ఓం

శ్రీ గణేశాయ నమః, శ్రీ శారదాంబాయై నమః

# ఆంధ్రతాత్పర్య సహిత
# శ్రీ దత్త గురుచరిత్ర

(ఈ భాగము - శ్రీ మత్తిరుమల దేవస్థానం వారి
సహాయంతో ముద్రించడమైనది.)


అనువాదకః

**లం॥సీ॥రా॥శాస్త్రి**

(విద్యావాచస్పతి)

ఓం

శ్రీ పతే! శాయనమః, శ్రీ శారదాంబాయై నమః



# ఆంధ్రతాత్పర్య సహిత
# శ్రీ దత్త గురుచరిత్ర



అనువాదకః
లం॥సీ॥ రా॥ శాస్త్రి
(విద్యా వాచస్పతి)

శ్రీ గణేశాయనమః

శ్రీ దత్తాత్రేయ చరిత్ర (7 వేల శ్లోకములు గలది)

సమశ్లోకిని ఆంధ్ర లిపిలోని కనువదించిన శ్రీ గురుదత్త చరిత్రమ్

– ప్రథమోఽధ్యాయః

। శ్రీ గణేశాయనమః – హరిఃఓం

నమోభగవతే దత్తాత్రేయాయనమః

1 శ్లో॥ ఓం నమో విఘ్నహర తే । గజాస్యగిరిజాసుత!
జయ లంబోదర జయ । శూర్పక! త్రైకదంత! భో॥

2 శ్లో॥ కర్ణయుగ్మం చాలయసి తతోవాతః ప్రవర్తతే ।
తతః పలాయతే విఘ్నస్తత స్త్వం విఘ్ననాశకః ॥

3 శ్లో॥ తప్తకాంచనవద్భాతి । గజానన! తవాననమ్ ।
కించోదిత ప్రభాతార్క్మండలాభం సుతేజసా ॥

4 శ్లో॥ చేత్తుం విఘ్నవనం యేన స్వహస్తే పరశుః ధృతః ।
నాగబంధః కటౌ యస్య నాగయజ్ఞోపవీతకం ॥

5 శ్లో॥ భుజాయస్యతు చత్వారో విశాలాక్ష! వినాయక!
సత్వం నివార్య విఘ్నౌఘాన్ విశ్వలోకాన్హి రక్షసి ॥

6 శ్లో॥ కుర్వంతి చింతనం తేయే తాన్విఘ్నోనైవ బాధతే ।
త ఏవ సకలేష్టార్థా ప్రాప్నువం త్యవిలంబితం ॥

7 శ్లో॥ సర్వమంగళ కార్యేషు వంద్యతే ప్రథమంభవాన్ ।
స్వామీన్! లంబోదర! త్వం హి రాశి ర్విద్యాశ్చతుర్దశ ॥

8 శ్లో॥ వేదశాస్త్ర పురాణాది శాసనం తవ లేఖనమ్ ।
అతః పురాసురా బ్రహ్మ, ముఖా స్త్వాం సంస్తువం త్యహో ॥

తాత్పర్యము
శ్రీ దత్తాత్రేయుల వారికి నమస్కారము
నాగర లిపిలో గల దత్తగురు చరిత్రకు సమానమగు శ్లోకముల గ్రంథము
ఇది దత్తాత్రేయుల వారి చరిత్రము (మహారాష్ట్ర భాషలోని దానికి సమానమైన
శ్లోకములతో వ్రాయబడినది – శ్రీ నృసింహ సరస్వతి వారి శిష్యులు వాసుదేవ
సరస్వతీ స్వామి వారు) సంస్కృతీకర్త)
గణపతికి నమస్కారము – ఓం హరిః (ప్రారంభమున విష్ణు స్మరణ పూర్వక ప్రణవము)
జంనమో భగవతే దత్తాత్రేయుల కొరకు.

1 తా॥ ఓయి! విఘ్నముల హరించువాడ! నీకు నమస్సు; పార్వతీ పుత్రుడవైన – ఏనుగు మోము గల దేవా! నీకు నమస్కారము – లంబోదర! శూర్పకర్ణ – ఏకదంత! ఓ విఘ్నేశ నీకు విజయమగుగాక!

2 తా॥ ఓయీ! గణపతి! నీవు చేటలవంటి నీ రెండు చెవులను త్రిప్పుచుంటివి – దాని వలన పుట్టెడి గాలికి విఘ్నములు దోమల వలె పారిపోవుచున్నవి అందుచే నిన్ను విఘ్న నాశకుడనిరి.

3 తా॥ ఓయీ! గజముఖ! నీ మొగము పదాఱువన్నె గల బంగారము వలె ప్రకాశించుచున్నదిది – మరియు నింతియకాదు – ప్రాతఃకాలమున నుదయించు సూర్యకాంతివలె మంచి తేజస్సుతో ప్రకాశించుచున్నది స్వామీ!

4 తా॥ ఓయీ! వినాయక! నీవు గొడ్డలి నాయుధముగ బూనితివి. ఎందుకంటే విఘ్నములనెడివి ఒక అడవి చెట్ల గుంపు– వానిని నరుకుటకట్లు పరశువును ధరించితివి – నాగమును జందెముగ వేసి నడుమునకు బంధము చేసితివి – అందుచే గణేశ నీవు విఘ్నములు రాకుండ ముందు బంధించి వేసితివి అని భావము.

5 తా॥ దీర్ఘ నేత్రములు గల వినాయక! నీవు నాల్గు చేతులు గలిగి యుంటివనగా విఘ్న సముదాయము విశ్వములో ఎచటనున్నను నివారించి రక్షించుటకే!

6 తా॥ ఎవరు లోకమున నూతన కార్యమునకు ముందు వినాయకుని చింతింతురో వారి అభీష్టములన్నియు త్వరితముగ నెరవేరును.

7 తా॥ అన్ని మంగళ కార్యములకు ముందు నిన్నే లోకము నమస్కరించుచున్నది. – ఓయీ! ఓ బొజ్జ వెనకయ్య నీవు 14 విద్యలకు రాశివి – లేక పదునాల్గు విద్యలకు నిధివి.

8 తా॥ వేదములు – శాస్త్రములు – పురాణములు – (4 వేదములు, 6 శాస్త్రములు – 4 పురాణాలు – ధర్మశాస్త్రం, పూర్వో ఉత్తర మీమాంసలు–14) ఇవియన్నియు గణనాథ! నీ లేఖన లేఖితములే – అందుచే పూర్వము బ్రహ్మాదులందరు నిన్ను గురించియే కొనియాడిరి.

9 శ్లో॥ త్వాం పురాత్రిపురం భేత్తుం పూజయా మాస శంకరః ।
వృషా కపిరపేస్తుత్వాత్వాం దైత్యాన జయత్ ద్రుతం ॥

10 శ్లో॥ విష్ణుకాద్యైర్గణపతే । కార్యాదేతేఽ భివంద్యతే ।
పదం తే ఖలు జాయంతే లబ్దేష్టాః కృపయై వతే ॥

11 శ్లో॥ గణనాథ! కృపాసింధో । బంధో । దైత్యఘ్న । విఘ్నహృత్
మతి ప్రకాశం కురు మే భయాంతక! వినాయక ॥

12 శ్లో॥ విఘ్నాంతకాద్యం సకలగణనాయక పాలక ।
యే త్వాం నమంతి లోకా స్తత్కార్య సిద్ధిః ప్రజాయతే ॥

13 శ్లో॥ సర్వకార్య సమాధార స్త్వం కృపా సాగరః పరః ।
గౌరీకుమార మే బుద్ధిప్రకాశం కురు తే నమః ॥

14 శ్లో॥ మన్మనోవాసనా స్సర్వాః ప్రపూరయ గజానన ।
సాష్టాంగం తేఽస్తు నమన మద్య విద్యాం ప్రదేహి మే ॥

15 శ్లో॥ గురోశ్చరిత్ర కథన కాంక్షా మే మనసి స్థితా ।
త్వం కృపాపూర్ణదృష్ట్యా తత్ సిద్ధింకురు బహుప్రద ॥

16 శ్లో॥ అజ్ఞానోమతిహీనోఽహ మతస్తే చరణౌధృతౌ ।
సర్వ విద్యా నిధానస్త్వం శరణాప్త వరప్రద ॥

17 శ్లో॥ అథవందేతథా బ్రహ్మకుమారీం వాగధీశ్వరీం ।
కరయోః పుస్తకం వీణా యస్యాస్సాహంసవాహనా ॥

18 శ్లో॥ యా వేదశాస్త్రవిద్యాధి కారదా శారదాముదా ।
సర్వదా వందనాద్యస్సా జ్ఞానాప్తిర్యాహి సర్వదా ॥

9 తా॥ పూర్వకాలమున త్రిపురముల జయించుటకు శంకరుడు నిన్ను పూజించెను. ఆ శివుడు నిన్ను స్తోత్రమును చేసిపందుననే ఆ రాక్షసులను త్వరగ జయించెను.

10 తా॥ ఓయీ గణపతి! విష్ణ్వాది దేవతలు సర్వ కార్యప్రారంభములందు నీకు నమస్కరింతురు. నీ దయవలన నీ పాదములంటిన వారందరు లబ్ధాభిలాషులు.

11 తా॥ ఓయీ! దయా సముద్రుడవైన లోకబంధువువగు హే గణపతి! నీవు దయ దలచిన రాక్షసులను, విఘ్న నాశనం జేతువు. ఓ వినాయక నాకు భయమును పోగొట్టి నాయీ రచనకు బుద్ధి వైశద్యము నిమ్ము.

12 తా॥ ఓయీ! వినాయక - సకల విఘ్నముల పోగొట్టి రక్షించు దేవుడా! ఎవరు కార్యారంభమునకు ముందు నీకు నమస్కరింతురో వారి కోరికలన్నియు వెంటనే తీరును.

13 తా॥ ఓయీ! వినాయక! నీవు దయా సముద్రుడవు. సర్వ కార్యముల కాధారభూతుడవు. ఓయీ! పార్వతీ తనయ! నాకు బుద్ధికి తేజస్సు నిమ్ము. నీకు నమస్కారము.

14 తా॥ ఓయీ! గజముఖ నా మనస్సులోని వాసనలు (భావములు) అన్నిటిని నీవు సఫల మొనర్పుము. నీకు సాష్టాంగ నమస్కారము చేతును. విద్యనిమ్ము.

15 తా॥ ఓ వినాయక! నీవు అన్నింటి నీయగలవాడవు. నాకు ప్రస్తుతము గురుచరిత్ర వ్రాయు నౌత్సుక్యము గలదు. నీవు సంపూర్ణ దయగల చూపుతో చూచి కార్యసిద్ధినిమ్ము!

16 తా॥ అయ్యా! వినాయక! నేను తెలియనివాడను - బుద్ధిలేని వాడను. అందుకు నీ పాదముల రెంటిని పట్టుకొంటిని. సర్వ విద్యానిధివి. నిన్ను శరణుజొచ్చిన వారికి వరమిమ్ము.

17 తా॥ ఇక నిటుపై బ్రహ్మదేవుని కుమార్తెయగు వాగీశ్వరి సరస్వతికి నమస్కరింతును. ఏ యమ హంస వాహనమున హస్తద్వయమందు వీణా పుస్తకముల ధరించినదో ఆమెకు నా నమస్కారము.

18 తా॥ ఏ తల్లి సమస్త వేద శాస్త్రముల కధికారియో ఆ శారద నాకు సర్వదాసేవ్యురాలు. ఎందుకంటే ఏ సరస్వతికి నమస్కారమో ఆ నమస్కారము భక్తులకు జ్ఞానము నిచ్చునది. అందుకే ఆమెకు మా వందనము.

19 శ్లో॥ అతః ప్రసన్నాభవమే వందే స్వామిని! తే పదే ।
ఆస్థాయ మమ జిహ్వాగ్రే గ్రంథసిద్ధికరీభవ ॥

20 శ్లో॥ ప్రార్థనాం శృణుమేమాతః! దేహి మే విమలాం మతిం ।
ప్రకాశ్య సన్మతిం త ఛ్ఛ్రీ చరితం వితతంకురు ॥

21 శ్లో॥ వాగ్దేవతే జయ జయ జగన్మాతర్నమోఽస్తుతే ।
సమస్త వేదశాస్త్రాది లిఖితం జగతీహితే ॥

22 శ్లో॥ వేదశాస్త్ర పురాణాది మాత! స్త్వత్తః సముద్గతమ్ ।
షడ్దర్శనా ని చాప్యేతైరశక్యం త్వత్ప్రకాశనమ్ ॥

23 శ్లో॥ స్థితిస్తే గురునామ్నితః శ్రీ నృసింహ సరస్వతీ ।
ఇతిప్రసిద్ధం తత్రీతిః మయితేఽస్తుతదంకితే ॥

24 శ్లో॥ సూత్రధారే చ్ఛయాదేవి యథా నృత్యంతి సూత్రితాః।
జడాః కృత్రిమ నర్తక్యోనాస్తితాసాం స్వతంత్రవా॥

25 శ్లో॥ తథా నిజమతేన త్వం మమవాణీం ప్రచోదయ ।
వాగ్దేవతే కృపాబ్ధే హం బాలస్తే స్త్వర్బ్యయేఽ భయే ॥

26 శ్లో॥ ప్రసన్నాభవతే పాదౌధృతౌ స్వామిని! భారతి!
భూయాద్గ్రంధ ప్రకాశోమే యధావిద్యాం తథాఽర్పయ

27 శ్లో॥ అథ వందే బ్రహ్మ విష్ణు మహేశాం స్త్రి గుణాత్మకాన్
అనుక్రమేణ యాచే తా న్విద్యాం విద్యా ప్రవర్తకాన్

28 శ్లో॥ చతుర్ముఖో జగత్స్రుష్టికర్తా పూర్వాది వక్త్రతః
యస్సోద్గతా ఋుగాద్వా స్త చ్చరణౌ శరణౌ మమ॥

19 తా॥ అందుచే నా ప్రభుమూర్తియగు ఓ శారద! నీ పదద్వంద్వమును నమస్కరింతును. అందుచే నీవు నా నాలుకపై నిల్చి నా గ్రంథరచన కూతమునిమ్ము.

20 తా॥ ఓ అమ్మా! సరస్వతీ! నా ప్రార్థనను విని నాకు స్వచ్ఛమైన మతినిమ్ము. నీవు నాకు సద్బుద్ధినిచ్చిన నేను శ్రీ వారి చరిత్రను విపులీకరింతును. దానిని నీ యనుగ్రహమున పొందగలను.

21 తా॥ ఓ సరస్వతి! నీకు జయము; జయము. ఓ జగజ్జనని నీకు నా నమస్కారము. ఈ ప్రపంచములోని సమస్త వేదశాస్త్ర పురాణములన్ని నీచే వ్రాయబడినవే.

22 తా॥ ఈ సమస్త వాఙ్మలమంతయు నీనుండి యీ విశ్వమునఁ బుట్టినది. ఆరు దర్శనములు గూడ నిన్ను ప్రకాశింప సామర్థ్యం లేనివయ్యెను.

23 తా॥ తల్లీ! సరస్వతి! నీవెక్కడున్న నది అత్యంత ప్రియమైనది. మా గురువులకు (శ్రీ నృసింహ సరస్వతి) మీ నామము చివర నున్నందున యెంతటి మహిమాన్వితులో వారు. అందుచే నీవు వారియందు అంకితమైనందున నాకు ప్రీతి గల్గింపుము.

24 తా॥ లోకమున సూత్రధారుని సూచన పద్ధతి నర్తకులెట్లు నటింతురో తల్లీ! ఓ దేవి! అట్లే యీ జీవులందరు యాటబొమ్మలు. స్వాతంత్ర్యం లేనివారు. నీ సూచన మేరకు మెలగునట్లు చేయుచున్న నీకు నమస్కారము.

25 తా॥ ఓ శారదా! నీవెప్పుడు విజయవంతురాలవు. నా వాక్కును అట్లు విజయవంతము చేయుము. ఓ తల్లీ నేను బాలుడను. అస్వతంత్రుడను. నిన్ను నేనర్చించ లేను. నీవు నీకు తోచినట్లు చేయుము.

26 తా॥ తల్లీ! భారతి! మీ పాదములఁబట్టికొంటిని. నీవు నాకు ప్రసన్నమగుము. నాయీ గ్రంథము. అర్థవంతమై లోకమందు ప్రకాశమునకు తెమ్ము.

27 తా॥ ఇఁక నిక్కడనుండి సత్వ రజ స్తమో గుణమూర్తులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల ముగ్గురను నమస్కరింతును. ఈ ముగ్గురిని క్రమముగ నాకు విద్యనిమ్మని, విద్యా ప్రకాశకులుకండని వేడుకొందును.

28 తా॥ ఏ మహాత్ముడు సృష్టికర్త యయ్యెనో? ఆ మహాత్ముని నాల్గు ముఖములనుండి ఋక్, యజు:, సామ, అథర్వ వేదములు పుట్టినవి. అట్టి బ్రహ్మదేవుని చరణములు శరణమంటిని.

29 శ్లో॥ సర్వేంద్రియ ప్రేరకత్వా ద్యో యో హృషీకేశ ఉచ్యతే ।
విశ్వనాథః సలక్ష్మీ కోయ ఆస్తే క్షీరసాగరే ॥

30 శ్లో॥ చతుర్బాహుః నరహరిః శంఖ చక్ర గదాధరః ।
మురవైరిః పద్మహస్తః పద్మనాభో మమేష్టదః ॥

31 శ్లో॥ పీలాంబరో వైజయంతీ మాలయా లోకమాలయా
సహితః సహితోమేఽస్తు శరణాగత కామదః

32 శ్లో॥ వందే సురవరాన్ సర్వాన్ యక్షగంధర్వ కిన్నరాన్ ।
సిద్ధాన్ సాధ్యాన్ పరేశాంశాన్నత్వా సర్వా! నృషీశ్వరాన్ ॥

33 శ్లో॥ అథ వందే కవికులం సుశీలం కిల నిర్మలం ।
పరాశరకవి ర్వ్యాస వాల్మీకి ప్రభృతీన్మునీన్ ॥

34 శ్లో॥ కవిత్వ రీతిం సాహిత్య హీనో జానే న సర్వథా
తథాఽపి మత్వా దాసం మాం జ్ఞానదాః సన్తుమేఽఖిలాః॥

35 శ్లో॥ న జానే గ్రంథ రచనాం నైవ శాస్త్ర విచారణామ్
మహారాష్ట్రీయ భాషాంచ న జానేఽ తో నమామి వః

36 శ్లో॥ సమస్తైః కృపయా మేఽద్యకార్యం సాహాయ్యముత్తమమ్ ।
కావ్య వుత్పత్తి హీనం మాం పాయా త్కవికులం కిల ॥

37 శ్లో॥ ఏవం సర్వాన్ కవీన్ నత్వా ధ్యాయేఽహం పూర్వజాన్నిజాన్
జననీ జనకం చాపి మహాత్మానా మహోదయా ॥

38 శ్లో॥ య ఆపస్తంబ శాఖీయో ద్విజః కౌండిన్య గోత్రజః
సాఖరే ఇత్యుపాఖ్య స్స సాయందేవో గురుప్రియః

29 తా॥ ఏ భగవంతుడు సర్వేంద్రియ ప్రేరకుడో అట్టి హృషీకేశుడు విశ్వమునకు నాథుడై లక్ష్మీ సమేతముగ క్షీర సాగర వాసికి నా నమస్సు.

30 తా॥ నాల్గు బాహువుల శంఖ చక్ర గదా పద్మముల ధరించిన మురవైరి యగు పద్మ హస్తధారియగు ఆ పద్మనాభుడు నా కోరికల నిచ్చుగాక.

31 తా॥ పీతాంబరధరుడు, వనమాలా విభూషితుడై చూచుటకింపగు మనోహర రూపధారియగు పరమేశ్వరుడు శరణాగత రక్షకుడు నాకు తోడగుగాక.

32 తా॥ నేను చేయు యీ గ్రంథరచన కార్యమునకు సర్వ దేవతలను, యక్ష కిన్నర గంధర్వాది దేవయోనులను, సిద్ధ సాధ్యులను, మహర్షులను తలతును గాక.

33 తా॥ మంచి బుద్ధిగల నిర్మల వంశజులగు కవికులం వారిని నమస్కరింతును. అటుపై సంస్కృత కవులగు పరాశర, వ్యాస వాల్మీక్యాదులగు వారిని నమస్కరింతును.

34 తా॥ నాకు కవిత్వపు పద్ధతి తెలియదు. సాహిత్య విజ్ఞానము బొత్తిగా లేదు. అట్లయ్యు జ్ఞానదాస్యము గోరు నా యీ అజ్ఞానుని దాసుగా దలిచి అనుగ్రహింతురు గాక!

35 తా॥ నేను గ్రంధరచన నెరుగను. శాస్త్ర విచారణ ఎట్టిదో తెలియదు. మహారాష్ట్ర భాష నసలే ఎరుగను. అందుచే మీకందరకు నమస్సు.

36 తా॥ పై మహాత్ములందరు నా యీ గ్రంథ రచనా కార్యమునకు సాహాయ్యమొనరింతురు గాక. కవికుల మంతయు కావ్యజ్ఞానం లేని నన్ను క్షమించి రక్షింతురు గాక!

37 తా॥ ఈవిధముగ సర్వ కవులకు నమస్కరించి మా పూర్వీకుల నొకసారి ధ్యానించుకొని మహాత్ములగు నా జననీ జనకులకును నమస్సొనర్చెదను.

38 తా॥ ఆపస్తంభ శాఖీయుడును, కౌండిన్యస గోత్ర బ్రాహ్మణుడును, సాఖర్ అను పేరుగల సాయందేవుడను వాయన గురుప్రియుడుండెను.

39 శ్లో॥ తస్మాజ్జాతో నాగనాథో దేవరావశ్చ తత్సుతః ।
గంగాధరో గురువర స్తత్పుత్రః వ పితా మమ ॥

40 శ్లో॥ తాతస్య తస్య చరణే న త్వా మచ్చరణే తతః
ఆశ్వలాయన శాఖీయ వంశజోమాతృపూర్వజః

41 శ్లో॥ యోహి కాశ్యపగోత్రేయః సచ మాతా మహో మమ ।
గంగా యా జనకో యద్వజ్జహ్ను ర్య ద్వా భగీరథః ॥

42 శ్లో॥ సువృత్తా తస్య దుహితా భవానీవ పతివ్రతా।
లోకే చంపేతి సాఖ్యాతా స్వామి నీ జననీ మమ॥

43 శ్లో॥ జననీ జనకాంఘ్ర్యబ్జ నమనాద్గురు కీర్తనే ।
మతి ప్రకాశో జాతోమే సద్గురు స్మరణాదపి ॥

44 శ్లో॥ సదాయ ఐక్యభావేన సద్గురుశ్చరణే భజన్ ।
గంగాధరో ద్విజవరో మమ జన్మ యతోఽభవత్ ॥

45 శ్లో॥ సరస్వతీతి విఖ్యాతో గంగాధర సుతోఽ స్మ్యహం ।
క్షమస్వ సజ్జనా హం తే బాలః పాదరజస్సమః ॥

46 శ్లో॥ యో వేదాధ్యాయి సన్యాసి యతియోగీ శ తాపసాః ।
భజంతి సద్గురుం ప్రేమ భక్త్యా తేభ్యో నమోనమః ॥

47 శ్లో॥ ప్రార్థయామి సమస్తా న్వః స్వల్పబుద్ధి రహంమమ ।
బాల వాక్యో పమం వాక్యం స్వీ కుర్వంతు విమత్సరాః ॥

48 శ్లో॥ మతిర్మే కావ్యరచన క్షమా నైవచ నైవచ ।
వ్యుత్పత్తిః సర్వథాఽధాపి గురుప్రేరణ యోద్యతః ॥

39 తా॥ ఆయనగారివల్ల నాగనాథుడును, ఆ నాగనాధునకు దేవరావు, ఆ మహాత్మునకు గంగాధరుడను ఆయన పుట్టెను. ఆయన కుమారుడనగు నాకు తండ్రి ఆ గంగాధరుడు.

40 తా॥ మా తండ్రిగారి పాదములు ముందుగా మదిలో తలచి ఆశ్వలాయన శాఖీయుడైన మా మేనమామగారి చరణములను గొలిచెదను.

41 తా॥ మా మాతామహుడు పూజ్యుడు. కాశ్యప గోత్రజుడు గంగకు జనకుడు జహ్నువువలెను – లేక భగీరథుడు వలె గంగా సమమైన మా తల్లికి ఆయన తండ్రికి నమస్కరింతు.

42 తా॥ ఆయన పుత్రికయైన మాతల్లి సుచరిత్రయై శంకరునకు భవానివలె నుండెను. ఆ మా తల్లిపేరు మాత్రమే లోకములో చంపాదేవి అని ఖ్యాతి. ఆమె నా తల్లి.

43 తా॥ తల్లిదండ్రుల పాదకమలసేవ చేత గలిగిన శ్రీ గురు సంకీర్తన వలన నా మతి ప్రకాశించినది. దానికి ఆ సద్గురు స్మరణయే ముఖ్యకారణము.

44 తా॥ ఎల్లప్పుడు మా తండ్రియగు గంగాధరుడు శ్రీ దత్త సద్గురు చరణములందే లగ్న మనస్కుడై యుండెను. అట్టి మహనీయ బ్రాహ్మణ పుత్రుడను నేను.

45 తా॥ ఆ నా తండ్రియైన గంగాధరులకు సరస్వతీ అని నామ మున్నది. ఆయన పుత్రుడను. నన్ను బాలుని క్షమించండి! ఆ గంగాధర సరస్వతీ పాదరజస్సమానుడను.

46 తా॥ ఏ మహానుభావుడైన మా జనకుడు గంగాధర సరస్వతియో ఆయన వేదాభ్యాసం చేసి సన్యాసి యయ్యెను. అట్టివారికి ప్రేమతో, భక్తితో నమస్కరింతును.

47 తా॥ నేను స్వల్పబుద్ధిని. మిమ్మందరను ప్రార్థిస్తున్నాను. నాయందు మాత్సర్యము లేక నా యీ పలుకులు బాల వాక్యములవలె నాదరింపవేడెదను.

48 తా॥ నాకు కావ్యరచనా పాటవము ముమ్మాటికి లేదు. పోనీ ఆ రచనకు తగిన చదువున్నదా? లేదు. అట్లయినను దీనిని మా గురు ప్రోత్సాహమున వ్రాయ బూనితిని.

49 శ్లో॥ పారం పర్యాగతా త్వస్మత్కులే దత్త ప్రసన్నతా ।
తేనైవ ప్రేరితోఽ థాపి గురుప్రేరణయో ద్యతః ॥

50 శ్లో॥ చరితా మృత కుంభస్తే దత్తః కధయ మే కథాం ।
లభస్వత్వం సర్వశోఽర్థా నిత్యాజ్ఞా శ్రీ గుర్వోర్మిమే ॥

51 శ్లో॥ గురువాక్యం కామధేను ర్మానుమానం కరోమ్యహం ।
సిద్ధిం న యేత్స జాగర్తి యో నృసింహ సరస్వతీ ॥

52 శ్లో॥ యస్త్రిమూర్త్యవతారోఽ యం స నృసింహ సరస్వతీ ।
కస్తస్య చరితాస్యాంతం యా యాదప్య మరాయుషా ॥

53 శ్లో॥ క్వానంతం చరితం తస్య కోహం జడమతిః కియాన్ ।
అథా పి తత్ప్రేరణయా వక్తుం శక్తో యధామతి ॥

54 శ్లో॥ య ఇచ్ఛేత్పుత్ర పౌత్రాదీ నైహి కాముష్మికం సుఖమ్ ।
కధేయం రుచిదా తస్య తిష్ఠేచ్ఛీ స్త ద్గృహేసదా ॥

55 శ్లో॥ యద్గృహేఽ సా కధా రమ్యా శ్రావ్యతే షఠ్యతే సదా ।
నందతే శ్రీయుతం తస్య సుశీలం విమలం కులం ॥

56 శ్లో॥ శ్రీ గురోః కృపయా తత్ర రోగపీడాది నైవచ ।
సప్తాహ శ్రవణా త్సర్వ పాశనాశోఽ ప్య సంశయం ॥

57 శ్లో॥ ఈః దృశీ పావనీ రమ్యా కథారాతి మనోరథాన్ ।
అనాయాసేన కామ్యార్థసిద్ధిః సద్యో భవిష్యతి ॥

58 శ్లో॥ నిధిశ్చే ల్లభ్యతేఽ యత్నాత్ ఆయాసేనా పరేణకిం ।
అస్తి చేన్మ మహాక్యేఽస్మి న్విశ్వాసోఽ ద్యానుభూయుతామ్ ॥

49 తా॥ వంశపారంపర్యము నుండి మా వంశములో దత్తాత్రేయ ప్రసన్నత గలదు. అందుచే నేనిపుడు ప్రేరితుడనై స్వ చరిత్రను కీర్తింప గడగితిని.

50 తా॥ నాకు మా శ్రీ గురువుల వారు ( శ్రీ నృసింహ సరస్వతి) ఓరీ! నీ చేతికిప్పుడు నేను అమృత కుంభము నిచ్చితిని. దీనిని నీవు తీసుకొని లాభము నొందుమని నాకాజ్ఞ నిడిరి.

51 తా॥ గురు వాక్యము కామధేను తుల్యము. దీనిపై అనుమానము నాకు లేదు - యెవరు నృసింహ సరస్వతి దత్తాత్రేయుడే అయి వున్నాడనుకొన్న వానికి - ఆ గురు వాక్యమునకు సంశయము లేదు.

52 తా॥ ఏ మహానుభావుడు నృసింహ సరస్వతియో ఆయనయే త్రిమూర్త్యాత్మక దత్త ప్రభువు - ఆ నృసింహ సరస్వతి చరితం అనంతం. ఇది దేవాయుర్దాయ పరితము - అనగా దేవాయుర్దాయ పర్యంతము పట్టునని భావము.

53 తా॥ ఆ గురు మహనీయుని చరితమెక్కడ? అల్పబుద్ధి గల నేనెక్కడ? ఎంతవాడను? అట్లయ్యు ఆ గురు ప్రేరణచే నాకు తోచిన రీతి చెప్పదలచితిని.

54 తా॥ లోకమున పుత్ర పౌత్రాదులతో నైహికమును - విజ్ఞానప్రదమైన ఆముష్మిక ఫలములను బొందవలయుననుకొన్న వాడీ గురు చరిత్ర పఠనము నెప్పుడు చేయుచున్న వానియింట లక్ష్మియు - కార్యసిద్ధియు తప్పక యుండును.

55 తా॥ ఎవనియింటిలో శ్రీ గురుదత్త చరిత్రను కథాశ్రవణముగాను చేయుచుందురో, పఠింతురో వానియింట సంతతి, లక్ష్మి సమృద్ధిగా వుండి కులం పవిత్రమగును.

56 తా॥ శ్రీ గురు చరిత్రను వినువారియెడ శ్రీవారి దయతో - రోగపీడాది బాధలు వదలును. సప్తాహ దీక్షతో పారాయణమును చేసిన సమస్త బంధములు పోవును.

57 తా॥ ఇట్టి పవిత్రమైన యీకథ మిక్కిలి రమ్యమైనది. దీనిని విన్నవారి సమస్త కోరికలు సిద్ధించును. ఏ కార్యమైనను అనాయాసముగా నగును.

58 తా॥ శ్రీ గురు చరిత్రా కథనము వల్ల నే కార్యమైనను అనాయాసముగా సిద్ధించును. ఇది నేను చెప్పునది నిజము. దీనిని నమ్మినవారికే అనుభవము గల్గును.

59 శ్లో॥ అనుభూతం మయా సత్యం శ్రోతన్సం ప్రార్థయే తతః ।
శ్రీదత్త స్మరణం సద్య ఇష్టదం హ్యనుభూయతాం ॥

60 శ్లో॥ యథోద్గారం దదాత్యత్ర భుక్త స్తృప్తస్త థాప్యహం ।
అనుభూయ ప్రవక్ష్యామి దత్తాత్రేయ కథామృతం ॥

61 శ్లో॥ ఔదాసీన్యం లఘుతరం మయికార్యం కదాచన ।
మక్షికా నదనా త్స్వాదు మధుప్రాజ్యం హి లభ్యతే ॥

62 శ్లో॥ హేయ శుక్తే ర్యథా ముక్తా కర్పూరః కదళీ దళాత్ ।
అస్పృశ్యకా కవిష్ఠాతః పూజాశ్వత్థో దయో నకిమ్ ॥

63 శ్లో॥ ఔదాసీన్య మథోగ్రంధే సురసే ధార్యమార్యకైః ।
యథాక్షోర్మలినా ద్వక్రాల్లభ్యతే మధురోరసః ॥

64 శ్లో॥ తథాంజసైవ మద్వాక్యా దగ్రా హ్యోగురు కధారసః
యేషాం గురుస్మృతిః ప్రీతిః స్వీకృత్యాను భవంతుతే ॥

65 శ్లో॥ ఏ తత్ బ్రహ్మ రసాస్వాద ఫలం సద్యో ను భూయతాం ।
మద్వాక్యే భక్తిమాన్యః స సద్యోఽనుభవ భాగ్భవేత్ ॥

66 శ్లో॥ జ్ఞాన ప్రదా గురుకధా కామదా కామధుగ్యథా ।
వృధా న వచ్మిశ్రోతారః శ్రోత వ్యోయం సమాహితైః ॥

67 శ్లో॥ గంధర్వ నగరేసోఽస్తి శ్రీ నృసింహ సరస్వతీ ।
మహిమాత్యద్భుతస్తస్య విఖ్యాతో భువనత్రయే ॥

68 శ్లో॥ మహాంతం మహిమానంతం శ్రీదత్త స్యమహాత్మనః ।
ఆకర్ణ్యాయాంతి రసికా. లోకా దూరాచ్చ భావికాః ॥

59 తా॥ నేను శ్రీ గురు చరిత్రను విన్నందున నా కోరికలు నెరవేరినవని. అనుభవముతో చెప్పుచున్నాను. కావున శ్రీ దత్తదేవుడిష్ట ఫలప్రదుడనుట ననుభవించండి.

60 తా॥ లోకమున తృప్తిగా భుజించినతడు మరల తింటే అది బయటకు వచ్చును. అట్లే శ్రీ దత్తచరిత కథాశ్రవణ లాభం గలవాడనగుటచే మీకు నా అనుభవమును వాక్కుతో తెలుపుచున్నాను.

61 తా॥ నేను వ్రాసితిని ఈ మహాకావ్యమును ! అని మీరు ఉదాసీనముగా గాని తేలికగ గాని ఈ గ్రంథమును చూడరాదనుకొనవలదు. తేనె తేనెటీగ త్రాగి దాచినదే చాలా మధువుగా నుండును.

62 తా॥ కావి చిప్పలందు ముత్యములు పుట్టుటచేత – కదళీ తరువుల నుండి కర్పూరము లభ్యమగుటచేత కాకిరెట్టల నుండి పుట్టినను రావిచెట్టు పవిత్రము, పుణ్యము అగుటలేదా?

63 తా॥ ఈ వ్రాయబోవు గ్రంథమందు చమత్కారాదికము – రసము లేదని నిరసించవకండి. చెఱుకునకు వంక పోయినను తీపి చెడునా? చెడదని నా భావము.

64 తా॥ నా మాటల వలన పాఠకులకు మాధుర్యము దొరకక పోయినను శ్రీ గురువుగారి స్మరణముండుటచే పాఠకులకు సత్ఫలము అనుభవ వేద్యమగును.

65 తా॥ ఈ గ్రంథ పఠనము వలన బ్రహ్మానంద రసప్రాప్తి గలుగును. నా వాక్యముల వల్ల కాకున్నను, శ్రీ గురువునందున్న భక్తి – ఫలానుభవమిచ్చును.

66 తా॥ గురుచరిత్ర పఠనము జ్ఞానమునిచ్చును. కామధేనువు వలె కోరికల తీర్చును. నేను శ్రోతలకు వ్యర్థ కాలక్షేపమునకు చెప్పుటలేదు. ఆలోచించిన దీనిపఠన ఫలము మీకుఁ దెలియగలదు.

67 తా॥ గానుగాపురముననున్న శ్రీ నృసింహ సరస్వతియొక్క అత్యద్భుతములైన మహిమలు ముల్లోకములయందు విఖ్యాతి చెందినవి.

68 తా॥ దత్తాత్రేయులు మహాత్ములని వారి మహిమ అనన్యమని లోక ఖ్యాతి వలన దూర దూర దేశములనుండి వచ్చియు భక్తులు సఫల మనోరథులగుచున్నారు.

69 శ్లో॥ ఆగత్యతం సమారాధ్య లభంతే త్వరితం ఫలం ।
స్త్రీ, పుత్ర, ధన, ధాన్యాది కామలబ్ధిర్యతోఽ చిరాత్ ॥

70 శ్లో॥ గురుదర్శన సంకల్పా-దపి సిద్ధిశ్చ పాదుకే
దృష్ట్వా స్పృష్ట్వా గృహం గత్వా పుమర్థానపి విందతి ॥

71 శ్లో॥ ఇతి శృత్వా ద్విజవరః కోప్యేకో నామధారకః ।
అమల శ్రీ గురుపద కమల ప్రేక్షణోత్సుకః ॥

72 శ్లో॥ చింతాన్వితోఽతి నిర్విణ్ణః కష్టవ్యాకుల మానసః ।
సాక్షాత్ ద్రష్టుం గురుపదం నిర్యయౌ స్వగృహో ద్విజః ॥

73 శ్లో॥ స్వకార్యం సాధయిష్యామి పాతయిష్యామి వాతనుమ్ ।
భవే శ్రీ గుర్వలాభేఽ స్మిన్ కింకార్యం జడయానయా ॥

74 శ్లో॥ ఇతి నిశ్చిత్య నిరవ్వణ్ణో ధ్యాయన్ గురు పదాంబుజమ్ ।
క్షుధం తృషంచ విస్మృత్య గచ్ఛన్ గుర్వాశ్రమం జగౌ ॥

75 శ్లో॥ యన్నామ స్మరణాత్సద్యోదైన్యహాని ర్నృణాంభవేత్ ।
తన్నామ స్మరణాత్ కస్మాత్ మమదైన్యం స నశ్యతి ॥

76 శ్లో॥ దైవం చేత్ప్రతికూలం మే త్వ దృక్తేః కిం ప్రయోజనం ।
హీనోఽహం చేత్కథం స్పర్శ స్పర్శాల్లోహస్య హేమతా ॥

77 శ్లో॥ పాపోఽహం చే త్పాప తాప కష్టహారీశ నామ తే ।
మయిస్థితే పి చేచ్ఛిష్టం కష్టం కస్య తత స్త్రపా ॥

78 శ్లో॥ మనస్యా నీయ మే వాక్యం గురుమూర్తే! సదాశివ ।
సర్వభూత కృపాలో! త్వం దర్శనం దేహి మే ప్రియమ్ ॥

69 తా॥ శ్రీవారి మహిమను విని వచ్చుటగాదు – వచ్చి పూజించి ఫలములను పొందుచున్నారు – స్త్రీ – పుత్ర – ధనము – విద్యా – మొదలగు కోర్కెలందుచున్నారు.

70 తా ॥ శ్రీ నరసింహ సరస్వతి వారి పాదుకా సందర్శన కుతూహలము చేతనే కార్యసిద్ధి యగును. ఆ పాదుకల దర్శించిన, స్పృశించిన చతుర్విధ పురుషార్థముల మానవులొందుదురు.

71 తా॥ ఈవిధముగ బ్రాహ్మణ శ్రేష్ఠుడను వాడానామ ధారకుడు – అద్భుతమును చూడగోరి – శ్రీవారి స్వచ్ఛమైన పాద దర్శన కుతూహలుడయ్యెను.

72 తా॥ ఆ నామధారకుడు – కష్టము వచ్చినను సరియే శ్రీ గురుపాద దర్శన చింతాకులుడై యింటినుండి వానిని చూడ వెడలెను.

73 తా॥ నేను నా శరీరము పతనమైనా సరే! నా గురుపద సందర్శన కార్యమును సాధింతును. ఆ నృసింహ సరస్వతి పాదుకల సందర్శనము లేని యీ శుష్కతను వెందులకు?

74 తా॥ ఇట్లు మనసున నిశ్చయించుకొని నిర్విణ్ణుండయి గురుపదాంబుజ సందర్శన చింతతో – ఆకలి దప్పులను త్యజించి ఆ గురువుగారి ఆశ్రమమునకు వెళ్లెను.

75 తా॥ ఏ మహాత్ముని నామస్మరణము దైన్య నాశకారకమో – అట్టి శ్రీ నృసింహ సరస్వతీ పాదుకల కారణమున స్మరణము నాకుమాత్రము దైన్యమెట్లు గల్గించును.

76 తా॥ దైవము నా యీ ప్రయత్నమునకు ప్రతికూలమైన నాభక్తికి ప్రయోజనం లేదు. నేను హీనుడనే అయితే – అయ స్పర్శచే బంగారము ఎట్లగును?

77 తా॥ ఓ భగవంతుడా! నేను పాపాత్ముడనైన నా పాపతాపములు పోవును. నేనుండియు స్వామి పాద దర్శనమైనను కష్టము తొలగలేదన్న సిగ్గు నాకే [illegible]?

78 తా॥ గురుమూర్తి యగు నో! సదాశివ! నా ప్రార్థనను మనసునకు తెచ్చుకొని నాకు ప్రియమైన మీ దర్శనమిమ్ము! సర్వభూతములయెడ దయ గలవాడ నీవేకదా!

79 శ్లో॥ ఇతి వ్యాకులచిత్త స్సన్ భక్తి మాన్నామధారకః ।
స్తు తిం కర్తుం సముద్యుక్తో వాణ్యా గద్గదయా గురోః ।

80 శ్లో॥ పాండురంగం విఘ్నభంగం గౌరీపుత్రం చ శారదామ్ ।
ప్రణమ్య శ్రీ గురుం స్తోతుం ప్రారేభే నామధారకః ॥

81 శ్లో॥ త్రిమూర్తిః శ్రీ గురు రితి వదతశ్చ శ్రుతిస్మృతీ ।
వదంతి సద్యః ఫలదం తం త్వామేవ కలౌయుగే ॥

82 శ్లో॥ కలౌయుగేఽస్తి తే ఖ్యాతిః శ్రీ నృసింహ సరస్వతీ ।
త్వం భక్తసారధిరితి ప్రథితోఽసి. కృపానిధే! ॥

83 శ్లో॥ కృపాసింధో! భక్తబంధో! వేదాస్త్వాం వర్ణయంతిహి ।
గురునాధః పుణ్యకధ స్తోతేతి త్రిగుణాత్మక! ॥

84 శ్లో॥ త్రిగుణాత్మక! ఏక స్త్వం. నిధానం బీజమద్వయం ।
నివార్య సంకటం భక్తాః భయాత్పాసిదయా నిధే! ॥

85 శ్లో॥ దయానిధే! యతిపతే! శ్రీపతే ప్రార్థయామి తే ।
భక్తిం నమే సాత్వికాష్ట చిహ్నం గృహ్ణాతి మానసం ॥

86 శ్లో॥ మానసం చంచలం మేఽస్తి నగురో స్థైర్యమృచ్ఛతి ।
ఆశ్వాసయ కృపా సింధో త్వం సమాగచ్ఛవేగతః

87 శ్లో॥ వేగతోమాం సమాగచ్ఛ నృహరేఽ నంత సర్వగ ।
రుదంతం బాలమా లక్ష్య త్వరయేవ యధా ప్రభుః ॥

88 శ్లో॥ ప్రసూస్త్వం జనకస్త్వం మే సఖాత్వంమే చిరంతనః ।
వ్యవహారేఽపి వంశస్యత్వంమేఽసి కులదైవతమ్ ॥

79 తా॥ ఇట్టి వ్యాకులచిత్తుడై భక్తిమంతుడైన నామధారకుడు – గద్గద వాక్కుతో నా గురుమూర్తిని స్తోత్రమును చేయమొదలిడెను.

80 తా॥ ముందు పండరినాథుని – ఆ తరువాత విఘ్న నాశకుడగు వినాయకుని – శారదాదేవిని నమస్కరించి ఇక గురుస్తోత్రమును చేయుటకు నామధారకు డారంభించెను.

81 తా॥ శ్రీ గురువగు నృసింహ సరస్వతియే త్రిమూర్తియగు దత్తదేవుడని వేద శాస్త్రములు చెప్పుచున్నవి – ఆ నీవు అప్పటికప్పుడే ఫలమిచ్చు వాడవని కలియుగంలో నీవే దేవదేవుడని యందురు – అందుచే నీవే శరణ్యము!

82 తా॥ ఓ స్వామీ! కలియుగంలో తమకు గొప్ప ప్రతిష్ఠ గలదు – ఓ దయానిధీ నీవు భక్తులకు ఫలమునిచ్చు సారథివని లోకవాడుక!

83 తా॥ అయ్యా! తమరిని దయా సముద్రులని, భక్త బంధువులని వేదములు నిర్ణయించినవి – త్రిగుణాత్మకమై సోపాధిక గురుమూర్తివి –ఆ కథ పుణ్యమైనదని – నీవు రక్షకుడవని ప్రతీతి.

84 తా॥ ఓయీ! స్వామీ! నీవొక్కడవే త్రిగుణాత్మకుడవు – అవ్యయుడవు – జగదాది కారణుడవు – ఓ దయానిధీ! భక్తుల సంకటముల దొలగించి భయము నుండి కాపాడుదువని – వేదాదులు చెప్పుచున్నవి.

85 తా॥ ఓ స్వామీ! నీవు దయానిధివని – లక్ష్మీపతివని ప్రార్థించుచున్నాను. నాకు భక్తి లేదు – సాత్త్విక భావములును లేవు – అందుచే నా మనసు నిత్తును చేకొనుము.

86 తా॥ ఓ గురువరా! నా మనస్సు చంచలమైనది – స్థైర్యము లేదు – స్వామీ! తాము దయతో వేగముగ వచ్చి – ఈ నా మనసును సమాధాన పరుచుము.

87 తా॥ స్వామీ! తాము వేగముగ వచ్చి మా – యీ ఆపదపుటేడ్పులను పోగొట్టి పిల్లలను తమ పెద్దలవలె రక్షింపండి!

88 తా॥ ఓయీ! గురుమూర్తీ! నీవే మాకు తల్లివి, తండ్రివి, సఖుడవు – గురువువు – మా వంశమునకు దైవమువు – సమస్త వ్యవహారమునకు కర్తవు.

89 శ్లో॥ కులదైవత మస్మాకమితి నిర్ధార్యభక్తితః ।
భజేత్త్వాంత్వం స్వర్గగతి స్త్వం నృసింహ సరస్వతే ॥

90 శ్లో॥ సరస్వతీ తి తే నామ్నా విక్రీతోఽహం త్వదాశ్రయః ।
కుతో దైన్యం మమ ద్వారితిష్ఠత్యే తచ్చ సంకటమ్ ॥

91 శ్లో॥ సంకటం వితతాంచింతాం కుతోఽర్పయ సి మేవద ।
భక్తవత్సల ఇత్యత్ర ప్రఖ్యాప్యస్త్వం కృపానిధిః ॥

92 శ్లో॥ కృపానిధే దీనబంధో అనంతానంత సద్గుణ ।
పరమాత్మా త్రిమూర్తిస్త్వం మా సంత్యజ కృపాలుతాం ॥

93 శ్లో॥ దయాళుతా తే ప్రధితా త్రిమూర్తే విశ్వపాలక ।
లోకే సమస్త దేవానాం త్వమేవాసి బహుప్రదః ॥

94 శ్లో॥ బహు ప్రదోఽపి దేవేభ్యోయది త్వంత్వర్థిః సద్గురో।
త్వాం విహా యాపరం కంవా యాచే దా తా త్వమేవమే ॥

95 శ్లో॥ త్వమేవమే పరందైవం దాతాత్వత్తోఽపరోఽస్తి కః ।
పోషకోఽసిత్వమనిశ మస్య విశ్వస్య సర్వవిత్ ॥

96 శ్లో॥ సర్వతః సర్వవిదితి వదతిత్వాంకిలశ్రుతిః ।
సాక్షీ నాస్త్యన్యనేక్షేహి సర్వ మాశ్రిత్వ లక్షణం ॥

97 శ్లో॥ సర్వసాక్షి త్వలక్ష్మేదం కః కథంకుత్రవర్తతే ।
తథా నవేత్సు పేక్షావా దయాలోయుజ్యతే కథం ॥

98 శ్లో॥ కథం మమస్థితిరితి వేత్సిచేత్త్వం హి సర్వవిత్ ।
మాంనజానాసి చతుర క్షుధితం తాత! పాలకమ్ ॥

89 తా॥ ఓ స్వామీ! మిమ్ము మా కుల దైవతముగ నమ్మితిమి. అందుచే ఓ నృసింహ సరస్వతి మిమ్ము భజింతుము - మాకు స్వర్గ సౌఖ్యమిప్పించండి!

90 తా॥ ఓ స్వామీ! మీపేరుతో మీకు విక్రయమైతిమి. అనగా మేము మీ సొత్తు - అందుచే మిమ్మాశ్రయించిన మాకు దైన్యం సంకట మెక్కడిది.

91 తా॥ భక్తుల కల్పవృక్షమవు - దయానిధివి - నీకీ రెండును ప్రసిద్ధ నామములు గదా? భక్తులమైన మాకు చింతాధ్యాస సంకటములెందుకు కలిగించెదవో? చెప్పుము.

92 తా॥ ఓయీ! అనంత గుణధామ! కృపా సముద్ర - నిన్ను పరమాత్మగా, త్రిమూర్తిగా తలచు మమ్ము నీవు వదలకు స్వామీ!

93 తా॥ విశ్వమునంతయు పాలించు మూర్తివని దయాబ్ధివని నీకు లోకమున పేరున్నది. ఓ దత్తా! నీవు దేవతలలో ప్రతిష్ఠ గలవాడవు. నీకన్న రక్షించుదాత లేడు - అందుచే నిన్నే తప్ప మరెవరిని శరణనను.

94 తా॥ ఓ దత్తా! దేవతలలో ఇట్టి దయాపరుడు లేడు. అందుచే సద్గుణుడవు నీవు - నిన్ను కాదని ఎవరిని రక్షింపగోరెదను?

95 తా॥ నీవే అందరకన్న గొప్పవాడవు - నీకన్న రక్షకుడింకెవడు? నీవే లోకమును సర్వమును పోషించుదు వీవెల్లపుడును.

96 తా॥ నీవు సర్వవేత్తవు - సర్వత్ర నుందువని - కావున ఆశ్రితులకే ఆసాక్షి ధర్మము దక్కును.

97 తా॥ నీవు సర్వసాక్షివన్న గుర్తు యేమున్నది - ఎక్కడున్నది - అసలున్నదా లేదా? అని నీ యుపేక్ష వలన సందేహమగుచున్నది. దయాళువు - నీకీ యుపేక్ష మా యందేల?

98 తా॥ నీవు ప్రపంచమంతటిని తెలిసినవాడవు మరి నా స్థితి నెఱుగుదువుగద? నేను రక్షణ లేనివాడనని - నన్ను పాలింప నీకు గుర్తు లేదా?

99 శ్లో॥ పాలకం క్షుధితం స్వీయం రుదంతం వీక్ష్యచాపికిమ్ ।
మాతాపి మానుషీ దేవస్త్వా దృశం కిముపేక్షతే ॥

100 శ్లో॥ ఉపేక్షసే భవాన్కిం మాం న దత్తం కిమపీతిచేత్ ।
శ్రియం మేకించి దాదాయ చిత్సేఽపిత్వం బహుప్రద! ॥

101 శ్లో॥ బహుప్రదత్వమాఽ దాయభూతలం సఫలం బలేః
స్వరాజ్యమర్పితంతస్మై ప్రసిద్ధ మితిచేద్వద ॥

102 శ్లో॥ వదతేఽ న్యత్తు పృచ్ఛామి లంకా స్వర్ణ మయీూత్వయా ।
దత్తా విభీషణాయేశ దత్తం తే తేన కింపురా ॥

103 శ్లో॥ పురాత్వయాధ్రువా యాపి దత్తం ధ్రువపదంతదా
కిందత్తం తే హృషీకేశ తేన మాంకి మయాచసే ॥

104 శ్లో॥ యాచేసేవకపాలత్వం దత్తా నిః క్షత్రియా మహీ ।
విప్రేభ్యః కింప్రదత్తం తే కిందాస్యే తేఽద్యపోషక ॥

105 శ్లో॥ పోషకః సర్వసృష్టేస్త్వం దేవస్త్వం కమలాపతిః ।
కింతేదాస్యామ్యహం రంకోమశకోదుర్మతిః కియాన్ ॥

106 శ్లో॥ కియానహం పరాధీనః క్వచ శ్రీమాన్ భవాన్ క్వచ ।
సవిలాసా మహాలక్ష్మీ ర్యదగ్రేనందతే సదా ॥

107 శ్లో॥ సదానంద తతః కింతేవద దేయం మయాధికమ్ ।
కిమిచ్ఛసి హృషీకేశ మత్తోఽహం తవ బాలకః ॥

108 శ్లో బాలకోమాతురుత్సంగ ము పవిశ్యక్షుధాతురః ।
దీనః ప్రసారయి[illegible] [illegible]పయసః కాంక్షయా[illegible]యుదా ॥

99 తా॥ నీవు రక్షకుడవని పాలింతువని నిన్ను చూడక ఏడ్చుచుంటిని - ఇప్పుడు చూచితిని - అయినను ఊరకుందువేల? నీవే తల్లివి, నీవే తండ్రివి, సఖుడవు - నీవుపేక్షసేయుటదేమి?

100 తా॥ నేను నీకేమి లంచమీయలేదని యుపేక్షయా? నీవు నాకు అయిశ్వర్యమును ఎక్కువగా నిమ్ము. అందులోనేనే కొంత చేకొనుము కాని యిట్లుపేక్ష చేయకు స్వామీ!

101 తా॥ నీవు బహుప్రదుడవు. ఈ ప్రపంచమంతయును రక్షింప చేకొనువాడవు - నీవు సర్వమగు సామ్రాజ్యమును బలిచక్రవర్తిది కొని - వానికి - స్వారాజ్యమునిచ్చితివి - ఇది లోక ప్రసిద్ధము - నీవే చెప్పుము. అట్లు చేసితివి గదా!

102 తా॥ ఓ స్వామీ! నిన్నొక్కటి అడిగెద! చెప్పుము - లంకాపురి బంగారుమయమైనది. ద యాచింప కుండగనే విభీషణునకు యీయలేదా?

103 తా॥ పూర్వము ధ్రువుడు నీకిచ్చినదేమున్నది - నీవడిగినదేమున్నది? అట్లుగాకయే ఆయనకు - నిశ్చలమైన ఉన్నత స్థితి నిచ్చితివి - ఇప్పుడు నేను నీకీయ నేమున్నది?

104 తా॥ అయ్యా! నీవు దయామయుడవగుటచేత నీకు బ్రాహ్మణులేమిచ్చిరి - భూమినంతటిని పరశురామావతారమున నిచ్చితివి. నీవు స్వయముగ విశ్వపోషకుడవగుట వల్లనే - నీ వందరకు అట్లే ఇమ్ము!

105 తా॥ స్వామీ! నీ వీ సర్వసృష్టికి ముందు సృష్టికర్తవైన దేవుడవు. పాలకుడవగు కమలాపతివి - నేను అల్పుడను - తెల్లవెంద్రుక వంటివానిని - దుర్మతియైన దోమ వంటివానిని - నేను నీకివ్వగలదేమున్నది?

106 తా॥ నీవు శ్రీమంతుడవగు భగవంతుడవు - స్వతంత్రుడవు - నేను అస్వతంత్రుడను - అభాగ్యుడను - కావున ఓ భగవంతుడా? లక్ష్మి నీయొద్దనే యున్నది - విలాస పురుషుడవు - నీవు నన్నడుగరాదు - నేను దరిద్రుడను.

107 తా॥ నీవెల్లప్పుడానందము గలవాడవు -అట్టి సదానందునకు నీకు నేనేమి యిత్తును? అయినను స్వామీ! నేను పిల్లవానిని - నావల్ల నీకు వచ్చునదేమి?

108 తా॥ పిల్లవాడు - ఆకలి గొన్నప్పుడు తల్లి తొడపైకెక్కి - పాలకొరకు నోరు తెరచును - పాలిచ్చునని కోరికతో నాలుక తెరచి వక్షోజముల నోట నుంచుకొనును.

109 శ్లో॥ తదామాతా ప్రథమతో యాచతేకిం సుతంప్రతి ।
తథా మాం గురునాథాద్యయాచసేకిం దదామి కిం ॥

110 శ్లో॥ కిం దాతాఽదాయ యోదాతాయద్వాసేవామపేక్ష్యవా।
వదాన్య! సద్గురో! తేఽగ్రే కిం దదామి దయానిధే ॥

111 శ్లో॥ దయానిధే! నశక్నోషి దాతుమద్యేతి నోచితం ।
త్వం చతుర్దశ లోకేభ్యః సర్వం పూరయసి ప్రభో ॥

112 శ్లో॥ ప్రభోయదితవేచ్ఛేయం మయాసేవా న తేకృతా ।
అతోన దాస్యామ్య భీష్ట ఇతిచేన్మా తథా వద ॥

113 శ్లో ॥ వద సేవాభి కాంక్షీ యః సవదాన్యాగ్రణీర్భవేత్ ।
నగణ్యతే హి దాతృత్వం సేవ్య సేవక భావయో ః ॥

114 శ్లో॥ భావం యోగజ్ఞ భగవన్ పశ్య రూపాదిషు క్షితౌ ।
ఆకాశస్థోఽపి జలదో నిరపేక్షోఽంబు వర్షతి ॥

115 శ్లో॥ వర్షతీహతు యోమేఘ స్తస్యసేవాంనకుర్వతే ।
వాపీ కూపతటాకాద్యాః ప్రసిద్ధ మద ఈశ్వర ॥

116 శ్లో॥ ఈశ్వరో వేతనాదాతా దాతాసేవా మపేక్ష్యయః ।
ఉదారత్వం దయాబ్ధే! త ఏతేన శ్లాఘ్య తేకథం ॥

117 శ్లో॥ కథంచనాపిమేదోషః నాగ్రహోఽపి తు సేవనం ।
నజానేఽథాఽపిమత్పూర్వే సర్వేఽపి తవసేవకాః ॥

118 శ్లో॥ సేవకాన్వయజం దేవ పాలనం బాలిశం తవ ।
స్వామిన్నతోఽపి విద్ధిహ మాం రంకం తవసేవకం ॥

109 తా॥ అట్లు పసివానికి పాలిచ్చు తల్లి ముందు బాలునేమైన అడుగునా? అడుగదు. ఈయడు. అట్లే తల్లివంటి నీవు నన్నడిగేది లేదు. నేనిచ్చేది లేదు. నీవు పాల రొమ్ము నోటబెట్టక తప్పదు.

110 తా॥ లోకమున యాచకుని వద్ద తీసికొని యిచ్చెడివాడు దాత కాడు. అందునను నీవు యిచ్చే దాతవు – నీముందు నేనేమిత్తును?

111 తా॥ దయామయుడవగు దేవుడా! ఇప్పుడు నన్ను నీవనుగ్రహింప లేవా? ఉచితము గాదా? పదునాల్గు లోకముల రక్షించు నీవు నన్నొక్కని రక్షింపలేవా?

112 తా॥ స్వామీ – నేను సేవచేయలేదని – అందుకు నన్ననుగ్రహింపనని నీ కోరికయైనచో – అనఁగా నేనివ్వను అని మాత్రము దయయుంచి అనబోకుము.

113 తా॥ అడుగగనే కోరికల వెంటనే యిచ్చువాడే వదాన్యుడని పేరు – ఇది యాచక దాతల మధ్య వ్యవహారం – ప్రస్తుతము నేను సేవకుడను నీవు సేవ్యుడవు – అందుచే నేనడుగ పనిలేకయే నా కోరికల దీర్తువు.

114 తా॥ భగవంతుడా! నీ సేవకుల భావములు మీకు బాగుగ తెలియును. మేఘుడాకాశమున నిరపేక్షగా వర్షము కావలసిన వారి కడుగకుండా ఇచ్చుటలేదా?

115 తా॥ లోకమున వాపీకూప తటాకనద్యాదులు – అయ్యా! మేఘుడా మీకు సేవఁజేతుము – మాకు వర్షమిమ్మని కోరుట లేదు అయినను వర్షిస్తున్నాడు గద?

116 తా॥ సేవా ధర్మమునకు తగిన కూలిచ్చువాడు దేవుడే! అందుకని నీవు ఉదార భావముతో నీ సేవకులకు నీవు యిచ్చు అభీష్ట ఫలము నెక్కువ చేయుము.

117 తా॥ స్వామీ! ఏ విధముగ నా దోషము లేదు. నీవు సేవకు దగ్గ ఫలమిచ్చుటకు కోపింప నవసరం లేదు – నేనెరుగను గాని మా పూర్వీకులు నీసేవతో బ్రతికినవారే!

118 తా॥ ఓ ప్రభూ! నేను నీ సేవకుల వంశంలో పుట్టితిని – అందుచే నీ సేవక సంతతిలో అల్పుడను, దయచూడుము.

119 శ్లో॥ సేవకాన్వయజం రాజా లోకే రక్షితి పుత్రవత్ ।
ఇతి ప్రసిద్ధం తన్న్యాయాద్రక్ష మా మద్యసేవకం ॥

120 శ్లో॥ సేవకైస్తవ మత్పూర్వైః నిరపేక్షం పదంతవ ।
సేవితం తేన తు భవాన్ ఋణీ మే దదాత్వృణమ్ ॥

121 శ్లో॥ ఋణం కృపానిధే!ఽస్మాకమస్వామ్యం దాతుమేవతే ।
రోచతేనకథం నద్బ్య విజ్ఞాప్యాదాస్య ఎవతత్ ॥

122 శ్లో॥ తత్వం న దిత్ససియదా తదాత్వా మృణినం త్వహమ్ ।
నియోజయామి హి నిజవ్యవహారే పరేశ్వర! ॥

123 శ్లో॥ పరేశ్వరా ద్యమేభాతి కాఠిన్యం హృదయస్యతే ।
గురో కిమర్థం కాఠిన్యం భో సనాతన! సేవకే ॥

124 శ్లో॥ సేవకేనస్వామి గోనస్యార్థం యుజ్యత ఈశ్వర ।
సాసమేనైవతుకియా నహం త్వం భక్తవత్సలః ॥

125 శ్లో॥ భక్తవత్సలతే చిత్తం జ్ఞాతం మృదుతరం పురా ।
దైత్యేన పీడితే భక్తే ప్రహ్లాదే సేవకే నిజే ॥

126 శ్లో॥ నిజేనాప్య పరాద్ధం చేద్దయ నీయేస మానద! ।
దయాలో స్త్రతకాఠిన్యం ప్రభోః కిం శోభతే తరాం ॥

127 శ్లో॥ తరాం మమా పరాధేన కృద్ధోఽసి స్వాంతరేఽపికిమ్ ।
దుర్వాక్య శ్రవణాన్మేఽపి నమాం వశ్యసి బాలకమ్ ॥

128 శ్లో॥ బాలకం నిష్ఠురగిర మంకే స్థిత్వాఽపిలత్తయా ।
తాడయంతం దీయ మానపాన మప్యసకృత్పర ॥

119 తా॥ లోకమున సేవకుడు రాజునకుగా నుండి ఆ సేవకుడుచచ్చిన, వాని వంశము వారిని రక్షించుట రాజ ధర్మమైనట్లు మీ సేవక వంశజుల రక్షించుట తమ విధి గదా?

120 తా॥ మా పూర్వీకులగువారు మీ సేవకులు – వారు నిరపేక్షగా సేవించిరి – అందుచే దేవుడా! నీవు మాకు ఋణపడినావు – ఆ ఋణమును తీర్పనైనా యిప్పుడు మా కోరికలందీర్చుము.

121 తా॥ మాకు నీవు ఋణపడి యున్నావు – అందుకని మీరు మాకు ఋణదాతలు. ఇచ్చి పుచ్చుకొనుట యనునది సత్పురుషోచితమే గద?

122 తా॥ నేను మీకు, మీరు మాకు ఋణ సంబంధం గలవారము – అందుచే స్వామీ! మమ్ము మీ సేవయందుంచుకొని యధార్థ వేతనం దయచేయండి!

123 తా॥ ఓయీ! సర్వేశ్వరా! మా యందు తమకీ కాఠిన్యమెందులకు? సనాతన సేవకులపై ప్రభువులకు కాఠిన్యము రాకూడదు. మన్నించండి.

124 తా॥ స్వామీ! భక్తవత్సల! తమకు సేవకులతో కాదగినది లేని యీశ్వరులు తాము – కానీ మా బ్రతుకు కొరకైనా మా సేవ నంగీకరింపక తప్పదు.

125 తా॥ ఓ భగవంతుడా! మీ చిత్తమును మేమెఱుగుదుము – చాల మెత్తనిది మీ మనసు – పూర్వము – ప్రహ్లాదుడు సేవించెను – అతనిని పీడించిన హిరణ్యకశిపుడేమయ్యెను?

126 తా॥ ప్రభో! స్వామీ! మీ సేవలో నా అపరాధం ఉండవచ్చును. అంతమాత్రముగ తమరు కాఠిన్యం వహింపరాదు – వహించిన మా మేలునకే!

127 తా॥ నేను అపరాధులలో ఒకవేళ పెద్దవాడనే! – దుర్మార్గ వాక్యము మానుండి వినవచ్చినను మీ బాలకునిగను దయఁజూపుము.

128 తా॥ పిల్లవాడజ్ఞానముచే తండ్రి తొడయెక్కి తండ్రిని కొట్టినను – ఆ తండ్రి ఆ పిల్లని నైష్ఠుర్యమును సహించి వానికి మేలు చేయును గద?

129 శ్లో॥ పరమాత్మన్ విలోక్యార్భమానుషేజననీదృశమ్ ।
జహాత్యస్మై క్రుధ్యతివా ప్రత్యుత శ్లిష్యతి ప్రభో! ॥

130 శ్లో॥ ప్రభో కేనా పరాధేన వదసి త్వం నమాం వద ।
కిం ప్రార్థయే హృషీకేశ! బాలోఽహం త్వం హి మే పితా ।

131 శ్లో॥ పితాకుప్యతి బాలాయ నిజాయ పరమేశ్వర ।
యదాకదా చి త్తం బాలం తదాశ్వాసయతి ప్రసూః ॥

132 శ్లో॥ ప్రసూర్యదాకదాచిత్తు భం తుం దృష్ట్వా ప్రకుప్యతి ।
స్వదుఃఖం కథయంతం తం తదా రక్షతి తత్పితా ॥

133 శ్లో॥ పితాఽభిన్న నిమిత్తోపాదానమాతా త్వమేవమే ।
సద్గురోత్వయిరుష్టేఽద్యకంబ్రువేఽకం క్షమాంకురు ॥

134 శ్లో॥ కురు స్వామిన్మయి దయాం త్వం నాథోదీనవత్సలః ।
దాసోఽగ్రేపతితోఽహం తే దీనం మాం ప్రతిపాలయ ॥

135 శ్లో॥ ప్రతిపాలయసీ శ త్వమనాథమితి కథ్యసే ।
అనాథ నాథానాథోఽహం బాలంమాం ప్రతిపాలయ ॥

136 శ్లో॥ పాలయస్యనిశం దీనాన్కృపాలో వేదవిశ్రుత!
సత్వం విలాపం మేకర్ణే నగృహ్ణాసి కథం వద ॥

137 శ్లో॥ వదకస్మాన్నతే కర్ణౌ దీనం మే గృహ్ణాతోవచః ।
విమనస్త్వ త్వయా కస్మాద్గురు రాజ! కథం ధృతమ్ ॥

138 శ్లో॥ ధృతం నైర్ఘృణ్యమితితే భాతి యద్వచనం మమ ।
శ్రుత్వాద్రవంతి పాషాణాః కారుణ్యం తేగతంకుతః ॥

129 తా॥ ఓయీ! పరమాత్మ! మానవజన్మయే యిట్టిది? అట్లని పిల్లవానిని తాను భయపెట్టడు – కౌగిలించుకొని ముద్దును బెట్టుకొనును.

130 తా॥ నా అపరాధమేమిటో నాకు చెప్పండి! స్వామీ? నీవు తండ్రివి – నేను నీ బాలుని – నీవు కోపించినను చివరకు రక్షించునది నీవేకద?

131 తా॥ తండ్రి కుమారుని కోపం చేస్తుంటాడు. అప్పటికి కోపపడిన – ఆ కోపము తీరిన తరువాత దయతలచును గదా? నీవు నట్లే చేయుదువు!

132 తా॥ తల్లి పుత్రుని ఎప్పుడో వానిని కొట్టునట్లు భయపెట్టును – ఆ సంగతి తండ్రితో పిల్లవాడు విన్నవించుకొంటే విని దయఁజూపుట లేదా?

133 తా॥ తల్లిదండ్రులు – నిమిత్తోపాదాన కారకులు – నీవట్లు గాదు – అభిన్న నిమిత్తో పాదాన కారకుడవు – తమరు సద్గురువులు – మీరు కోపగించిన దానికి తిరుగు లేదు – కావున మరల మీరే క్షమింపవలెను.

134 తా॥ దీనవత్సలుడివి – నీవు నాయందు దయజూపుము – దీనుని. నీ కాళ్లపై బడి శరణన్న నన్ను ముందు రక్షించు స్వామీ!

135 తా॥ వేదవేద్యుడవు స్వామీ! నీవు ఎల్లప్పుడు రక్షించుచునే యున్నావు – అనాథులలో ననాథుడనైన నన్ను బాలుని రక్షింప మీకు తప్పదు – పాలింపుము.

136 తా॥ దీనుని నన్ను పాలింపుము స్వామీ! నా దీనుని మొర నీ చెవిని బడిన నీకు దయ యేల కలుగలేదు స్వామీ?

137 తా॥ దీనుడనై ఏడ్చుచు నిన్నే దేవునిగా విలపిస్తుంటే నీ కర్ణముల కెక్కదా? నీవు గురురాజావే! నా యీ దీనాలాపములకు విమనస్కుడవెందుకగుదువు?

138 తా॥ నా మొర నాలించియు నింత దయలేకుండ నుంటివే? నిజముగ మా యేడుపును విన్నచో పాషాణములు కరుగును – నీ మనసు రాతికన్న కఠినమా?

139 శ్లో॥ కుతస్తదాం వర్ణయంతి లోకాస్త్వాం కరుణా కరమ్ ।
తత్సత్యం చేదథాప్యద్య దయాఘన దయాంకురు ॥

140 శ్లో॥ కురుప్రభో కృపాదృష్టిం మ యీ త్యుక్త్వా సమూర్చితః ।
గురునాధః కృపాసింధు స్తదాతమగమద్రుతమ్ ॥

141 శ్లో॥ దృతం వాత్సల్యతో వత్సం ప్రతిధేనుర్యధా తధా ।
దయాలు ర్భగవాగ్ర్వా ప స్వప్నేతం నామధారకం ॥

142 శ్లో॥ నామధారక ఉత్థాయ గురుం దృష్ట్వా సమాగతమ్ ।
దండవత్పాతితో భూమా వుపసంగృహ్య పద్ద్వయం ॥

143 శ్లో॥ పదద్వయరజస్తస్య మమార్జ స్వశిరోరుహైః ।
క్షాళ యిత్వాऽనందజాశ్రుజలైః సువిమలైరలం ॥

144 శ్లో॥ అలంకృత్యోపచారై స్సుఖైర్గం ధాక్షతాదిభిః ।
హృదయాలయ ఈ శానముపవేశ్యమమోద సః ॥

145 శ్లో॥ స ఆపా నందభరితః సద్భక్తో నామధారకః ।
తం తథా వీక్ష్యతచ్చిత్తే గురునాధ స్థిరోऽభవత్ ॥

146 శ్లో॥ నిజ భక్త హృదంబుజం ముదా గురునాధో విభురావసద్యదా ।
ముదమాప సరస్వతీ తదా ముదసా మయ్య పి చాస్తు సర్వదా ॥

గద్య॥ ఇతి శ్రీ సరస్వత్యాఖ్య గంగా ధరాత్మజవిరచిత నరసింహసర
స్వత్యుపాఖ్యాన సంజ్ఞిత మహారాష్ట్ర భాషాన్విత గురుచరిత్ర
సమానార్థాయాం వాసుదేవానంద సరస్వతీయ విరచితాయాం
శ్రీగురు సంహితాయాం ప్రథమోऽధ్యాయః సమాప్తః

139 తా॥ నిన్ను యిట్టి కఠిన మనస్కుని దయానిధిగా లోక మెల్లన్నది? అది నిజమేయైన – ఆ జనవాక్యం నిజమైతే యిప్పుడు నన్ను దయజూడుము.

140 తా॥ స్వామీ! నాపయి దయా కటాక్షముంచు మనుచు మూర్ఛిల్లెను నామధారకుడు, వెంటనే గురునాథులు – దయతో నాతనివద్దకు త్వరగ వెళ్లెను.

141 తా॥ ప్రేమతో ఆవు దూడవద్దకు వెళ్లినట్లు – దయాలుడైన భగవంతుడు నామధారకునికి స్వప్నమున గానవచ్చి కరుణించెను.

142 తా॥ ఇంతలో నామధారకుడు మూర్ఛనుండి లేచి గురువు నెదురుగ నుండుగ చూచి దండవన్న మస్కృతి నొనర్చెను. స్వామి అని పాదములు పట్టెను.

143 తా॥ స్వామివారి పాదములపైఁబడి – ఆపాద ధూళిని తన శిరోజములకు తాకించుకొని ఆ స్వామి పాదములను తన యానంద భాష్పములతో తుడిచెను.

144 తా॥ ఇట్లు స్వామివారి పాద ప్రక్షాళనం చేసి – ఆ పాదముల అంకారము చేసి – ధూప దీప గంధ పుష్పాక్షతలతో పూజించి తన హృదయమును స్వామి పాదములకు దగ్గర నుంచి – సంతసించెను.

145 తా॥ సద్భక్తుడైన నామధారకుడు – కేవలానంద భరితుడే కాదు – అట్లు చింతతో నున్న నామధారకుని చూచి – ఓయీ! నీవు స్థిరముగ నుండుమని గురువుగారు దీవించిరి.

146 తా॥ గురునాథులు తన భక్తుని హృదయాంబుజమును స్వీకరించి ఆనందమునొందెను – ఎట్లు స్వామివారు నామధారకునిపై ప్రేమనుంచిరో అదే విధముగ మా అందరిపై సంతసముతో నుందురుగాక!

గద్య ॥ ఇది సరస్వతి అను బిరుదుగల గంగాధర యతి పుత్రులును – వాసుదేవానంద స్వామి – తమ గురువులగు శ్రీ నృసింహ సరస్వత్యవతార రూపదత్త చరిత్రమును మహారాష్ట్ర భాషనుండి సంస్కృతమునకు అనువదించుటలో ఈసమ శ్లోక గురుచరిత్రలో ప్రథమాధ్యాయమైనది.

# శ్రీ గురు దత్త చరిత్రే

## ద్వితీయోఽధ్యాయః

1 శ్లో॥ త్రిమూర్తి రాజః సగురుర్మమాజః కృష్ణాతటే యోఽస్తిసుదీప్తిపుంజః
ఆనందలోలాం దధతేఽత్రభక్తాః స్వర్గే సు రాస్తాన్స్పృహయంత్య
భక్తాః ॥

2 శ్లో॥ ధ్యాయన్గురుపదం గచ్ఛన్ సంస్తువన్నామధారకః ।
అతిశ్రాంతో వృక్షమూ లే ఖిన్నః సుష్వాపమూర్ఛితః ॥

3 శ్లో॥ క్షణం సనిద్రితో భూత్వాగురుం స్వప్నే ప్య చింతయత్ ।
శ్రీ గురుశ్చింతితోఽనంతో దయాబ్ధిః స్వం హ్యదర్శయత్ ॥

4 శ్లో॥ . భస్మలిప్తో జటాధారీ వ్యాఘ్ర చర్మ ధరో వరః ।
ఏవం రూప ఉపాగత్య తస్య దృష్టి పథేస్థితః ॥

5 శ్లో॥ నామ ధారక మాగత్య లలాటే తస్యభస్మ చ ।
ధార యిత్వా సమాశ్వాస్య దదౌ శీర్ష్ణ్య భయంకరమ్ ॥

6 శ్లో॥ ఇతి స్వప్నే విలోక్యైవ ప్రబుద్ధో నామధారకః ।
దిశ ఆలోక్యతం స్మృత్వా విస్మయం పరమం యయౌ ॥

7 శ్లో॥ స్వప్నే విలోకితాం మూర్తిం మనసా చింతయంస్తదా ।
గచ్ఛన్నచాగ్రతోఽద్రాక్షీ త్ప్రత్యక్షం తం తథైవచ ॥

8 శ్లో॥ యోగీశ్వరం సమాలోక్య సాష్టాంగం ప్రణిపత్యతం ।
కృపాంకురు కృపాసింధో! త్వం హి మా తా పితా మమ ॥

## తాత్పర్యము

1 తా॥ నాకు గురుమూర్తియైన త్రిమూర్తి రాజా కృష్ణానదీ తట తీరమున మంచి కాంతివంతమైన నౌక గుంపు కలదు. ఆ మహానుభావుడు భక్తులతో నానంద తరంగ లోలితులను చేయుచుండ దేవతలు గూడ దానికి మురిసిపోవుదురు.

2 తా॥ నామధారకుడు నడచుచున్నను ఆ గురువుగారి పాద ధ్యానుడగుచుండెను. ఇట్లు ఎడతెరిపి లేక గురువును భజించు నామధారకునకు మూర్ఛ వచ్చి అలసి యొక చెట్టు మొదల దైన్యమునఁబడి యుండెను.

3 తా॥ ఇంతలో క్షణకాల మాతనికి నిద్ర వచ్చెను. ఆ నిద్రయు ఆ గురుపద ధ్యానములో పోగా – స్వప్నములో స్వామి యాతనికి సందర్శనమిచ్చెను.

4 తా॥ ఆ స్వప్న దృష్టమైన మూర్తి – దేహమున భస్మము న లంది – జడలను ధరించి వ్యాఘ్ర చర్మమను వస్త్రముగా ధరించి శివరూపముగ ప్రత్యక్షమైనాడు. ఆ మహాత్ముని దృష్టిలో – యీ నామధారకుడు పడినాడు.

5 తా॥ ఆ నామధారకు నొద్దకు ఆ స్వప్నదృష్టమూర్తి దగ్గరకు వచ్చి – భస్మమును చల్లి ఆతనిని కొంచమోదార్చి – అభయ హస్తమును నెత్తిపై నుంచెను.

6 తా॥ అట్లు స్వప్నమున చూచి నామధారకుడు మేల్కొనెను – ఇట్లు లేచి దిక్కులు చూచుచుండ ఆ గురువును చూస్తున్నట్లె పరమాద్భుతమందెను.

7 తా॥ స్వప్నమూర్తిని ప్రస్తుత జాగ్రదవస్థా మూర్తిని చూచి చింతించుచు ముందుకు పోఁబోవ యెదుట ప్రత్యక్షముగ ఁజూచెను.

8 తా॥ అప్పుడు నామధారునెదుట యోగీశ్వరుడుండెను – ఆయనకు సాష్టాంగ నమస్కార మొనర్చి – స్వామీ! దయానిధి – నాపై దయనుంచుము – నీవే నా తల్లివి, దండ్రివి అని అనెను.

9 శ్లో॥ జయ యోగీశ! జయ జయ త్వమజ్ఞానతమోహరః ।
ఆత్మ జ్యోతిః ప్రకాశశ్చ సిద్ధయోగీ కృపానిధిః ॥

10 శ్లో॥ తవ దర్శన మాత్రేణ దురితం మే ధ్రుతంగతం ।
మమ త్వం తారకోయస్మాత్ స్వామిన్ ప్రాప్తో సంకటే ॥

11 శ్లో॥ కృపయా కృపణం భక్త మాగతోఽస్తికుతోభవాన్ ।
కిం నామ భవతః స్థానం క్వనివాసోఽబ్రవీత్తు మాం ॥

12 శ్లో॥ సప్రాహసిద్ధోఽహం యోగీ తీర్థాటనరతో భువి ।
శ్రీ గురు ర్నః ప్రసిద్ధోఽస్తి శ్రీ నృసింహ సరస్వతీ ॥

13 శ్లో॥ గంధర్వాఖ్యంపురం భీమాఽ మరజా సంగమేఽస్తి తత్ ।
యస్య స్థానం త్రిమూర్త్యాత్మా స నృసింహ సరస్వతీ ॥

14 శ్లో॥ స త్రిమూర్త్య వతారోఽత్ర లోకే భక్తావ నాయ హి ।
భవసాగర తారం యం సదా ధ్యాయం తి యోగినః ॥

15 శ్లో॥ సద్గురుః స కృపా సింధుః భక్తానాం వరద స్సదా ।
యో దత్తే భక్త శిష్యేభ్యః సర్వసౌఖ్యం శ్రియం ముదమ్ ॥

16 శ్లో॥ తద్భక్తానాం కుతో దైన్యం శ్రీ రఖండాఽత్ర తిష్ఠతి ।
పూర్ణా గోధన ధాన్యాద్యైస్తే నందం త్యష్ట సిద్ధిభిః ॥

17 శ్లో॥ ఇతి ప్రగల్భం తద్వాక్యం శ్రుత్వాఽసౌ నామ ధారకః ।
ప్రాహోహ మస్మితస్యైవ శ్రీ గురోశ్చింత క స్సదా ॥

18 శ్లో॥ బిరుదా వలయస్తస్య కీర్తిశ్చాఽపి తథా శ్రుతా ।
పారంపర్యాప్త భక్తం మాం స కష్టార్తం నపశ్యతి ॥

9 తా॥ ఓ యోగీశ నీకు జయము జయము; నీవు నా అజ్ఞాన హరుడవు – ఆత్మ స్వరూపద్యోతి సందర్శనమయ్యెను – సిద్ధయోగి అన నా అదృష్టము గదా?

10 తా॥ ఓ సిద్ధయోగి! మీ దర్శన మాత్రమున మా పాపములు తొలగెను – నాకు నీవే తారకుడవు – ఎందుకనగా? నాకు సంకటము గలిగినపుడు ప్రత్యక్షమైతివి.

11 తా॥ స్వామీ! నేను కృపణుని, నీవే భక్తుని ఆదరించుటకెక్కడి నుండి వచ్చితివో? స్వామీ! నీవుండుచోటేది? నాయందు దయయుంచి చెప్పుమనెను.

12 తా॥ అయ్యా! నేనొక సిద్ధయోగిని – తీర్థాటనాపరుడనై ఈ భూమిని దిరుగుచుంటిని – మా గురువుగారు – ప్రసిద్ధులు, మహిమాన్వితులు శ్రీ నృసింహ యోగీంద్రులు.

13 తా॥ గంధర్వమను పేరుగల నగరము – భీమా – అమరజా నదుల సంగమము కడనున్నది – ఆస్థానము. శ్రీ నృసింహ సరస్వతుల వారి స్థానము. (దానిని గానుగాపురమందురు)

14 తా॥ వా రీ లోకమున భక్త సంరక్షణమునకై త్రిమూర్త్యవతారులై యుండిరి – ఎవ రా మహాత్ముని స్మరింతురో – వారిని సంసార సముద్రము నుండి వారు దాటింతురు.

15 తా॥ ఆయన సద్గురువు – భక్తుల పాలిటి కల్పతరువు – ఎవరు ఆ దత్తమూర్తి గురువులకు శిష్యులో వారికి ఇహపర సౌఖ్యములుండును.

16 తా॥ ఆయన భక్తులకు దైన్యముండదు – అఖండ లక్ష్మి చేకూరును. గో–ధన–పుత్ర–ధాన్య సంపత్తియు సమృద్ధిగా నుండును.

17 తా॥ ఇట్లు మాట్లాడు యోగీశ్వరుడు ధైర్య వాక్యములు విన్న నామధారకుడు – స్వామీ! నేను ఆ గురు దర్శన చింతతో నుంటిని.

18 తా॥ ఆ మహాత్ముని కీర్తి లోకప్రసిద్ధి – ఆర్తావనుడు – ఆర్త త్రాణుడను బిరుదములు చాలగలవు – ఆయనను నా కష్టముల దీర్ప వేడుచుంటి కానరాడు అనెను.

19 శ్లో॥ అద్యత్వం తారకోఽస్మాకం జాతాతే సంగతిస్తతః ।
నిః సంశయం కథయమే ప్రసాదో నకుతో గురోః ॥

20 శ్లో॥ ఉవాచ సిద్ధస్తం విప్ర! సావధానమనాః శ్రుణు ।
కృపాం వర్షతి సర్వత్ర భక్తవత్సల సద్గురుః ॥

21 శ్లో॥ యత్ర స్థితా కృపాతస్య క్షదైన్యంతత్రతతత్కులే ।
వశా భవంతి దేవాః స కలికాల జయీభవేత్ ॥

22 శ్లో॥ ఈ దృశం గురు మా పూజ్యకథం దైన్యం ప్రభాషసే ।
జానే తే సంశయావిష్టం చిత్తం కష్టంతతస్తవ ॥

23 శ్లో॥ త్రిమూర్తిః శ్రీ గురురితి శ్రద్ధా వా నిష్ట భాగ్భవేత్ ।
ఏక భావాయ భక్తాయ స దద్యా దఖిలాన్వరాన్ ॥

24 శ్లో॥ కు పితో య ది దైత్యా రి స్త్రి పురారి రథాపివా ।
తతోఽపి భక్త మాత్మీయం శ్రీ గురుః పరిరక్షతి ॥

25 శ్లో॥ యస్మైకస్మైకదాచిత్తు గురుః కుప్యేత చేత్తదా ।
తతోఽపిభక్త మాత్మీయం శ్రీ గురుః పరిరక్షతి ॥

26 శ్లో॥ ఇతి శ్రుత్వా వచస్తస్య సిద్ధస్య చరణద్వయం ।
ధృత్వా ప్రణమ్య భావేన వినయాఽ వనతో వదత్ ॥

27 శ్లో॥ స్వామిన్నేతత్తవవచః శ్రుత్వా మే సంశయోఽభవత్ ।
గురుః కథం త్రిమూర్త్యాత్మా బ్రహ్మ విష్ణు శివాత్మకః ॥

28 శ్లో॥ దేవేరుష్టే గురుస్త్రా తా గురౌ రుష్టే నకో ప్యదః ।
వద కస్య వచశ్చింది ద్వైధంచిత్తం స్థిరీకురు ॥

19 తా॥ అయ్యా! తమరెవరో తెలియదు. మీ దర్శనమైనప్పటి నుండి నిజముగ తాము ఆ గురుమూర్తులని నా కష్టముల బాపవచ్చిరనుకొందును.

20 తా॥ అప్పు డా సిద్ధుడు నా మధారకునితో ఇట్లనెను – అయ్యా! నేను చెప్పుదును సావధానముగా వినుము – భక్తవత్సలుడగు ఆ సద్గురువు దయను ఎప్పుడు వర్షించుచునే యున్నాడు?

21 తా॥ ఆ మహాత్ముని పాదమెచ్చటుండునో అచట దైన్యముండదు – దేవతలందరు వశముగుదురు – ఈ కలికాల రక్షకుడే ఆ దత్తగురుస్వామి!

22 తా॥ ఇట్టి మహానుభావుడైన గురువు నారాధించు నీకు దైన్యమెక్కడిది? ఎవనికైతే సంశయాత్మ యుండునో అట్టివారికి కష్టము – నిస్సంశయులకు భయము లేదు.

23 తా॥ ఎవడు శ్రీ గురువును త్రిమూర్తిగ భావిస్తాడో అట్టివాడిష్ట భోగములొందును – ఆ గురువు నం దచంచల భావమున్న వానికి అన్నియు సమకూరును.

24 తా॥ ఆ విష్ణువుగాని – శివుడు గాని కోపగించినను యీ శ్రీ గురువు దయయుంటే వారినుండి శ్రీ వారు రక్షింతురు.

25 తా॥ ఎవరిపైనైనా ఎప్పుడన్న గురువు కోపించెనా? ఆ కోపము నుండి మాధవుడు గాని ఉమాధవుడు గాని రక్షింపలేరు.

26 తా॥ ఇట్లన్న సిద్ధుని వాక్యమును విన్న నామధారకుడు – ఆ యోగి పద ద్వయమును గట్టిగ పట్టుకొని వినయముతో నిట్లనెను.

27 తా॥ స్వామీ! మీ మాటలయందు నాకొక సంశయము గల్గుచున్నది – ఆ గురువు – బ్రహ్మ విష్ణు మహేశ్వరులగు త్రిమూర్తి యెట్లయ్యెను?

28 తా॥ భగవంతుడు కోపపడిన గురువు రక్షించును – గురువు కోపగించిన రక్షించువాడు లేదు.

29 శ్లో॥ ఇతి తేన నమస్కృత్య సంపృష్టః సిద్ధయోగిరాట్ ।
అభినం ద్య వచస్త స్య సహాసః సకృపానిధిః ॥

30 శ్లో॥ నామధారక సద్బుద్ధే! సాధు పృష్టంత్వయాశ్రుణు ।
అత్ర సాక్షీవేదవాద ఆదితః కథయామి తే ॥

31 శ్లో॥ చతురానన ఉత్పన్నో విష్ణోర్నా భే స్తదాస్యతః ।
వేదాశ్చత్వార ఉదితాః పురాణా న్య భవం స్తతః ॥

32 శ్లో॥ అష్టాదశ పురాణానాం మన్యే యత్తు సవిస్తరం ।
పురాణం బ్రహ్మవైవర్తే ప్రఖాతం భువన త్రయే ॥

33 శ్లో॥ ద్వాపరాంతేఽభవద్విష్ణుః వ్యాసోనారాయణ స్స్వయమ్ ।
ప్రకాశయా మాసభూమౌ పురాణాన్యఖిలే ష్టకృత్ ॥

34 శ్లో॥ శిష్యాది ద్వారతో వ్యాసా ద్విస్తృతా నీహ తానితు ।
తతోయథా మతి కథా శ్రుతా తే కధ్యతే మయా ॥

35 శ్లో॥ కలిః పప్రచ్ఛ లోకేశం విస్తరేణ గురోః కథాం ।
తస్మై స కథయా మాస మహిమానం గురోర్విధిః ॥

36 శ్లో॥ ఇతి సిద్ధ వచః శ్రుత్వా ప్రణమ్య పునరప్యసౌ ।
వినయావనతో భూత్వా పృష్టవా న్నా మధారకః ॥

37 శ్లో॥ జయసిద్ధ మహాయోగి! న్నజ్ఞాన ధ్వాంత భాస్కర! ।
సంగతోఽసికృపాసింధోర్భవసాగర తారక! ॥

38 శ్లో॥ బ్రహ్మ దేవేన కలయే కి మర్థం మహిమా గురోః ।
కథితస్తమపి ప్రాజ్ఞ మహ్యం కథయ విస్తరాత్ ॥

29 తా॥ ఇట్లని అనుచుండగా – నామధారకుడు సిద్ధయోగికి నమస్కరించి యిట్లనెను – స్వామీ! మీమాటలో సత్యమున్నది. ఆ స్వామి కృపానిధి అనెను.

30 తా॥ నీవడిగినది మంచి ప్రశ్నయే! కాని ఆ గురువుగారు త్రిమూర్తి యనుటకు వేదమే సాక్ష్యము – దాని సంగతినంతయు మొదటినుండి నీకు తెలుపుదును.

31 తా॥ మొదట విష్ణుమూర్తియొక్క నాభి కమలమందుండి బ్రహ్మ పుట్టెను. నాల్గు వేదములా బ్రహ్మ ముఖము నుండి పుట్టినవి – పురాణాదులన్నియు నావేదములనుండి యుత్పన్నమైనవి.

32 తా॥ పదునెన్మిది పురాణముల గూర్చి వచింతును. పురాణములన్నిటిలో బ్రహ్మ వైవర్తము ముల్లోకముల ప్రసిద్ధమయ్యెను.

33 తా॥ ద్వాపర యుగాంతమున ఆ విష్ణువు వ్యాసుడుగ నుద్భవించెను. పురాణములతో వేదార్థమునంతయు ప్రాకాశమొనర్చినది – ఆనారాయణుడే!

34 తా॥ ఆ వ్యాసుడు తన శిష్యులు – జైమిని – వైశంపాయన – పిప్పాలాది శిష్యుల ద్వారా ప్రకాశింపజేసెను – అం దీ కథ యున్నది – దానిని చెప్పుదును – వినుము.

35 తా॥ అప్పుడు కలి బ్రహ్మను గూర్చి యీ వృత్తాంతమును చెప్పుమనగా చెప్పినట్లున్నది.

36 తా॥ ఆ సిద్ధవాక్యమును విని నామధారకుడు మరల నాయనను ప్రశ్నించెను. వినయముతో సిద్ధుని గూర్చి యిట్లడిగెను.

37 తా॥ ఓయీ! సిద్ధుడా! ప్రజ్ఞానిధియైన ఆ గురువజ్ఞానపు చీకటిని పోగొట్టువాడు – మీతో కలయిక సంసార తాప నాశకము.

38 తా॥ బ్రహ్మదేవునితో కలయికయైన గురు మహిమ చాల గొప్పదయ్యెను – దానిని నీకు విస్తృతముగ చెప్పెదను అనగా చెప్పుమనెను.

39 శ్లో॥ సిద్ధ ఆఘ్ర శ్రుణుత్వార్య కల్పో నైమిత్తికోఽభవత్ ।
వట పత్రే తదా విష్ణుః శయానః కల్పసాగరే ॥

40 శ్లో॥ నారాయణోఽ వ్యక్తమూర్తిః కల్పే వారాహ సంజ్ఞకే ।
మయి లీనాం పునస్సృష్టిం స్రక్ష్యేత ద్దైవభుక్తయే ॥

41 శ్లో॥ ఇతి ప్రపంచ రచనాం కర్తు మాధాయమానసే ।
యోగనిద్రాం విహాయాదిపురుషః పూర్వ సర్గవిత్ ।

42 శ్లో॥ నారాయణస్య వృద్ధస్య జగదుత్పాదనేమతిః ।
సంజాతానాభి కమలం ప్రాదుశ్చక్రే సలోకసృట్ ॥

43 శ్లో॥ తన్నాభిపద్మా దుదితో బ్రహ్మదేవ శ్చతుర్దిశః ।
ఆలోకయర్గా స మనసా సమభూ చ్చతురాననః ॥

44 శ్లో॥ స్వగతం ప్రాహ సబ్రహ్మా మత్తోనాన్యోఽపరోబ్రవీత్ ।
నేక్షాఽన్యం కిమపీహాఽస్మి సమర్థో బలవానితి ।

45 శ్లో॥ తదా ప్రహస్యతం గాఢ వాచా నారాయణోఽబ్రవీత్ ।
అహమస్మి మహా విష్ణుః పితరం తవ మాం భజ ॥

46 శ్లో॥ ఇతిశ్రుత్వా విలోక్యాథః శ్రీ విష్ణుం ప్రేక్ష్య చాత్మభూః ।
నమస్కృత్వా చిరతరం తంతుష్టా వాంబుజాసనః ॥

47 శ్లో॥ తే న స్తోత్రేణ సంతుష్టో నారాయణ ఉవాచ తం ।
మమాజ్ఞాం శిరసా ధృత్వా సృష్టిం రచయ పుత్రక! ॥

48 శ్లో॥ బ్రహ్మోవాచే సృష్టి రచనా రీతిం విష్ణో నవేద్మ్యహం ।
న దృష్ట్వా సృష్టి రచనాం విష్ణో! స్రక్ష్యేకథం వద ॥

39 తా॥ ఆ సిద్ధుడిట్లు చెప్పెను – ఒకప్పుడు విష్ణుమూర్తి వటపత్ర శాయియై యుండెను.

40 తా॥ ఆ నారాయణమూర్తి – అపుడు బ్రహ్మతోడ! నాలో యుగాంతమున లీనమైన యీ జగత్తును మరల నీవు సృష్టింపు మనెను.

41 తా॥ ఇట్లు ప్రపంచ సృష్టిని గూర్చి విష్ణువు చెప్పగా – అప్పుడు బ్రహ్మదేవుడు, యోగనిద్రను వదలి యథాపూర్వముగ సృష్టించెను.

42 తా॥ ఆ నారాయణమూర్తి నాభి కమలోత్పన్నుడైన సృష్టికర్త ఆ విష్ణువు వలన సృష్టి విషయమునంతటిని నేర్చెను.

43 తా॥ ఆ విష్ణువు నాభికమలోద్భవుడైన బ్రహ్మ తన తండ్రి మహిమచే జగత్కర్తృత్వ రూప రచనా చతురుడై నలుదిక్కులు చూచెను.

44 తా॥ అపుడు బ్రహ్మ తన మనసులో నాకంటే బలవంతుడు లేడు – ఇంకొకడు నాకన్న అన్యుడెవడు లేడు. సమర్థుడు బలవంతుడును లేడు.

45 తా॥ అప్పు డా విష్ణువు నవ్వు నవ్వి గట్టివాక్కుతో నాతనికిట్లనెను. ఓరీ! నీకు నేను తండ్రిని – నానుండి జనించితివి – నన్ను భజింపుమనెను.

46 తా॥ ఇట్లు విష్ణువనుటతోనే బ్రహ్మ ఆలోచించి నేలకు చూచి విష్ణుమూర్తితో బ్రహ్మ యిట్లని పలికెను – అటుపై స్తోత్రమును జెసెను.

47 తా॥ ఆ స్తోత్రమునకు విష్ణువు సంతసించెను అపుడు ఇట్లనెను – ఓయీ! కుమారా! నా యాజ్ఞను శిరసావహించి లోక సృష్టిని చేయుము.

48 తా॥ అయ్యా! నేను సృష్టిరచన నెరుగను దాని విధానమును సావధానముగ చెప్పుమనెను.

49 శ్లో॥ బ్రహ్మణో వచనం శ్రుత్వా తుష్టో నారాయణోఽవదత్ ।
వేదా న్గృహా ణారచయ తదుక్త విధినాపునః ॥

50 శ్లో॥ వేదేఽస్తి సృష్టి రచనా విచారస్తే సమానద! ।
లీనాం విరించేతాం సృష్టిం యథాపూర్వం ప్రకాశయ ॥

51 శ్లో॥ వేదోఽనాదిః సృష్టి మార్గ దర్శకో దర్పణోపమః ।
త మా దా యాఖిలాం సృష్టిం సావధానతయా సృజ ॥

52 శ్లో॥ వేదోదితేన సర్గేణ త్వమశ్రాంతం సృజాఖిలం ।
ఇత్యువాచహృషీకేశః తథేత్యుక్త్వా పి సోఽసృజత్ ॥

53 శ్లో॥ తతః ప్రజాః ప్రజానాధః ససర్జ సచరాచరమ్ ।
ఉద్భిజ్జానండజాంశ్చైవ స్వేదజాంశ్చ జరాయుజాన్ ॥

54 శ్లో॥ శ్రీ విష్ణో రాజ్ఞయాధాత్రా సర్వం సృష్టి మశేషతః ।
త్రైలోక్యమీశశక్త్యా యుగ్యథావ్యాసేన వర్ణితం ॥

55 శ్లో॥ నారాయణే నఖ్యా తాని వేదవ్యాసేన విస్తరాత్ ।
అష్టాదశ పురాణా ని ఖ్యాతాని జగతీతలే ॥

56 శ్లో॥ తన్మధ్యే బ్రహ్మ వైవర్త పురాణం సూత సూనునా ।
కథితం శౌనకాదిభ్య స్తత్రేయం సద్గురోః కథా ॥

57 శ్లో॥ సనకాదీన్ బ్రహ్మనిష్ఠాన్ సృష్ట్వాఽగ్రేసృష్టి వర్ధకాన్ ।
మరీచ్యాదీన్మా నసాంశ్చ ససర్జ చతురాననః ॥

58 శ్లో॥ అమరా నసురాంశ్చాఽపిససర్జ ద్రుహిణ స్తతః ।
ఉత్పాద్యైకైక మాహూయ పృథివ్యై ప్రేరయద్విధిః ॥

49 శ్లో॥ ఓయీ! నేను చెప్పుచున్నాను - సావధానముగా విని దానిని తప్పక పునస్సృష్టిని చేయుము.

50 శ్లో॥ ఓయీ! నేను నిన్ను సృష్టించి నీ ముఖములనుండి వేదముల బలికించితి - అందుగలదు సృష్టి రహస్యము - పూర్వపు రచన నాలో లీనమైనది - తిరిగి దానిని యథాపూర్వ మొనరింపుము.

51 శ్లో॥ వేద మనాది రూపమైనది - సృష్టికి మార్గదర్శకమైనది - అద్దమువలె ప్రతిబింబమును చూపించును - దానినాధారముగ గొని ఓ బ్రహ్మ నీవు సావధానముగ లోకముల సృజింపుము.

52 శ్లో॥ వేదములో చెప్పఁబడిన క్రమములో నెడతెగక సమస్తమును సృష్టింపుము. ఇట్లు విష్ణువు బ్రహ్మకు చెప్పెను. బ్రహ్మయు నట్లే సృజించెను.

53 శ్లో॥ వెంటనే ప్రజలను ప్రజానాథులను, సమస్త చరాచర ప్రపంచమును సృష్టించెను - అటుపై - ఉద్భిజముల, అండజములను స్వేదములను జరాయుజములను చతుర్విధ జగత్తును సృష్టించెను.

54 శ్లో॥ విష్ణుమూర్తి యాజ్ఞా ప్రకారము బ్రహ్మ సృష్టి విధానమునంతటి నొనరించెను - ముల్లోకములలోని శక్తి దానికి కారకమయ్యెను - వ్యాసుడెట్లు యుగక్రమముగ వర్ణించెనో అట్లు సృజించెను.

55 శ్లో॥ శ్రీమన్నారాయణ మూర్త్యవతారుడైన వ్యాస భగవానుడు పదునెన్మిది పురాణములను ప్రపంచమునకు ప్రకటించెను.

56 శ్లో॥ ఈ పురాణములలో మధ్యనున్నది బ్రహ్మవైవర్త పురాణము - దానిని సూతపుత్రుడు - శౌనకాది మహర్షులకు చెప్పినట్లు త్రేతాయుగపు సద్గురు కథ యుండెను.

57 శ్లో॥ బ్రహ్మదేవుడు ముందుగా - సనక, సనందన, సనత్సుజాత, సనత్కుమారులను - బ్రహ్మవిష్ణులను - మరీచ్యాది ప్రజాపుత్రులను - అత్ర్యాది మహర్షి సప్తకమును సృష్టించెను.

58 శ్లో॥ తదుపరి బ్రహ్మ - దేవతలను, రాక్షసులను సృష్టించెను. తరువాత బ్రాహ్మణాది వర్ణముల వారిని - తద్ధర్మములను, తదాశ్రమ ధర్మములను సృజించెను.

59 శ్లో॥ అమరా నసురాంశ్చాఽపి ససర్జ ద్రుహిణస్తతః ।
స్వవర్ణాశ్రమ ధర్మాది సహితాన్బ్రాహ్మణాదికాన్ ॥

60 శ్లో॥ పూర్వం కృతయుగంబ్రహ్మా సమాహూయా బ్రవీదిదం ।
మమాజ్ఞయాభువంగత్వా స్వగుణాన్ సంప్రకాశయ ॥

61 శ్లో॥ ఏవం బ్రహ్మవచః శ్రుత్వా సత్యరూపం కృతం యుగమ్ ।
భువం గం తుం ప్రవస్థే త ల్లక్షణం శ్రుణు సాదరం ॥

62 శ్లో॥ కదాప్యసత్యంనో వేద వైరాగ్య జ్ఞాన సంయుతం ।
యజ్ఞోపవీతాభరణ మస్ర స్తకరకం కణమ్ ॥

63 శ్లో॥ ఏవం రూపం కృతయుగం నత పూర్వాంగ మబ్రవీత్ ।
బ్రహ్మన్ మాం ప్రేరయస్వాద్యక థయాస్యే మహీతలమ్ ॥

64 శ్లో॥ మహీతలే నరా బ్రహ్మన్ ప్రాయశోఽసత్యభాషణాః ।
నిందాపనోద నిరతాః శఠాస్తేభ్యోబిభేమ్యహం ॥

65 శ్లో॥ శ్రుత్వాత ద్వచనం ప్రాహబ్రహ్మా కృతయుగ త్వయా ॥
స్వస్వత్వా ౯ ద్విసపైక మితాష్టాన్ స్థేయమేవహి ॥

66 శ్లో॥ తుభ్యంకష్టం న దాస్యామి ప్రేరయిష్యేఽ పరం యుగం ।
సావధానతయాస్థేయ మితి తత్ప్రేరయద్విధిః ॥

67 శ్లో॥ వ్యతీతేనియతేకాలే తస్య త్రేతాయుగం విధిః ।
సమాహూయ జగత్సృష్ట్వాతది దంవాక్యమబ్రీత్ ॥

68 శ్లో॥ త్రేతాయుగస్థ లక్ష్మాని శ్రుణువక్ష్యామి సాదరమ్ ।
భోగైః పుష్టాతనుస్తస్య సామగ్రీ యాజ్ఞికీకరే ॥

59 తా॥ కృత - త్రేత - ద్వాపర - కలియను యుగ చతుష్టయమును సృష్టించి - అటుపై భూమిని సృష్టించి - ఆ భూదేవికి యుగముల నప్పగించి ఒక్కొక్క యుగ పద్ధతిని కలిగింపజేయ నాభూమిని ప్రేరేపించెను.

60 తా॥ ముందుగ బ్రహ్మ కృతయుగమును బిల్చి దానితో నిట్లనెను - నా యాజ్ఞా ప్రకారము భూమిపైకి వెళ్లి నీ ధర్మముల నన్నింటిని నీవు ప్రకటించి ప్రజలకాదర్శముగ నుండుము.

61 తా॥ ఇట్లు బ్రహ్మయాజ్ఞచే కృతయుగము భూమిపైకి వెళ్లి తన స్వరూపమును ప్రకటించిన విధానమును చెప్పద వినుము.

62 తా॥ నేను ఒకప్పుడు నసత్య మెఱుగను - వైరాగ్యం జ్ఞానములతో గూడియున్న వాడను - యజ్ఞోపవీతము - ధర్మరక్షణ కంకణ ధారణమును గలిగి యుందును.

63 తా॥ నా స్థితి యిదియని కాయమును చరిచి వంగి బ్రహ్మతో మనవిఁజేసికొనెను - ఓయీ! బ్రహ్మ నన్ను భూమిపైకి పంపుము - నేను అందరిని నా ధర్మమును ప్రోత్సహింపగలను.

64 తా॥ ఓయీ! కృతయుగమా! నీవు భూమిమీద వారలను బాగుచేయ వలయును. వారు సత్యభాషణులు, శఠలు - గూఢాపకారులు - నీలాప నిందలు మొదలైన వానితో నుందురు - వారిని చూచి నేను భయపడుదును. నీవు వారిని బాగు చేయుము.

65 తా॥ ఆ మాటలు బల్కు కృతము (యుగ)తో బ్రహ్మ యిట్లనెను. ఓయీ! కృతయుగమా! నీవు భూలోకమున 118271 పరిమిత సంవత్సరములట నుండుము.

66 తా॥ అయ్యా! కృతయుగమా! నీకు కష్టమును కలిగించను - త్వరలో నేను ఇంకొక యుగమును ప్రేరేపించి పంపుదును. అని దానిని ప్రోత్సహించెను బ్రహ్మ.

67 తా॥ కృతయుగమునకు నియమించిన కాలమగుట తోడనే బ్రహ్మ త్రేతాయుగమును బిల్చి సావధానముగ దానితో నిట్లనెను.

68 తా॥ త్రేతా యుగమందున్న లక్షణములను వినుము చెప్పెదను - యజ్ఞాదులనొనర్చి - భోగభాగ్యములతో తులఁదూగుచు పుష్టిగా నుండుట.

69 శ్లో॥ త్రేతాయుగే ద్విజాస్తస్మా ద్యాగహోమారతాః సదా ।
కర్మ మార్గేణ గంతారో ధర్మశాస్త్రవిదః సదా ।

70 శ్లో॥ త్రేతాయుగం వృషధరం ధర్మశాస్త్ర ప్రవర్తకమ్ ।
న్వస్వ షష్టి నవాదిత్యమి తాబ్దాంస్త దువాసకా ॥

71 శ్లో॥ తతో బ్రహ్మ సమాహుయ మిశ్రరూపధరంపరం ।
ద్వాపరం ప్రాహ తస్యాపి లక్షణాని నిబోధమే ॥

72 శ్లో॥ ఖడ్గ ఖట్వాంగ చాపేషు శాఖాద్యకర పల్లవః ।
ద్వాపరే ఉగ్రతాశాంతి దయా నైష్ఠుర్య సంయుతః ॥

73 శ్లో॥ సహితః పుణ్య పాపాభ్యాం తృతీయం యుగమీదృశమ్ ।
బ్రహ్మ ప్రాహభువం గత్వాకశ్చివ్కాలం స్థితింకురు ॥

74 శ్లో॥ స్వస్వస్యాబ్ధి షడష్టాబ్ద కాలః పూర్ణోఽస్య దా భవత్ ।
తతో బ్రహ్మ సమాహూయ కలిం ప్రాహ మలిమ్లుచమ్ ॥

75 శ్లో॥ శ్రుణుష్వ లక్షణం తస్య మలినస్య కలేర్విదుః ।
బ్రహ్మణః పురతః ప్రాప్తః కలిస్సచ కలిప్రియః ॥

76 శ్లో॥ విచారహీనః పిశునవదనోఽధో ముఖోఽశుచిః ।
గచ్ఛన్ పదేపదేచాపిప్రస్ఖలత్ సఖలప్రియః ॥

77 శ్లో॥ క్రూరోవిరాగరహితః కలహద్వేష సంయుతః ।
ధృత్వావామేనహస్తే న సుధృఢం లింగమాత్మనః ॥

78 శ్లో॥ జిహ్వాం దక్షకరేణాపి ధృత్వా నృత్యన్ము దాతదా ।
దోషపూర్వస్తుతికరః పాపైరపి సమన్వితః ॥

69 తా॥ త్రేతాయుగ బ్రాహ్మణులు యజ్ఞముల నొనర్చువారు – ధర్మశాస్త్రమును దెలిసినవారు. కర్మ మార్గమందత్యంతాసక్తి గలవారుగ నుందురు.

70 తా॥ త్రేతాయుగము ధర్మశాస్త్రబద్ధమై దృఢతరముగ నుండునది – అది 116912 పరిమితమైన సంవత్సరములు గలది – అది ప్రశస్తమైనది.

71 తా॥ బ్రహ్మ ఆత్రేతను పిలిచి మిశ్రరూప ధనమును (న్యాయా న్యాయార్జిత ధనం) ఉండవలెనని చెప్పి పంపుచు, ద్వాపర యుగమును పిల్చి – దాని లక్షణములంజెప్పెద వినుమనెను.

72 తా॥ ద్వాపరము ఖడ్గములతోను అస్త్ర శస్త్రములతోను ప్రజలుందురు – వారందరు దాన దయా గుణహీనులు – నైష్ఠుర్యవంతులు – అశాంతితో నుండువారు.

73 తా॥ మూడవ యుగమైన ద్వాపర యుగము పుణ్యపాప మిశ్రితమై యుండును. దానిని గూర్చి బ్రహ్మ యిట్లనెను – ఓ ద్వాపరమా! నీవు కొంతకాలము భూలోకమున నుండుమనెను.

74 తా॥ ద్వాపర కాలము 111468 సంవత్సరముల కాలమగుట తోడనే నీ కాలము చెల్లినట్లు ద్వాపరమును గూర్చి బ్రహ్మ చెప్పి – పాపభూయిష్ఠమగు కలికాలమును గూర్చి పలికెను.

75 తా॥ మలినవంతమైన ఆ కలిపురుష లక్షణమును చెప్పెద వినుము – ఆ బ్రహ్మ యాజ్ఞ ప్రకారము కలి బ్రహ్మ యెదుట నిలబడెను.

76 తా॥ ఆ కలి విచారము లేనివాడు – పిశాచ సమాన ముఖమువాడు – ముఖమును నేలకు వంచినవాడు – శుచి లేనివాడును – దుర్మార్గులతో సహవాసియై నడుచుచు పడిపోవుచుండువాడునై యుండెను.

77 తా॥ క్రూరుడు – వైరాగ్యము లేనివాడు. ఇతరులపై ద్వేషమును అకారణ కల మందాసక్తి గలవాడును. ఎడమ చేతితో అంగస్పర్శ చేయుచుండువాడునై ఆ కలిపురుషుడుండెను.

78 తా॥ నాలుకను కుడిచేత ధరించి నాట్యము చేయుచు – తాను దోషిగా నుండియు నితరులచే స్తుతులందుచు సమస్త పాపములతో గూడియుండెను.

79 శ్లో॥ ప్రహసన్ ప్రరుదంశ్చశ్చ చేష్టాం మర్కటవచ్చరన్ ।
ప్రాహాగ్రే బ్రహ్మణః స్థిత్వా కి మాజ్ఞా పయసీ తి తం ॥

80 శ్లో॥ దృష్ట్వా పిశాచ రూపం తం ప్రహస్య విధిరబ్రవీత్ ।
కలే కి మర్థం హస్తాభ్యాం జహ్వా లింగేత్వయాధృతే ॥

81 శ్లో॥ స ప్రాహ లింగ జిహ్వా భ్యా మేతా భ్యాం సకలాన్ జనాన్ ।
జ్యేత్వా్య మీతిప్రతిజ్ఞాతం స్వభావోఽయం మమ ప్రభో! ॥

82 శ్లో॥ దేహ్యాపన్ధ్య సుఖాసక్త్యా జేష్యా మీత్యత ఏవమే ।
జహ్వాలింగే ధృతౌకాపి నబిభే మి స్వభావతః ॥

83 శ్లో॥ ఇతి శ్రుత్వాకలేర్వాక్యం బ్రహ్మ దేవఉవాచతం ।
కంచిత్కాలం భువిగతా ప్రకాశం కురుచాత్మనః ॥

84 శ్లో॥ కలిః ప్రాహవిధే! భూమౌకి మర్థం ప్రేరయస్యహో ।
స్వభావంతేఽగ్రతోవచ్మి దుర్గుణానపిమే శ్రుణు ॥

85 శ్లో॥ భేత్తాహం ధర్మతంతూనాం నిస్త్ర పోఽహం నిరంకుశః ।
నిద్రాకలహ శోకాద్యాః సదాసంతి మమాయశః ॥

86 శ్లో॥ పరద్రవ్య హరోఽన్యస్త్రీ హరో మేభ్రాతరామతౌ ।
ప్రపంచ దంభమాత్సర్య కర్తా ప్రాణసమామమ ॥

87 శ్లో॥ యతయస్తే మమ ప్రాణా దాంభికా యేబకాఇవ ।
సమమాత్మా యశ్చలేనభూతద్రోహి హ జీవతి ॥

శ్లో॥ ...శః పరం పరం మిత్రం మమ జీవసమం విభో!
...ణో లోకా స్తే సర్వేమమ శత్రవః ॥

79 తా॥ ఊరక వెటకారపు నవ్వును – ఏడుపును – కోతి చేష్టలఁజేయుచు – అసహ్య రూపముతో బ్రహ్మకడనుండి స్వామీ! నాకు తమ యాజ్ఞ యేమనెను?

80 తా॥ ఆ పిశాచ రూపము గల కలిని బ్రహ్మ చూచి నవ్వి – ఓయీ! నీవెందులకు నాలుకనొకచేత వేఱొకచేత లింగస్పర్శ చేయుచుంటివి? కారణమేమి? అనెను.

81 తా॥ ఓయీ! బ్రహ్మ నా స్వభావమిది – భూలోకములోని వారలను బయటకు లాగవలయునంటె – అశనమునకు (జిహ్వను) లింగమును కామమునకు వశులు – ఈ రెంటిచే ప్రజల జయింపఁచేపట్టితిని.

82 తా॥ లోకులు జిహ్వతో – భోజన సుఖమునకు – లింగముతో కామ సుఖమునకు లోనగుదురు – అందుచే ప్రజలనాకర్షించుట కిట్లుంటిని.

83 తా॥ సరే కలీ! నీవు కొంతకాలమును – నీ ధర్మముల భూలోకమున స్థాపించి రమ్ము! అని బ్రహ్మదేవుడు కలితో చెప్పెను.

84 తా॥ ఓయీ! బ్రహ్మ! నన్ను భూలోకమునకెందులకు బొమ్మను చుంటివి? అని కలి బ్రహ్మతో పలికి – నా స్వభావము – నా దుర్గుణములను మరికొన్నిటిని వినిపింతును – వినుము.

85 తా॥ ఓ దేవా! నేను ధర్మతంతువులఁదెంపుదును – నాకు సిగ్గులేదు – నేను నిరంకుశడను – నా అభిప్రాయములో – నిద్ర, కలహం, శోకము మొదలైన గుణములన్నియు – కూడియుండుట నాకు సమ్మతము.

86 తా॥ అయ్యా! ఓ బ్రహ్మ నాకు – పరద్రవ్యమును హరించుట – పరస్త్రీ హరణం అను నిద్దరు నా సోదరులు – దంభము – మదము మాత్సర్యములను నవి గుణములు నాకు స్నేహితులు.

87 తా॥ లోకమున కొంగజపమొనర్చు – మాయిక సన్న్యాసులంటే నాకు చాల ప్రీతి. లోకమున భూతములకు ద్రోహమును నిశ్శంకగ చేయువాడు నా ప్రాణమునకు ప్రాణము.

88 తా॥ అయ్యా! బ్రహ్మ! ఈ పైజెప్పిన జీవహింసాపరులు, జీవద్రోహులు నాకు ప్రాణతుల్యులు, స్నేహితులు – ఎవరు పుణ్యాత్ములో – ఎవరు పరోపకారులో వారే నాకు ఆగర్భ శత్రువులు.

89 శ్లో॥ బ్రహ్మా ప్రాహమమాదేశం కలే దేహి స్వకేగలే ।
కలౌయుగే మనుష్యాణాం పరమాయుః శతం మతం ॥

90 శ్లో॥ యుగాంతరేతుబహులం తపోఽనుష్ఠానతం స్తదా ।
నృభిః కతిపయాఽహోభిః కష్టేనాపాదితం ఫలం ॥

91 శ్లో॥ ఏవంత్వయి సమర్త్యానామిహస్వల్పాయుషాంద్రుతమ్ ।
భక్త్యాపరేశ భజన మాత్రేణా పి కృతార్థతా ॥

92 శ్లో॥ యుగాంతరే నృణా మాయుర్బాహుల్యాద్దీర్ఘకా లతః ।
తపోఽనుష్ఠాన సంసిద్ధిః కష్టేన న తథాత్వయి ।

93 శ్లో॥ యే బ్రహ్మజ్ఞానినః పుణ్యకారిణో దేవసేవకాః
మా విఘ్నం కురుతేషాంత్వం సాహాయ్యం కురు శీఘ్రద ॥

94 శ్లో॥ ఇతి శ్రుత్వావిధేర్వాక్యం నమస్కృత్యాఽబ్రవీద్కలిః ।
స్వామిన్ యేకథితాలోకాస్తే లోకామమవైరిణః ॥

95 శ్లో॥ యత్రేమేవైరిణస్తత్రక్షి తౌమే గమనం కథమ్ ।
యేషాం శ్రవణమాత్రాచ్చ బిభేమి భృశదుఃఖితః ॥

96 శ్లో॥ భూమండలే విశేషేణ ఖండే భారత సంజ్ఞకే ।
సంతి పుణ్య జనాఘ్నంతితే మాంతత్ర కథంగతిః ॥

97 శ్లో॥ ఇతి శ్రుత్వాకలేర్వాక్యం హసన్ బ్రహ్మా తమాహచ ।
త్వం కాలాత్మాన మాశ్రిత్యేకలే తిష్ఠాచలాచలే ॥

98 శ్లో॥ ఛినత్తి స్వగుణైనైష సర్వేషాం ధర్మవాసనాం ।
పుణ్యాత్మానోఽపిమహతో భవేత్వాపే మతిస్తతః ॥

89 తా॥ ఓయీ! కలే! నీవు కంఠోక్తిగ నన్న పలుకులను భూలోకమునకు వెళ్లి తీవ్ర ప్రచారమును చేయుము – నేను కలియుగము వారికి కొందరకు నీ నఖులకు నూరు సంవత్సరములాయువును పెంచుదును.

90 తా॥ వేరొక యుగము వచ్చి నిన్నాక్రమించు వఱకు నీ వ్యవహారమును నీవు నడువుము – మానవులు నీ ధాటికి తట్టుకొని కష్టములనుభవించిన గాని భగవంతుని పాదములబట్టరు.

91 తా॥ సాధ్యమై నంతలో – ఓ కలీ! నీవావేశించిన ప్రజలకు స్వల్పాయుర్దమునే ఇత్తును – భూలోకవాసులు భజన మాత్ర తృప్తులై కృతార్థులగుదురు.

92 తా॥ యుగాంతరమున నీ తరువాత కాలమున ప్రజలకు ఆయుర్వృద్ధి – తపోనుష్ఠాన తత్పరత – తపస్సిద్ధి గలిగియుందును.

93 తా॥ ఓయీ! కలి! నేను చెప్పునది గుర్తుంచుము – అని బ్రహ్మ కలితో చెప్పెను – నీ పాలనలో – బ్రాహ్మణులకు – పుణ్యవ్రతులకు – దేశ సేవకులకు – తపఃపరులకు – చేతనయినంత విఘ్నముల గలిగించి – వారి నా త్రోవను పోనీకుము.

94 తా॥ ఇట్లుగా బ్రహ్మ వాక్యమును కలి విని – ఆకలి, స్వామీ! తమరు చెప్పిన పుణ్యవంతులను నేను భ్రష్టుల నొనరింప వీలుగాదు – వారు నా శత్రువులు.

95 తా॥ ఎక్కడ నా శత్రువులుందురో నేనక్కడకు వెళ్లను – నా పేరును వింటేనే – మీరు చెప్పిన పుణ్యాత్ములకు – మిక్కిలి భయము. అందుచే నేను అక్కడ కెట్లేగుదు?

96 తా॥ సాధ్యమై నంతలో భూమండలంలో భరత ఖండవాసులే మీరు చెప్పిన పుణ్యాత్ములు – అట్టి పుణ్యాత్ముల వద్దకు నేను శత్రువుడనగుటచే పోను.

97 తా॥ కలియు పల్కినట్టి వాక్యములను బ్రహ్మ విని – ఇట్లనెను. నీవు కాలస్వరూపమును ధరించి – వారివద్ద కూర్చుండలేవు. చిక్కిన స్థిర నివాసము నొందుము.

98 తా॥ ఓయీ! బ్రహ్మ సాధ్యమై నంతలో నా స్వభావమున – ఎవరికి ధర్మవాసన యున్న వారికి సాధ్యమై నంతలో విఘ్నమొనర్తును? ఎంతటి పుణ్యాత్ముడు కాని కాలాంతర రూపమును ధరించి వారికి మనశ్చాంచల్యమును గలిగింతును.

99 శ్లో॥ కలిః ప్రాహ శృణు బ్రహ్మన్ వైరిణోమే విశేషతః ।
భూమండలే సువిమలే తీర్థా దౌ ని వసంతియే ॥

100 శ్లో॥ యే శివోపాసకా విష్ణు ధ్యాన నిష్ఠాశ్చ ధార్మికాః ।
ఉపద్రవంతి మాం తేతు తేషు మే నకృపాభవేత్ ॥

101 శ్లో॥ అన్యేపి వైరిణస్సంతి గంగా తీర విహారిణః ।
వారణాసీ వాసినోయే యే ధర్మం తత్రకుర్వతే ॥

102 శ్లో॥ తీర్థాని పర్యటం తీహ పురాణ శ్రవణా దరాః ।
ధ్యాన నిష్ఠా దానరతా యేచతే మనువైరిణః ॥

103 శ్లో॥ యేషాం మనసి శాంతిస్తే వైరిణోమే ప్రజాపతే ।
అదాంభి కాన్పుణ్య శీలాన్ దృష్ట్వామే వేపధుర్భవేత్ ॥

104 శ్లో॥ నాసాగ్ర దృష్ట్యా యే తేచ జపానుష్ఠాన తత్పరాః ।
దృష్ట్వా దృష్ట్వాపి తాన్ప్రాణా మమయాస్యంతి భాతిమే ॥

105 శ్లో॥ స్త్రీ పుత్ర స్నేహ సంబంధా యేమాయాజాలవేష్టితాః ।
తేషాము పరి మే ప్రీతి స్త ఇష్టాః పరమామమ ॥

106 శ్లో॥ దూషయం తి శ్రుతీః శాస్త్రం భేదా ద్ధరి హరౌచయే ।
పశ్యంతితౌ ద్విషం తీహ తఆప్తాః పరమామమ ॥

107 శ్లో॥ భజంతియే హరిహరౌ సర్వదా విజతేంద్రియాః ।
యేరాగద్వేష రహితా తేభ్యో మమదరః పరః ॥

108 శ్లో॥ బ్రహ్మ ప్రాహకలే! భూమే త్వత్ప్రకాశోభవిష్యతి ।
గతి మాత్రేణ తేలోకావర్తిష్యం తే త్వదిచ్ఛయా ॥

99 తా॥ ఓయీ! బ్రహ్మ! మీరు చెప్పిన పుణ్యాత్ములు - సాధ్యమైనంతలో నేను తిరుగని - తీర్థములలో - క్షేత్రములలో నాకంట బడకుందురు. ఒకవేళ నాకు చిక్కినచో నేను వశము చేసికొని - నా మార్గములోనికి వారిని లాగుకొందును.

100 తా॥ ఎవరు శివ విష్ణూపాసకులో - ధ్యానపరులెవరో - ధార్మికులెవరో? వారందరు నాకు ద్రోహము చేయు దుర్మార్గులు - అట్టివారిపై నాకు దయయే లేదు.

101 తా॥ గంగాది తీర్థములలో నెవరుందురో వారందరు నా శత్రువులే! ఎవరు కాశీవాసులో వారందరు ఉత్తములు - వారిని నేను దర్శింపలేను - కాలాంతర ధర్మమున నేను నీ యాజ్ఞతో వారిని చెరచి నాత్రోవకు తెచ్చుకొందును.

102 తా॥ తీర్థాటనపరులు – పురాణ కథాశ్రవణ పరులు – ధ్యాననిష్ఠులు – దానానుష్ఠాన తత్పరులు మొదలగు మీరన్న ధర్మాత్ములు - నాకు పరమ శత్రువులు.

103 తా॥ ఎవరు శాంతచిత్తులో వారందరు నా శత్రువులే! దంభము లేని నిజమైన – అనుష్ఠానపరులు - దానపరులు - తపస్వులు మొదలగు వారిని చూచిన నాకు కంపము పుట్టును.

104 తా॥ నాసాగ్రన్యస్త చూపులై భ్రుకటి స్థానస్థ జపపరులెవరున్నను – అట్టివారిని నేను చూచినను వారు నన్ను చూచిన నా ప్రాణములు పోవునని కలి బ్రహ్మతో ననెను.

105 తా॥ ఎవరు స్త్రీలు, పుత్రులు, స్నేహితు లను సంబంధము గలవారో - అట్టి మాయాజాల వేష్టితులపై నాకు ప్రేమ యెక్కువ! అట్టివారన్న నాకు మిక్కిలి ఇష్టము గలవారు.

106 తా॥ ఎవరు వేదములను శాస్త్రములను దూషింతురో వారును – హరిహరాదులయందు భేదబుద్ధి గలవారును - ఎవరు దేవతలన్న ద్వేషబుద్ధితో నుందురో వారు నాకు పరమాప్తులు.

107 తా॥ ఎవరింద్రియ జయము నొనర్చి హరిహరాదుల సేవింతురో - రాగద్వేషములు లేక విరాగులుగ నుందురో అట్టివారనిన నాకు ద్వేషం.

108 తా॥ ఓయీ! కలీ! అట్లులైన నీ ప్రకాశము భూలోకమున వెలుగొందును - నీవు కదిలిన భూలోకమంతయు నీకనుగుణముగ వర్తింతురని బ్రహ్మయనెను.

109 శ్లో॥ తేషాం మధ్యే పుణ్యావంతో భవిష్యం తిక్వ చిన్నరాః ।
మా విఘ్నం కురువేషాంత్వం సంచ రైవం మహీతలే ॥

110 శ్లో॥ ఇత్యేతద్బ్రహ్మణో వాక్యం కలిః శ్రుత్వా కరద్వయమ్ ।
సంధాయ స పునః ప్రాహవినయా వనతో విధిమ్ ॥

111 శ్లో॥ స్వభావో మమ దుర్వృత్తేః కథ మేవంభవిష్యతి ।
స్వామిన్ ధర్మేణ తుకథం సంగతిర్మమమాంవద ॥

112 శ్లో॥ ఏవం కలేర్వచః శ్రుత్వా ప్రహస్య విధిరబ్రవీత్ ।
నివాసోపాయ మవనౌశ్రుణు కాలమలాత్మక! ॥

113 శ్లో॥ త్వం కాలమలసాహాయ్యా ద ధర్మస్యచ గచ్ఛగాం ।
తతో విజ్ఞాత మార్గస్త్వం నిర్భయం ప్రచరిష్యసి ॥

114 శ్లో॥ నిర్మలా యేజనాః క్వాపి తవతే సంతువైరిణః ।
ఇష్టా స్తవభవిష్యంతి యే నరా మలదూషితాః ॥

115 శ్లో॥ ఇతి బ్రహ్మ వచః శ్రుత్వా కలిర్నత్వా వదత్పునః ।
ఏవం శ్రుత్వాపినమనః క్షమంగంతుంక్షితింమమ ॥

116 శ్లో॥ యేషాం మధ్యేనరః కశ్చిత్ పుణ్యావాంస్త్వాం నజేష్యతి ।
ప్రాయశోభూతలే లోకాః భవిష్యంతి వశేతవ ॥

117 శ్లో॥ ఏవం క లేస్తు సకలం సాశంకం నామధారక ।
శ్రుత్వా వాక్యం విధిః ప్రాహ సావధానమనాః శ్రుణు ॥

118 శ్లో॥ ధైర్యం ధృత్వా మనసియే శుద్ధా బుద్ధా శ్చరంతి తాన్ ।
త్వద్దోషాః స్పర్శయిష్యంతి నతథాలోభవర్జితాన్ ॥

109 తా॥ వారిలో కొందరు పుణ్యవంతులగు వారుందురు – అట్టివారికి విఘ్నమొనరింపకుము – ఇట్లు నేను చెప్పినట్లు జాగ్రత్తగ భూలోకమున(బవర్తింపుము.

110 తా॥ ఇట్లు బ్రహ్మ పలికిన వాక్యమును కలి విని – రెండు చేతులు మోగిచి బ్రహ్మకు వినయముగ నమ్రుడగుచు నిట్లనియెను.

111 తా॥ స్వభావముతో దుర్వృత్తి గలనాకు మీరు చెప్పిన పద్ధతి యెట్లు పొసగును? స్వామీ! నాకు ధర్మముతో సంగతి యెట్లు లభించును?

112 తా॥ ఇట్లు కలి పలికిన పలుకులకు నవ్వి బ్రహ్మ యిట్లనెను. ఓయీ! మలినవంతుడా! నీవు భూలోకమున వసించు నుపాయమును వినుము.

113 తా॥ నీవు కాలపురుషుని సహాయముతో భూమియందు సంచరింపుము – అపుడు నీ సంచార మార్గము నిరాటంకమగును – నీవు నిర్భయముగ సంచరింతువు.

114 తా॥ నిర్మలులైన మహనీయులుండినచో – వారు నీకు శత్రువులు – మలముతో దూషితులు (పాపాత్ములు) నీకు స్నేహితులే! కావున కాల సాహాయ్యం నీకు నిర్భయమును గల్గించును.

115 తా॥ ఇట్లుగా పలుకు బ్రహ్మ వాక్యమును కలి విని నమస్కరింప వంగి ఆ బ్రహ్మతో మరల నిట్లనెను. మీరెన్ని విధములుగ బుద్ధి నాకు చెప్పినను – మంచివారిని క్షమింపవలెను – చెడుత్రోవకే త్రిప్పుదును.

116 తా॥ ఎవడైన నరులలో పుణ్యవంతుడైనచో వాడును నిన్ను జయింపలేడు – అందులో భూలోకమున నీవున్నప్పటి వారు నీకందరు వశులుగ నుందురు.

117 తా॥ ఈవిధముగ కలి ప్రభావము సకలమును నామధారకుడు విన్న తదుపరి బ్రహ్మ వాక్యమును ఆ నామధారకుని గూర్చి ఓయీ! శ్రద్ధగా వినుము – ఈ కలియొక్క ప్రభావమును చెప్పుదును.

118 తా॥ ధైర్యమును వహించి భూలోక నరులు – పరిశుద్ధాంత రంగులు – కొందరుందురేమో? నీ సహవాస దోషమున వారు లోభవర్జితులై నిన్ను స్పృశించియే యుందురు.

119 శ్లో॥ యే సేవం తే హరి హరా వభేదేన గురూనపి ।
యేకాశీవాసినస్తేషు త్వద్దోషః ప్రభవోనహి ॥

120 శ్లో॥ యే విప్రసేవకాలోకాః యే మాతృపితృసేవకాః ।
కపిలాగోర్చకా స్తేషు త్వద్దోషః ప్రభవానహి ॥

121 శ్లో॥ శైవాకవా వైష్ణవాన్వాపి-తులసీ పూజకాన్ కలే ।
మదాజ్ఞాం శిరసా ధృత్వాక దాప్యేతాన్న పీడయ ॥

122 శ్లో॥ గురుసేవరతాంశ్చైవ పురాణ శ్రవణాదరార్ ।
స్వధర్మ నిరతాంశ్చైతకదాప్యేతాన్న పీడయ ॥

123 శ్లో॥ శ్రుతిస్మస్మృతి పురాణ జ్ఞాన్ ధర్మజ్ఞాంశ్చ వివేకినః ।
గురుభక్తాన్విశేషేణ కలే! త్వం నైవ పీడయ ॥

124 శ్లో॥ కలిర్జగాదభగవన్ బ్రహ్మన్మాం వదకోగురుః ।
గురుస్వరూపం కథయ ప్రసాదాద్విస్తరేణ మే ॥

125 శ్లో॥ ఇతిశ్రుత్వాకలేర్వాక్యం బ్రహ్మ ప్రాహప్రసన్నధీః ।
కలే! శ్రుణుప్రవక్ష్యామి గురు మాహాత్మ్యముత్తమమ్ ॥

126 శ్లో॥ గకారస్సిద్ధి దః ప్రోక్తో రేఫః పాపస్యదాహకః ।
ఉకారో విష్ణు రవ్యక్తః త్రితయాత్మాగురుః స్మృతః ॥

127 శ్లో॥ గణేశోవహ్ని యుక్తశ్చ విష్ణునా చ సమన్వితః ।
వర్ణ ద్వయాత్మకోమంత్రః చతుర్వర్గ ఫలప్రదః ॥

128 శ్లో॥ గణేశ సంజ్ఞోగకారో వహ్ని సంజ్ఞోరకారకః ।
విష్ణు సంజ్ఞ ఉకారస్యాత్ ఏవం గురు రితి స్ఫుటమ్ ॥

119 తా॥ ఎవరేని గురువులను బ్రహ్మ విష్ణు శివ సమానులుగఁజూచుచుందురో వారియందును - కాశీపట్టణమందున్న వారును - నీ దోషముల పాలుగారు.

120 తా॥ తలిదండ్రులను - బ్రాహ్మణులను - నల్ల గోవులనెవరు అర్చింతురో వారియందును - కాశీపట్టణమందున్న వారును - నీ దోషముల పాలుగారు.

121 తా॥ ఎవరు శివాచారపరులో - విష్ణ్వాచార దీక్షబూనినవారును - తులసీపూజను చేసిన వారును - నా ఆజ్ఞననుసరించు వారిని - కలీ! నీవెప్పుడును పీడింపకుము.

122 తా॥ గురుసేవా తత్పరులనుగాని - పురాణ శ్రవణ తత్పరుల గాని స్వధర్మానుష్ఠాన పరులను గాని - నీవెప్పుడు బాధింపకుమని విధి చెప్పెను.

123 తా॥ శ్రుతి స్మృతి జ్ఞానులను స్వ స్వధర్మముల రక్షించువారిని - వివేకులను - గురువునందు భక్తిగల వారిని విశేషించి నీవు పీడింపకుము.

124 తా॥ ఆ కలి బ్రహ్మతో నిట్లు పలికెను - స్వామీ! గురువన నెట్టివాడు? ఆ గురు స్వరూపమును వివరించి చెప్పుము - వారి అనుగ్రహమెట్టిదో వివరింపుము.

125 తా॥ ఆ కలి పలికిన దానిని విని బ్రహ్మ నిర్మలచిత్తుడై - ఓయీ! కలీ వినుము - గురు మాహాత్మ్యము గొప్పది - ఉత్తమమైనది - దానిని నీకు వివరింతును వినుమనెను.

126 తా॥ గురువు అను రెండక్షరములలో - గ్, ర్ - ఉ = అను మూడక్షరములు గలవు. అందు గకారము - సిద్ధియనియు రకారము పాపదాహకమనియు -ఉకారము విష్ణుతుల్యమని - అందుచే గురువు త్రితయాత్మకుడని భావము.

127 తా॥ గణేశుడు వహ్ని బీజముతో గూడి విష్ణువుతో గలిసి యుండుట ఈ మూడును - ధర్మ, అర్థ, కామ - మోక్షముల నొసగుట గల మంత్రమని అర్థము (గురు)

128 తా॥ ఆ గురువే! తండ్రి! ఆయనయే తల్లి - ఆయనయే శివుడు. ఆ గురువునకంటె గొప్పవాడు లేడు. ఆ గురువు కోపగించిన రక్షించువాడు లేడు.

129 శ్లో॥ గురుః పితా గురుర్మాతా గురురేవ పరః శివః ।
ఈశ్వరో యదికుప్యేత గురూ రక్షతి తంతదా ॥

130 శ్లో॥ యదాకదాచిచ్ఛిష్యాయగురుః కుప్యేత దైవతః ।
పరిరక్షితు మీ శానస్తం న శక్నోతి సర్వథా ॥

131 శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః ।
గురురేవ పరంబ్రహ్మ తస్మాద్గురు ముపాశ్రయేత్ ॥

132 శ్లో॥ బ్రహ్మత్వేనోత్పాదకత్వా ద విద్యాదేశ్చతారణాత్ ।
భవసంహారకత్వాచ్చ గురురాత్మా త మాశ్రయేత్ ॥

133 శ్లో॥ హరౌ ప్రసన్నే పిహి వైష్ణవాజనాః సంప్రార్థయంతే గురుభక్తి మవ్యయాం,
గురౌ ప్రసన్నే జగతామధీశ్వరోజనార్దన స్తుష్యతి సర్వసిద్ధిదః

134 ॥ యదిప్రసన్న యీశానః సద్గురుర్నైవతుష్యతి ।
గురౌ ప్రసన్న ఆసన్న ఈశానస్తస్య ధీమతః ॥

135 ॥ అత ఏవగురుం భక్తాన్ శాస్త్ర మార్గేణ యోభజేత్ ।
సజ్యోతీ రూపభాక్తీ ర్థవ్రతయాగ తపోఽర్థభాక్ ॥

136 శ్లో॥ వర్ణాశ్రమ వృషాచారా ద్వివేక ప్రక్రియాపథం ।
భక్తిం విరక్తిం ముక్తించతస్య దర్శయతే గురుః ॥

137 శ్లో॥ ఇతి శ్రుత్వా విధేర్వాక్యం పప్రచ్ఛ ప్రణతః కలిః ।
సర్వ దేవ నమానోసౌ కు తోజాతో గురుర్వద ॥

138 శ్లో॥ బ్రహ్మా తమాహ వక్ష్యామి విస్తరేణ యథాతథమ్ ।
శ్రుణుష్వైకాగ్రచిత్తేన పారోఽలభ్యో గురుం వినా ॥

129 తా॥ ఆ గురువే! తండ్రి! ఆయనయే తల్లి - ఆయనయే శివుడు - ఆ గురువునకంటె గొప్పవాడు లేడు - ఆ గురువు కోపగించిన రక్షించువాడు లేడు.

130 తా॥ ఎప్పుడైన గురువు శిష్యుని కోపించిన వాని నీశ్వరుడు రక్షింప శక్తుడు గాదు - ఎన్ని విధములకైనా గురువే రక్షింపవలెను.

131 తా॥ ఆ గురువు - బ్రహ్మ - విష్ణువు - దేవుడు - మహేశుడు - ఆ గురువే పరరూప బ్రహ్మము - అందుచే గురువు నాశ్రయించుట తక్షణ కర్తవ్యము.

132 తా॥ బ్రహ్మమున్నదని తెల్పువాడు - మాయనుండి తరింపజేయువాడు, ఈ సంసార రోగహారకుడు - అందుచే నెన్ని విధములుగను గుర్వాశ్రయణీయుడు.

133 తా॥ విష్ణువు తమకు ప్రసన్నుడు కానపుడు వైష్ణవులు గురువు నాశ్రయింతురు - గురువనుగ్రహించినచో భగవంతుడు సంతసించి అభీష్ట ఫలము నిచ్చును.

134 తా॥ ఒకప్పుడు భగవంతుడు ప్రసన్నచిత్తుడైనను గురువు సంతుష్టి చెందక పోవచ్చును - కావున గురువు ప్రసన్నుడైన యీశుడు వెంటనే ప్రసన్నుడగును.

135 తా॥ అందుచే శాస్త్రములో చెప్పినట్లు గురువును భక్తితో సేవింపవలెను - ఆయన సేవవలన - దివ్యజ్యోతి శిష్యాత్మలో ప్రవేశించి కార్యసిద్ధి నిచ్చును - ఆ గురువు తపస్సులోని సగమును శిష్యుడు పొందగలడు.

136 తా॥ వర్ణాశ్రమ ధర్మములు గాని వృద్ధాచారములు గాని - ఇవి యన్నియు వివేక గ్రాహ్యములు - భక్తి-విరక్తి-ముక్తి యను మూడు పదార్థముల గురువిచ్చును.

137 తా॥ ఇట్లన్న బ్రహ్మ వాక్యమును కలి విని కరముల మొగిచి యిట్లనెను - సర్వ దేవతా సమానుడు గురువంటివే - అట్టి స్థితి గురువునకెట్లు వచ్చెను?

138 తా॥ బ్రహ్మ యిట్లనెను - ఓయీ దీని యాథార్థ్యమును విస్తారముగ వచింతును - సావధాన మనస్సుతో వినుము - గురువు లేకున్న చిత్తశుద్ధి గలగదు.

139 శ్లో॥ గురుం వినాన శ్రవణం భవేద్యస్యాపికస్యచిత్ ।
వినా సచ్ఛా స్త్రశ్రవణా త్వద్భయాన్ముచ్యతేకథమ్ ॥

140 శ్లో॥ గురుర్వినా న శ్రవణం స్వబుద్ధ్యా తత్త్వ తోభవేత్ ।
శాస్త్రాణి సులభాన్యేవ శ్రవణే లభే సతి ॥

141 శ్లో॥ శాస్త్ర తత్వేఽబుద్ధేతు సంసార సరణం తతః ।
గురుః ప్రకాశకస్తస్మా జ్యోతీరూప ప్రదర్శకః ॥

142 శ్లో॥ గురు సేవన యా సర్వసిద్ధిర్జాతా పురాకలే! ।
గురు శిష్య కథామేతాం అభిధాస్యామితే కలే! ॥

143 శ్లో॥ పురా గోదావరే తీర ఆశ్రమోఽంగిరసోమహాన్ ।
నానా వృక్షలతాకీర్ణః పుణ్యారణ్య మృగాన్వితః ॥

144 శ్లో॥ యత్ర బ్రహ్మర్షి ముఖ్యాస్తుసువ్రతా స్త పసిస్థితాః ।
తత్రైకోవేద ధర్మాఖ్యః పైలపుత్రః ద్విజోత్తమః ॥

145 శ్లో॥ తచ్ఛిష్యాస్తత్పరా ఆసన్ శ్రుతిసచ్ఛాస్త్ర పాఠకాః ।
తేషాం మధ్యే దీపకాఖ్యః శిష్యాఖ్యో వేద ధర్మణః ॥

146 శ్లో॥ వేదధర్మోపితద్భావ పరీక్షా యై కదాచన ।
శిష్యాన్ సమస్తానాహూయ సంతోషేణాభినంద్యతాన్ ॥

147 శ్లో॥ సగురుః ప్రాహ భో శిష్యాః కించిత్పృచ్ఛామివోఽధునా ।
యదివోఽస్తమయి ప్రీతి ర్మ ద్వాక్యం శ్రుణుతాఽధునా ॥

148 శ్లో॥ శిష్యా ఊచుర్గురోస్వామిన్నస్మాకం తారకోభవాన్ ।
శిరసాఽంగీకరిష్యామోభవదాజ్ఞాం నసంశయః ॥

139 తా॥ సాధారణముగ మంచిమాటను గురువే వినుపించును - సచ్ఛాస్త్ర శ్రవణము లేకున్న - ఓ కలీ! నీ భయమునుండి యెట్లు నరుడు తప్పుకొనును?

140 తా॥ గురువులేని సచ్ఛాస్త్ర శ్రవణము లేదు - అది లేకున్న నిజస్థితి తెలియదు - శాస్త్ర శ్రవణము లేకున్న - ఓ కలీ! నీ భయమునుండి యెట్లు నరుడు తప్పుకొనును.

141 తా॥ శాస్త్ర తత్వమును తెలిసిన తరువాత సంసారస్థితిని తెలిసికొనుట సులభము - జ్యోతిరూప బ్రహ్మతత్త్వ బోధ గురువువల్ల నగును - కాన గురువు భగవత్త్వదర్శకుడు.

142 తా॥ ఓయీ! కలీ! పూర్వము గురుసేవ చేతనే కార్యసిద్ధి యగుచుండెను - గురుశిష్య సంబంధ రూపకధను నీకు - ఓ కలీ! చెప్పెదను.

143 తా॥ ఎక్కడ బ్రహ్మరుష్యాదులుండిరో అచట తపస్సు అధికము - ఇట్లుండ వేద ధర్మముల తెలిసిన పైలపుత్రుడగు బ్రాహ్మణుడొకడుండెను.

144 తా॥ పూర్వము గోదావరీ తీరమున మహాత్ముడగు నాంగీరసుడాశ్రమమును నిర్మించుకొనెను - అనేక వృక్షములు - అరణ్య మృగములు పుణ్యవంతములు గలవు.

145 తా॥ ఆయన శిష్యులు ఆయనకు వలె శ్రుతి శాస్త్ర పారంగతులుగ నుండిరి - వారిలో దీపకుడను పేరుగల శిష్యుడు వేదధర్మ పరాయణుడొకడుండెను.

146 తా॥ వేదశాస్త్ర నిష్ణాతుడు దీపకుడని విని - ఆ శిష్య పరీక్షకు గురువు తనతోటి శిష్యులతోగూడ బిలిచి వారిని విచారించి ఆనందించుచుండెను.

147 తా॥ ఓయీ! శిష్యులారా! కొంచెము మిమ్ము అడుగ దలచితిని - మీకు నాయందు ప్రేమయున్న యీనాయాజ్ఞనిప్పుడు నెరవేర్చండి! అనెను.

148 తా॥ ఆ శిష్యులు గురువుతో అయ్యా! మీరు మాకు తారకులు (రక్షకులు) తమ ఆజ్ఞ వచ్చిన మేము శిరసావహించి యొనర్తుమని అంగీకరించిరి.

149 శ్లో॥ గురు వాక్యాతిచారీ సరౌరవం నరకం ప్రజేత్ ।
గురు వాక్యమ కుర్వాణో మాయా సింధౌ సమజ్జతి ॥

150 శ్లో॥ తతో నవిందతి గతిం దుర్గతిం యాతిసోఽధమః ।
తారకో గురురేవాతో భక్తస్య శ్రుతిసమ్మతః ॥

151 శ్లో॥ ఇతి శ్రుత్వా వచస్తే షాం వేదధర్మాతిహర్షితః ।
దీపక ప్రముఖాచ్ఛిష్యానిదం వచనమ బ్రవీత్ ॥

152 శ్లో॥ శిష్యాః శ్రుణుతమే వాక్యమస్తి పూర్వార్జితం మమ ।
జన్మాంతర సహస్రేషు మహాపాపం తుయత్కృతం ॥

153 శ్లో॥ తపోఽనుష్ఠాన ధర్మేణ బహుప్రక్షాళితం మయా ।
ప్రారబ్ధ కువశిష్టం న నశ్యేద్భోగం వినాతుతత్ ॥

154 శ్లో॥ తపసోపేక్షి తమపి మోక్ష విఘ్నకరంభవేత్ ।
ఉపేక్షా నైవకర్తవ్యా ఘోర పాపస్యభాతిమే ॥

155 శ్లో॥ స్వదేహేన న భుక్తం చే న్నభవేత్తస్య నిష్కృతిః ।
ఇతి నిశ్చిత్య మనసా తద్భోగార్థం సముద్యతః ॥

156 శ్లో॥ నిష్కృత్యర్థం హి పాపస్య యాస్యే వారాణశీం పురీం ।
భోక్ష్యేఘం తత్రయుష్మాభి రక్షా కార్యా ప్రయత్నతః ॥

157 శ్లో॥ సర్వ పాపక్షయకరీ పురీ నారాణసీ శ్రుతా ।
పురాణా దౌభవంతోఽతోమాంనయంత్వవి లంభితం ॥

158 శ్లో॥ శిష్యాణా మత్రయుష్మాకం కస్సమర్థోఽననేమమ ।
కోఽంగీకరిష్యతి వచో దుఃఖోదర్కం వదంతుమాం ॥

149 తా॥ గురువాక్యమును అనుసరింపనివాడు రౌరవ నరకము నొందుదురు – గురువాక్య కరణము లేనివాడు మాయా సముద్రమున మున్గును.

150 తా॥ గురువాక్యము చేయనివాడు – సద్గతి నొందడు – దుర్గతిని పొందును – అధముడగును – సంసార సముద్రమును తరింపఁజేయువాడు గురువని నమ్మినవాడు సచ్ఛిష్యుడు.

151 తా॥ ఇట్టి వాక్యమును విని ఆ పైలపుత్రుడు వేద ధర్మవిధుడు – చాల సంతోషించెను – దీపకుడు మొదలగు శిష్యులగూర్చి ఆ గురువు ఇట్లనెను.

152 తా॥ ఓయీ! శిష్యులారా! నా వాక్యమును వినండి – నేను పూర్వమునుండి ఆర్జించినది – పూర్వజన్మలలో నే చేసిన పాపలబ్దము కొంతగలదు.

153 తా॥ అనుష్ఠానము తపస్సును చేసి చాలవఱకు పాపమును క్షాళన మొనర్చితిని – ఇంకను అవశిష్టమైన పాపము కొంతగలదు – అది నశింపకున్న – మోక్షము రాదుగద?

154 తా॥ తపస్సుచే అదియు నశించుననన్న – అట్లు తపో వ్యయము మోక్షమునకు భంగకరము – మోక్షయత్నము చేసిన యీపాపముండగ నదియు సరిగాదనిపించు చున్నది.

155 తా॥ దానిని ( ఆ మిగిలిన పాపమును) నా దేహముతో ననుభవింపనిది – అది పోదు – అనుభవమే ప్రారబ్ధమునకు నిష్కృతి – అని నిశ్చయించుకొని ఆ గురువుగారు శిష్యులకుఁదెలుపఁబూనుకొనెను.

156 తా॥ నా పాపనిష్కృతికై నేను కాశీపట్టణమునకుఁబోయెదను – మిగిలిన పాపఫలము అనుభవింతును – దానికిగానున్న మీరు ప్రయత్నముతో రక్షించండి! అనెను.

157 తా॥ కాశీ పట్టణమున సర్వ పాపములను పోగొట్టునది – ఈ సంగతి పురాణాదులలో ప్రసిద్ధమైనది – కావున మీరు నన్ను త్వరగ నచటకు చేర్చండి!

158 తా॥ యీ మీ శిష్యులతో ఎవరు నన్ను రక్షింప సమర్థులు? అనెను – ముందు నా సేవకై పడెడు కష్టము భరింప సామర్థ్యమును ఎవరు అంగీకరింతురు?

159 శ్లో॥ ఇతి శ్రుత్వా గురువచో గురు సేవావిశారదః ।
తేషాం మధ్యే దీపకాఖ్యః సచ్ఛిష్యో గురుసమ్మతః ॥

160 శ్లో॥ గురుం నత్వాఽవదత్స్వామిన్నిజపాపం నశేషయేత్ ।
దేహ నాశక రా ఘస్య శీఘ్రం కార్యాప్రతిక్రియా ॥

161 శ్లో॥ వేద ధర్మాఽవదచ్ఛిష్య యావద్దేహో ధృఢోన్నృణాం ।
తావత్పాపక్షయః కార్యో భవేదగ్రేవిప్రషోపమః ॥

162 శ్లో॥ తీర్థసేవాఽధవా ప్రాయశ్చిత్తం కృచ్ఛ్రాదికం మహత్ ।
రోగాది భోగో దేహేనినాన్యధా పాపనిష్కృతిః ॥

163 శ్లో॥ స్వయమేవాత్మనః పాపం భోగ్యం దేవోఽధవా ఋషిః ।
జ్ఞానీవాపినశక్నోతి త్యక్తుం భోగం వినైవతత్ ॥

164 శ్లో॥ దీపకః స్వగురుం ప్రాహ యదుక్తం సత్యమేవ తత్ ।
శక్త్యాసేవాం కరిష్యామి స్వామిన్నాజ్ఞప్తుమర్హసి ॥

165 శ్లో॥ దీపకస్యవచః శ్రుత్వా వేద ధర్మాతమబ్రవీత్ ।
గలత్కుష్ఠోభవిష్యామి పంగురం ధశ్చ పాపతః ॥

166 శ్లో॥ ఏకవిం శతి వర్షాణి గలత్కు ష్టం భవిష్యతి ।
ఈ దృశం రక్షితుం శక్తిశ్చేదంగీ కురుపుత్రక! ॥

167 శ్లో॥ దీపకః ప్రాహకుర్వేఽహం భవత్పాపస్య నిష్కృతిం ।
ఏకవింశతి వివర్షాణి కుష్టోఽంధోఽపిభవామ్యహం ॥

168 శ్లో॥ భవత్పాపక్షయం స్వామిన్ కరిష్యే మమవర్ష్మణా ।
స్ఫుటమాజ్ఞాపయేత్యుక్తోభక్త్యాతచ్చరణేఽ గ్రహీత్ ॥

159 తా॥ ఇట్లనిన గురువుగారి వాక్యమును విన్న గురుసేవను బాగుగ తెలిసిన దీపకరుడను వాతడు ముందుకు వచ్చి అయ్యా! ఆ మీ యాజ్ఞకు నేను సమ్మతించితిననెను.

160 తా॥ స్వామీ! మీకు నమస్కరించి చెప్పుచున్నాను - మీరు దేహ నాశకరమైన మీ పాపమును నశింప జేయవలెను. దేహ నాశకర పాపమునకు ప్రతిక్రియ వెంటనే చేయవలయుగదా?

161 తా॥ ఆ వేద ధర్మములను గుర్తెరిగిన దీపకుడు అయ్యా! మానవులు దార్ఢ్యముగ నున్నంతలో - పాపములను అనుభవించి పోగొట్టు కొనవలెను - అది విషతుల్యమైనదిగా వున్న ముందు ముందు బాధాకరమైనది.

162 తా॥ ఆ పాపమును పోగొట్టుకొనుటకు తీర్థసేవాదులగాని - కృచ్ఛ్రాది వ్రతములను గాని యాచరించవలె గదా? లేక రోగాద్యనుభవమున గద ఆ పాప పరిహారము.

163 తా॥ ఋషియైనను స్వకృత పాపమును స్వయముగనే అనుభవింపవలెను. జ్ఞానియైన మహాత్ముడు గూడ పాపమును అనుభవముతో పోగొట్టుకొన వలయుగాని మరొక విధముగ గాదుగదా?

164 తా॥ ఇట్లన్న గురు వాక్యమును ఆ దీపకుడు విని - అయ్యా! మీరన్నది సత్యం మీకు నేను సేవను నా శక్తికొలది చేతును - తమ ఆజ్ఞ యేదియో సెలవిండనెను.

165 తా॥ ఆ దీపకుని వాక్యమును విన్న గురువుగారతనితో నిట్లనిరి - నా పాపమును - కుష్టు రోగముతో ననుభవింతును - దానికితోడు - కుంటి గ్రుడ్డితనము గూడ వచ్చును.

166 తా॥ ఇరువదియొక్క సంవత్సరములు - కండలూడివడు కుష్టు రోగమనుభవింతును - ఓయీ!

167 తా॥ అప్పుడు దీపకుడు - అయ్యా! మీరన్నదానిని నేను చేయగలనని యంగీకరించెను - మీరాజ్ఞనిచ్చిన ఇరువదియొక్క సంవత్సరము దానిని నేననుభవింతును - అది కుష్టు - కుంటి - గ్రుడ్డి యైనను నాకు పరవాలేదనెను.

168 తా॥ స్వామీ! మీ పాపమును నేను నా యీ సంవత్సరములలోనే అనుభవింతును - స్పష్టముగ చెప్పండి! అని భక్తితో ఆ గురుపాదములను పట్టుకొనెను.

169 శ్లో॥ ఇతిశ్రుత్వావచస్తస్య వేదధర్మా మహామునిః ।
ప్రహృష్టస్తం పునఃప్రాహగతిం పాపస్యమే శ్రుణు ॥

170 శ్లో॥ స్వయ మేవాత్మనః పాపం భోక్తవ్యంఖలు శిష్యతత్ ।
స్వశిష్యాది ప్రతినిధి ద్వారాపాపక్షయో నహి ॥

171 శ్లో॥ అత ఏవాహమేవాఘం మమ భోక్ష్యేస్వవర్ష్మణా ।
ఏకవింశతి వర్షాణి రక్షమాం యదిరోచవే ॥

172 శ్లో॥ యః పీడ్యతేఽత్రరోగేణ తత్కృష్టాదధి కంఖలు ।
సేవకస్యాపికష్టం తత్ త్వం భవిష్యసి కష్టభాక్ ॥

173 శ్లో॥ ఇదం పూర్వం మయోక్తం తేభోక్ష్యే స్వాంగేన పాతకం ।
శక్తోసిచేత్పురీం నీ త్వాకాశ్యామ్మాం పరిపాలయ ॥

174 శ్లో॥ అహంతతోపకారేణ కాశ్యాం భుక్త్వా స్వపాతకం ।
భూత్వా విపాపోయాస్యామి శాశ్వతం పదమవ్యయం ॥

175 శ్లో॥ దీపకః స్వగురుం ప్రాహ త్వా నేష్యేఽవశ్యమేవతాం ।
కాశ్యాంసేవాం కరిష్యామి విశ్వనాధ సమోభవాన్ ॥

176 శ్లో॥ కలే! దృఢమతిః శిష్యః సేవామాశ్రిత్య తం గురుం ।
ఆదాయ ప్రాపతాంకాశీం తారకాం మణికర్ణికామ్ ॥

177 శ్లో॥ నీత్వాగురుం కంబలాశ్వతరా సన్న మివానయత్ ।
వేదధర్మోఽపి సంతుష్టః తస్థాభుంజన్నఘం స్వకం ॥

178 శ్లో॥ స్నాత్వా మహామునిస్తత్ర ప్రణమ్య మణికర్ణికామ్ ।
పూజయిత్వా విశ్వనాధం స్వారబ్ధంభోక్తు మారభత్ ॥

169 తా॥ ఇట్లి వాక్యమును విని వేద ధర్మవిదుడగు ముని చాల సంతసించి మరల నిట్లనెను – నా యీ పాపస్థితిని గూర్చి నీకు జెప్పెదను – వినుము.

170 తా॥ ఓయీ శిష్యుడా! పాపమును నది స్వయముగ ఎవరిది వారే అనుభవింప దగినది – తన శిష్యులు – పుత్రులాప్తుల ద్వారా నశింపదు – స్వయముగ ననుభవించిననే తీరును లేకున్న – వదలదనెను.

171 తా॥ కాబట్టి శిష్యా నేను నా వయసులో నా యీ దేహము తోడనే అనుభవింతును – ఇక నీవు చేయవలసినదేమంటే! నా యనుభవ కాలము 21 సంవత్సరము గద? ఆ యీ సంవత్సరములు నన్ను నా తనువును నీవు రక్షింపవలెను.

172 తా॥ ఆ కుష్టాది రోగము అనుభవించు రోగి కష్టమునకంటే ఆయనను సేవించువానికి అధిక కష్టముండును. దానిని విచారించుకొనుము.

173 తా॥ నేను నీకు మొదట దీనినే చెప్పితిని. ఎవరికి వారు పాప కర్మ ఫలము స్వయముగ అనుభవింపవలెను. నీకు శక్తి యున్నచో – ఆ రోగారంభమును చేతును – నన్ను కాశికి కొనిపోయి రక్షింపుము.

174 తా॥ నీ యీ యుపకార కారణముగ కాశీలో నా పాపమును నే ననుభవింతును, నా యీ పాపము వదలుటతోడనే మరల మంచికి వచ్చి శాశ్వతమైన బ్రహ్మపదవి నందుకొందును.

175 తా॥ అపుడు దీపకుడిట్లనెను – అయ్యా! తమరెట్లున్న నేను పాపము ననుభవించుచు మిమ్ము కాశికి గొనిపోయి విశ్వనాథేశ్వర సములగు మిమ్ము సేవింతును.

176 తా॥ ఓయీ! కలీ! దృఢమతి యగు నా శిష్యుడు గురువుగారిని – భవరోగ తారకము – మణికర్ణికా సమేతముగు కాశీ పట్టణమును చేర్చెను.

177 తా॥ ఆ దీపకుడు గురువును కంబలాశ్వతరమను స్థలమున నివాసమునుగ చేయించెను – ఆ వేద ధర్ముడను గురువు గూడ సంతసించుచు తన పాప కర్మఫలము ననుభవించు చుండెను.

178 తా॥ ఆ మహాముని స్నానమొనర్చి – నమస్కారాదులతో మణికర్ణికను పూజించి పూజాదులతో తను అనుభవించు ప్రారబ్ద కర్మ ననుభవించుచుండెను.

179 శ్లో॥ గలత్కుష్ఠాభి భూతః స నేత్రహీనోఽతి దుఃఖితః ।
వేద ధర్మాఽభవద్భక్త్యా సిషేతేదీపకోఽపితం ॥

180 శ్లో॥ వ్యాప్తం కుష్టేన సర్వాంగం తస్య పూయాస్రదూషితం ।
కృమయోఽప్యభవన్ గాత్రేస్మృతిర్నష్టాఽస్య దుఃఖితః ॥

181 శ్లో॥ సందీపకోఽపి భిక్షిత్వా గురవేఽన్నంద దౌముదా ।
విశ్వనాధ స్వరూపం తం మత్వాభక్త్యాఽభి పూజ్యచ ॥

182 శ్లో॥ రోగేణ పీడితా లోకే సాధనోఽపి గతత్రపాః ।
క్రూరాభవం తి హి మునిః శాంతోఽపిక్రూరతాంగతః ॥

183 శ్లో॥ శిష్యేణ భిక్షితం త్వన్నం భక్త్యాదత్తమ పిద్విజః ।
న భునక్తి క్షిపతి కౌ స్వల్పం మత్వాఽతికోపనః ॥

184 శ్లో॥ అపరేఽహని శిష్యేణ బహ్వన్నం హి సమాహృతం ।
కించిజ్జగ్ధ్వాఽత్యజత్క్రోపాన్న మిష్టం నేష్టమిత్యసౌ ॥

185 శ్లో॥ పక్వాన్నానిసుమిష్టాని కస్మాన్మహ్యం న దాస్యసి ।
ఇతిక్రుద్ధో యయాచేతం శాక పాకాద్య నేకశః ॥

186 శ్లో॥ అపరేఽహని భిక్షిత్వాత థైవాహృతమప్యసౌ ।
శిష్యా యాశివవాక్యా ని జగాదాతాడయచ్చతం ॥

187 శ్లో॥ కదాచిత్తు గురుః ప్రీతః ప్రాహశిష్య శిఖామణే ।
జ్ఞానరాశే మన్నిమిత్త మనుభూత మకం త్వయా ॥

188 శ్లో॥ సద్యోఽపి పునరప్యాహత్వం మాంవ్యధయ సిద్రుతం ।
గచ్ఛ శక్యత్పూతి గంధిక్షాళనం నకరోష్యతః ॥

179 తా॥ మాంసపు ముక్కలూడిపడెడి కుష్ఠ – కుంటి – గ్రుడ్డి తనముతో దుఃఖించుచు ఆ వేద ధర్మజ్ఞుడుండెను – దీపకుడను భక్తితో నాయనను సేవించుచుండెను.

180 తా॥ కుష్ఠ రోగముతో సర్వాంగముల నుండి చీము రక్తముతో నలముకొన్న గాత్రుడైయుండగ – పురుగులన్నియు శరీరము నలమి యుండెను – ఆయనకు స్మృతియు లేకుండెను.

181 తా॥ దీపకుడును యథావిధిగ సేవించుచు భిక్షాన్నమును గొనివచ్చి అన్నమును సంతోషముగ పెట్టుచుండెను – ఆ కాశీ విశ్వనాథునితో సమమైన స్వరూపమని గురువు నతిభక్తితో పూజించుచుండెను.

182 తా॥ రోగ పీడితుడైన ఆ సాధకుడు (బ్రహ్మవేత్త) సిగ్గును వీడియుండుటయు – క్రూరతపోని యా ముని అతి క్రూర భావములో నుండెను.

183 తా॥ శిష్యుడడిగి తెచ్చిన భిక్షాన్నమును – భక్తితో శిష్యుడు పెట్టుచున్నను తినువాడు కాదు – నీవు నాకు కొంచమే పెట్టుచుంటివని నేలను కొట్టి ఆ యన్నమును పారవేసి కోపపడుచుండెను.

184 తా॥ మరు రోజున నా దీపకుడు వేరొక శిష్యునితో గూడినవాడై – ఎట్లైనను – మరింతటి యన్నమును ప్రతిరోజున కన్న నధికముగ సంపాదించి తెచ్చి పెట్టగా కొంచెము తిని – ఏదో ఒక రూపముతో – ఇదినాకు రుచిగా లేదు – ఇలాంటి దానిని నేను తిననెను.

185 తా॥ ఓరీ శిష్యా! ఇదేమిరా! నాకు బాగుగా నున్నమును – రుచికర పదార్థములను ఎందులకు తెచ్చిపెట్టవని కోపపడుచు మంచి మంచి వ్యంజన పదార్థుల తెచ్చిపెట్టుమని యడుగుచుండెను.

186 తా॥ మరురోజున నా శిష్యుడు దాతలను మంచివిగా నడిగి తెచ్చిపెట్టుచుండగా నా శిష్యుని అమంగళ వాక్యములతో ఇట్టుచు దగ్గరకు పిలిచి కొట్టుచుండెను.

187 తా॥ ఇట్లు సేవించుచుండగా నొకనాడు ఆ గురువు సంప్రీతుడై – ఓయీ! శిష్య చూడామణీ! జ్ఞానమునిచ్చు కాశీవాసమును నీ మూలకముగా ననుభవించుచు పాపమును అనుభవించు చుంటిని.

188 తా॥ ఓయీ! ఇట్లయ్యు నన్ను నీవు చాల బాధించుచున్నావు వెళ్లు! అవలకు పొమ్ము; నీవు నా శరీరమిట్లు దుర్గంధ భూయిష్టమైన దానిని ఏనాడును కడుగవు గదా? – అని వెంటనే అనును.

189 శ్లో॥ తుదంతి మక్షిరా స్తాః కిం నవారయసి దీపక! ।
ఇతి శ్రుత్వాతథేత్యుక్తం ప్రాహభిక్షాం నదాసికిం ॥

190 శ్లో॥ ఇతి పాపోత్థ రోగేణ పీడితస్స గురుస్తదా ।
విపరీతం వచః ప్రాహ పాపస్య హిగతిస్త్వియమ్ ॥

191 శ్లో॥ అధికం పాతకం తత్ర దైన్య మాత్సర్య దుష్టతాః ।
నసంతి పాప రూపీ స న జానాతి శుభాశుభమ్ ॥

192 శ్లో॥ యోదైన్యేనాతిదుఃఖేన పీడితో భాషతేన్యథా ।
ఉన్మత్త వ త్స విజ్ఞేయః పాప రూపీ న సంశయః ॥

193 శ్లో॥ కుష్టా న్యష్టా దశరుజాం దుఃఖ దానిచతేషుతు ।
గల త్కుష్టం మహాకష్టం యతోఽయం మునిరీదృశః ॥

194 శ్లో॥ తథాపితస్య దోషాన్స శిష్యోఽనాదాత్ స్వమానసే ।
మత్వేశ్వరం నిషేవేస భర్త్సితో వారితోఽపిచ ॥

195 శ్లో॥ యథాయథా యాచతేఽస్మైభిక్షిత్వాఽదాత్త థాతథా ।
యథేశ్వరో మహావిష్ణుస్తథాఽ సావిత్యమన్యత ॥

196 శ్లో॥ నా చరత్తీర్థ యాత్రాంస కాశీక్షేత్రేప సన్నపి ।
గురుసేవాతతోదేవ యాత్రార్థ మపినాగమత్ ॥

197 శ్లో॥ నదేహ రక్షణం చాపి చక్రేగురు పదాశ్రితః ।
గురుం త్రిమూర్తిం మత్వాస నిత్యం నాన్య మభాషత ॥

198 శ్లో॥ సోఢ్వాఽపి నిష్ఠురం వాక్యం గురోః సంతుష్ట మానసః ।
యథాయథా మనస్తస్యచచార సతథా తథా ॥

189 శ్లో॥ చూడవయ్యా! నా శరీరమును ఈగలు కుట్టి మాంసమును తినుచున్నవి. ఆ యీగలను తోలవు – అనుటతోనే. శిష్యుడట్లే చేమననుచుండ అన్నమును గూడ అడిగి తెచ్చి సరిగా పెట్టవు.

190 శ్లో॥ ఆ పాపిష్టి రోగముతో పీడితుడైన గురువు ఆ కోపముతో విపరీత భాషలను శిష్యుని గూర్చి పలుకుచు – నడుమ నడుమ – ఈ పాపము నన్నిట్లు పలికించు చున్నదనుచుండెను.

191 శ్లో॥ అత్యధికమైన నా యీ పాపము దైన్య మాత్సర్య దౌష్ట్యముల గూర్చుచుండెను. పాపరూపముతో నుండి దుర్మార్గముల సూచించు చుంటిని – శుభాశుభముల గుర్తింపు రానీదు.

192 శ్లో॥ నేను (యీతడు) అది దైన్య దుఃఖములతో పీడింపఁబడి – అనరాని మాటలను చుంటిని – పాపము ననుభవించువాడు – పిచ్చివానివలె నుండును. నీవు సంశయింపకుము.

193 శ్లో॥ పదునెనిమిదిలగు కుష్టురోగములు గలవు – అవి యన్నియు దుఃఖప్రదములైనవి – అందు మహాకుష్టము గలత్కుష్టము – అది మహా దుఃఖకరమైనదే! నేననుభవించు యీ కష్టము.

194 శ్లో॥ అట్లు గురువు చెప్పుచున్నను – ఆ శిష్యుడద్దానిని వినియు బాధపడలేదు – ఆ గురువు అపుడపుడు వద్దన్నను గురువు కేవలం విశ్వేశ్వరుడని సేవించు చుండెను.

195 శ్లో॥ ఏది గురువనకిష్టమో దానిని వార్ని వారినాశ్రయించి వెచ్చి పెట్టి గురువును మెప్పించుచుండెను. ఆ శివుడే! ఆ విష్ణువే యీ గురువను భావముతో శిష్యుడు దీపకుడు సేవించుచుండెను.

196 శ్లో॥ ఆ గురువును సేవించు కారణము గదా కాశీక్షేత్రమున – పుణ్యతీర్థములు మాహాత్మ్యములెన్ని యున్న విచారింపక ఆ దీపకుడు కేవల గురు సేవానిరతుడయ్యెను.

197 శ్లో॥ గురుపాద సేవారతుడైన ఆ దీపకుడు తన శరీర రక్షణమును గూడ మరచిపోయెను – ఆ గురువే! త్రిమూర్త్యాత్మకుడని దృఢముగ భావించి గురువేమన్నను మరు మాట పలుకుండెను.

198 శ్లో॥ సహనశీలుడైన ఆ శిష్యుడు ఏమనినను నవ్వుచు సంతోషమున నుండుచు – ఆ గురువునకు ఇష్టమైన రీతిని సంచరించుచుండెను.

199 శ్లో॥ ఏవంతం దీపకం సంతం సుప్రసన్నః పినాకధృక్ ।
ఉపాగత్యాఽ బవీ ద్వత్స ప్రీతోఽస్మివరమీప్సితం ॥

200 శ్లో॥ సద్భక్తా హెూ మహాజ్ఞానిన్ కులదీపక దీపక ।
ప్రసన్నోఽస్మ్య ధునాఽభీష్టం వరం వరయ సువ్రత ॥

201 శ్లో॥ సందీపక ఉపాచేశ మృత్యుంజయు గురుం త్విదం ।
అస్పృష్ట్వా వ్యామ కేశాద్య నోఽదాస్యామివరం వరం ॥

202 శ్లో॥ ఇత్యుక్త్వా స్వగురుం గత్వా వినయావనతోఽ బ్రవీత్ ।
విశ్వనాథః ప్రసన్నోమే వరందాతు ము పాగతః ॥

203 శ్లో॥ యద్యాజ్ఞా భవతోరోగ శాన్తయేఽ ధ తతోపరం ।
ఆదాస్యే తద్వారాదేవ రోగ శాన్తిర్భ విష్యతి ॥

204 శ్లో॥ ఇతి దీపక వాక్యం సః శృత్వాకృద్ధో బ్రవీన్మునిః ।
శ్రాన్తో సికిం నసం ప్రార్ధ్యో వ్యాధిశాన్త్యై మమేశ్వరః ॥

205 శ్లో॥ వినాభోగేన శిష్యాత్ర నవితర్తేత పాతకం ।
వరేణ ప్రతిబద్ధంచే ద్భోక్తవ్యం తద్భవాన్తరే ॥

206 శ్లో॥ ఇతి శాస్త్రీహ శాస్త్రం తద్భోగ్యమత్రైవ జన్మని ।
క్షాళయిత్వాపి చేచ్ఛిష్టం పాతకం మోక్ష విఘ్నకృత్॥

207 శ్లో॥ ఇతి శృత్వా గురోర్వాక్యం సశిష్యో దీపకోగురుం ।
ఆజ్ఞా ప్రమాణమిత్యుక్త్వా యయౌ యత్రేశ్వరః స్థితః ॥

208 శ్లో॥ ఆగత్య ప్రాహ విశ్వేశం కింకర్తవ్యం వరేణమే
మతో గురో ర్నమనసః స్వీకార్యోధ వేదం వరః ॥

199 శ్లో॥ దీపకుడిట్లు సేవింపగా సుప్రసన్నుడైన ఆ గురువుగారు - ఆ శిష్యుని పిలువ దగ్గరకు వచ్చెను - అప్పుడు గురువా శిష్యునితో ఓయీ నీ సేవకు తృప్తి నొందితిని - నీ చేతకు నీకు వరమిత్తు నడుగుమనెను.

200 శ్లో॥ ఓయీ! భక్తుడా! నీ పాపములన్ని పోయినవి - నీవు మహాజ్ఞానివి - నీవోర్చిన సేవకు ప్రసన్నుడనైతిని, వరమడుగుము ఇచ్చెదనెను.

201 శ్లో॥ అపుడా దీపకుడు - ఓ మృత్యుంజయ - శివ! మా యీ గురువుగారి - ఆపదను తొలగింపక నాకు వరమిచ్చినను నాకు వలదు.

202 శ్లో॥ ఇట్లనుకొనుచు గురువు వద్దకు వెళ్లి వినయముతో విన్నవించెను ఆ విశ్వనాధుడు ప్రసన్నుడై నాకు వరమీయవచ్చెను.

203 శ్లో॥ ఓ స్వామీ! తమరు వరమీయ నాజ్ఞాపుడనైతిని - ఆ వరము తమరు రోగ శాంతిని పొందుటయే నాకీయండి! అటుపై మీరు శాంతించిన రోగులైన వరము నిచ్చుట, నేను పుచ్చుకొనుట జరుగును.

204 శ్లో॥ ఇట్లా దీపకుడన్న వాక్యమును విని కోపముతో నిట్లనెను గురువు - ఓయీ! నాకు రోగము శాంతించినను మరల దానిని శాంతింపుమని ఏల అడిగెదవు?

205 శ్లో॥ ఓయీ! రోగము దేహముతో ననుభవింప వలసినదే! దానిని నీవడిగిన వరముతో శాంతించిన మరొక జన్మలో శేష పాపమనుభవింప వలెను.

206 శ్లో॥ ఓయీ! శాస్త్రములట్లు శాసించినందున - ఆ శాస్త్రములు - భోగనశ్యము పారబ్ధమనుచున్నది.

207 శ్లో॥ ఈ ప్రార్థమును మనమెట్లుగా ఓదార్చినను - అది ముందు మోక్షప్రాప్తికి అడ్డువచ్చును - ఉచ్ఛిష్టమును మనము గౌరవించిన నీది పాపమేగద?

208 శ్లో॥ అపుడు దీపకుడు విశ్వేశుడని నమ్మిన గురువు వద్దకు వచ్చి స్వామీ! నాకు వరముతో పనియేమి? గురు మనసు ఇష్టము గాని యీ వరమును నేనెట్లు స్వీకరింతును?

209 శ్లో॥ ఇతిశ్రుత్వా వ్యామకేశః ప్రాప్య నిర్వాణ మండపం।
దేవానాం శృణ్వతాం విష్ణో రగ్రౌ తత్రాహ విస్మితః॥

210 శ్లో॥ ఉవాచ శంకరం విష్ణుః కః శిష్యః కో గురుః కుహు।
నివాసమేతయోర్బ్రూహి విస్మయోమేఽభవన్మహాన్॥

211 శ్లో॥ ఈశ్వరః ప్రాహతం విష్ణు మాశ్చర్యం దృష్టమద్యమే।
దీపకోబాలకస్త్వేకో గురుభక్తి విధారకః॥

212 శ్లో॥ గోదవరీతీ రవాసీ వేదధర్మాఖ్యతాపసః।
తత్సేవానిరతోఽశ్రాంతం దీపకోభక్తి దీపకః॥

213 శ్లో॥ తత్తుల్యోనేక్షితోలోకే గురుభక్తి పరాయణః।
తం దృష్ట్వైవ వరందాతుంజాతా ప్రీతిరతీమే॥

214 శ్లో॥ విష్ణోన వారయా మాసవరం దాతుంగతం హిమాం।
గురుణాఽజ్ఞాన దత్తాఽతః పరిభావ్య వరంజగా॥

215 శ్లో॥ దివ్యకోటి సహస్రాబ్దాంస్త ప స్యం తోమహర్షయః।
నక్తం దివం సుకష్టేన సంస్థితాస్తే వరార్థినః॥

216 శ్లో॥ తాదృశాంస్తా పసాన్యోగీనుపేక్ష్య త్వం ప్రసహ్యమే।
కుతో దిత్సేవరమితిసచోక్త్వానా దదేవరం॥

217 శ్లో॥ వపుర్మనో వచస్తస్మై సమర్ప్య గురవేనిశం।
సేవతేదీపకః సాక్షాత్త్రిమూర్త్యాత్మేతి వీక్ష్యతం॥

218 శ్లో॥ మాతాపితాసుతాస్సర్వే గురురేవమమేతి సః।
నిశ్చిత్యానుదినం ప్రీత్యాగురుసేవారతోఽస్తిసః॥

209 తా॥ దీపకుడన్న వాక్యమును విన్న విశ్వేశ్వరుడు ముక్తి మండపమునకు వచ్చి విష్ణుమూర్తి యెదుట నిట్లు చెప్పి విస్మితుడయ్యెను.

210 తా॥ అపుడు శంకరుని గూర్చి విష్ణువిట్లనెను - ఓయీ! శిష్యుడెవడు? గురువెవడు? ఈ యిద్దరకు నివాసమేదియో తెలుపుము. నాకాశ్చర్యముగ నున్నది.

211 తా॥ అపుడీశ్వరుడు విష్ణువును గూర్చి యిట్లనెను - ఇది యేదియో ఆశ్చర్యముగ నున్నదె? దీపకుడు బాలకుడు, గురుభక్తి గలవాడొక్కడే!

212 తా॥ గోదావరీ తీరమందున్న వేదధర్ముడగు తాపసి యొకడు - అతని సేవాసక్తుడు - వంశదీపకుడగు దీపకుడు ఎడతెగని గురుభక్తి గలవాడు.

213 తా॥ ఆ దీపకునితో సమానమైన గురుభక్తి పరాయణుడు ఆతని గురుభక్తిని చూచియే నేనాతనికి వరమిత్తునంటిని.

214 తా॥ వరమీయవచ్చిన ఆ దీపకునడుగ నీశ్వరుడు - వద్దని వారించుచున్నాడో విష్ణువూ! ఈతడు గురువు నాజ్ఞ బడలేదు. అందుచే నేనిత్తునన్న వరమును ధిక్కరించి వెళ్లెను.

215 తా॥ అనేక కోట్ల సంవత్సరములు తపస్సు చేయు మహర్షులు గలరు - వారందరు రాత్రింబవళ్లు కష్టతరమైన తపస్సు చేయుచున్నారు.

216 తా॥ అట్టి మహర్షుల నందరి నుపేక్షించి బలాత్కారముగ నాకు వరమిత్తుననెను. - ఇట్టి మాత్సర్య యుక్తమైన దానము నాకు వద్దని యీతడు తిరస్కరించెను.

217 తా॥ ఈతడు తన గురువునకు - తను - మానధనముల నన్నిటిని సమర్పించినవాడు - త్రిమూర్త్యాతకుడే తన గురువని యీ దీపకుడు - సదా సేవించుచున్నాడు.

218 తా॥ ఆ యీ దీపకుడు - తల్లియు తండ్రియు - సమస్త దేవతలును గురు స్వరూపమే అను నిశ్చయముతో అతి ప్రీతితో గురుసేవా రతుడై యుండెను.

219 శ్లో॥ తద్గుణాన్కృతి వక్ష్యామి సోఽవిద్యాధ్యాం తదీపకః ।
గురుసేవా దరోనిత్యం దీపకః కులదీపకః ॥

220 శ్లో॥ ధర్మోజ్ఞానం యశః సర్వం గురురేవేతి నిశ్చితః ।
భేజే తచ్చరణే ప్రీత్యా దీపకః కులదీపకః ॥

221 శ్లో॥ ఇతి విశ్వేశవచనం శ్రుత్వా శార్ఙ్గధరోగురుమ్ ।
శిష్యం యథాశ్రుతం తంచ త్వరయామాసవీక్షితుం ॥

222 శ్లో॥ ఆగత్య దృష్ట్వా విశ్వేశ కథితాదపి బాధికమ్ ।
తస్య భక్తి ప్రకారం సతుష్టోఽభూ ద్భక్త వత్సలః ॥

223 శ్లో॥ విష్ణుః దీపకమా హూయ హృషీకేశోఽవదత్త దా ।
తుష్టోఽస్మిగురుభక్త్యాతే పరంవరయ సువ్రత! ॥

224 శ్లో॥ ఉవాచ దీపకోఽ ష్టో కామద్భక్తి స్తవేక్షితా ।
కిమర్థం మే హృషీకేశవరం దాస్యస్యనిచ్ఛతే ॥

225 శ్లో॥ మునయో దివ్యకోట్యబ్దా శరణ్యే తపసిస్థితాః ॥
తానుపేక్ష్య వరం దిత్సే తపో హీనాయమే కృతః ॥

226 శ్లో॥ నారాయణ! త్వద్భజనం నమేకృతం నారాయణ త్వత్స్మరణంనమేకృతం –
నారాయణత్వం న వరం వృణోమ్యహం దాతుం ప్రసహ్యాపి నయోగ్యతా మమ ॥

227 శ్లో॥ హరిః ప్రగల్భ్య మితి దీపకోక్తి మాకర్ణ్య నారాయణ ఆపతుష్టిం ।
తద్భక్తి సమ్మోహిత మోహితాత్మా తందీపకం ప్రాహజగద్ధితాత్మా॥

228 శ్లో॥ త్వయా నిర్వాణ పరమా గురుః భక్తిః కృపాపరా ।
తయా తుష్టోఽస్మి సా భక్తిర్మమైవకుల దీపక ॥

19 తా॥ ఆ దీపకుని మంచి గుణము లెన్నని చెప్పగలను? నిజముగ నాతడజ్ఞానపు చీకటిని పోగొట్టు కుల దీపకుడే! గురు సేవాసక్తుడై నిజవంశ ప్రదీపకుడయ్యెను.

20 తా॥ ధర్మము – సత్యము – జ్ఞానము – సర్వమును గురువాక్కునినే భావించి కులదీపకుడగు నీతడు భక్తితో ఆతని చరణముల సేవించుచుండెను.

21 తా॥ ఇట్లు విశ్వేశ్వర వచనమును విన్న విష్ణువు – ఆ గురువును – ఆతని శిష్యుడగు దీపకుని యధాతథముగ విని చూచుటకు త్వరపడెను.

22 తా॥ అపుడా విష్ణువు ఆ శిష్యునికడకు వచ్చి విశ్వేశరుడు చెప్పిన దానికన్న నధికముగనున్న వానిని, వాని భక్తిని చూచి భక్తవత్సలుడైన ఆ విష్ణువు వాని (ఆ దీపకుని) భక్తికి సంతుష్టుడయ్యెను.

23 తా॥ అపుడు హృషీకేశుడగు విష్ణువు ఆ దీపకుని పిలిచి ఓయీ! నీ భక్తికి సంతుష్టుడనైతిని – నీవును సువ్రతుడవు – నీవు వరమును కోరుము – వరమిచ్చెదను.

24 తా॥ అంత దీపకుడు విష్ణువున కిట్లనెను – అయ్యా! నా భక్తిని మీరేమి చూచితిరి – ఎందులకు నాకు వరమీయ కోరిక గలిగెను?

25 తా॥ మునులరణ్యమున ననేక కోట్ల కొలది సంవత్సరములు తపమును జేసిరి – అట్టివారిని వరమీక నుపేక్షించి – నా యీ తపసులేని వానికి వరమీయరాదు.

26 తా॥ ఓ నారాయణా! నీ సేవను గాని నీ స్మరణమును గాని నేను చేయలేదు. నేను నిన్ను వరమిమ్మనలేదు – బలాత్కారముగ నాకు వరమీయ వలదు.

27 తా॥ ఆ దీపకుని ప్రౌఢ గంభీర వాక్యముల విన్న విష్ణువు సంతోషపడెను – జగద్ధితకారుడైన విష్ణువు ఆ దీపకుని భక్తికి సమ్మోహితుడయ్యెను.

28 తా॥ అపుడు విష్ణువు కులదీపకునితో మోక్షేచ్ఛ గల నీ గురుభక్తి గొప్పదని తెలిసికొంటిని – ఆ గురుభక్తి – నాయందలి భక్తికి పరాకాష్ఠ.

229 శ్లో॥ యోనరో గురుభక్తోఽసౌ గురుభక్తిః కృతాపరా ।
తదధీనోఽస్మి సతతం దాస్యేఽభిలషితం వరం ॥

230 శ్లో॥ మద్భక్తా స్తేఽపి విజ్ఞేయా యేమాతా పితృసేవకాః ।
యాపతింభజతే సాధ్విసాఽపిభక్తా మమైవహి ॥

231 శ్లో॥ విజ్ఞేయ స్యోఽపిమద్భక్తో యోవిద్వద్విప్రసేవకః ।
తపస్వియ తియోగీశ భజకా భజకా మమ ॥

232 శ్లో॥ ఇతి ప్రగల్భ వచనం విష్ణోరాకర్ణ్య దీపకః ।
ప్రణమ్యతం వినీతోఽసౌ ప్రాబ్రవీచ్ఛృణు సాదరం ॥

233 శ్లో॥ శ్రుణు విష్ణో హృషీకేశ నిశ్చయో మనసోమమ ।
వేదశాస్త్రాదిమీమాంసాదాతానో గురురేవహి ॥

234 శ్లో॥ గురోస్తు సర్వ విజ్ఞానం తతోఽధీనాస్త్రి మూర్తయః ।
కింనోఽన్యేన దేవేన దోవోఽస్మాకం హి సద్గురుః ॥

235 శ్లో॥ సర్వదేవాశ్చ తీర్థాని సత్యం సద్గురు రేవనః ।
అస్మాకం పరమాఽర్థోఽపి కిందూరే విద్యతే వద ॥

236 శ్లో॥ సిద్ధాశ్చ యోగినశ్చాఽపి జ్ఞానినో నగురుం వినా ।
యే న జ్ఞానం గురోర్లబ్ధం సుదూరోఽస్యేశ్వరోఽస్తికిమ్ ॥

237 శ్లో॥ విష్ణో! త్వం యం వరం దిత్సే తం గురుర్నాపిదాస్యతి ।
గృహస్థం దూరతస్త్యక్త్వా కోఽన్వేష్టుం యాత్యహో బహిః ॥

238 శ్లో॥ త్వద్భక్తి బద్ధోఽస్మనత ఆగవోఽస్మి వరం తమష్యంగవృణీష్వ దాస్యే।
తమ బ్రవీచ్ఛష్య శిఖామణే! త్వం ధన్యోఽసి మే ప్రాణసఖోఽసి బాల ॥

229 తా॥ లోకమున గురుభక్తి గలవాడు నాయందు భక్తిగలవాడే అగును. నేను అట్టి భక్తులయెడ ప్రీతి గలవాడను. అందుచే పరమీయ ప్రీతి పడితిని.

230 తా॥ ఎవరు – లోకమున మాతా పితృభక్తి గలవారో – ఏ స్త్రీ పతిని దైవముగ సేవించు నా పతివ్రతయో – వారు నాకు పరమ హితులు.

231 తా॥ ఎవరు బాగుగ చదువుకొన్న బ్రాహ్మణసేవ సేతురో అట్టివారును తపము చేయువారు – యోగుల యతులను సేవించువారు భక్తులు.

232 తా॥ ఇట్లు విష్ణువు చెప్పిన ఆ మాటలను విని దీపకుడు – విష్ణువునకు నమస్కరించి వినీతుడై యిట్లు పలికెను.

233 తా॥ ఓయీ హృషీకేశ! నా నిశ్చయమిది – వేదశాస్త్ర మీమాంసాదికమును చెప్పిన గురువే నాకు గురుదైవము.

234 తా॥ గురువు సర్వవిజ్ఞాని – ఆయన అధీనములో త్రిమూర్తులుందురు – ఇతర దేవతలతో నాకు పనియేమి? మాకు సద్గురువే దేవుడు.

235 తా॥ సర్వ దేవతలు – సర్వ తీర్థములు – సత్యము సద్గురువే దైవము – మాకు పరమార్థము దైవమే! దూరము ఏమి మనకున్నది?

236 తా॥ సద్దులు – యోగులు – జ్ఞానులు మొత్తము గురువు కాక మరియెవరు? ఏ మహాత్ముని వలన జ్ఞాన లబ్ధమైనదో ఆజ్ఞాన ప్రదుడగు గురువునకన్న యీశ్వరుడు దూరమున లేడు.

237 తా॥ ఓయీ! విష్ణువు నీవు యిత్తునన్న వరమును గురువు ఈయడా? గృహస్థుని దూరముగ వెళ్లగొట్టి – బయటనున్న వారిని వెదకుట ఏమి శ్రేష్ఠము?

238 తా॥ ఇట్లు స్నేహ భావమునఁబలికెడి దీపకుని పలుకులకు విష్ణువు సంతోషము నొందెను – ఓయీ! బాలక! నీవు ధన్యుడవైన శిష్యుడవు – నాకు సఖుడవు.

239 శ్లో॥ త్వద్భక్తి బద్ధోఽస్మ్యత ఆగతోఽస్మి వరం కమప్యంగ వృణీష్వ దాస్యే ।
సమాగతః ప్రాగిహ విశ్వనాథో దాతుం వరంచాఽపితవోఽహమాప్తః ॥

240 శ్లో॥ వరం వృణీష్వతోఽర్ధ మావయో రేకరూపయోః ।
అభీష్టం తే ప్రదాస్యామి వశవర్తీ తవాఽస్మ్యహం ॥

241 శ్లో॥ దీపకః ప్రాహభోవిష్ణోవరం దాతుంయదీచ్ఛసి ।
గురౌ మమాధికాభక్తి ర్వర్ధత్వ య్యుత్తరోత్తరం ॥

242 శ్లో॥ గురు స్వరూప విజ్ఞానం తద్భక్తిః ప్రేమ లక్షణా ।
భవత్వేవం వరోదేయోనాదేఽతః పరః పరః ॥

243 శ్లో॥ ఇత్యుక్త్వా పదలగ్నోఽభూచ్చార్ఙ పాణిరువాచతం ।
సంతుష్టోఽసిమమ ప్రాణసఖస్త్వం కులదీపక! ॥

244 శ్లో॥ విహితోపి గురుభక్తిర్యాతేన తీర్ణోఽసి వశ్యసి ।
ఇహైవచ పరం బ్రహ్మ శృణ్వన్యదపి దీపక ॥

245 శ్లో॥ ధర్మేణ లౌకిక ధియా పరబుద్ధ్యాఽసి సద్గురుం ।
ఉత్కృష్ట మనసావాఽపిభజ భక్త్యా స్తుతింకురు ॥

246 శ్లో॥ యదాయదా నిజగురుం త్వం భక్త్యాస్తౌషి దీపక! ।
తేనతుష్టో భవామీహస్తుతిః సాఽపి మమైవహి ॥

247 శ్లో॥ యే వేదపాఠకాలోకా యే సాంగ శ్రుతిచింతకాః ।
వేదాంత వాక్యరసికాః పర్యవశ్యంతి సద్గురౌ ॥

248 శ్లో॥ వదం తి వేదసిద్ధాంతే యే పరబ్రహ్మ సద్గురు మ్ ।
తే మత్ప్రియాభజ తతో గురుంతే దేవతావశే ॥

239 తా॥ ఓయీ దీపక! నీమాట నాకు నచ్చినది - నీ భక్తికి నేను బద్ధుడను - వరమడుగుము - ఇత్తును - ఇంతకుముందు విశ్వనాథుడు వచ్చి వర మిత్తుననెను - అపుడు నాకు వరమిచ్చినట్లానందపడితిని.

240 తా॥ ఆ విశ్వనాథుడు నేనును ఒకేరూపమును ధరించినవారమే! నీ కోరికను ఇవ్వగలను - నేను నీకు వశవర్తినై యుందును.

241 తా॥ దీపకుడు విష్ణువుతో నిట్లనెను - అయ్యా! నాకు వరమీయదలచినచో నాకుగురువునందధికభక్తియున్న. అదిఉత్తరోత్తర మెక్కువచేయుము.

242 తా॥ గురువుయొక్క విజ్ఞానము ఆయన యందు భక్తి యుండుటయే! అదియే వరము నాకిచ్చుట - ఆ యీ దానము పరమునకు పరమే!

243 తా॥ ఇట్లని ఆ దీపకుడు ఆ విష్ణువు యొక్క పదములను బట్టును - అపుడు దీపకునితో - ఓయీ! నీవు నా ప్రాణ సఖుడవు-నేను నీకు సంతుష్టుడ నైతిని.

244 తా॥ ఓయీ! గురుభక్తి నీకధికము - నీవు దానిని వశమొనర్చుకొంటివి - ఆయననే పరబ్రహ్మ స్వరూపముగ తలచునది.

245 తా॥ లోకధర్మము ననుసరించి గురు శిష్యడను భేదమే కానీ, గొప్ప మనసుతో గురుసేవ - నుతిసేయుట గొప్పది.

246 తా॥ ఓయీ! నీవెప్పుడెపుడు గురువును నుతింతువో - దానికి నేను సంతుష్టుడ నగుచున్నాను - నీవు గురువును నుతించుట నన్ను స్తుతించుటయే!

247 తా॥ సద్గురుభక్తియందు - నిత్యము వేద పారాయణపరులును - షడంగ శాస్త్రముల పఠించినవారును - వేదాంత వాక్య శ్రవణాభిలాషులు - మొదలగు పవిత్రులుందురు.

248 తా॥ వేదములోని ధర్మ సిద్ధాంతములు - పరబ్రహ్మవాదులు (లోకమును బ్రహ్మగా భావించువారెవరో) వారు గురువులే! వారు భగవత్స్వరూపు లగుట దేవతలందరు తద్వశులై యుందురు.

249 శ్లో॥ గురురిత్యక్షర ద్వంద్వం కేవలం సోఽమృతార్ణవః ।
తస్మిన్ క్షణం నిమగ్నస్య త్రితాపా నిర్దహంతి కిమ్! ॥

250 శ్లో॥ సద్గురుస్మరణం యస్యచిత్తే పూజ్య స్స సర్వతః ।
గురునామ సుధాపానం యస్య సోఽప్యమరోభవేత్ ॥

251 శ్లో॥ యథా మమశివస్యాపి బ్రహ్మణో బ్రాహ్మణస్యవా ।
అనుగ్రహో భవే న్నౄణాం లభ్యతే సద్గురు స్తదా ॥

252 శ్లో॥ మయాఽథ వేశ్వరేణాపి దీయతే బ్రహ్మణావరమ్ ।
గురుణా దీయతే సోఽపి త్రిమూర్త్యాత్మా గురు స్తతః ॥

253 శ్లో॥ ఇత్యుక్త్వా దీపకం విష్ణు ర్జగామ స యథాగతః ।
కలే! శ్రుణు మహాత్మానం విద్ధి సద్గురుసేవకమ్ ॥

254 శ్లో॥ ఏవం లబ్ధవరో విష్ణో ర్దీపకో గురుసమ్ముఖం ।
ఆగత్య తం ననామాఽథ సర్వజ్ఞః ప్రాహ తం గురుః ॥

255 శ్లో॥ వద శిష్యైః హృషీకేశ స్త్వయా సంభాషితః కిల ।
కిం తే దదౌత్వయా కిం వా యాచితం హి మదాత్మహృత్॥

256 శ్లో॥ దీపకః ప్రాహ తం దత్తో హృషీకేశేన మే వరం।
అనిచ్ఛతేపి హి భవత్పాదభక్తి రచంచలా ॥

257 శ్లో॥ తాత్పర్యేణ భవత్పాదసేవా యుష్మత్పదాబ్జయోః ।
దృఢభక్తిరితి స్వామి న్వరోమే విష్ణు నార్పితః ॥

258 శ్లో॥ ఇతి శిష్యవచః శ్రుత్వా సంతుష్టః స గురు స్తదా ।
ప్రసన్నః ప్రాహ సు చిరంజీవ కాశీ పురీం వస ॥

249 తా॥ గురు - అను రెండక్షరములు - లోకమున ముఖ్యమైన అమృత సముద్రములు - క్షణకాలమైన - ఆ సముద్రములలో మునిగినను వారికి - ఆధ్యాత్మిక - ఆధిదైవిక - ఆధిభౌతికములనెడి తాపత్రయము లుండవు

250 తా॥ సద్గురువును స్మరించువాడు లోకపూజ్యుడగును - గురు నామమను ఉచ్చరించుట యను అమృతపాయి సాధారణముగ దేవునితో సమానుడు.

251 తా॥ బ్రహ్మ, విష్ణువు - శివులయొక్క అనుగ్రహము గల పుణ్యాత్మునకే సద్గురువు లభించును.

252 తా॥ ఓయీ శిష్యా! శివుడుగాని విష్ణువునగు నేనుగాని బ్రహ్మగాని అనుగ్రహించి లభింపజేసిన గురువును సేవించువానికి ఆ గురువు త్రిమూర్త్యాత్మకుడై సమస్త వరముల నిచ్చును.

253 తా॥ ఇవ్విధముగ విష్ణువు దీపకునకు సద్గురువును చూపి వెళ్ళెను - అపుడు దీపకుడు గురుసమ్ముఖము దిరిగి నమస్కారమును చేయగా ఆ గురు విట్లనెను: ఓయీ కలీ! సద్గురువు సేవ గొప్పదని బ్రహ్మ చెప్పెను.

254 తా॥ దీపకుడు విష్ణువు వలన సద్గురు సమ్ముఖస్థుడై ఆయనకు నమస్కరింప ఆయన ఇట్లనెను :

255 తా॥ ఓయీ దీపక! హృషీకేశుడగు విష్ణువు నిన్నాదరించి నన్ను చూపెను- నీకు కావలసిన వరము కోరుకొమ్ము - నీవు నా ఆత్మను హరించిన శిష్యుడవు.

256 తా॥ అయ్యా గురుదేవ! విష్ణువు నాకిష్టములేకున్న వరము నిత్తుననెను- దానికి నేను ఎదురు ప్రశ్నలను వేయగా చివరకు గురువునందు అచంచలత నాకు కావలెనని గ్రహించి ఇచ్చి వెళ్లెను.

257 తా॥ కాబట్టి గురువరా! అచంచలమైన మీయొక్క పాదసేవ నాకు కలుగునట్లు విష్ణుమూర్తి వరముగ నిచ్చెను.

258 తా॥ ఇట్లనుచున్న శిష్యవచనముల విని గురు వప్పుడు చాల సంతోషించెను. ప్రసన్నుడైన సద్గురువిట్లు చెప్పెను: ఓయీ! నీవు చిరంజీవివి కమ్ము నీవు కాశీపట్టణమునకు పొమ్మనెను.

259 శ్లో॥ సిద్ధ! య స్త్వద్వచోధీనాః నిధయో ద్వారి సం మతే ।
త్వ దధీనో విశ్వనాథో భూయా త్సంతోషతో మమ ॥

260 శ్లో॥ స్మరిష్యంతి జనా యే త్వాం తత్కష్టం నాశమేష్యతి ।
నందంతి పుత్రదారాద్యై స్తే త్వత్స్మరణ మాత్రతః ॥

261 శ్లో॥ ఇత్యుక్త్వా దీపకం సోఽపి వేద ధర్మా మహామునిః ।
విపాపో విరజో దివ్యదేహ స్తక్షణ మాబభౌ ॥

262 శ్లో॥ పరీక్షితుం శిష్యభావం బుద్ధ్వా కుష్టీవ సోఽభవత్ ।
య స్తాపసో మహాజ్ఞానీ పాపశంకా కుతోఽన్యతత్॥

263 శ్లో॥ మునిః కాశీపురీం యాతోలోకానుగ్రహ కాంక్షయా ।
శ్రీ కాశీక్షేత్ర మహిమా నైక జన్మాఘ సంఘహృత్ ॥

264 శ్లో॥ ఇతి దర్శితమేతేన యే కాశీవాస తత్పరాః ।
అధర్మనిరతా వాఽ పి నా స్తి తేషాం పునర్భవః ॥

265 శ్లో॥ ఏవం శ్రీ మద్గురు వర మహాసత్కీర్తి రుక్తా
శీతక్ష్మాభృత్పయ ఉదధిజా వల్లభౌదార్యయుక్తా ।
శిష్యాయాపిప్రతి వచనతః పద్మజాతేన చోక్తా
సూతేనాథో శునకసుత ముఖర్షిభ్య ఏషాప్యనూక్తా ॥

266 శ్లో॥ ఏవం బ్రహ్మవచో నిశమ్యసకలి ర్నత్వా తదుక్తం ముదా
మూర్ధ్నాఽదాయ భువంగతః స్మ చరతి బ్రహ్మోక్త
వత్సర్వదా ।
సిద్ధః ప్రాహ స నామధారక గురౌ యస్యాఽస్తి భక్తి ర్వరా
తీర్త్వాఽశ్చేవం భవాంబుధిం పరగతిస్తేనైవ లబ్ధాఽ
చిరాత్ ॥

259 తా॥ ఓయీ! దేవతలలో-నున్న సిద్ధులగువారు నీ మాటకు జవదాటరు-నవ నిధులు (ధనరాసులు) నీ యింటి ద్వారమందుండును-ఇఁక కాశీ విశ్వేశుడు నీ ఆధీనమున నుండును.

260 తా॥ ఎవరు నీ నామ పారాయణ చేతురో వారు పాపనాశకులగుదురు. భార్యా పుత్రులతో నీ నామస్మరణమాత్ర ముచ్చరించిన క్షేమంకరులై సంతోషింతురు.

261 తా॥ ఇట్లని-ఆ వేద ధర్ముడు దీపకునితో నిట్లనెను: అట్లనుచుండగనే-ఆ శిష్యుడు-పాప రహితుడై-తొలగిన మాయగలవాడై-అప్పటి కప్పుడే దివ్య దేహముతో వెలుగొందెను.

262 తా॥ ఆ గురువగు వేద ధర్ముడును-శిష్యుని పరీక్షించుటకు కుష్ఠురోగివలె కానుపించెను. ఆ పరీక్షానంతరము పాపలేశముగూడలేని మహాజ్ఞాని యని సంతసించెను.

263 తా॥ గురువు కాశీపట్టణమునకు బోవుట లోకానుగ్రహమునకే! కాశీ క్షేత్ర మహిమ చాలా గొప్పది. అది అనేక జన్మార్జిత పాపములఁ బోగొట్టును.

264 తా॥ ఇట్లు కాశీపుర మాహాత్మ్యమును సిద్ధుడు నామధారకునకు చెప్పి కాశీవాస ఫలము చాలా గొప్పది-అధర్మవాదులుగాని నాస్తికులుగాని అచట లేరు.

265 తా॥ ఇట్లు గురుశిష్య సత్కీర్తి ప్రకటనను-పార్వతీపరమేశ్వరుల ఔదార్యమును-గురుసేవాపద్ధతిని - బ్రహ్మ కలి సంవాద వాక్యమును - చెప్పి-సూతుడు శౌనకాది మహర్షులకు వినిపించెనని- (ఈ గ్రంథపు) మూలభూతమగు బ్రహ్మ వైవర్తమందలి ప్రశ్నోత్తర రూపవాక్యమును చెప్పెను.

266 తా॥ ఇట్లు కలిని అడిగి అతనికి చెప్పుటతో ఆ కలి నమస్కరించి, మీరు చెప్పినట్లు-నేను భూలోకమునకు వెళ్లినపుడు జాగ్రతగ మెలుగగలను-అనెను. సిద్ధుడు నామధారకునకు-గురుభక్తిని-తత్ఫలితమును చెప్పి-సంసార తారకమైన పరమేశ్వరుడు గురువు-అన్న భేదమును తెలిసికొన్నవాడు సర్వాభీష్టప్రాప్తుడగును.

267 శ్లో॥ యత్రకుత్రదృఢా భక్తిర్యదా యస్యమహాత్మనః ।
తత్ర తత్రమహాదేవః ప్రకాశ ముపగచ్ఛతి ॥

268 శ్లో॥ భక్తిర్యస్య నిజేగురౌ హరిహర బ్రహ్మాత్మ బుద్ధ్యాస్థితా
యోవాచా మనసాఽనిశం సువచసా సంసేవతే సోఽచిరాత్।
ఈశానుగ్రహపాత్రమేవ భవతిక్షిప్రం యథా దీపకః
శ్రీశ స్తద్వశవర్తి వాంఛయతియః స్వీయేష్టధీ దీపకః ॥

269 శ్లో॥ గంగాధరస్య తనయో హి సరస్వతీతి
ఖ్యాతః ప్రణమ్య వినతోఽర్ధయ తిస్మ సర్వాన్ ।
శ్రోతౄంశ్చ భుక్తివదిదం మమవాక్యమత్ర
న్యూనం సుపూర్ణమధునాఽస్తు భవత్ప్రసాదాత్॥

గద్య :- ఇతి శ్రీ సిద్ధనామధారక సంవాద రూపేణ సరస్వ త్యాఖ్య గంగా ధరాత్మజ విరచిత నరసింహ సరస్వత్యుపాఖ్య సంజ్ఞత మహారాష్ట్ర భాషాన్విత గురుచరిత్ర సమానా ర్థాయాం వాసుదేవానంద సరస్వతీ యతివిరచితాయాం సంహితాయాం శ్రీ గురుదత్త సంతాయాంకలి బ్రహ్మ సంవాదాన్విత సిద్ధనామధారక సంవాదాఖ్యో ద్వితీ యోధ్యాయ స్సమాప్తః.

ఆదితః శ్లో॥ 415=

ద్వితీయోఽధ్యాయ స్సమాప్తః॥

267 తా॥ ఎక్కడైనను గురుభక్తి గొప్పగానున్న మహాత్ముడు-భగవంతుడు మహాదేవుని సాక్షాత్కార మొందునను-సందియం లేదు.

268 తా॥ గురుభక్తి గలవాడు త్రిమూర్తుల స్వాధీన పరచుకొనును-ఆ గురుభక్తి ఎడతెగని-త్రికరణ శ్రద్ధగలిగియుండుట-అట్టివాడు దీపకునివలె యీశ్వరానుగ్రహ ప్రాప్తుడగును-సంసారమును తరించును.

269 తా॥ ఈ గ్రంథము గంగాధరుని పుత్రుడు నృసింహ సరస్వతీ శిష్యులగు వాసుదేవా నందయతి సర్వవిఖ్యాతులైన శ్రీ దత్తావతార మూర్తియగు శ్రీ నృసింహ సరస్వతీ మహిమాత్మకమగు దత్తగురు చరిత్రమును వ్రాసి సత్పురుష్టులగు పాఠకులయు - గురువులయొక్కయు ప్రసాదమున-భవాంబుధిని దాటగోరెను.

గద్య ॥ ఇది సిద్ధునకు నామధారకునకు సంవాద రూపమైనదియు శ్రీ అపర దత్తావతార శ్రీ నరసింహ సరస్వతీ స్వామివారి శిష్యులైన వాసుదేవానంద సరశ్వతీ స్వామివారు మహారాష్ట్ర భాష యందున్న-మహారాష్ట్ర భాషా ఛందోగ్రంథమునకు సమానముగ-దైపీ వాక్కుతో పారాయణార్థముగ-సంస్కృత సమశ్లోక శ్రీ గురుదత్త చరిత్రమును వ్రాయుచు-అందలి రెండవ అధ్యాయమును సంపూర్తి చేసెను.

మొదటినుండి యింతవఱకుగల శ్లోక సంఖ్య-415

ద్వితీయాధ్యాయము సమాప్తము.

శ్రీ గణేశాయ నమః - శ్రీ దత్తాత్రేయాయ నమః

# శ్రీ గురుదత్త చరితే

## తృతీయోఽధ్యాయః - జ్ఞానకాండః

1 శ్లో॥ ఏవం సిద్ధమునే ర్వాక్యం భక్తియుక్తం స విస్తరం ।
శ్రుత్వా సంతోషమాపన్నః ప్రాబ్రవీన్నామధారకః ॥

2 శ్లో॥ జయి సిద్ధమునే త్వంమే సంసారార్ణవతారకః ।
సంశయోమే సముచ్ఛిన్నో మనోగత ఇహాధునా ॥

3 శ్లో॥ త్వత్తఃసర్వం మయాలబ్ధం మగ్నోస్మ్యానంద సాగరే ।
విజ్ఞాతం పరమం తత్వంమయా తవ ముఖాద్గురో ॥

4 శ్లో॥ త్వన్ముఖాద్గలితంపీత్వా సద్గురోర్మహిమామృతమ్ ।
ఆనందో భాతిమేచిత్తేభో! స్వామిస్తే ప్రసాదతః ॥

5 శ్లో॥ కుత్రాఽస్తి భవతోవాసో గ్రాసోవా కుత్ర మే వద ।
దాసోఽహం తే భవామీతి కరాభ్యాంతత్పదేఽగ్రహీత్ ॥

6 శ్లో॥ తతఃసిద్ధం కృపాలుః సహృష్ట ఆలింగ్యతమ్ముదా ।
ఆశీర్భిరభినంద్యాథ నిజవృత్తాంత మబ్రవీత్ ॥

7 శ్లో॥ యత్రయత్ర గురోర్వాసో వాసోమే తత్ర తత్ర చ ।
గ్రాసో మమాపి సతతం గురుస్మరణమేవ హి ॥

8 శ్లో॥ మహిమా మృతపానంమే శ్రీ గురోర్నిత్య తృప్తిదమ్ ।
సదానంసేవ్యతేభక్త్యా పశ్యేదం పుస్తకం శుభమ్ ॥

1 తా॥ ఈ విధముగ సిద్ధముని వాక్యమును విని నామధారకుడు సంతోష మును పొందినవాడై ఇట్లు బల్కెను:

2 తా॥ ఓయీ సిద్ధమునీ, నీకు జయమగుగాక! నీవు నాకు సంసార సముద్ర మును దాటించు నావికుడవైతివి. ఇపుడు నీ వాక్యములవల్ల నా మనసులోని సంశయమంతయుఁ బోయినది.

3 తా॥ నీ నుండి నేను తెలిసికొనదగినది తెలుసుకొని ఆనందసాగరమున మునిగితిని. ఓయీ మహానుభావా! నీ ముఖము నుండి పరతత్వము నంతయు దెలిసికొంటిని; గురుతత్వము నెఱిగితిని.

4 తా॥ అయ్యా! సద్గురువుగారి చరితామృతమును మీ ముఖము నుండి వచ్చిన దానిని త్రాగితిని. ఓ స్వామీ! మీ అనుగ్రహముతో నా చిత్తము ఆనందములో మునిగినదన్నట్లున్నది.

5 తా॥ అయ్యా? మీ నివాస మెచట? మీ భోజన మెచట? నాకు చెప్పండి. స్వామీ! నేను మీ దాసుడనగుదును అని తన రెండుచేతులతో నామ ధారకుడు సిద్ధముని పాదములకు ప్రణమిల్లెను.

6 తా॥ అపుడా సిద్ధుడు దయతో వాని నాలింగన మొనర్చుకొని సంతోషించి నామధారకు నాశీస్సులచే తృప్తిపరచి తన నిజవృత్తాంతమును చెప్ప నారంభించెను.

7 తా॥ అయ్యా! నామధారక! గురువుగారెక్కడ నుంటె అదే నా నివాసము. వారి నామస్మరణమే నాకు తిన తిండి అని చెప్పెను.

8 తా॥ శ్రీ గురువుగారి స్మరణమునాకు తృప్తిని దీర్చును. వారి నివాసమే నాకు నివాసము. ఎప్పుడు ఆ స్వామి సేవనమే నా పని. ఈ పుస్తకమంతయు శ్రీ సద్గురు మహిమాన్వితము, చూడుము.

9 శ్లో॥ భక్తిర్ముక్తిః పరార్థశ్చ వాంఛితం సకలంధ్రువతమ్ ।
శ్రీ సద్గురోశ్చరిత్రస్య శ్రవణాదేవ లభ్యతే ॥

10 శ్లో॥ ధనార్థీచాక్షయ ధనం లభతేశ్రుతి మాత్రతః ।
పుత్రపౌత్ర గవా దీంశ్చ తత్కామో జ్ఞానమప్యుత ॥

11 శ్లో॥ సప్తాహం యశ్శుచిర్భక్త్యా పఠేద్వాశ్రుణుయా దపి ।
తన్మనోరథసిద్ధి స్స్యాత్ అపుత్రః పుత్రవాన్ భవేత్ ॥

12 శ్లో॥ గ్రహరోగాదిపీడాఽపి న కదాఽపి భవిష్యతి ।
ముచ్యతే బంధనా ద్బద్ధః ఏతచ్ఛ్రవణ మాత్రతః ॥

13 శ్లో॥ యః శ్రుణోతి నరోభక్త్యా శతాయు ర్జానవాన్భవేత్।
బ్రహ్మహత్యాదిపాపాని నశ్యంతి శ్రవణేన హి॥

14 శ్లో॥ ఇతి సిద్ధవచః శ్రుత్వానత్వాతం నామధారకః।
ప్రాహ స్వామిం దయాసింధో! మాం తారయ భవాంబుధేః॥

15 శ్లో॥ లబ్ధోజ్యోతిర్మయః సాక్షాద్గురుమూర్తి స్త్వమేవహి।
స్వామిన్ గురుచరిత్రస్యశ్రవణేచ్ఛామమా పి హి॥

16 శ్లో॥ తృషితాయ యథామార్గే యథేష్టం దీయతేఽమృతం।
భవ్యాపిచతథామేఽద్య చరితామృతపానతః॥

17 శ్లో॥ నైశంతమో యథాఽపైతి సూర్యాలోకవిలోకనాత్।
మమాజ్ఞానం తథాఽపేయాత్ చరిత్రశ్రవణాద్గురోః॥

18 శ్లో॥ ఇత్థం సమాకర్ణ్య స నామధారక వ్యాహార మాశ్వాస్యసదుఃఖ
హారకః।
దత్వాఽభయం తస్యకరం ప్రగృహ్య నిన్యేధ్రువం
సద్గురుమూర్తి సేవితం॥

9 తా॥ ఈ సద్గురు చరిత్రమును విన్నందున నాకు భక్తియు ముక్తియు పరమార్థము - నా కోరికలు ఫలించుటయు గలిగినది.

10 తా॥ ఈ దత్త గురు చరిత్రను విన్నందున ధనమును పుత్ర పౌత్రాది సంపద గోరినవాడా జ్ఞానసంపదను అభీష్టఫలము నొందును.

11 తా॥ అయ్యా! సప్తాహ దీక్షతో దీనిని పారాయణము చేసినను, చదివినను, విన్నను ఎవడు దేనిని గోరునో ఆతడా ఫలము నందును. పుత్రుల గోరినవారు ఆ పుత్ర సంపదను పొందుదురు.

12 తా॥ ఈ చరిత్రను విన్నవాడు లోగ విముక్తుడగును. ఇది యీ చరిత్ర శ్రవణ ఫలము.

13 తా॥ ఎవ డీ చరిత్రను భక్తితో వినునో వానికి నూరు సంవత్సరములు ప్రాణములునిల్చు. దీని శ్రవణమున బ్రహ్మహత్యాది పాపములు పోవును.

14 తా॥ ఇట్లనుచున్న ఆ సిద్ధుని వాక్యములు విని నామధారకుడు నమస్కరించి- ఓ స్వామీ! దయామయ! నాకు సంసారముతరించు నుపాయము చెప్పుమనెను.

15 తా॥ అయ్యా సిద్ధమునీ! నాకు సాక్షాద్గురుమూర్తివి నీవే! నీవు దివ్యతేజోమయుడవుగ నగుపించుచున్నావు. నాకు సద్గురు చరిత్రాశ్రవణేచ్ఛ అధికముగ నున్నది.

16 తా॥ దప్పికిగొన్న బాటసారికి ఆ సమయమును అమృతమున యదేష్టముగా యిచ్చిన యెట్లు తృష్ణ తీరి ఆనందపడునో అట్లే యిప్పుడు నేను - భగవత్కథా శ్రవణము లేక సంసార తాపమున దప్పిగొంటిని. అట్టి యీ సమయమున నీవు నాకు సద్గురు చరిత్రను చెప్పు టమృత పానము వంటిది.

17 తా॥ సూర్యకిరణ ప్రసారమున చీకటి తొలఁగినట్లు మీరు చెప్పిన యీ సద్గురు చరితామృత శ్రవణమున నా యజ్ఞానము తొలగిపోయినది.

18 తా॥ ఇట్టి సిద్ధ వాక్యముల విన్న నామధారకుడు ఆ సంభాషణముతోనే దుఃఖము తొలఁగి- చక్కగా గురు సమీపమున గూర్చుండి యిట్లడుగ నా సిద్ధు డాయన కిట్లనెను;

19 శ్లో॥ అశ్వత్థ సంజ్ఞే కిల కల్పవృక్షే జ్ఞానప్రదే సద్గురుసన్నిధానే -
స్వయం సమాసీన ఇమం సమీపే ప్రీత్యోపవేశ్యాథ జగాద
సిద్ధః॥

20 శ్లో॥ శ్రుణు శిష్యదృఢాభక్తి రజ్ఞానస్య నతేగుణః
సంశయావిష్టచిత్తత్వాచింతా క్లేశాది తేఽభవత్॥

21 శ్లో॥ అథ తే దృఢభక్తిం యః సదాచారో నరోగుణః
సజానీయాద్గురోరూపం సఏవాభీష్టభాగ్భవేత్॥

22 శ్లో॥ ఇతి శ్రుత్వా పునర్నత్వా తం సిద్ధం నామధారకః।
ఉవాచ కరుణం దీనః ప్రశ్రయావనతో భృశమ్॥

23 శ్లో॥ సంసారాబ్ధౌ నిపతితో నిమగ్నోఽజ్ఞానవారిణి।
త్రితాపబడబా తప్తః కామాదిగ్రహవేష్ఠితః॥

24 శ్లో॥ జ్ఞాననావి సమారోప్య మా మితో నావికోభవాన్
ప్రేరయిత్వా కృపావాయుం పరంతీరం నయత్వరం॥

25 శ్లో॥ ఇతి శ్రుత్వా సకారుణ్యం ప్రార్థితః సిద్ధ ఆహ తం।
కృపాకరం నిజకరం తస్య శిష్యస్య మూర్ధని॥

26 శ్లో॥ నామధారక మాభీస్త్వం చింతాం సంత్యజ దూరతః।
ఉత్తిష్ఠోత్తిష భద్రంతే కరిష్యే త్వా మ సంశయం॥

27 శ్లో॥ యస్యనాస్తి దృఢాభక్తిః నసదాక్లేశ దైన్యభాక్।
శ్రీగురుస్తస్యకింకుర్యాత్సంశయావేష్ఠితస్య తు॥

28 శ్లో॥ సంశయం మానసంధృత్వాజాతోఽసిత్వంసుదుఃఖభాక్।
విహాయ సంశయం తస్మాచ్ఛ్రద్ధస్వజ్ఞానవాన్ భవ॥

19 తా॥ ఓయీ శిష్యా! విను. నీ యజ్ఞానము తొలగుటకు నీ కా గురుభక్తి దృఢముగ నుండుటయే! నీకు సంశయము గురుదేవునందుండిన నీకు చింతయు కష్టములు కలుగును.

20,21తా॥ లోకమున నే నరుడైనను సదాచారము, దృఢభక్తియు దత్త గురువందున్నచో అట్టి మనుష్యుడు అభీష్టమును వరముల పొందును; గురురూపదర్శన సిద్ధియు గలిగినవాడను.

22 తా॥ ఇది విన్న నామధారకుడు మరల సిద్ధునకు మ్రొక్కి ఇట్లనెను : దీనముఖుడై వినయముతో నమ్రతగ ననెను.

23 తా॥ అయ్యా! నేను సంసారమనే అజ్ఞానసాగరంలో మునిగితిని. నన్ను తాపత్రయ జ్వరము, కోరికలనే గ్రహములు పట్టి పీడించుచున్నవి.

24 తా॥ నన్ను సంసారము నుండి జ్ఞానమను పడవతో దాటించు నావికుడవగుము. ఎట్లయినను నీ ప్రేరణ వాయువుతో నా నావ నావలి వడ్డు చేర్పుము.

25 తా॥ ఈ మాటలు విన్న సిద్ధుడగస్త్యునకువలె - వింధ్య తుల్య శిష్యమూర్ధమున చేయి పెట్టి యిట్లనెను:

26 తా॥ ఓయీ, నీకు భయము లేదు. నీవు నా పాదములనుండి లే! నీకు మంగళము గల్గింతును.

27 తా॥ ఎవనికి శ్రీ గురువునందు దృఢ భక్తి యుండదో అతని అజ్ఞానము పోదు. వానికి దైన్యక్లేశములు గలుగును. సంశయావిష్టునకు గురువు చేయునది లేదు.

28 తా॥ ఓయీ! నీ వీగురు చరిత్రమందు సంశయచిత్తుడవైన సుఖదుఃఖములు రెండు నుండును. అందుచేత సంశయమును వదలుము. జ్ఞానివగుము

29 శ్లో॥ నిస్సంశయం భజగురుం సోఽభీష్టం తే ప్రదాస్యతి ।
భజతోఽను భజత్యేషభక్తం నోపేక్షతే నిజమ్ ॥

30 శ్లో॥ గురుంవిద్ధి కృపాసింధుం వేదశాస్త్రాది విశ్రుతం।
కిం దుర్లభం తచ్చరణ శరణస్యతు భూతలే ॥

31 శ్లో॥ వదాన్యః కామదఃకోఽత్ర వదాన్యః నచమేఘవత్ ।
మేఘోవర్షతి సర్వత్ర తారతమ్యం న వీక్షతే ॥

32 శ్లో॥ తథైవ సద్గురుః కామ పూరకోఽస్తి తవాపిహి ।
నతిష్ఠత్యుదకం తూచ్చదేశే, గతే తు తిష్ఠతి ॥

33 శ్లో॥ దృఢభక్తిర్గర్త సమో దాంభిక స్తూచ్చదేశవత్ ।
తస్మాద్వాక్కాయ హృద్ధర్మైర్దృఢభక్త్యా గురుం భజ ॥

34 శ్లో॥ గురు ర్నిరుపమో యస్య శిష్యసం స్పర్శమాత్రతః ।
మాయామయ ప్రపంచంతు పరంబ్రహ్మైవ పశ్యతి ॥

35 శ్లో॥ నోపమాకల్పవృక్షస్య యుక్తాఽత్ర నతు కల్పితమ్ ।
దదాతి శ్రీగురుర్ధ్యాయో దత్తేఽసంకల్పితం ధ్రువమ్ ॥

36 శ్లో॥ తస్మాత్త్వం సంశయంత్యక్త్వా నిగమాగమ విశ్రుతం ।
చరణం శరణం గచ్ఛకామధేనుం జగద్గురోః ॥

37 శ్లో॥ ఇత్యుక్తః సఃక్షణం ధ్యాత్వాప్రాంజలిర్నామధారకః ।
అనుగ్రహో గురోరేష ఇతిమత్వాఽబ్రవీ దిదం॥

38 శ్లో॥ యోగేశ్వర! కృపాసింధో!కామధేనుస్త్వమేవ మే ।
సేవకోఽహం తవ స్వామిన్ భవభీతిహరో భవ ॥

29 తా॥ సంశయము లేక గురుసేవఁ జేయుము. నీ కోరిక నెరవేరును. భగవంతుడగు గురువు తన సేవకుని తప్పక రక్షించును.

30 తా॥ గురువుగా రనిన దయా సముద్రుడనుకొనుము. వేదశాస్త్రములన్నియు గురువును గొప్పగ చెప్పుచున్నవి. అట్టి గురువు లభించుట, ఆయన చరణములు లభించుట దుర్లభము.

31 తా॥ ఎవడు మేఘునివలె కోరక తీర జీవనదానమిచ్చునో ఆయన దాత! భగవంతుడు వర్షించు కోరికలచే జగమనంతము, సర్వసమమై యుండును.

32 తా॥ అట్లే నీ గురువును నీ కోరికలఁ దీర్చును. నీరు మెట్టకెక్కదు. పల్లము నందే నిల్చును. శ్రద్ధాభక్తి బుద్ధి వినయునందు దేవుడుండును. పద్ధతులు- డాంభికభక్తులకు స్వామి దయ సేయడని భావము.

33 తా॥ దృఢభక్తి కలవాడు పల్లపునేలవంటివాడు. డాంబికుడు ఉన్నత ప్రదేశము వంటివాడు. అందుచే గురువైన దాత పల్లమున వర్షించును.

34 తా॥ గురువు ఎప్పుడును సాటిలేని దయామయుడే. ఆయన స్పర్శ మాత్ర మున అజ్ఞానము తొలగి కేవల బ్రహ్మజ్ఞానమే కలుగును.

35 తా॥ కల్పవృక్షము నకు సాటియుండదు. దానిని దేనియందు కల్పించినను అది సాటిలేనిదే! ఈ దత్త గురుచరణమును కల్పవృక్షములె మనము కోరిన దాని నిచ్చును.

36 తా॥ అందుచే శిష్యా, నీవు సంశయింపక వేదశాస్త్ర విదుడగు దత్త గురుచరణ కల్పకము నాశ్రయింపుము. అది కామధేనువు వంటిది.

37 తా॥ ఇట్లనుటతోడనే నామధారకుడు క్షణమాలోచించి-గురువునకు దోసి లొగ్గెను-ఇదియే గురువుగారి అనుగ్రహమని అతడు సిద్ధునకిట్లనెను.

38 నా॥ ఓయీ! సిద్ధా! నీవు యోగీశుడవైతివనగా సద్గురువువు. నేను నీకు దాసుడనై శరణు అంటిని. నీవు నాకు సంసారభయమును పోగొట్టుము.

39 శ్లో॥ విస్తృతం భవతోవాక్యం శ్రుత్వా గురుపదాంబుజే ।
సంలగ్నం మే మనోలీలా శ్రవణోత్కంఠితా గురోః ॥

40 శ్లో॥ త్రిమూర్తిః శ్రీగురుః సాక్షా ద్యదితర్హి కుతోభువి।
మర్త్యాత్మనాఽవతీర్ణోఽత్ర తన్మే కథయ తే నమః॥

41 శ్లో॥ ఉవాచసిద్ధః సాధో త్వం శిష్యచంద్రోఽసి కేవలం।
మమ బోధ సముద్రోఽయం పూరితః ప్రశ్నత స్త్వయా॥

42 శ్లో॥ మహానందా ప్తికాల స్తే గురుదాస్యోదయోఽపిచ।
ఉపస్థితోఽచిరాదేవ త్వం బ్రహ్మానుభవిష్యసి॥

43 శ్లో॥ పర్యటం తక్షితితలే కోఽపిమాంన్నై వపృచ్ఛతి।
గురులీలామృతం త్వద్యశుశ్రూషు స్త్వం మయేక్షితః॥

44 శ్లో॥ ఐహికాముష్మికార్థేచ్ఛా యస్యతస్యతు రోచతే।
చరితం తచ్ఛ్రుణుష్వాద్య కృత్వాత్రికరణం ధ్రువం॥

45 శ్లో॥ త్వమసి శ్రీగురోర్భక్త స్తత స్తే మతి రీదృశీ।
లప్స్యసేత్వం చతుర్వర్గా మమేదం నిశ్చితం మతం॥

46 శ్లో॥ ధనధాన్యాదిసంపత్తిః పుత్రాః పౌత్రాః శ్రుతిఃస్మృతిః।
ఆయుస్సౌఖ్యం మతిశ్శాంతే లభ్యా యచ్ఛ్రవణా న్నృణాం॥

47 శ్లో॥ గురులీలా కామధేనుఃవే దశాస్త్ర మతాఽఽదృతా।
లీలావిహారిణో మర్త్యరూపిణోఽరూపిణో విభోః॥

48 శ్లో॥ భూమేర్భారావతారాయ భక్తోద్ధారాయ మారిష।
ఏష వేషధరోభూత్వా కురుతే ధర్మపాలనం॥

39 తా॥ అయ్యా సిద్ధా! మీ వాక్య శ్రవణానంతరం గురు పరణకంజ ప్రభావ మును కంటిని-నీవు చెప్పిన గురు కథా శ్రవణానంతరం ఆయన పాదములపై నా మన సంటియుండెను.

40 తా॥ ఆ గురుమూర్తి త్రిమూర్త్యాత్మకు డగు దత్త దేవుడే! ఆయన భూమిలో నవతరించెననిన - మర్త్య లోకమువారి నను గ్రహించుటకే కద? అందుచే సిద్ధా! ఆయన కథను సంపూర్ణముగ వినిపింపు మనెను.

41 తా॥ అపుడాసిద్ధుడు నామధారకునితో - ఓ సాధువా! నీవు నిజముగ శిష్య చంద్రుడవే - నీ ప్రశ్నపరంపరలతో నా మన స్సముద్ర ముప్పొంగి పోవుచున్నది.

42 తా॥ నేను ప్రశ్నలకు సమాధానము చెప్పవలెనన్న మహానంద ముభయులకు గలదు - నీకును బ్రహ్మానందాప్తి కాలము కలిగి నాతో సమాగమ మైతివి.

43 తా॥ నేను యీ భూమినంతయు తిరుగుచుంటిని - ఎవడు నన్ను యీ భగవంతుని గూర్చిన ప్రశ్న చేయలేదు - ఈ లీలామృతమును - నా యోపికకొలది కీర్తింతును దేవుని నీ శ్రద్ధకొలది వి భజింపుము.

44 తా॥ లోకమున నెవనికైనా ఐహికాముష్మిక కాంక్ష యున్నచో - వారు సరియైన భక్తి శ్రద్ధ గలిగి శ్రీగురు చరిత్రను విందురుగాక!

45 తా॥ నీవునిజముగ శ్రీగురుపాద భక్తుడవు,అందుచే-నీ కీచరిత్ర జిజ్ఞాస గలిగి నది - అందుచే నీవు యీ గ్రంథ శ్రవణమున - ధర్మ - అర్థ-కామ మోక్ష మను 4 పురుషార్ధముల సాధింతువు.

46 తా॥ అదియునుకాక ఈ చరిత్రశ్రవణమున - ధన ధాన్య - పుత్ర, పౌత్ర భాగ్యము - ఆయువు - సౌఖ్యము - ఈ లోకమున శ్రీగురు చరిత్రను విన్నవాడు తప్పకపొందును.

47 తా॥ ఈ గురు లీలామృతము - కామధేనుసమము - దీనినంతటిదని నేననుటగాదు - ఇది వేదశాస్త్రములంగీకరించిన మాట - ఆ విష్ణువు విలాసముగా మర్త్యులతో సుఖముగ నుందామని అవతరించెను.

48 తా॥ భూభారహరణమునకు - భక్తోద్ధారణకు - భగవంతు డీ వేషమును ధరించి ధర్మ సంస్థాపనఁ జేయుచుండెను.

49 శ్లో॥ ఇతి సిద్ధవచః శ్రుత్వా నత్వా తం నామధారకః।
పప్రచ్ఛేశావతారాణాం నిదానం కిం మహామతే॥

50 శ్లో॥ స్వామిన్మయికృపాంకృత్వా విస్తరేణైవ తద్వద।
ఉవాచ సిద్ధః శ్రుణు భో నిర్గుణం బ్రహ్మవస్తు యత్॥

51 శ్లో॥ జగదాది స్వతోఽనాది యదేకం చా ద్వితీయకం।
తత్స్వశక్తి సమావేశా త్త్రిగుణం విశ్వకారణం॥

52 శ్లో॥ యతస్స్వతంత్రం తదేవాసీ ద్బ్రహ్మవిష్ణ్వీశరూపదృత్।
సృష్టిస్థితిప్రలయకృతే రజఃసత్త్వతమోగుణైః॥

53 శ్లో॥ కః స్రష్టా రజ ఉద్రేకే, సత్వోద్రేకస్య కేశవః।
పోష్టాం తే తమ ఉద్రేకే హర్తా రుద్రఃస్వయంప్రభుః॥

54 శ్లో॥ నైతే పరస్పరం భిన్నాస్త్రయః కార్యానుసారిణః।
సృష్ట్యాది లీలాకర్మకరాః ప్రసిద్ధాః ప్రభవఃశ్రుతౌ॥

55 శ్లో॥ అంబరీషాభిధః కశ్చిత్ సూర్యవంశీయ పార్థివః।
ఏకాదశీవ్రతపరో విష్ణుభక్తో దృఢవ్రతః॥

56 శ్లో॥ నానావతారస్వీకారే సనిమిత్తమభూ ద్విభోః।
తత్సర్వం తేఽభిధాస్యామి సావధానమనా భవ।

57 శ్లో॥ ఉపోష్యవిధినా రాజా నిత్యమేకాదశీదినే।
ఆతిథేయః సకురుతే సర్వదా హరిచింతనమ్॥

58 శ్లో॥ ఏవం సత్యేకదా తస్య దుర్వాసాగృహమాగతః।
సాక్షాత్తద్వ్రతభంగాయ దుర్దైవం కి ముపాగమత్॥

49 తా॥ ఇట్లన్న ఆ సిద్ధ వాక్యమును విని నామధారకుడు నమస్కరించి - ఇట్లనెను - స్వామీ! పరమేశ్వరుడు విలాసముగ నవతరించుట భక్త రక్షణకే కద?

50 తా॥ ఓ స్వామీ! నాపై దయతో శ్రీవారి చరిత్రను విస్తారముగ చెప్పండి. వినుమో నామధారక అనుచు - నిర్గుణుండగు పరమేశుని గుణవంతునిగ చెప్పును.

51 తా॥ జగత్తున కాది పురుషుడు అద్వితీయ పరబ్రహ్మమే! దానిని గూర్చి చెప్పవలయుసన్న త్రిగుణాత్మకునిగా, త్రిమూర్తిగా జెప్పుదును.

52 తా॥ అసలు త్రిమూర్తులు స్వతంత్రులే! వారులోకావరణమునకై త్రిగుణవంతులు.

53 తా॥ ఎవరు సృష్టి - పోషణకు కర్తలు, ఎవరు లయ కర్త అనఁగా-రజో గుణము ప్రకోపించి బ్రహ్మ స్వరూపమున సృష్టియు-సత్త్వోద్రేకముచే పోషణకర్త యగు కేశవుడును తమోగుణ ప్రకోపమున రుద్రుడును - త్రిమూర్తులయిరి.

54 తా॥ ఈపై ముగ్గురు భిన్నులుగారు - ఒక్కడే. ఆయా గుణ సంయోగమున మారి సృష్ట్యాది కర్మల చేయుచుండిరి - వీరు ముప్వురుగ ప్రసిద్ధులైరి - కాని ఒకడే! ఈశ్వరుడు.

55 తా॥ పూర్వము సూర్యవంశపు రాజు అంబరీషు డను నాతడు ఏకాదశీ వ్రతమును సల్పుచు విష్ణు భక్తుడయ్యెను.

56 తా॥ విష్ణువు నానావతారము లెత్తుటకు ఆ అంబరీషుడే కారణమయ్యెను - దానిని సమ్యగముగఁ జెప్పుదును, సావధానముగా వినుము.

57 తా॥ ఆ రాజు ఉపవాస మేకాదశియందుండి మరునాడు - అతిథికి శ్రద్ధతో భోజన మిచ్చుచు - హరి భక్తిని జరుపుచుండెను.

58 తా॥ ఒకతూరి ఏకాదశీ వ్రతము చేయుచుండ ఆ రాజుగారి వ్రత భంగమా? అనునట్లు దుర్వాసు డతిథిగా వచ్చెను.

59 శ్లో॥ ఏకనాద్యవశిష్టా భూ తద్దినే ద్వాదశీతిథిః।
ఆతిధేయోంబరీషస్తం గతోభీతోఽపిసమ్ముఖమ్॥

60 శ్లో॥ తం సమానీయ పానీయమానీయ విధినాఽన్యనః।
పాదౌ ప్రక్షాళ్యసంపూజ్య పూజ్యమేత మపూజయత్॥

61 శ్లో॥ తం నత్వా కుశలం పృష్ట్వాప్రాహాశీఘ్ర మనుష్ఠితమ్।
కృత్వాతు పారణాయాఽశు భవా న్స్వల్పాద్యసే తిథిః॥

62 శ్లో॥ తథేతి సనదీంగత్వా చక్రేకర్మ చిరక్రియః।
వ్రతభంగా తిథిత్యాగదోషభీత్యా సశంకితః॥

63 శ్లో॥ విచార్యస్వగతం రాజా జలపానేన మే భవేత్।
అధునోభయ సంసిద్ధి రితిమత్వా పపౌ జలం॥

64 శ్లో॥ అత్రాంతరేఽపి దుర్వాసా ఆగత్య కుపితోఽవదత్।
బుభుక్షితాతిథిం హిత్వాకథంపానం త్వయాకృతమ్॥

65 శ్లో॥ ఏవముక్త్వా స దుర్వాసాః శాపందాతుంప్రచక్రమే
భీతోరాజాస్మరన్ శార్ఙ్గధరం తం భక్తవత్సలం॥

66 శ్లో॥ స్మృతమాత్ర స్తదాప్రాప్తోధేనుర్వత్సమివద్రుతం।
నారాయణః సకరుణః శరణాగతరక్షణః॥

67 శ్లో॥ రాజ న్నా నాయోనిభా క్త్వం భవేతి స శశాప తం।
యావత్తావ ద్ధృషీకేశ స్తయోర్మధ్యే సమాగతః॥

68 శ్లో॥ మునే ర్వాక్యంనమిథ్యేతి భీతోరాజాహరేః పదమ్।
జగ్రాహ స మహావిష్ణుర్బభాషే భక్తవత్సలః॥

59 తా॥ ఒక ఏకాదశీ తిథి యందు ద్వాదశి మరునాడు ఒక ఘడియ మాత్ర ముండెను . అతిథియగు దూర్వాసునకు - విష్ణుభక్తిపరు డంబరీషుడు భయపడుచుండెను.

60 తా॥ అపు డా దూర్వాసుని పిల్చుకొనివచ్చి ఆయనకు పూజ లొనర్చి పూజ్యుడగు దుర్వాసుని పూజించెను.

61 తా॥ పూజానంతరమారాజు మునికి మ్రొక్కి - అయ్యా! పారణకుతాము శీఘ్రముగ వచ్చిన వ్రత పూర్తియగు ననెను.

62 తా॥ దానికా ముని నదికి వెళ్ళి స్నానించివత్తును-అని వెళ్ళి ఆయన స్నానా దికృత్యముల నిమగ్నుడయ్యెను. అతిథి వేళకు రాలేదు - వ్రత భంగ మగును అను భీతిగలవాడై యుండెను.

63 తా॥ తాను తనతోటి పెద్దలతో విచారించి - ఆకలిగొన్న వాని కన్నము పెడుదుమని - చెప్పి - కాలము (ద్వాదశి) వెళ్ళిపోవునని తినిన చాల నష్టమగును - ఆ ముని వచ్చుననిన రాడు - ఘడియలు పోవుచున్న వని ఆ కాలములో జలపానం చేసిన వ్రత భంగము గాదన విని అట్లు చేసెను

64 తా॥ ఇంతలో దుర్వాసుడు వచ్చి అంతయు తెలిసికొని కుపితుడయ్యెను. ఏమీ? నీవు అతిథిని నన్ను వదలపెట్టి ముందు జలపానము చేయుట తప్పు. అందుచే - నీవు తప్పొనర్చితి వని కోపగబడెను.

65 తా॥ ఇట్లనుచు ఆ రాజునకు శాప మిచ్చుటకు పూనుకొనెను, దానికి భయ పడిన రాజు భక్తవత్సలుడగు విష్ణువును నమ్ముకొని ప్రార్థించెను.

66 తా॥ అపు తన దూడపై ప్రేమతో వచ్చినట్లు దుర్వాసునిశాపభీతుడైన అంబరీషుని కడకు ఆ నారాయణమూర్తి శరణాగత వత్సలుడగుట ప్రత్యక్షమయ్యెను.

67 తా॥ ఓయీ! నీవు యీ తప్పిదమునకై నానా యోనుల బుట్ట మనెను అపుడు హృషీకేశుడు వారిద్దరి మధ్యగజేరి సామరస్యమును పెట్టెను.

68 తా॥ మహర్షి వాక్యము వ్యర్థము గాదని ఆ రాజు భయపడి విష్ణువు చరణ మును పట్టుకొనెను. భక్తవత్సలుడగు విష్ణువు ఆయనతో నిట్లనెను.

69 శ్లో॥ మునే రక్షా స్వముం భక్తం శాపందేహి త మేవమే।
నాయం సోఢుం ప్రభు ర్భక్తవాత్స ల్యా న్మేఽసహిష్ణుతా॥

70 శ్లో॥ ఈశ్వరాంశోఽపిదుర్వాసా విచార్య స్వగతం జగౌ।
అవతీర్త్యైషశాపేన భువోభారం హరిష్యతి॥

71 శ్లో॥ సుచిరేణాపి తపసా భగవాన్సువిదుర్లభః।
అంబరీషప్రభావేణ శాపసంబంధి కారణాత్॥

72 శ్లో॥ భవిష్యత్యత్ర సులభః శ్రీపతిః సహితః శ్రియా।
అవతార్య స్వభక్తానా ముద్ధార్తా భవితాఽభవః॥

73 శ్లో॥ అస్మై పరోపకారార్థం శాపోదేయోదయావతే।
కి మంబరీషజనుషా భూభారోఽయం హరిష్యతి॥

74 శ్లో॥ ఇత్థం విచార్యదుర్వాసా వాసార్థ మవనౌ హరేః।
శాపంతమేవ హరయే ప్రదాస్యన్నిదమబ్రవీత్॥

75 శ్లో॥ స్థూలసూక్ష్మ నివాసోఽపి విశ్వాత్మాపి క్షితావజ।
దశవారంచ మత్స్యాది రూపైరవతరిష్యసి॥

76 శ్లో॥ ఇతి దుష్టాంతకః శిష్ట రక్షకో మునినార్పితమ్।
శాపం ప్రీత్యా స్వీచకార కారణాత్మా దయాఘనః॥

77 శ్లో॥ నారాయణానంతరూపో భగవాన్భక్తవత్సలః।
అస్యావతారాద్యా ఉక్తా భాగవతాదిషు॥

78 శ్లో॥ క్వచిత్ సృష్టాక్వచిద్గుప్తాస్తాన్విదుర్బ్రహ్మవాదినః।
కుతో విమూఢా జానంతి యత్రవేదోఽపిశంకితః॥

69 తా॥ ఓయీ ముని! నా యీ భక్తుని రక్షింపుము. మీ శాపమును ఈతడు సహింపలేడు. శరణాగత ధర్మము నేను సహింతును.

70 తా॥ ఆ రాజిట్లనుచు ఈ దుర్వాస ఈశ్వరాంశజుడు అందుచే ఆయన శాపమునకు అర్థముండును. ఈ శాపముతో నీకు అవతారం కల్పింప భూభార రక్షణకు సంసిద్ధుడవైతివి.

71 తా॥ ఎన్ని తపములొనర్చిన భగవంతుడు భూమిపై నవతరించెదు? ఈ అంబరీష మహీపతితో దుర్వాసుడు వచ్చి శాపకారణముగా నాతో సంబంధించెను.

72 తా॥ ఆ విష్ణువు లక్ష్మీదేవితో నిట తప్పక పుట్టగలడు. అట్లు భువిపై నవతరించి తన భక్తుల బ్రోచుచు నుద్ధరించును

73 తా॥ దయానిధి ఆ దుర్వాసేశ్వరుడు ఇతనిపై యీ నెపమున నలిగి పరోపకారమునకు శాపమిచ్చెను లేకున్న అంబరీషునకు ఫలమేమి? ఆయనకై భగవంతుడు జనించి భూభారహరణ మొనర్చునా?

74 తా॥ ఇట్లుగా దుర్వాసుడు విచారించి మనసులో నా యీ శాపము విష్ణువునకైన నగును అనియనెను.

75 తా॥ విశ్వాత్మకుడగు విష్ణువు స్థూల రూపములతో భూమిని రక్షింపదలచి పది పర్యాయములు మత్స్యాద్యవతారావతరణుడయ్యెను

76 తా॥ దయానిధియగు శ్రీ హరి దుష్టశిక్షణ శిష్టరక్షణ అగునని ఆ దూర్వాస శాపమును ప్రీతితో స్వీకరించెను.

77 తా॥ ఆ నారాయణమూర్తి యీ విధముగ భాగవతుల రక్షణకై దశావతారము లొందెనని భాగవతాది గ్రంథములందుండెను

78 తా॥ శ్రీ మహావిష్ణువు విశ్వోద్ధరణమునకుపాటుపడినట్లు వేదశాస్త్రములేచెప్పి చెప్పకుండనుండే - మూఢు లాయీశ లీలల నెట్లు తెలుసుకోగలరు?

79 శ్లో॥ చమత్కారోఽపిచాన్యోఽయమనసూయామనస్వినీ।
పతివ్రతాశిరోరత్నం శ్రుతావపి చ విశ్రుతా॥

80 శ్లో॥ తస్యాగృహం సమాగత్యమధ్యాహ్నేఽతిథిరూపిణః।
త్రిమూర్తయసుతాస్తస్యా అభవన్నద్రియోషితః॥

81 శ్లో॥ ఇతిశ్రుత్వాఽథపప్రచ్ఛపునస్తం నామధారకః।
ఆశ్చర్యం కథితంత్వేత దాసన్మాత్రాః కథంసురాః॥

82 శ్లో॥ ధన్యోఽయమత్రిః కుతఏషజాతః సకిం ప్రభావోఽపిత
ధానసూయా!
సవిస్తరంతూత్తర మార్తబందో! బంధోచ్ఛిదాఖ్యాహిసు
బోధసింధో॥

83 శ్లో॥ ఇతి సతదనుయోగం కామితానందయోగం
సకలమలవియోగం సన్ముముక్షూపయోగం।
దృఢమతిరవధార్యం ప్రాబ్రవీదార్యవర్యం
త్రితనుజను రనార్య ధ్వంసకం శిష్యవర్యం॥

గద్య॥ ఇతి శ్రీ సిద్ధనామధారక సంవాదరూపేణ సరస్వత్యాఖ్య
గంగాధరాఽత్మజ విరచిత నరసింహ సరస్వత్యుపాఖ్యాన
సంజ్ఞిత మహారాష్ట్ర భాషాన్విత గురుచరిత్ర సమానార్థాయాం
వాసుదేవానంద సరస్వతీయతి విరచితాయాం శ్రీ దత్తగురు
సంహితాయాం జ్ఞానకాండే తృతీయోఽధ్యాయః.

ఆదితః శ్లోకాః - 498

తృతీయోధ్యాయః సమాప్తః.

79 తా॥ భూలోకమున మహాపతివ్రత - సాక్షాద్దేవీ స్వరూపయైనది భూలోకమున అనసూయ - ఆమె గర్భమున బుట్టి నా జన్మసాఫల్యము చేసికొందునని హరి తలచెను.

80 తా॥ ఇట్లు విచారించుకొని త్రిమూర్తులును ఒకనాటి మధ్యాహ్న భోజనమునకు ఆ అత్రిముని గేహమునకు చేరిరి.

81 తా॥ ఇట్లా సిద్ధముని చెప్పినదానినివిని నామధారకుడు ఆశ్చర్యమును ప్రకటించుచు దేవతలందరు భూభారహరణమునకు శ్రీహరి భూలోకావతరణమునకు సమ్మతించి రనుకొనిరి.

82 తా॥ ఆ అత్రి యెంతటి ధన్యుడు. ఆ అనసూయ గర్భమున ఎట్లు త్రిమూర్తులుదయించిరో సవిస్తరముగా చెప్పుమని సిద్ధయోగిని నామధారకుడడిగెను.

83 తా॥ ఆనందవర్ధకుడును - భక్తులకు మోక్షదాయకుడును - చెప్పిన దానిని గుర్తుపెట్టుకొనుచున్న శిష్యుని గూర్చి దయామయమగు విష్ణుచరిత్రను సిద్ధుడిట్లు చెప్పసాగెను :

గద్య॥ ఇది సిద్ధనామధారక సంవాదరూపమైనది. శ్రీ దత్తావతారమైన గురువర్యులగు శ్రీ నరసింహస్వామివారి సంజ్ఞతో మహారాష్ట్రి భాష యందలి యీ చరిత్రమును శ్రీ నృసింహ సరస్వతీయోగి శిష్యులైన శ్రీ వాసుదేవానందకృపచే గురుదత్త సంహితారూప గ్రంథమున జ్ఞానకాండలో 3 అధ్యాయ రూపము సమాప్తము.

మొదలనుండి జరిగిన శ్లోకములు - 498.

శ్రీగణేశాయ నమః - శ్రీ దత్తాత్రేయాయ నమః

# శ్రీ గురుదత్త చరితే

## చతుర్థోఽధ్యాయః - జ్ఞానకాండః

1 శ్లో॥ ఏవం శిష్యస్యసంప్రశ్నం శ్రుత్వాసిద్ధ ఉవాచ తం।
సాధు, సాధు త్వయా పృష్టం ప్రీతిర్గురుపదేఽస్తి తే॥

2 శ్లో॥ ధన్యామాన్యాస్తితేవాణి త్వం హిశిష్య శిఖామణిః।
త్వత్ప్రశ్న శ్రవణేనైవ గురులీలామృతాఽఽదితః॥

3 శ్లో॥ ప్రశ్నస్తేఽయం సమీచీనః సాదరంకథయామి తే।
ఆరభ్యసృష్టి త స్సర్వ మత్రేర్జన్మాది యచ్ఛ్రుతమ్॥

4 శ్లో॥ పురా కల్పాంబుధౌలీనా విశ్వసృష్టి రశేషతః।
నారాయణో వేదగీతో జలశాయీ తదాఽభవత్॥

5 శ్లో॥ రేతోరూపేణమనసా సకామోంఽడం పురాసృజత్।
పురాకల్పే యత్రలీనా నానా చేతనవాసనాః॥

6 శ్లో॥ హిరణ్య గర్భసంజ్ఞం తత్ బ్రహ్మాండం దేవ వత్సరం।
స్థిత్వా భిన్నమభూత్తత్ర సర్వోత్పత్తిః శ్రుతీరితా॥

7 శ్లో॥ స్వర్భూతలే ద్వేశకలే విధాత్రా నిర్మితేఽమలే।
భువోఽ ధస్సప్తలోకాః స్యు రూర్ధ్వేసప్త సు తేజసః॥

8 శ్లో॥ విష్ణోర్నాభే ర భూద్బ్రహ్మ స చతుర్దశలోకసృట్।
మనసా దేహతశ్చాఽపి దిక్కాలాదీన్ స ససర్జ హి॥

1 తా॥ పూర్వాధ్యాయాంతమున శిష్యుడు వేసిన ప్రశ్నకు సంతోషించి సిద్ధుడు ఆ నామధారకునితో - ఓయీ! నీ వేసినప్రశ్న బాగున్నది - నీ చిత్తము గురుచరణములందుండుట ప్రశస్తము.

2 తా॥ నీ వేసిన ప్రశ్న చాల యుక్తమైనది - ఓయీ శిష్యశ్రేష్ఠ! గురులీలామృతము నీ ప్రశ్న వెంటనే నాకు గుర్తు వచ్చినది. చెప్పుదును.

3 తా॥ నీవడిగిన ప్రశ్నకు సాదరముగ సమాధానమిత్తును. సృష్టి మొదలిప్పటి వఱకుగల గురుచరిత్రమును నేను విన్నది నీకు దెలుపుదు.

4 తా॥ పూర్వము - ప్రపంచమంతయు - జలప్రళయముతో సముద్రమైనది. (విశ్వమంతయు) అట్టి సమయమున నారాయణమూర్తి ఆ జలమందు పరుండి యుండెను.

5 తా॥ అపుడాయన మనస్సుతో రేతస్సును గల్పించి దానిచే బ్రహ్మాండమగు గ్రుడ్డును సృజించెను. పూర్వకల్పమున యేవిధముగా నీటితో లీనమైనదో విశ్వము - దానినట్లే నానావిధముగా విష్ణువు మరల సృజింపజేసెను.

6 తా॥ ఆ నారాయణమూర్తి గర్భము నుండి బ్రహ్మయుదయించెను. ఆయన సృష్టించిన అండము ఊర్ధ్వాధో రూపమున రెండు డిప్పలయ్యెను.

7 తా॥ స్వర్గము - భూమి అను భేదముతో రెండు ప్రక్కలకు పేరులయ్యెను. ఆ భూమియను దాని క్రింద సప్త అధోలోకములు, పై స్వర్గమునకు ఊర్ధ్వ లోకములు 7 నుండెను.

8 తా॥ విష్ణునాభికమలసంభూతుడు బ్రహ్మ - ఆయనయే - పై - ద్వి - సప్త లోకముల చతుర్దశగా విభజించి సృష్టించెను.

9 శ్లో॥ సృష్టిం వర్ధయితుంచాగ్రే బ్రహ్మవిష్ణోరనుజ్ఞయా।
తపస్తప్త్వాపి చతురః పుత్రాన్ స్వప్రచసోఽసృజత్॥

10 శ్లో॥ మరీచి రత్ర్యంగిరసౌపులస్త్యః పులహః క్రతుః।
వశిష్ఠ ఇతి సప్తైతే మనసాబ్రహ్మణః సుతాః॥

11 శ్లో॥ శతరూపా మనూబ్రహ్మ దేవహూతిః సుతౌతయోః।
ఛాయేతికర్దమస్త్రీ తత్పుత్ర్యో బ్రహ్మసుతైర్వృతాః॥

12 శ్లో॥ విధాతృనేత్ర జస్యాత్రే ర్ధర్మపత్నీ పతివ్రతా।
అనసూయా వేదగేయా జగదంబైవకేవలం॥

13 శ్లో॥ తస్యాః సులక్షణాయాః కః శక్తః సౌందర్యవర్ణనే।
యస్యాః పుత్రోహి నక్షత్రనాథశ్చంద్రోఽత్ర విశ్రుతః॥

14 శ్లో॥ పతిసేవారతా నిత్యం తాం విజ్ఞాయ తపస్వినీమ్।
భీతా ఇంద్రాదయోదేవాః స్వర్గైశ్వర్యం హరిష్యతి॥

15 శ్లో॥ ఇతి మత్వాఽమరవరా ఇంద్రాద్యాశ్శరణం యయుః।
బ్రహ్మవిష్ణు హరాస్తేభ్యః సతీఖ్యాతింన్య వేదయన్॥

16 శ్లో॥ ఇంద్రః ప్రాహమహాదేవా అత్రిపత్నీ పతివ్రతా ।
తదాచారాదధీరాః స్మః స్వపదచ్యుతి శంకయా ॥

17 శ్లో॥ భజతేయా పతింభక్త్యా మనోవాక్కాయ కర్మభిః ।
అతిథీనాం తథాఽతిధ్యే స్వప్నేఽపి విముఖానహి ॥

18 శ్లో॥ స్వకరస్పర్శతః సాధ్యాస్తాపోనను భవిష్యతి ।
ఇతి మత్వాతు తపనోమందంతపతి భీతిమాన్ ॥

9 తా॥ ఆ సృష్టికార్యమును పెంపొందింప బ్రహ్మ విష్ణ్వాజ్ఞచే తపమొనరించి సనకాది నల్వురు పుత్రులను - సప్త మహర్షులను సృష్టించెను.

10 తా॥ వారేడుగురు - 1 మరీచి 2 అంగీరసుడు 3 పులస్త్యుడు 4 పులహుడు 5 క్రతువు 6 వశిష్ఠుడు 7 అత్రి అనువారు. వీరును బ్రహ్మ మానస పుత్రులు.

11 తా॥ మనువు శతరూప వారిద్దరు బ్రహ్మ సృష్టమైన దంపతీద్వయము ఛాయాకర్దము లోకజంటగా సృష్టిసహాయులైరి.

12 తా॥ ఆ బ్రహ్మనేత్రము నుండి పుట్టిన అత్రి తపస్వి - ఆయన ధర్మపత్ని అనసూయ సాధ్వీమణి.

13 తా॥ ఆ అనసూయాత్రి దాంపత్యము వర్ణనీయము-వారి పుత్రుడే చంద్రుడు ఇట్లని వేదవాక్యము గలదు.

14 తా॥ ఆ అనసూయ పతిసేవాపరాయణ - మహా సాధ్వి - ఆమె పాతివ్రత్య మహిమచే - ఇంద్రాదులు - స్వర్గము నామె హరించునని భయ పడిరి.

15 తా॥ ఇట్లనుకొనుచు దేవతలందరు ఆమెను శరణు జొచ్చిరి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు గూడ - ఆమె పాతివ్రత్యమును పెద్దగా దేవ తలకు తెలిపిరి.

16 తా॥ అపుడు - ఇంద్రుడు దేవతలతో నిట్లనెను - ఓయీ దేవతలారా! అనసూయాదేవి ఆచారముచే-మనమందరము చాల తక్కువయైతిమి-నాకీయింద్రపదవి దక్కుట కష్టమనెను.

17 తా॥ ఆ అనసూయాదేవి త్రికరణశుద్ధితో పతిభక్తి నాచరించుచు - అర్ధరాత్రివేళ అతిథులు వచ్చినను వారి కాతిథ్యమిచ్చును.

18 తా॥ ఆమె చేతి స్పర్శ గలిగిన సాధ్యులే తాపపడుదురు - అందులకే ఆమె పాతివ్రత్యాగ్ని తేజమునకు సూర్యుడోడి స్వల్పకాంతి గలిగియుండెను.

19 శ్లో॥ భీత భీత స్తథా ప్యగ్నిః శీతలత్వం హి వాంఛతి।
వాయుశ్చ చకితోవాతి మందంమందం సదైవహి॥

20 శ్లో॥ ధరామృదుతరాజాతా తస్యాః కాఠిన్యశంకయా।
శాపం దాస్యతి సాకిం న ఇతిభీతా నతావయమ్।

21 శ్లో॥ తపః ప్రభావాత్కస్యాఽపిప్రస్థానం సాఽపహరిష్యతి।
సానుగృహ్ణాతి యంసోఽపి రంకోఽప్యస్మాన్విజేష్యతి॥

22 శ్లో॥ అత్రోపాయ మపాయఘ్నా జగదీశావిచార్యనః।
పదభ్రంశోయథా నస్యాత్ తథాకురు తమాచిరమ్॥

23 శ్లో॥ అనుగ్రహో న భవతా మస్మానుపవదే త్తదా।
స్థాస్యామ ఏవ త్వద్వారి దాసభావంసమాశ్రితాః॥

24 శ్లో॥ ఇత్థం దేవవచః శ్రుత్వా బ్రహ్మవిష్ణు మహేశ్వరాః।
క్రుద్ధా ఊచురహో జాతాకిమేవం సా పతివ్రతా॥

25 శ్లో॥ గత్వాఽస్యా వ్రతభంగం తు కృత్వాయద్వా య మాలయమ్।
గమయిత్వాపునః శీఘ్రమాయాస్యామ సురోత్తమాః॥

26 శ్లో॥ త్రయోఽపీతి ప్రతిజ్ఞాయ భూత్వాతేఽతిథయోఽమలాః।
ఆగతా ఆశ్రమపదమత్రేరివ బుభుక్షితాః॥

27 శ్లో॥ గతే మునా వనుష్ఠాతుం బ్రహ్మవిష్ణుమహేశ్వరాః
అనసూయా మనుప్రాప్యప్రాహుఃస్తాం భిక్షుకా ఇవ॥

28 శ్లో॥ మాతః బుభుక్షితాఽస్మోఽద్య దేహ్యన్నంత్వరితంశుభే!
అథవానేతిచేద్బ్రూహి గచ్ఛామోఽన్యత్రమాచిరమ్॥

19 తా॥ అగ్ని వంటి వా డామెపతివ్రతాత్వతేజమునకు జంకి చల్లదనమును వహించుచున్నాడు - వాయువుగూడ మెల్లమెల్లగనే వీచుచుండెను.

20 తా॥ భూమియు ఆ అనసూయకు తన స్పర్శ కఠినము కాకూడదని మార్ద వమును వహించెను - ఆమె శాపమిచ్చునని కాదు - గౌరవమున.

21 తా॥ తవః ప్రభావముచే యే వనితకును అచట స్థానమే లేదు - ఆమెయను గ్రహము నొందినవాడు నిర్భయముగ మనలందర జయించును.

22 తా॥ ఆ అనసూయా ప్రకారమంతయు జగదంబ పద్ధతియే - ఆమె మమ్మను గ్రహదృష్టితో చూచుటచే మన పదవులూడకున్నవి.

23 తా॥ అమ్మా! మీ అనుగ్రహములేకున్న మేమెచటకు పోగలము. నీ దయ వచ్చువఱకు నిన్నాశ్రయించి యుందుము-నీ వాకిటపడి యుందుము - మమ్మనుగ్రహింపు మందము.

24 తా॥ ఇట్లనుకొనియెడు దేవవాక్యముల విన్న త్రిమూర్తులాగ్రహపరులై ఆమె పతివ్రతయైన మాత్రమున దేవతలకుకూడ నింతటి భయమా?

25 తా॥ సరే! ముప్వురము ఆమె వ్రతాత్వభంగముచేసి యమాలయమైన చేరు దము - లేక తరువాత గృహముల క్రమముగనైన వత్తము - ఇది సహింపరానిదనుకొనిరి.

26 తా॥ ఆ ముప్వురిట్లు ప్రతిజ్ఞనుచేసి ఆ దేవతలతిథులై - ఆమె గృహమునకు వచ్చిరి. అనగా అత్ర్యాశ్రమమునకు దేవతలు భోజకాకాంక్షులై వచ్చిరి.

27 తా॥ బ్రహ్మ విష్ణు మహేశ్వరు దేవతలట్లు వెళ్లిన తరువాత అగస్త్యుడను స్థానమునకుఁబోయెను - అంత అనసూయగారి వద్దకు భిక్షుకులవలె వెళ్ళిరి.

28 తా॥ అమ్మా! మాకు బాగుగ ఆకలి యగుచున్నది. త్వరగా అన్నమును పెట్టుమమ్మ! వీలులేదన్న లేదనిచెప్పు, మరియొకచోటికి వెళ్లెదమనిరి.

29 శ్లో॥ సదా తవాశ్రమపదే తృప్యంత్యభ్యాగతా ఇతి।
కీర్తింశ్రుత్వాఽద్య సంప్రాప్తా యథేచ్ఛసితథాకురు॥

30 శ్లో॥ ఇచ్ఛాభోజనదాత్రీ త్వ మితి శ్రుతిపథంగతమ్।
యశస్తే దూరతః ప్రాప్తం-ఇచ్ఛా భోజనకాంక్షయా॥

31 శ్లో॥ ఇతిశ్రుత్వా వచస్తేషాం అనసూయా ప్రణమ్యతాన్।
పాదౌప్రక్షాళ్య పీఠేఽషుప్రీత్యాసముపవేశ్యచ॥

32 శ్లో॥ దత్త్వార్ఘ్యాదిచ సంపూజ్య గంధపుష్పాదిభిః శుభైః।
ప్రాహాఽహ్నికం సమాప్తంచేత్ సిద్ధమన్నందదామివః॥

33 శ్లో॥ ఋషయస్తపసేయాతాః ఇతిశ్రుత్వావదంస్త్రయః।
చిరాదృషయ ఏష్యంతి శీఘ్రంనోదేహి భోజనం॥

34 శ్లో॥ ఇతిశ్రుత్వాగిరస్తేషాం ఆనయిత్వాగృహాంతరం।
ఆసనేషూపవేశ్యాసావన్నం దాతుంప్రచక్రమే॥

35 శ్లో॥ గృహఆసాద్యపాత్రాణి రంగవల్ల్యాది రంజితే।
అభిఘార్య సమారేఖే పరివేష్టుం మనస్వినీ॥

36 శ్లో॥ ఊచుస్తేఽతిథియో సాధ్వి! త్వమభీష్టప్రదాసిచేత్।
యాచ్ఞాం నః సఫలాకర్తుం అనసూయే! త్వమర్హసి॥

37 శ్లో॥ నగ్నాభూత్వాత్వమస్మభ్యమన్నం దేహీతికాంక్షితం।
నోచేన్నేతివదాశుత్వం గచ్ఛామోఽన్యత్ర సత్వరం॥

38 శ్లో॥ ఇతిశ్రుత్వాగిరస్తేషాం స్వగతంప్రాహ సాసతీ।
ఏతేకారుణికా ఏవ మహాపురుషలక్షణాః॥

29 తా॥ అమ్మా! మీ ఆశ్రమములో ఎల్లప్పుడు అతిథులు అన్నముల భుజించి పోవుదురన్న కీర్తివిని యిపుడు మేము వచ్చితిమి - మీ యిష్టము వచ్చినట్లు చేయుమని దేవతలనిరి.

30 తా॥ అభీష్టభోజనమును అతిథులకు మీరు పెట్టుదురని లోకశ్రవణగోచరమయ్యెను. ఈలాంటి కీర్తి మీకున్నందున దూరమునుండి మేము వచ్చితిమి.

31 తా॥ అ వచ్చిన బ్రహ్మ విష్ణు మహేశ్వరరూపులగు సురల వాక్యమును విని ఆ అనసూయ - వారికి నమస్కరించి కాళ్లుగడిగి - పీటలపై కూర్చుండ నియమించెను.

32 తా॥ వారికి అర్ఘ్యము -గంధపుష్పాక్షతలిచ్చి పూజించి - ఇట్లనెను: అయ్యా, మాధ్యాహ్నిక (జప) మయినచో అన్నము సిద్ధమైనది- పెట్టుదుననెను.

33 తా॥ ఋషులందరు అత్రియు తపస్సునకు వెళ్లిరి. ఇది సమయమని ఆ ముప్వురు- ఋషీశ్వరులు వచ్చులోపల - మాకు భోజనము పెట్టుమమ్మా అని యనిరి.

34 తా॥ సరే అట్లేనని వారినింటికి కొనివచ్చి - వంట యింటిలోనికి పిలిచి పీటలపై గూర్చుండఁబెట్టి - అన్నమును పెట్టుటకు మొదలుపెట్టెను.

35 తా॥ ఆ భోజనశాలలో రంగవల్లీ ముగ్గులపై పాత్రల నుంచి - పాత్రాభిఘారమును చేసి - ఇక వడ్డనకారంభించెను.

36 తా॥ అప్పుడా అతిథులు - అమ్మా! నీవభీష్టాన్న మిచ్చుదానవట - మేము యాచించుదానిని కాదనక పెట్టగలదానవు నీవేగదమ్మ అనిరి.

37 తా॥ అమ్మా! నీవు వస్త్రహీనవై మాకన్నమునుబెట్ట కోరిక గలదు. అట్లు పెట్టదలచిన పెట్టుము - లేదని త్వరగ చెప్పిన వెళ్లిపోదుమనిరి.

38 తా॥ ఇట్లనుటతో ననసూయ తనలో నిట్లనుకొనెను: వీరు మహా దయగలవారు - మహాపురుషులవలెనున్నారనుకొనెను.

39 శ్లో॥ విముఖాశ్చే దతిథయో యద్గృహాత్త ద్గృహం వనం।
ఉల్లంఘ్యతే చేద్వచనం యాస్యంతి విముఖా ఇమే॥

40 శ్లో॥ నిర్మలం మానసం మేఽస్తికిం స్యాత్కామ ఖలేనమే।
షత్యుస్త పో వలం భూయస్తన్మే భవతి తారకమ్॥

41 శ్లో॥ ఏవం విచార్య మనసి సాఽనసూయా పతివ్రతా।
భోజనం వస్తధాదాస్యే భోక్తవ్యం స్వస్థమానసైః॥

42 శ్లో॥ ఇత్యుక్త్వా పాకసదనం గత్వాధ్యాత్వాపదం మునేః।
బాలా ఏతే మమేత్యేవం విచింత్య వసనంజహౌ।

43 శ్లో॥ నగ్నాసతీ సమాదాయ యావదన్నందదాతిసా।
తావత్తే బాలకాజాతాః ప్రభవోఽపియశస్కరాః॥

44 శ్లో॥ త్రీన్ బాలకాన్ సమాలోక్య కించిద్భీతాసతీ సుధీః।
ఆగత్యతాన్ సమాశ్వాస్య సంప్రాప్తా పరమాం ముదం॥

45 శ్లో॥ రుదతస్త్రీ నపిసుతాన్ సమాశ్వాస్య పునః పునః।
క్షుధితాన్ వీక్ష్య చకితా యావత్తావత్పయోఽస్రవత్॥

46 శ్లో॥ ఏకమేకం సమాదాయ పాయ యిత్వాపయోముదా।
క్షుధితాంస్తర్పయామాస నాలంయత్తృప్తయే సఖాః॥

47 శ్లో॥ అహోభాగ్యమహోభాగ్యమత్రి పత్న్యాః త్రిమూర్తయః।
యద్దుగ్ధపానతస్తృప్తా ఇదం సాధ్వీతపఃఫలం॥

48 శ్లో॥ తిష్ఠంతి జఠరేయస్య భువనాని చతుర్దశ।
సవిష్ణుః తత్పయః పానాత్తృప్తోఽభూత్కింబ్రువేఽధికమ్॥

39 తా॥ నేను వీరి మాటకు వైముఖ్యమును సూచించిన నా గృహమునుండి వెళ్ళగలరు. భోజనమునకు సిద్ధముగా గూర్చున్న అతిథులు వెళ్ళిన అరిష్టమగును.

40 తా॥ నాది నిర్మలమనసైన - ఆ దుష్టుడు మన్మధుడేమి చేయును? అన్నిటికి నా భర్త తపముచాలు - అదియే ఇపుడు నాకు తారకమగును.

41 తా॥ ఇట్లు మనసున విచారించి దృఢ దీక్షతో - అయ్యా! మీరు కోరిన తీరున మీకు భోజనమిడుదును. స్వస్థముగ భోజనము చేయుడనెను.

42 తా॥ ఇట్లని వంటయింటిలోనికి వెళ్ళి - భర్తృపాదములను మనసులో ధ్యానించి, వీండ్లు నా బిడ్డలు - ఈ పసివారిని గూర్చి విచారింపనేల అని వస్త్రమును విడిచివేసెను.

43 తా॥ వివస్త్రయై అన్నముగొనివచ్చి అనసూయ వడ్డించుచుండగా ఆమె కీర్తియినుమడింపగా వారు పిల్లలై పీటలపై పొర్లుచు నేడ్చుచుండిరి.

44 తా॥ ఆ ముగ్గురు పిల్లలఁజూచి మొదట కొంచము భయముగలదై - తరువాత విజ్ఞురాలగుట వారివద్దకు వచ్చి వారిని ఓదార్చి చాల సంతోషముతో నుపలాలనఁ జేయుచుండెను.

45 తా॥ ఏడ్చుచున్న నా ముగ్గురనోదార్చి - ఆక లనుచున్న ఆ పసిపిల్లలకు వివస్త్ర అయ్యే తను చనుబాలనిచ్చి యేడ్పునాపించెను.

46 తా॥ ఒక్కొక్కనిని దగ్గరకు తీసికొని పాలిచ్చి ఓదార్చిన వెంటనే - క్షుద్బాధనణగియుండిరి. వారు మహనీయులని ఆమె గ్రహించెను.

47 తా॥ ఏమి నా భాగ్యము - నిజముగ త్రిమూర్తులు - నా పయఃపానముచే తృప్తిని చేయగల భాగ్యము నా దని ఆయమ తృప్తిపడెను.

48 తా॥ పదునాల్గు భువనము లేవిష్ణువుబొజ్జలో నుండెనో ఆయన నా స్తన్యము ద్రావి తృప్తుడయ్యెను. నా భాగ్య మేమనుకొందును?

49 శ్లో॥ చతుర్ముఖః సృష్టికర్మశ్రాంతోన క్తం దివం విధిః।
సనతీ స్తన్యపానేన బ్రహ్మా తృప్తింగతో ధ్రువమ్॥

50 శ్లో॥ కర్పూరగౌరోఫాలాక్షోరుద్రః పంచముఖో ఽపియః।
కాలాగ్ని సదృశః సోఽపి తృప్తః సాధ్వీరసగ్రహాత్॥

51 శ్లో॥ తపోబలమిదం త్వత్రేః సమా నా న్యానసూయయా।
యాత్రిమూర్తిప్రసూర్జాతా ఖ్యాతా యా భువనత్రయే॥

52 శ్లో॥ ఉత్థాప్యబాలకాన్ప్రీత్యా లాలయామాస సా సతీ।
శా యయిత్వాఽథ పర్యంకే సుస్వనం మధురంజగౌ॥

53 శ్లో॥ సానర్వోపనిత్సార భూతైర్గీతై స్సురంజితైః ।
సప్తస్వరైశ్చ సహితం సుస్వరం తద్యశోజగౌ ॥

54 శ్లో॥ అత్రాంతరేఽత్రిర్భగవాన్మధ్యాహ్నే స తపోవనాత్।
సమాప్య నైత్యకంకర్మ నిజాశ్రమముపాగతః॥

55 శ్లో॥ ఆకర్ణ్యసోఽనసూయాయాగీత శబ్దం మనోహరమ్।
బాలకాశ్వాసనం చాపిప్రియాం పప్రచ్ఛసాదరమ్॥

56 శ్లో॥ ఆదితః కథితం సర్వంతయా సోఽపి తదాముదా।
ఖ్యాత్వాతపః ప్రభావేణ జ్ఞాత్వానత్వాననామ తాన్॥

57 శ్లో॥ నమంత మత్రిమాలోచ్య గాయంతీం సుదతీం సతీం।
విజ్ఞాయచతయోర్భావం ప్రసన్నా అభవం స్త్రయః॥

58 శ్లో॥ పాలకే బాలరూపేణస్థితా అపిచతే త్రయః।
ప్రాదుర్భూయ స్వరూపేణ సాధుసాధ్వితితే జగుః॥

49 తా॥ ఎప్పుడు విశ్రాంతిలేని సృష్టికర్త బ్రహ్మయు తృప్తిగా నా దుగ్ధ పానముతో తృప్తుడయ్యెను. నాకు కావలసిన దేమని ఆమె తృప్తి పడెను.

50 తా॥ తెల్లని దేహము - ఫాలాక్షము - పంచాస్యముగల కాలాగ్ని రుద్రుని వంటి శివుడు నాపయఃపానదృప్తుడయ్యెనన నా భాగ్యమెట్టిదో కదా?

51 తా॥ నా ప్రాతివ్రత్యము - నా భర్త తపఃఫలమునకు తోడైనది. యేయమ్మ త్రిమూర్తి జనకురాలయ్యెనో ఆమె జన్మ ప్రసిద్ధమయ్యెను

52 తా॥ ఆ పిల్లలను అన్నము తిన్న తదుపరి తొడపై పరుండబెట్టుకొని మధురమధురముగా జోల పాడుచుండెను.

53 తా॥ ఆమె యుపనిషత్సారమును సప్తస్వరములతో చెవులకింపుగా పాడుచు జోకొట్టుచుండెను.

54 తా॥ ఇంతలో నామెభర్త మాధ్యాహ్నికక్రియలఁ దీర్చుకొని సుస్వరముగా పాడుచున్న తన భార్య కంఠధ్వనిని వినెను-నిజాశ్రమమును చేరెను.

55 తా ఆ అనసూయ గీతమును విని - పిల్లల జోలపాటల నాకర్ణించి ఆమెనడిగెను:

56 తా॥ ఆమెవలన న్రతి అంతయు నామూలాగ్రముగ విని-తపః ప్రభావమును విని తెలిసికొని - ఆ వచ్చినవారలను త్రిమూర్తులనుకొని నమస్కరించెను.

57 తా॥ అత్రియు అనసూయాదేవి మనసును విచారించి ఆమెయనుకొన్నరీతిని ఆ త్రిమూర్తులకు నమస్కరించి మాతృత ననుకొనెను.

58 తా॥ లోకరక్షకులు బాలల రూపముననున్నందున ఆ ముప్వురును మన యింట పిల్లలరూపేణ ఉదయించుట మంచిదనుకొనిరి.

59 శ్లో॥ తుష్టాఃస్మోయువయోర్భక్త్యా దాస్యామోవాంఛితంద్రుతమ్।
ఉవాచాత్రిః సతీమేభ్యోవరంవరయ కాంక్షితమ్॥

60 శ్లో॥ ప్రాహానసూయా ప్రాణేశం భవద్భావ ప్రభావతః।
ప్రాప్తా ఏతే సుతానేభ్యో వృణుత్వ మధునే దృశాన్॥

61 శ్లో॥ ఇతి సతీవచనం మతిరంజనం మునివరోఽభ్యుపగమ్య సుపావనమ్।
అథ తథేతిసవప్ర ఇమేఽమరాః సురవరా అభవన్వరదాః పరాః॥

62 శ్లో॥ మునీశ్వర యథేచ్ఛాతే తథాభవతుతేగృహే।
అస్మదంశభవాబాలాః స్థితా యా స్యామహే వయం॥

63 శ్లో॥ ఇత్యుక్త్వాతేయయు స్వం స్వం ధామ యేఽభిన్న విగ్రహాః॥
బాలాభూత్వాఽథతేఽత్రాపి సంస్థితా అత్రివేశ్మని॥

64 శ్లో॥ తాన్పుపోషానసూయాఽపి బ్రహ్మవిష్ణుమహేశ్వరాన్।
శ్రీదత్తచంద్రదుర్వాసః సంజ్ఞితాఀలోకపూజితాన్॥

65 శ్లో॥ దుర్వాసాశ్చంద్రమాశ్చైవ సంస్కృతౌమాతరంముదా।
ప్రార్థయామాసతుర్గంతుం కృతప్రజ్ఞామహామతీ॥

66 శ్లో॥ దుర్వాసా ఆహజనని తప స్తప్తుంసుపావని।
గచ్ఛామి దేహ్యనుజ్ఞాంమే తీర్థ దర్శనకాంక్షిణే॥

67 శ్లో॥ చంద్రోఽవదదహో మాతర్యాస్యేఽహంచంద్రమండలం।
నిత్యంతే దర్శనం మేఽస్తు దేహ్యనుజ్ఞాంహిమాభిదః॥

59 తా॥ అమ్మా! మీ యిద్దరు దంపతుల తపఃప్రభావము గొప్పది. మీ కోరిక ప్రకారము మేమిచటఁ బుట్టెదము - అనుచు పల్కుచు వరమును కోరుకొమ్మనిరి.

60 తా॥ అపు డనసూయ భర్తతో నిట్లనెను - స్వామీ! మీ తపఃప్రభావమున వారు మన యింట బాలురైరి - కనుక తాము పుత్రులుగా బుట్టుమని వారలకోరుడనెను.

61 తా॥ సరియే! ఇది మంచిదనుకొని దేవతలందర సమక్షమున వారిని పుత్రులుకండనివేడెనత్రి - దేవతలు తథాస్తనిరి.

62 తా॥ ఓయీ! నీ విష్టమువచ్చినట్లడుగుము. మా స్వకార్యకరణాయత్తుల మైనను మా అంశ సంభూతులు మీ యింట బాలులై యుందురనిరి.

63 తా॥ అంత నా దేవతలు త్రిమూర్తులతో స్వర్గమున కేగిరి - త్రిమూర్తులు త్రిమూర్తులుగా నత్రియింట అనసూయ బాలురైరి.

64 తా॥ అనసూయయు నాముప్వురు పిల్లల పోషించుచుండెను. అందు - శ్రీదత్తు - చంద్రుడు - దుర్వాసుడను పుత్ర త్రయమును బెరుగు చుండిరి.

65 తా॥ అందు చంద్రుడు దుర్వాసుడిద్దరు సంతోషమున సంస్కృతులైరి. ఆ యిరువురు - కృతప్రజ్ఞులు మహామతులగుట - తామింటి నుండి వెళ్ళుటకు తల్లిని ప్రార్థించిరి.

66 తా॥ దుర్వాసుడు తల్లితో -అమ్మా! నేను తపముఁజేయబోదుననెను - నేను తీర్థక్షేత్రములఁ జూడబోదును - నాకు గృహము నుండి వెళ్ళనను జ్ఞ నీయుమనెను.

67 తా॥ అమ్మా! నేను చంద్రమండలమునకు వెళ్ళుదును - నీ దర్శనమును నిత్యము చేసికొందును - నేను చంద్రమండలమునకు బోవుటకు అనుజ్ఞ నిమ్ము.

68 శ్లో॥ శ్రీదత్తోఽయంత్రి మూర్త్యాత్మా సదా యుష్మత్సమీపగః।
తిష్ఠత్యేవ న సందేహో నాన్యధా మే వచః సతి!॥

69 శ్లో॥ శ్రీదత్తోభగవాన్విష్ణుః సర్వం విష్ణుమయంజగత్।
నానేనతే వియోగోఽస్తు తవ చిత్తానుసారిణా॥

70 శ్లో॥ ఏవముక్త్వాతదాజ్ఞప్తౌ జగ్మతుఃభువి పర్యటన్।
దుర్వాసాః ప్రాపచంద్రస్య మండలం యోఽబ్ధిజః పునః॥

71 శ్లో॥ అనసూయా గృహేతస్థౌ శ్రీదత్తస్త్రి గుణాత్మకః।
గురోః పరస్పరాయాస్తు మూలపీఠ మిదంపరం॥

72 శ్లో॥ సిద్ధేనకథితా నామధారకాయ త్వియంకథా।
అథతుష్టః పునః ప్రీత్యానతం పప్రచ్ఛసాదరం॥

73 శ్లో॥ సిద్ధయోగేశ్వరజయ జయభక్తమనోహర।
జ్ఞానమూర్తే కృపాసింధో! సాధో! సంసారతారక॥

74 శ్లో॥ తవప్రసాదాత్ జ్ఞాతేయ మనసూయాసతీ కథా।
త్వంతారకోయోగిరాజః ప్రార్థనాంమేఽవ ధారయ॥

75 శ్లో॥ దత్తాత్రేయావతారోఽయం కథితోవిస్తరేణమే।
అపరోప్యవతారోఽన్యకధంజాతో మహీతలే॥

76 శ్లో॥ విస్తరేణవద స్వామిన్ కృపాంకృత్వా మమోపరి।
త్రిమూర్తేరవతారస్యలీలాకస్మా అలం భవేత్॥

77 శ్లో॥ ఏవం పృష్టం ప్రాహశిష్యాయసిద్ధః
శుద్ధః ప్రీత్యా యాం కథాంతాం ప్రబుద్ధ్వా।
వక్ష్యత్యగ్రేసాధుగంగాధరాఖ్యవిప్రా
పత్యం యస్సరస్వత్యభిఖ్యమ్॥

68 తా॥ త్రిమూర్త్యాత్మకుడగు శ్రీదత్తు నీవద్ద నెపుడు నుండగలడు - ఇది సందేహము లేనిదని - చంద్రుడును ప్రార్థించి చెప్పెను.

69 తా॥ అమ్మా! ఈ దత్తు - అను నీ పుత్రుడు - కేవల విష్ణుమూర్తి. ఈ జగమంతయు విష్ణు శబ్దార్థమే కద? ఈ దత్తునితో నీకు ఎడబాటుండదు. నీ చిత్తమునకు అనుకూలముగ నుండునని - చంద్ర దుర్వాసులు చెప్పిరి.

70 తా॥ ఇట్లు పలికి వారిరువురు తల్లి యాజ్ఞగొని - తీర్థయాత్రా పర్యటనకు దుర్వాసుడు, స్వీయ మండలమునకు చంద్రుడును వెళ్ళిపోయిరి

71 తా॥ అనసూయయు - విశ్వమునకు మూలభూత విష్ణువు ననసూయా గృహమందుండిరి. గురువుగారి మూలపీఠమిది. పరమగమ్యమిది.

72 తా॥ సిద్ధు డీ విధముగా చెప్పగా నామధారకుడు - గురుపీఠావతరణ కథను చెప్పగా సంతోషించి మరల నామధారకుడు సిద్ధు నిట్లడిగెను:

73 తా॥ ఓయీ! సిద్ధయోగీ! నీవు భక్తులకు మనోహరుడవు - కృపాసింధువైన శ్రీదత్త గురుచరిత్రమును మంచిగా చెప్పితివి.

74 తా॥ ఓయీ! నీ యనుగ్రహముచే అనసూయా మాతృమూర్తి సతీత్వము శ్రీదత్త గురుచరిత్రమును సావధానముగ వింటిని.

75 తా॥ ఈ మహానుభావుడు దత్తాత్రేయు లెవరు? వీరి తరువాతవారి అవతారమేమి - దానిని సవిస్తరముగాఁ చెప్పుము.

76 తా॥ స్వామీ! నాయందు దయయుంచి ఆ దత్తకథను సవిస్తారముగా చెప్పుము. త్రిమూర్త్యవతారుడైన ఆ లీలామూర్తి చరిత్ర ఇఁక చాలునని యెవడనగలడు?

77 తా॥ సిద్ధయోగి గురుదత్త కథా శ్రవణమునకు తత్తరపడుచున్న నామధారకునికి తెలియునట్లు - ఆ దత్త కథను చెప్పెను. ఇకముందు కథను శ్రీ సరస్వతీ (గంగాధరుని) సూనుడగు వాసుదేవానంద సరస్వతి శ్రీగురు చరిత్రను వినిపింప గలడు.

గద్య॥ ఇతి శ్రీ సిద్ధ నామధారక సంవాద రూపేణ సరస్వతీత్యాఖ్య గంగాధ రాత్మజ విరచిత నరసింహ సరస్వత్యుపాఖ్యాన సంజ్ఞిత మహారాష్ట్ర భాషాన్విత శ్రీ దత్తగురుసంహితాయాం జ్ఞానకాండే చతుర్థోఽధ్యాయః।

ఆదిత శ్లోకాః - 575.

ఇతి చతుర్థోఽధ్యాయః సమాప్తః.

శ్లో॥ తుర్యేత్రీశాః సత్యహృత్త్యైయథాన్నం
స్నేహంతేఽదద్యాఽనసూయాతథాఽన్నం।
బాలా భూత్వా దుగ్ధమస్యాపపుస్తే యత్
కీర్తిర్దిక్వాలీ సర్వదాఽస్తే
చతుర్థోఽధ్యాయసారసంగ్రహ శ్లోకోఽయం॥

గద్య = తా॥ ఇది సిద్ధ నామధారక సంవాద రూపమైన శ్రీ నరసింహ సరస్వతీ సంజ్ఞతోనున్న దత్త కథను మహారాష్ట్ర భాషయందున్న దానికి సమానార్థకముగ సంస్కృత శ్లోకములతో వ్రాసినది - శ్రీ వాసుదేవానంద సరస్వతి - వారి రచనయైన యీ గ్రంథమున 4 వ అధ్యాయం సమాప్తం. మొదటి నుండి శ్లోకములు 575.

ఈ నాల్గవ అధ్యాయం సమాప్తము

అధ్యాయసార సంగ్రహ శ్లోకార్థము:

తా॥ ఈ నాల్గవ అధ్యాయమున - భగవత్స్వరూపులు ముగ్గురు అన్నము యాచించి అనసూయా తల్లిచే పిల్లలై ఆమె చనుబాలతో - భోజనములతో తృప్తిచెంది - ఆమెకు ఆమె భర్త అత్రికి కీర్తి ప్రతిష్ఠలఁ జేకూర్చినది - ఈ అధ్యాయ మింతటితో సమాప్తము.

శ్రీ గణేశాయ నమః - శ్రీ దత్తాత్రేయాయ నమః

# శ్రీ గురుదత్త చరితే

## పంచమోఽధ్యాయః - జ్ఞానకాండః

1 శ్లో॥ నామధారకభక్తాయ సిద్ధః ప్రాహపరేశ్వరః।
నృరూపేణ స్వభక్తానాం తారణార్థ మవాతరత్॥

2 శ్లో॥ నామ ధారకశ్రుణ్వేష నానారూపధరోఽభవత్।
అంబరీషస్య రక్షార్థ మవతారాం ద శాదధౌ॥

3 శ్లో॥ మత్స్యఃకూర్మో వరాహశ్చ నారసింహ శ్శరీరధృత్।
యాచకోవామనాంగేన విప్రోఽపిక్షత్రియాంతకృత్॥

4 శ్లో॥ పుత్రో దశరథస్యాసీత్ శ్రీరామో రాజభూషణః।
రాజాభూత్వాప్యధ రక్షత్ గోష్ఠేగోపగృహేఽపిసః॥

5 శ్లో॥ విహాయవసనం నగ్నోజాతోయో యుద్ధధర్మకృత్।
యుగాంతే భవితాకల్కి మ్లేచ్ఛనాశోఽశ్వవాహనః।

6 శ్లో॥ ఏవం నానావేషధారీ హృషీకేశోఽవతీర్యసః।
సదాసాధు జనాన్ పాతిహంతి దుష్టాన్యుగే యుగే॥

7 శ్లో॥ ద్వాపరాంతేకలౌ వ్యాప్తే విప్రా అజ్ఞానవేష్టితాః।
జాతా దురాచారరతాః కలిదోషేణ దూషితాః॥

8 శ్లో॥ భూతలేభక్త రక్షార్థం గురునాథోఽప్యవాతరత్।
గంగాంయథాఽఽనయద్భూమిం పిత్రుద్ధత్యై భగీరథః।

1 తా॥ భక్తానుగ్రహము కోరి జన్మించిన సిద్ధయోగి - నామధారకుని గూర్చి ఇట్లనెను: భక్తులను తరింపజేయ బుట్టినవాడు సిద్ధయోగి.

2 తా॥ ఓయీ నామధారక! చూచితివా? భగవంతునకు భక్తులపై యెంతటి ప్రేమయో కదా? - అంబరీషుని కాపాడుటకు - భగవంతుడు నానా రూపములతో పది అవతారములఁ దాల్చెను.

3 తా॥ 1 మత్స్య 2 కూర్మ 3 వరాహ 4 నారసింహ 5 వామనుడు 6 పరశురాముడు 7 శ్రీరాముడు 8 బలరాముడు 9 బౌద్ధ 10 కల్కి రూపధారకుడయ్యెను.

4 తా॥ దశరథునకు పుత్రుడై రాముడను పేరను - గోపకులోద్ధరణమునకై గోష్ఠములో బుట్టి - బలరాముడుగ నుండెను. క్షత్రియాంతకుడుగ పరశురాముడయ్యెను.

5 తా॥ బుద్ధభగవానుడుగ అరణ్యవాసమును - మ్లేచ్ఛ నాశకంగా కల్కి రూపధారియునై నవా డాయెను.

6 తా॥ ఆ హృషీకేశుడు ఎపుడును తీరికలేక దుష్టశిక్షణ - శిష్టపాలనయం దేమరక జాగరూకతగ నుండును.

7 తా॥ ద్వాపర యుగాంతమున కలియుగము ప్రవేశించి - దురాచారము - దురన్యాయము మొదలగు దుష్టాచారములతో విప్రులు కలిదోషావిష్టులైరి.

8 తా॥ గంగానదిని భగీరథుడు తెచ్చినట్లు - దుష్టదోషమైన కలిలోని దుర్మార్గుల శిక్షించడానికి - భూతలమందు భగవంతుడు తాను పుట్టుదు ననెను.

9 శ్లో॥ తథా విప్రస్త్రియాదత్త ఆనీతోభక్తి యోగతః।
సతస్యాస్తనయోజజ్ఞే శ్రుణుష్వాశ్చర్యము త్తమమ్॥

10 శ్లో॥ పీఠాపురే పూర్వదేశేకులీనో బ్రాహ్మణోఽభవత్।
స ఆపస్తంబశాఖీయో రాజానామ స్వకర్మకృత్॥

11 శ్లో॥ తద్భార్యా సుమతిర్నామ సదాచారా పతివ్రతా।
అభ్యాగతాతిథీ న్నిత్యం సత్వ వృత్త్యార్చతిస్మ యా॥

12 శ్లో॥ సచ్ఛీలగుణసంపన్నా పతిసేవాపరాయణా।
కాలం నయతి సానిత్యం ముదాఽతిథ్యర్చనాదినా॥

13 శ్లో॥ ఏవం సత్యేకదాదత్తస్తద్వేశ్మాతిథిమాపధృత్।
సమాగాత్తద్దినేదర్శశ్రాద్ధమాసీ త్పితృప్రియమ్॥

14 శ్లో॥ పిత్రృవిప్రాశనా త్పూర్వం తస్మైభిక్షాం దదౌ సతీ।
భక్తిప్రియః ప్రసన్నోఽభూద్దత్తాత్రేయస్తదావిభుః॥

15 శ్లో॥ స్వరూపం దర్శయామాసతారకం త్రిగుణాత్మకం।
పతివ్రతా నతా భూత్వాభక్త్యాతచ్చరణేఽగ్రహీత్॥

16 శ్లో॥ దత్తాత్రేయోఽవదత్సాధ్వీం వరం వరయ సువ్రతే।
యద్యదిష్టతమం తత్తుభ్యం దాస్యామి సత్వరం॥

17 శ్లో॥ ఆకర్ణ్యవచనంతస్య విప్రపత్నీప్రణమ్య తమ్।
వినయావనతా భూత్వా తుష్టావజగదీశ్వరమ్॥

18 శ్లో॥ జగన్నాథ! జయానంత విశ్వకర్తాఽసితారకః।
యదిమే త్వం ప్రసన్నోఽసి మమకామాకణ ప్రపూరయ॥

9 తా॥ అటులే విప్రస్త్రీకి సంతానము లేక తనను యాచిస్తే, శ్రీదత్త స్వామి రక్షించుచు పాపములఁ దొలగించి కాపాడుచుండెను.

10 తా॥ పూర్వము - పిఠాపురములో-ఒక బ్రాహ్మణుడాపస్తంబీయుడుండెను వారింటిలో రాజా అను పేరుతో అయన స్మధర్మరతుండగు విప్రుడుండెను.

11 తా॥ ఆయన భార్య సుమతి. అ నాతి కష్టములు పడుచూ గూడ - తను సదాచార - సద్గుణములతో నతిథి పూజ చేయుచుండెను.

12 తా॥ ఆమె మంచిశీలము గలది - పతిసేవా పరాయణురాలు - ప్రత్యహం అతిథి పూజగావించి భర్తసేవారతి ప్రీతిగా కాలము గడుపుచుండెను.

13 తా॥ ఇట్లుండ నొకనాడు దత్తుడు (అనసూయా పుత్రరూపుడు) ఆమె యింటికతిథిగా వచ్చెను. ఆ రోజు ఆ యింట పితృప్రీతికరమైన శ్రాద్ధముండెను.

14 తా॥ శ్రాద్ధారాహూతులగు బ్రాహ్మణులకు భోజనమీయకయే ఆ అమ్మ శ్రీ దత్తాత్రేయ యతిగారికి భిక్ష నిడెను. భక్తసులభుడగు దత్తుడు ఆ యింటివారిపై దయగలిగెను.

15 తా॥ ఆ దయాకారణముగ నా యింటియామెకు తన స్వరూప దర్శనమిచ్చెను. అంత నా ప్రతివ్రతయైన యామె నమ్రురాలై భక్తితో నా నిజస్వరూపముగల దత్తదేవుని చరణములను గ్రహించెను.

16 తా॥ వెంటనే శరణన్న ఆమెతో - దయతో - అమ్మా! నీకు వరమిత్తును. అడుగుమనెను. అమ్మా! నీకిష్టమైనదే యిత్తును; కోరుకొమ్మనెను.

17 తా॥ ఆ మాటలకామె సంతోషించి - ఆ విప్రుని భార్య - విశ్వకర్తయగు జగదీశ్వరునిగ తలచి స్తోత్రించెను.

18 తా॥ స్వామీ జగన్నాథ! నీవు ప్రపంచతారకుడవని గ్రహించితిని. నీ దయ యీ పేదరాలిపై వచ్చినచో నాయీ కోరికల దీర్పవేడెదను.

19 శ్లో॥ త్వం కృపాలుః సర్వగతః పురాణాదిషు విశ్రుతః।
తవకోవర్ణయేత్కీర్తిం దయాబ్ధే భక్తవత్సల॥

20 శ్లో॥ మిథ్యావాక్యం నతేదేవ త్వం ధ్రువా యాచలం పదం।
విభీషణా యాచంద్రార్కరాజ్యం దత్తంఋుతం చ తత్॥

21 శ్లో॥ భక్తాధారః స్వభక్తార్థం భూమావవతరిష్యసి।
భో చతుర్దశలోకేషువ్యాప్తాస్తే బిరుదాలయః॥

22 శ్లో॥ నాన్యధాతేవచో భూమన్దేవరాజకృపానిధే।
దిత్సేచేత్వంపరం మహ్యం వాసనావనదాహక!॥

23 శ్లో॥ నారాయణా! నాథనాథ! యామేమనసివాసనా।
తాం పూరయధృతౌపాదౌ జగజ్జీవన తే మయా॥

24 శ్లో॥ ఇత్థమత్రితనయోఽస్య కారణం భాషణం సకరుణం నిశమ్య సః।
తత్కరంసమవలంబ్యతాంతదా బ్రూహిమాతరితి చాబ్రవీన్ముదా॥

25 శ్లో॥ సా సతీసమధార్యత ద్వచఃస్వామినం ప్రతి జగాద సద్వచః।
మాత రిత్యుదిత మీశతేఽత్ర సం బుద్ధిసిద్ధి రథునాఽస్తుమయ్య సౌ॥

26 శ్లో॥ పుత్రామే బహవోజాతాస్తే మృతాఃద్వౌతు జీవితౌ।
అపితౌ పాదనయన రహితౌ కష్టజీవితౌ॥

27 శ్లో॥ పుత్రోయోగ్యోనమేజాతో మూర్ఖైః కిం కార్యమార్తిదైః।
సత్పుత్రేణ వినాజన్మ నిష్ఫలం ప్రతిభాతి మే॥

19 తా॥ స్వామీ! నీవు దయాళువుడవు. పురాణముల వలన నిన్ననన్నిట నుండువానిగఁ దెలిసికొంటిని. కాని, భక్తరక్షణలో నీ మహిమను తెలిసికొనుట మా తరముగాదు.

20 తా॥ స్వామీ!నీవుమిథ్యావాక్యములాడువాడవు కావని నేనెరుగుదును. అట్లైన నీకు ధ్రువుడు - విభీషణులిచ్చిన కానుకలేవి? వారికి ఉన్నత పదవిని, లంకా రాజ్యమును వరుసగ వెంటనే యీయలేదా?

21 తా॥ స్వామీ! నీవు భూమి నవతరించుట నీ భక్తులను కాపాడనేగద? 14 లోకములను నీ బొజ్జలో దాచిన నీవు మాయామోహితుల మమ్ము నుద్ధరించు బిరుదములతో నుంటివి.

22 తా॥ లేకున్న స్వామీ! నీ దయయే కానిచో భవవాసనావాసితయైన యీ యజ్ఞానురాలికి వరమిత్తుననుట - దయానిధివగుటచేతనేగద?

23 తా॥ స్వామీ! నీ పాదములంటి వేడుచున్నాను. ఈ లోకమున ఆడుదానికి కావలసినది పుత్ర సంతాన కాంక్ష యన్నది. అందుచే నీవు నాకు వరమిమ్ము.

24 తా॥ అత్రి తనయుడగు దత్తుడు - కరుణ గల్గించెడి ఆ యమ మాటలకు భయపడి - ఆమె చేతిని స్పృశించి అమ్మా, వినుమని పల్కెను.

25 తా॥ అమ్మా! నీవు కోరినట్లు కోరికఫలించుననగా - ఆయమ తన భర్తతో స్వామి యిచ్చిన వరమును జెప్పెను - అందునను ఆ యోగి అమ్మా అనుటలో అయనయే ఆమె పుత్రుడుగా పుట్టునన్నట్లు సూచించినది.

26 తా॥ అయ్యా! నాకనేక మంది పుంత్రులుద్భవించిరి - కాని, వారు చచ్చి పోయినారు - ఒక రిద్దరు బ్రతికిరి కాని - వారు కాళ్ళు నయనములు లేనివారైరి.

27 తా॥ నాకు పుత్రులు యోగ్యులు లేరు - మూర్ఖులు - నాకు - పీడ గల్గించు వారివలన ప్రయోజనమేమి?- యోగ్యుడైన పురుషుడు లేని సంతతి వలన లాభములేదు - అట్టి జన్మ నిష్ఫలము గద?

28 శ్లో॥ ఆయుష్మాన్ జ్ఞానవాంచ్ఛ్రీమాన్ జగద్వంద్యోభవేద్యది।
భవాదృశ సు పుత్రోమే సాఫల్యం తర్హి జన్మనః॥

29 శ్లో॥ ఇతి తస్యావచః శ్రుత్వాప్రసన్నో భగవాన్ ప్రభుః।
సజ్జనాన్‌దీక్ష యోద్ధర్తు మిదం మే వాన్వమోదత॥

30 శ్లో॥ శ్రీదత్తః ప్రాహతేపుత్రో భవితామాదృశోఽనఘే।
కులముద్ధృత్యయువయోః కతా విఖ్యాతిమేష్యతి॥

31 శ్లో॥ పాలనీయం హి తద్వాక్యం స్థాస్యసీతరథా న సః।
జ్ఞానమార్గప్రదోదైన్యపాపతాపాన్‌హరిష్యతి॥

32 శ్లో॥ ఇత్యుక్త్వాంతర్దధే తస్యాఃపశ్యంత్యా భగవా న్విభుః।
విస్మితా సాఽపితంచిత్తేస్మృత్వాస్మృత్వా పునఃపునః॥

33 శ్లో॥ సాశ్చర్యాగృహమాగత్య యథా వృత్తం పతింప్రతి।
ఉవాచ సోఽపిహృష్టస్సదత్తోఽయమితితాంజగౌ॥

34 శ్లో॥ మధ్యాహ్నేఽతిథివేలాయాం దత్తో యాతి ద్విజాలయమ్।
విముఖీమాభవ తదా దేహ్యన్నం బహురూపిణే॥

35 శ్లో॥ మాహురం కరవీరం చ పాంచాలేశ్వర మీశితుః।
దేవస్యవసతిస్థానం సదా సర్వాత్మనోఽనఘే॥

36 శ్లో॥ దత్తోభిక్షుకరూపేణ నానారూప ధరోఽన్వహం।
అటత్యస్మై త్వయాదేయాభిక్షా మాపృచ్ఛ మాంప్రియే॥

37 శ్లో॥ సతీప్రాహాఽపరాధో మే క్షంతవ్యా యన్మయార్పితమ్।
శ్రద్ధాత్పూర్వం భగవతే శ్రాద్ధీయాన్నం దయస్వ మే॥

28 తా॥ అయ్యా! ఆయుష్మంతుడు - జ్ఞాని - శ్రీమంతుడు - జగద్వంద్యుడు నగు నీలాంటి కుమారుడు కల్గియుండుట నా జన్మసాఫల్యమగును.

29 తా॥ ఆమె మాటల విన్న నా యతి దయతో గూడిన మనస్సు గలవాడై సత్పురుషులనుద్ధరింపబూని ఆమెకు ఆ దానమునిచ్చుట కామోదించెను.

30 తా॥ అమ్మా! నీకు నాలాంటి పుత్రుడే కలుగును - నీ పుత్రులనిద్దరి నుద్ధరించి కలియుగ ప్రతిష్ఠావంతుడనగుదు.

31 తా॥ అమ్మా! ఆ పిల్లవాని వాక్యమును వినుము - ఆతడు జ్ఞానమార్గ ప్రదుడు - దైత్యుల పాప తాపముల బోగొట్టువాడు.

32 తా॥ ఇట్లని భగవంతు డాభిక్షువు అంతర్ధానమాయెను - ఆ వెళ్ళిన అయన చరిత్రను దలచుకొని తడవ తడవ కామె ఆశ్చర్యపడుచుండెను.

33 తా॥ ఆశ్చర్యముతో నా భిక్షువును సాగనంపి యింటికివచ్చి యథా ప్రకారము భక్తితో నుండెను. భర్తయు సంతసించి భార్యతో నిజముగ నీయన దత్తుడనియే వచించెను.

34 తా॥ మధ్యాహ్నవేళకు నీ యతి బ్రాహ్మణ గృహమునకు భిక్షమునకు వచ్చును - భక్తితో నెవరు పెట్టిన వారిపై దయ - విముఖమైన దుష్టురాలగును.

35 తా॥ ఓసీ - పూజ్యురాలా! ఈయన మాహురి లోను - కరవీరములోను - పాంచాలపురమున నుండును గల్గురు. ఇది నిశ్చయము.

36 తా॥ ఈయన దత్తాత్రేయుడు - నానారూపములను భక్తులకై ధరించును. ఈయన తిరుగుచు - భక్తుల కష్టముల గమనించి - తీర్చుటకుగా పుట్టెను.

37 తా॥ అవు డాసాధ్వి భర్తతో - అయ్యా! నే నొక అపరాధమును చేసితిని- మన యింట శ్రాద్ధమునకు పూర్వ మీయనకు అన్నమును పెట్టితిని అనెను.

38 శ్లో॥ ఇతిశ్రుత్వా వచస్తస్యాస్తుష్టోవిప్రోఽవదత్సతీ।
కృతం సాధుత్వయా తృప్తాః పితరోమే న సంశయః॥

39 శ్లో॥ పిత్రుద్దేశేన కర్మాణి కృత్వా యస్మై సమర్ప్యతే।
సాక్షాదాగత్యదత్తః సః శ్రీవిష్ణుః భైక్ష్యమాదదే॥

40 శ్లో॥ కృతార్థా పితరస్తృప్తాః స్వర్గేస్థాస్యంతి తే చిరమ్।
యత్సాక్షాద్భగవాన్దత్తస్త్రిమూర్త్యాత్మాత్వయాఽర్చితః॥

41 శ్లో॥ ధన్యా తే జననీ మాన్యావరోలబ్ధోయదీదృశః।
భవిష్యతి తథాపుత్రో నాత్రకార్యా విచారణా॥

42 శ్లో॥ ఏవం నిశ్చితచిత్తౌతౌ దంపతీ హృష్టమానసౌ।
తతః స్వల్పేనకాలేన గర్భిణీ సాఽభవత్సతీ॥

43 శ్లో॥ గతేషునవమాసేషు సాప్రసూత దినే శుభే।
స్నాత్వాఽనందభరో విప్రో జాతకర్మాదికం వ్యధాత్॥

44 శ్లో॥ దైవజ్ఞా ఏత్య తల్లగ్నం వీక్ష్యప్రాహురయంసుతః।
తపస్వీభవితా మాన్యోదీక్షాదాతా జగద్గురుః॥

45 శ్లో॥ ఇతి శ్రుత్వోచతుర్హృష్టౌ పితరౌ శ్రీగురోర్వరాత్।
ఫలం లబ్ధమిదం తీర్ణాః పితరః సర్వ ఆపయోః॥

46 శ్లో॥ సుచిహ్నాంకిత పాదత్వా ద్ద్వాదశాహేధతం సుతం।
నామ్నాచకార శ్రీపాదం త్రిమూర్తిం భక్తతారకమ్॥

47 శ్లో॥ సబాలోఽవర్ధత సమం విద్యాభిఃసద్గుణైః ధియా।
అష్టమేఽబ్దేఽకరోత్తస్యవ్రతబంధం పితా ముదా॥

38 తా॥ ఆమె మాటను విని - ఆ యింటి బ్రాహ్మణుడు - సాదు - మంచి పని చేసితివి - మన పితృ దేవతలు అందరు తరింతురు - సంశయము లేదు.

39 తా॥ పితృ దేవతల నుద్దేశించి యెవరికి మన మన్నమిత్తుమోఆ పూజ్యుడు భగవంతుడు దానిని ప్రత్యక్షముగ చేకొనిన నింతకన్న పుణ్యమే ముండును?

40 తా॥ మన పితృ దేవతలు సంతసించిరి - యీ మహానుభావుని సందర్శన మున - పితరులు సద్గతులగుదురు - ఆయన త్రిమూర్తి.

41 తా॥ ఆయన తల్లి ధన్యురాలు - ఈయనవంటి పుత్రు డుద్భవించిన అట్టి పుత్రవతి భాగ్యురాలు - ఇఁక అదియున్న విచారమేమున్నది?

42 తా॥ ఇట్లుగా భార్యాభర్తలు ఆ వచ్చి మాట్లాడి పోయిన ఆయన దత్తుడని నిశ్చయ పఱచుకొనిరి. ఇంతలో కొలది కాలమునకు ఆమె గర్భవతి యయ్యెను.

43 తా॥ తొమ్మిది నెలలు ఆమెకు నిండిన వెంటనే - ఒక శుభ దినమున ఆమె ప్రసూతియయ్యెను అది విని భర్త సంతోషస్నాతుడై - జాతకర్మాదిక మును చేసెను.

44 తా॥ జ్యోతిష్కులా బాలుని లగ్నమును - చూచి యీతడు మంచి జగదవనదక్షుడు - తపస్వి - సాక్షాజ్జగద్గురువగునని చెప్పిరి.

45 తా॥ ఇట్టి వాక్యమును విని పితరులు - శ్రీ గురు జననము వలన ధన్యుల మైతి మనుకొనిరి - ఆ పితరులు, మన మందరము తరించితి మనుకొనిరి.

46 తా॥ ఆ దంపతులకుఁ బుట్టిన పిల్లవాని పాదములలో విష్ణు పాద చిహ్నము లున్నందున శ్రీపాదుడను నామకరణ మొనర్చిరి - త్రిమూర్తియే ఆ యన.

47 తా॥ ఆ పిల్లవాడు చిన్నప్పటినుండి సద్గుణములు సదాచారములతో నుండి పెరిగెను - ఇంతలో 8వ వత్సరము వచ్చెను - తల్లిదండ్రు లుపనయనముజేయ సిద్ధులైరి.

48 శ్లో॥ బ్రహ్మచర్యావిధానేన సాంగాన్ వేదాన్ యథావిధి।
శాస్త్రాణి చాదదే శాస్త్రయోనిః శ్మాస్త్రపటుర్విదుః॥

49 శ్లో॥ పాఠశక్తిం వటోర్వీక్ష్య తథాగ్రంథార్థ ధారణామ్।
లోకావిస్మయమాపన్నాః ఆహురేషపరేశ్వరః॥

50 శ్లో॥ ఆచారం వ్యవహారం చ ప్రాయశ్చిత్తం యథా యథమ్।
వేదాంతభాష్యవాదార్థాన్ కథయామాస నిర్భయమ్॥

51 శ్లో॥ ఏవం లీలానరాకారః సర్వవిద్యాపరాయణః।
అభూత్తస్య వివాహార్థం ప్రవృత్తౌ పితరౌ ముదా॥

52 శ్లో॥ తదేత్యుకౌతుతౌ ప్రేక్ష్య నివార్య శ్రీపదోఽవదత్।
ఉద్వోఢుం మానుషీం భార్యాంమమ నోత్సహతే మనః॥

53 శ్లో॥ నిరతిర్మేమతాకాంతానాపరామమసమ్మతా।
తయా సహ వివాహోమే భవత్వితి వినిశ్చితమ్॥

54 శ్లో॥ యోగశ్రీః సుందరీనారీ వరణీయా మయా ఖలు।
తయావినాఽపరా నారీ మమ మాతృసమా మతా॥

55 శ్లో॥ తాపసోఽహం బ్రహ్మచారీ ప్రవృత్తి విముఖః సుఖః।
మనసాఽపి నకాంక్షేఽన్యాం నూనంయోగశ్రియం వినా॥

56 శ్లో॥ శ్రీవల్లభోఽస్మి శ్రీపాదః కృతార్థోఽహం హి తత్త్వవిత్।
ఉత్తరేణ పథా యాస్య ఇత్యాది జ్ఞానమాదిశత్॥

57 శ్లో॥ శ్రుత్వాపుత్రస్య వచనం స్మృత్వాఽత్రేయస్య భాషణం।
మత్వా తద్వచసో హార్దం జ్ఞాత్వాశ్రీదత్తమిత్యముమ్॥

48 తా॥ బ్రహ్మచర్యముతో వేదశాస్త్రముల నన్నిటి నా బాలుడు త్వరగ నాకళించెను.

49 తా॥ లోకు లా పిల్లవాని వేదపాఠమును గ్రంథ రచనాపటుత్వమును చూచి సర్వేశ్వరుడే యిట్లుదయించెనని విస్మయ మొందిరి.

50 తా॥ ఆ పిల్లవాడు ఆచారములను, ప్రాయశ్చిత్తములను, ధర్మములను, వేదాంత భాష్యార్థమును వివరించుచు పెద్దల మన్నన లందెను.

51 తా॥ అట్లు లీలామానుషుడు సర్వ విద్యాపారంగతుడైన ఆయనను వివాహితుని చేయనలయునని తలిదండ్రులు తలంచిరి.

52 తా॥ ఆ దంపతులట్లు నిశ్చయించుకొనుచుండగా వారిని శ్రీపాదులవారు వారించి, అయ్యా! నేను మానవ కన్యను వివాహమాడను.

53 తా॥ నాకు యీ ప్రాపంచిక వాసనల యిచ్ఛ లేదు. అందుచే నేను వైరాగ్య కాంతయం దాసక్తుడను. లోకమున మీరు వివాహ మొన రించు కాంత నాకు తల్లితో సమానము.

54 తా॥ అయ్యా! యోగశ్రీని వరించితిని. ఆమెతో వివాహము నొందిన నాకు సుఖము గలుగును.

55 తా॥ నేను తపమును చేసికొందును. బ్రహ్మచారిగ నుందును. ప్రవృత్తి మార్గగుడను కాను. నాకు త్రికరణశుద్ధిగ అన్యస్త్రీ వద్దు.

56 తా॥ నేను శ్రీవల్లభుడను. శ్రీపాదుడను. తత్త్వవిచారణాసక్తుడను ఓయీ! నేను నివృత్తి మార్గముననుండి వేదాంతమును వెదకికొను చుండునిమ ఆత్మబోధ.

57 తా॥ కుమారుడైన ఆ దత్తపుత్రుని వాక్యమును విని, ఆ దంపతులు నిజ ముగ నాయన దత్తాత్రేయులని నిశ్చయించుకొనిరి.

58 శ్లో॥ భాషణోల్లంఘనాదస్య మహావిఘ్నో భవిష్యతి।
అతోఽము మనుసృత్యస్మై దుఃఖం విజ్ఞాప్యచస్వకమ్॥

59 శ్లో॥ అస్యచిత్తం య ధాతుష్యే త్తధాకర్తవ్యమాదరాత్।
నాస్మత్పుత్రోఽవతీర్ణోఽయం దత్తః పరమపూరుషః॥

60 శ్లో॥ ఇతినిశ్చిత్య జననీ పుత్రాభిముఖ మేత్య తం।
ప్రాహాశాం నిష్ఫలాం పుత్ర! మాకురుత్వం మహీపాలకః॥

61 శ్లో॥ ఇత్యుక్త్వావ్యాకులమతిః సుమతిః సాశ్రుదృక్సతీ॥
పుత్రస్నేహేన పలితా రంభావాతా హతాయథా॥

62 శ్లో॥ తాదృశీంవీక్ష్య జననీం ఉత్థాప్యాశ్వాస్వతాంసుతః।
ప్రక్షాళ్యాశ్రూణి హస్తేన సంబోధ్యప్రాహ పూరుషః।

63 శ్లో॥ చింతాం మాకురుభోమాతర్యదిచ్ఛసి దదామి తత్।
మాతశ్చిత్తం దృఢంకృత్వా సుఖంతిష్ఠ శుచిస్మితే॥

64 శ్లో॥ సా ప్రాహ త్వాం విలోక్యైవ దుఃఖం త్యక్తం మయాఽఖిలం।
దైన్యం నివార్యవార్ధక్యే రక్షితే త్యభికాంక్షితం॥

65 శ్లో॥ వృద్ధావావాం పంగురేకః పుత్రోఽన్యో దృష్టివర్జితః।
త్వయి ప్రవ్రాజితే త్రాతా కోఽస్మాకం వదపుత్రక!॥

66 శ్లో॥ ఇతి మాతృవచఃశ్రుత్వా సుధాదృష్ట్యాగ్రజాప్రభుః।
దదర్శ తౌ తదాజాతౌ సుపాక్షియుతౌక్షణాత్॥

67 శ్లో॥ యథా చింతామణి స్పర్శాదయో భవతికాంచనమ్।
మహాత్మన స్తథా దృష్ట్యా తక్షణం యోగ్యతాంగతౌ॥

58 తా॥ ఆయన మాటకు వ్యతిరేకించిన అనర్థముల పాలగుదుమని ఆ దంప తులు ఆయన మాటను అనుస రించి తమ దుఃఖమును వివరించిరి.

59 తా॥ ఈ బాలుని చిత్తమెట్లుండే అట్లుండుట మంచిదని శ్రీ విష్ణువు దత్త మూర్తిగ పుత్రుడై జన్మించినందుకు సంతసించుచుండిరి.

60 తా॥ ఇట్లాబాలుని దైవముగ తలచి, ఇఁక పుత్రుని ముఖము చూచి నిష్ఫలాశ యేలయని మమ్ము రక్షింపవా తండ్రీ యని వేడుకొనిరి.

61 తా॥ ఇట్లని వ్యాకుల చిత్తముతో కంటనీరు పెట్టుకొనుచు నాయనా! నీవు కుమారుడవన్న మోహమునఁ బడితిమి. గాలికి పడిపోయిన అరటి బోదెవలె పడిపోయితిమి.

62 తా॥ తనకెదురుగా ఏడుస్తూ పడిపోయిన తన తల్లిని చూచి యాయన ఆమె కన్నీటిని తుడిచి తన హస్తముతో అమ్మా! అని పిలిచి యిట్ల నెను:

63 తా॥ అమ్మా! నీవు నిశ్చింతగా నుండుము. దిగులు పడవద్దు. నీ మనసు గట్టిపఱచుకొనుము - సుఖముగా నవ్వుచుండుము.

64 తా॥ నాయనా! నిన్ను చూచిననే దుఃఖము తొలగినది - దైన్య వాక్యముతో నాయనా! ఇప్పుడు మాకు ముసలితనము - ఇప్పుడు మాకు రక్షణ యేమని నిన్ను కోరుచున్నా ననెను.

65 తా॥ నాయనా! మేము వృద్ధులము - పెద్దవాడుకుంటి - రెండవవాడు గ్రుడ్డి నీవు సన్యసించితే - మాకు రక్షకుఁడగు పుత్రు డెవడుండును?

66 తా॥ ఇట్లనుచున్న నా బాలుడు తల్లిని-పెద్దన్నలఁజూచెను అంత వెంటనే - కుంటిదన మన్నకు - అంధత్వ మింకొకనికి మాయమయ్యెను.

67 తా॥ ఆమె యిట్లనుకొనెను - చింతామణి స్పర్శచే ఇనుము బంగారమై నట్లు యీ పిల్లవాని సాహచర్యమున పెద్ద బిడ్డలు రక్షితులైరను కొనెను.

68 శ్లో॥ వేదశాస్త్రకలాభిజ్ఞౌ భూత్వా సమవలంబ్యతౌ।
శ్రీపాదపాదాదగదౌకృతార్థావితిచోచతుః॥

69 శ్లో॥ తావాశ్వాస్య వరందత్వా శ్రీపాదః ప్రాహ సోదరౌ।
యువాం మమప్రసాదేన పుత్రపౌత్ర శ్రియాన్వితౌ॥

70 శ్లో॥ ఇహాముత్రం చ సౌఖ్యం వాం జనన్యా జనకస్య చ।
భూత్వాకృతార్థౌ మద్వాక్యాత్కైవల్యం గచ్ఛతంధ్రువమ్॥

71 శ్లో॥ ఇత్యుక్త్వాతౌ సమాశ్వాస్య శ్రీపాదః ప్రాహ మాతరం।
ఆభ్యాం సుతాభ్యాం సహితా లభస్వసుఖ ముత్తమమ్॥

72 శ్లో॥ శతాయుషౌ సుతావేతౌ పుత్రాన్ పుత్రీఃకిలైతయోః।
ద్రక్ష్యసి త్వం స్వనేత్రేణ చింతాం మాకురు మానద॥

73 శ్లో॥ శ్రీర్నిశ్చలాఽనయోర్వంశే కీర్తిః స్థాస్యతి శాశ్వతీ।
భవిష్యంత్యనయోర్వంశే వేదశాస్త్రాదిపారగాః॥

74 శ్లో॥ మాకుర్వనాదరం మేఽంబ దేహ్యనుజ్ఞామితో ద్రుతమ్।
దీక్షాం ప్రదాతుం సాధుభ్యో యాస్యామ్యుత్తరవర్త్మనా॥

75 శ్లో॥ ఇత్యుక్త్వాతాం నమస్కృత్యతయాఽజ్ఞప్తః స తక్షణమ్।
భూత్వాఽదృశ్యో యయౌకాశీం శ్రీపాదోభక్తి భావనః॥

76 శ్లో॥ లీలావిహారీ భగవాన్ గత్వాబదరికాశ్రమమ్।
దృష్ట్వా నారాయణం స్వాంగం నరం కారణ మానుషం॥

77 శ్లో॥ దీక్షాం దాతుం స్వభక్తేభ్యః పర్యటన్ సకలాంమహీం।
మనోగతిః ప్రభుస్తస్థౌ గోకర్ణ క్షేత్ర ముత్తమమ్॥

68 తా॥ ఆమె జ్యేష్ఠ పుత్రులిరువురు శ్రీపాదుని సహజత్వముతో వేదశాస్త్ర సంపన్నులమైతిమని పరస్పరము చెప్పుకొనుచుండిరి.

69 తా॥ ఆమెను శ్రీపాదు లోదార్చి సోదరులతో నిట్లనెను: నాయనా, నా వీక్షణముచే మీరు పుత్రపౌత్రవంతులగుదురు.

70 తా॥ ఇహ పరలోక సౌఖ్యములబొంది - జననీ జనకుల సంతోష పరచి కృతార్థులు కండి! చివరకు నా వాక్యమువల్ల మోక్షము గల్గును.

71 తా॥ ఇట్లుగా శ్రీపాదులు ఆ పితరులనోదార్చి, అమ్మా! ఈ సుతులిరువురితో నీవు సుఖముండుము - నీ కేలోటుండదనెను.

72 తా॥ అమ్మా! వీరు శతాయుర్వంతులగుదురు. నీవు బాధపడవలదు. అమ్మా! నీవు పుత్రపౌత్రులను చూచుకొనగలవు. సుఖపడుము.

73 తా॥ అమ్మా! మీ యీ వంశములో సంపద - కీర్తులుండును. వేదశాస్త్ర విద్వాంసులీవంశమం దాస్తికులు ందురు.

74 తా॥ అమ్మా! నాకు ఆలస్యము లేక తపమునకు బోవ నాజ్ఞనిమ్ము; అమ్మా! నేను దీర్ఘ ప్రవాసముబోదు నాశీర్వదింపు మనెను.

75 తా॥ ఇ ట్లాశ్రీపాదులు వారి తల్లికి నమస్కరించి, ఆమె ఆజ్ఞనుగొని అదృశ్యమై కాశీ పట్టణమునకు ప్రయాణమై పోయెను.

76 తా॥ లీలా విహారమూర్తి యైన ఆనారాయణాంశ సంభూత యతీశ్వర దత్తాత్రేయులు బదరికావనమును చేరిరి. నారాయణుడు మానుషాకారంతో కారణ జన్మనిట్లు దత్తాకృతి నుండెనని భావన.

77 తా॥ భక్తులకు దీక్ష నిచ్చి వారిని కాపాడుటకు లోకముల దిరుగుచు మనోగతిగా స్వేచ్ఛగా దిరుగుచు ఉత్తమమైన గోకర్ణమును జేరెను.

78 శ్లో॥ ఇతి సిద్ధవచోఽమృతోపమం
హ్యవధార్యాఽథ స నామధారకః।
అభివాద్య తమాహ పూజితం
విరతం కీర్తినతోనతోమతః॥

గద్య॥ ఇది శ్రీ సిద్ధనామధారక సంవాద రూపేణ సరస్వత్యాఖ్య
గంగాధరాత్మజ విరచిత నరసింహ సరస్వత్యుపాఖ్యాన
సంజ్ఞిత మహారాష్ట్ర భాషాన్విత గురుచరిత్ర సమానా
ర్థాయాం వాసుదేవానంద సరస్వతి యతి విరచితాయాం

శ్రీ గురు సంహితాయాం జ్ఞానకాండే పంచమోఽధ్యాయః

ఆదితః శ్లోకాః (653)

ఇతి పంచమోధ్యాయః

78 తా॥ ఇట్లు సిద్ధుని వాక్యమమృతోపమానముగ విని నామధారకుడు ఆ సిద్ధునకు నమస్కరించి వినతుడై తరువాతాంశమును విస్తారముగా వినఁగోరెను.

గద్య : సిద్ధ నామధారక సంవాదరూపముగ శ్రీ దత్త భగవానుని కథలను మహారాష్ట్ర భాషలో నృసింహ యతి సంజ్ఞతో నున్నట్టున్న గురుదత్త చరిత్ర మహారాష్ట్ర భాషకు సమానముగా సంస్కృత భాషలో శ్రీ గంగాధర పుత్రులు వాసుదేవానందస్వామివారు రచించిన శ్రీ గురుదత్త సంహితలో పంచమాధ్యాయము సమాప్తము.

ఆదితః - శ్లోకాః (653)

ఈ జరిగిన 5 వ అధ్యాయంలో పీఠికాపుర దంపతులకు శ్రీదత్తుడు శ్రాద్ధాన్నమునకు పూర్వమే భిక్షనిచ్చిన ఆయింటి యజమానురాలుకు కరుణించి శ్రీపాదనామకరూపకముగ జన్మించి ఆమె పుత్రుల నిద్దరనంగ వైకల్యము నుండి వదిలించి తాను తల్లి యాజ్ఞతో తీర్థయాత్రాటనా వ్యాజమున వివాహమును మాని ఆయనకు ఆమె వంశమున కాశీర్వాదము చేసి వెళ్లెను.

ఇట్టి కథా సందర్భమును సిద్ధయోగి నామాధారకునకుఁజెప్పగా విని ఆనందపడుచు, ఇంక నాస్వామిలీలల నడుగుచుండెను.

# శ్రీ గురుదత్త చరితే

## షష్ఠోఽధ్యాయః - జ్ఞానకాండః

1 శ్లో॥ స నామధారకోఽపృచ్ఛ దజ్ఞానధ్వాంత భాస్కర।
ఆదితోగురు పీఠంమేశ్రావితం సిద్ధసద్గురో॥

2 శ్లో॥ త్రిమూర్తి రవతీర్యాత్ర కుతః పర్యటతిక్షితౌ।
విశేషతః కిమర్థం స గోకర్ణం శ్రీపదోగతః॥

3 శ్లో॥ తీర్థానిబహు సంతీహ తా ని హిత్వామహీతలే।
శ్రీపాదశ్రీవల్లభోఽసౌ గోకర్ణేఽస్థాత్ కుతోవద॥

4 శ్లో॥ ఇతి సిద్ధవచఃశ్రుత్వా సంతుష్టః సిద్ధఆహతం।
సమీచీనః కృతఃప్రశ్నః సంతుష్టోఽస్మితవోపరి॥

5 శ్లో॥ నామధారకఊచే త్వంతుష్టోఽసి యదిమేవద।
విస్తరేణగురోర్లీలాం స్వామిన్నితిపదేఽగ్రహీత్॥

6 శ్లో॥ శ్రుత్వాతత్ప్రార్థనాం సిద్ధంః సంతోషేణ తమబ్రవీత్।
శ్రీగురోశ్చరితం రమ్యం నామధారకమేశ్రుణు॥

7 శ్లో॥ శ్రీగురోశ్చరితం వక్తుం హర్షోఽతీవ వర్ధతే।
లాభోమమాప్యభూద్యస్మా తల్లీలాస్ఫూర్తి రుద్యతా॥

8 శ్లో॥ తీర్థానిపర్యటత్యేష త్రిమూర్త్యాత్మాపిచస్స్వయమ్।
తస్మా గోకర్ణకేక్షేత్రే కిమర్థమితిచే చ్ఛృణు॥

1 తా॥ నామధారకుడు అజ్ఞానమను చీకటికి సూర్యుడివంటి ఓ గురూ! సిద్ధ యోగీ! మొదటనుండి శ్రీదత్తగురుపీఠమును గూర్చివినిపించం డనెను.

2 తా॥ త్రిమూర్త్యాత్మకుడుగ భూమిపై నవతరించి భూమిపై సంచరించుచు ఆ శ్రీపాద గురువులు గోకర్ణ క్షేత్రమునకు ముందుగ నెందులకు వెళ్ళిరి?

3 తా॥ భూతలమున ననేకములు తీర్థ స్థలములుండగా వానినన్నింటిని వదలి ఆ శ్రీపాదులు గోకర్ణమందుంటి రంటిరే! దానికి కారణమేమి?

4 తా॥ సిద్ధుడన్నమాట విన్న నామధారకుడు సిద్ధుని పైరీతిగఁ బ్రశ్నించుట తోనే, అయ్యా! నీ ప్రశ్న చాల బాగున్నది. సమాధానింతునని నవ్వెను.

5 తా॥ నామధారకుడా! నీవన్నది విని సంతసించితిని. శ్రీ గురు స్వామి లీలలు విస్తారములు అని నీవు ప్రతి మాటను గ్రహింతువు.

6 తా॥ ఆ నామధారకుని ప్రార్థనా పరమైన వాక్యమును విని సంతోషముతో సిద్ధు డిట్లనెను: ఓయీ నామధారకా! శ్రీ గురుచరిత్ర చాల రమ్య మైనది. వినుము.

7 తా॥ ఓయీ! మన గురువుగారి చరిత్ర చెప్పుటకు నాకు సంతోష మధిక మయ్యెను. ఆ గురులీలాస్ఫూర్తి నాకు చాలా లాభదాయకము.

8 తా॥ ఆ గురుమూర్తి తీర్థములన్నింటిని స్వయముగఁ దిరుగుచు గోకర్ణ క్షేత్ర మున నుండుటకు కారణమేమియో వినుము.

9 శ్లో॥ దత్తాత్రేయః స్వయంతీర్థః రూపోఽపిభువిపర్యటన్।
నిజపర్యటనేనైవ భక్తానుద్ధరతీశ్వరః॥

10 శ్లో॥ ఉపదేక్ష్యన్విశేషేణ స్వన్యశంకర రూపిణః।
గోకర్ణాఖ్యం యయౌక్షేత్రంప్రసిద్ధం యన్మహీతలే॥

11 శ్లో॥ శ్రుణు గోకర్ణ మాహాత్మ్యం లోకేనిరుపమం ఖలు।
సావధానమనాభూత్వాశ్రుణుత్వం నామధారక॥

12 శ్లో॥ అస్మిన్‌గోకర్ణకే క్షేత్రే బహవోలేభిరే వరాన్।
అపూర్వమివతత్ క్షేత్రం యత్రసాక్షాత్సదాశివః॥

13 శ్లో॥ మహాబలేశలింగం తత్ స్వయంభూః శివఏవహి।
లంబోదరేణ శ్రీవిష్ణోరాజ్ఞయైవ ప్రతిష్ఠితమ్॥

14 శ్లో॥ ఇతిశ్రుత్వాపునః సిద్ధం పప్రచ్ఛసకుతోవద।
విఘ్నేశ్వరేణ తల్లింగం స్థాపితం విష్ణ్వనుజ్ఞయా॥

15 శ్లో॥ సిద్ధ ఆహశ్రుణుష్వార్య కథయా మి త వాదితః।
మహాబలేశ్వరస్యేదం చరితం సర్వకామదమ్॥

16 శ్లో॥ కైకసీనామికాభార్యా పౌలస్త్య బ్రహ్మణస్యతు।
అతిభక్త్యా సర్వకాలం శివపూజనతత్పరా॥

17 శ్లో॥ నాన్నంగృహ్ణాతిసానిత్యం శివలింగార్చనం వినా।
ఏవం సత్యాః కదాచిత్తు నలబ్ధం లింగమర్చితుమ్॥

18 శ్లో॥ వ్రతభంగభియాసాతు మృణ్మయం లింగముత్తమం।
విధాయాఽనర్చ పరయా భక్త్యా చైకాగ్ర్య ఆస్థితా॥

9 తా॥ శ్రీ దత్తాత్రేయులు స్వయముగా తీర్థ స్వరూపి. అట్లయ్యు సమస్త తీర్థములఁ దిరుగుటలోని భావమేమన - తీర్థక్షేత్రముల భక్తులుందురు వారి నుద్ధరించు దయతో క్షేత్రములు తిరుగుచుండెను.

10 తా॥ విశేషాకారముగా క్షేత్రములఁ దెలిసికొని ఆదిశంకరావతారమైన స్వామి ఈ భూతలమున గోకర్ణ క్షేత్రము ప్రసిద్ధమని అక్కడకు వెళ్ళెను.

11 తా॥ ఓయీ! గోకర్ణ క్షేత్ర మాహాత్మ్యమును విను. అది సాటిలేనిది- దాని మహత్వమును నామధారక! నీవు సావధానముతో వినుము.

12 తా॥ ఓయీ! గోకర్ణక్షేత్రమహిమ అగణ్యము - ఇట తపసు చేసి అనేకులు వరములఁ బొందిరి - ఇచట సాక్షాత్ సదాశివుడున్నందున అపూర్వ క్షేత్రమిది.

13 తా॥ ఇచట మహాబలేశ లింగము గలదు. అది స్వయం భూ శివలింగము. శ్రీ మహా విష్ణ్వాజ్ఞతో గణేశుడు దీనిని (యీ శివలింగమును) ప్రతిష్ఠించెను.

14 తా॥ ఓయీ సిద్ధముని! ఏ కారణమున విష్ణువు విఘ్నేశ్వరున కనుజ్ఞ నిచ్చెను? ఆయనెందులకు దాని నచట ప్రతిష్టించెను?

15 తా॥ ఓ నామధారక వినుము - మొదటినుండి - ఆ మహాబలేశ్వరుని చరితమును చెప్పెదను. ఆయన భక్తుల కోరిక లిచ్చువాడు.

16 తా॥ పూర్వకాలమున పౌలస్త్యుడను బ్రాహ్మణునకు కైకసీ అను పేరుగల భార్య యుండెడిది. ఆమె యెప్పుడు శివపూజా తత్పరురాలు.

17 తా॥ ఆమె శివలింగపూజ చేయక భోజనము చేయదు. నిత్యమును ఇట్లుండ నొకనాడామెకు పూజకొరకు శివలింగము దొరకకపోయెను.

18 తా॥ అది లేకున్న భోజనము చేయదు - వ్రతభంగము కారాదని - ఒక మట్టి లింగమును చేసి విధివిధానముగ పూజించి ఏకాగ్రచిత్తమున నుండెను.

19 శ్లో॥ తదాత త్తనయ స్తత్ర రావణోలోక రావణః।
మాతరం ద్రష్టుమాపన్నో యోఽతిక్రూరో దశాననః॥

20 శ్లో॥ ప్రణమ్యమాతరం దృష్ట్వా లింగపూజన తత్పరామ్।
పప్రచ్ఛకిమిదంభద్రే కరిష్యామి వ దాఖిలమ్॥

21 శ్లో॥ మాతా త్వం మమ విఖ్యాతా దాస్యోమే సిద్ధయోఽఖిలాః।
కిమర్థం మృణ్మయం లింగం ఏతద్దౌర్భాగ్య మేవ మే॥

22 శ్లో॥ అస్తునామతథాఽప్యస్య పూజనాత్కిం ఫలం మిలేత్।
సాప్రాహ పూజనా దస్య కైలాసపదమాప్యతే॥

23 శ్లో॥ రావణః ప్రాహసాయాసో వ్యర్థోఽయం క్రియతేత్వయా।
అహ మానీయకైలాసం దాస్యామి క్షణమాత్రతః॥

24 శ్లో॥ లంకాపురేఽపికైలాసం ఉమారమణ సంయుతం।
ఆనీయ తుభ్యం దాస్యామి త్వరితం న మృషా వచః॥

25 శ్లో॥ సావధానేనమనసా తత స్తం పూజయా నిశమ్।
కిం మృణ్మయేన లింగేనేత్యుక్త్వా యాతోనిశాచరః॥

26 శ్లో॥ మనోవేగేన కైలాసం ప్రాప్య రాజత పర్వతం।
ఉత్పాటయితు మారేభే ధృత్వా వింశతిబాహుభిః॥

27 శ్లో॥ చాలయామాస కైలాసం రావణః స మహాబలః।
శిరాంసి దశ చాప్యస్య ప్రాంతేసంస్థాప్యయత్నతః॥

28 శ్లో॥ ఉత్సంగయోః కరాన్ ధృత్వాలీలయైవోజ్ఝహారతమ్।
పాతాలాని తదా చేలు రపి సప్త తతః క్షణాత్॥

19 తా॥ ఆ సమయమున ఆమె పుత్రుడు - లోకములను పీడించు రావణుడను వాడు తల్లిని చూడవచ్చెను - వాడతి క్రూరుడు - పదిమోములవాడు.

20 తా॥ వాడు వచ్చి తల్లికి నమస్కరించి, అమ్మా, యీ లింగపూజయేమి? దీనినింత భక్తితో పూజింప లాభమేమి? నాకంతయు చెప్పుమనెను.

21 తా॥ అమ్మా! నీవు నాకు తల్లివి - నేను లోకవిఖ్యాతుడను - సిద్ధపురుషు లందరును నాకు వశులు-నీవు మట్టి లింగమును పూజించు దౌర్భాగ్య మేమని ప్రశ్నించెను.

22 తా॥ పోనీ! పూజచేసితివనుకొందము-దీనివలన ఫలమేమి? అనగా, కైకసి వానితో - ఓయీ! కైలాసమును చూడగలుగుదుమని చెప్పెను.

23 తా॥ అపుడు రావణుడు తల్లితో, అమ్మా! నీవు వ్యర్థాయాస పడుచున్నావు- నీవు కావలయునంటే ఒక చిటికెలో కైలాసమునకుఁ బోయి నీకు ఆ లింగమును తెచ్చి యిచ్చెదను.

24 తా॥ అమ్మా! నేను అబద్ధపు మాటలాడుచుంటి ననుకొనకుము - నేను త్వరగ కైలాసమునకు పోయి - ఆ యుమా రమణుని గొనివచ్చి లంకలో నీ కప్పగింతు ననెను.

25 తా॥ నేను తెచ్చియిచ్చిన తదుపరి సావధానముగా ఎప్పుడు, ఆ స్వామికి పూజను చేసుకొనుము. నావంటి గొప్పవాని తల్లియగు నీ కీమట్టి లింగమేల? అని యనుచు నా రాక్షసుడు కైలాసమున కేగెను.

26 తా॥ మనోవేగ సమానముగ నాతడు వెండికొండకు వెంటనే యేగి, అచట నున్న యీశ్వరలింగము నిరువది బాహువులతో పెళ్ళగింపబూనెను.

27 తా॥ మహాబలుడైన ఆ రావణుడు తన పదితలల నేలపై యొరగబెట్టి లింగమును గుంజి కదలించి ఓరగ నొకచోటఁబెట్టియుంచెను.

28 తా॥ అంత నాతడు తొడచరచి విలాసముగ దానిని లాగికొనెను. పాతాలాది సప్తాధోలోకములాలింగ చాలనమున కదిరిపోయెను.

29 శ్లో॥ శేషోఽపి చకితోజాతః కూర్మోఽకస్మాచ్చ శంకితః।
దీనా దేవగణాస్సర్వే చచాలాప్యమరావతీ॥

30 శ్లో॥ సప్తోర్ధ్వలోకయుక్తా భూః సశైలవనకాననా।
మేరుశ్చచాల లోకాశ్చ మేనిరే ప్రలయాగమమ్॥

31 శ్లో॥ కైలాసీయా శివగణా అభవ న్భయ పీడితాః।
భీతభీతాఽద్రి దుహితా శంకరం శరణం గతా॥

32 శ్లో॥ శివాఽలింగ్య శివం ప్రాహ కైలాసోఽయం పతత్యథః।
అకస్మాత్కిమిదం ప్రాప్తం సభాగేహాది కంపితమ్॥

33 శ్లో॥ ఆక్రాంతః సర్వతోజాతో భవతః స్వస్థతా కుతః।
కురుష్వాస్య ప్రతీకార మిత్యుక్త్వా తత్పదేఽగ్రహీత్॥

34 శ్లో॥ శంకరః ప్రాహగిరిజే! భక్తోఽయం రావణో మమ।
క్రీడతీహ త్వయాచింతా నకర్తవ్యాఽధునాఽబలే!॥

35 శ్లో॥ ఇతి శ్రుత్వేశవచనం గిరిజా పునరబ్రవీత్।
శూలపాణే! సురగణాన్ రక్షరక్షాఖిలాన్ ప్రభో!॥

36 శ్లో॥ పార్వత్యావచనం శ్రుత్వా శంకరస్సర్వ శంకరః।
వామహస్తేన కైలాస అథశ్చక్రే సరావణం॥

37 శ్లో॥ రావణశ్చింత యా యుక్తః కైలాసాధః స్సముహ్యతి।
స్తోష్యే శివ శివ త్రాహిశరణాగత రక్షణ॥

38 శ్లో॥ పినాకపాణే మాంత్రాహి జగత్పాత్స శిరోమణే।
శరణంత్వాం ప్రపద్యేఽతో మర్దనం కిన్ను దాన్యసి॥

29 తా॥ అదిశేషుడదిరిపోయెను. ఆది కూర్మము క్రుంగిపోయెను. దేవతాగణము లన్నియు భీతిఁజెందినవి. స్వర్గము వణకిపోయెను.

30 తా॥ పర్వతారణ్యములతో గూడిన ఊర్ధ్వలోకములును అదిరిపోయినవి. మేరువూగినట్లాయెను. అందరు దానిని ప్రళయకాలమనుకొనిరి.

31 తా॥ కైలాసమందలి శివగణములన్నియు చాల ఆర్తి నొందినవి. ఆ పర్వతమందలి జీవులు భయపడి శంకరుని శరణుఁజొచ్చినవి.

32 తా॥ పార్వతియు శివునాలింగము జేసి శివునితో నిట్లనియెను: స్వామీ! యీ పర్వతము పడిపోవునేమో? మనమెట్లు వణకుచుంటిమి?

33 తా॥ ఈ పర్వతమందలి వారందరు భయముచే గుమికూడిరి. మరియొక చోట స్వస్థతగా నుండుటయేమి? అయ్యో! మీరు దీనికి ప్రతిక్రియ చేయుడని ఆయన పాదములఁబట్టెను.

34 తా॥ ఓయీ కాంతా! పార్వతీ! ఈతడు రావణుడు - పర్వతముతో ఆట లాడుకొనుచున్నాడు. దానికి నీవింత చింతపడవద్దనెను.

35 తా॥ ఆ మాటను విని పార్వతి- అయ్యో! యక్షరాక్షససిద్ధాదిసురలందరు భయపడుచున్నారు. ఇదియేమి ఆట? అనెను.

36 తా॥ ఆ మాటలు విని శంకరుడు ఆ సంగతినంతటిని గనిపెట్టి - తన కాలి వ్రేళ్ళతో ఆ కైలాసమును క్రిందికి త్రొక్కెను.

37 తా॥ దానికి రావణుడాశైలము క్రింద బాహువులు పడి నలుగుచు బాధతో శంకరుని స్తోత్రము చేయుచు మోహముతో వేడుకొనెను.

38 తా॥ జగద్రక్షక! శివ! నన్ను రక్షింపుము! నిన్ను శరణన్న నాకు శంకరా! మరణమిస్తున్నావా?

39 శ్లో॥ శంకరోభక్త వాత్సల్యాత్కృప యా పరయా యుతః।
పర్వతాధోగతం తం చ మోచయా మాస రావణం॥

40 శ్లో॥ లంకేశ్వర స్తతోముక్తో భక్త్యా తుష్టావ శంకరమ్।
సుస్వరం సాంగరాగాఢ్యం కోమలం సకలం జగౌ॥

41 శ్లో॥ రావణస్యచభక్త్యాతు ప్రసన్నోఽభూత్స ఈశ్వరః।
తస్థౌ తత్సమ్ముఖం హృష్టో నిజరూపేణ శంకరః॥

42 శ్లో॥ త్రినేత్రః పంచవక్త్రైః స భూత్వాసంతుష్ట మానసః।
రావణం ప్రాహ హృష్టోఽస్మి వరం వరయ కామితమ్॥

43 శ్లో॥ రావణః ప్రాహకిం ప్రార్థ్యం దాసీలక్ష్మీ గృహేమమ।
తథాఽష్టనిధయః సంతి దాసాఇవ సదాశివ!॥

44 శ్లో॥ చతురాస్యో జ్యోతిషికః సదామే వశవర్తనః।
బృందారకా స్త్ర యస్త్రింశత్కోటికా మమ సేవకాః॥

45 శ్లో॥ ఆశ్రయాశోఽపిసోఽగ్నిర్మే వస్త్రక్షాళనకర్మణి।
యోజితో సకృతాంతోఽపి హంతిమద్వచనం వినా॥

46 శ్లో॥ కుంభకర్ణో మమభ్రాతా శక్ర జేతా సుతో మమ।
స్థానంమేఽబ్ధౌ సురాగమ్యం కామధేనుర్గృ హేమమ॥

47 శ్లో॥ సహస్రకోటి వర్షాయుమమకోఽన్యోఽస్తి మాదృశః।
వేత్సీదం సర్వమీశానకైలాసం నేతుమాగతః॥

48 శ్లో॥ వ్రతమస్తి జనన్యామే నిత్యంత్వాం పూజయిష్యతి।
దాతః పూరయ భక్తస్య కృపామూర్తే! మనోరథమ్॥

39 తా॥ భక్తవత్సలుడైన ఆ భోళా శంకరుడు వాని స్తోత్రమునకు మనసు కరిగి, వాని నా పర్వతమునుండి బాహువుల విడిపించెను.

40 తా॥ అపుడా రావణుడు బంధవిముక్తుడై శంకరుని వద్దకు వచ్చి నుతించెను. అందునను రాగయుక్తమైన సుస్వరముతో కోమలముగ శివ స్తుతిని చేసెను.

41 తా॥ భక్తుడైన రావణుని స్తోత్రమునకు శంకరుడు ప్రసన్నుడయ్యెను. అట్లయి ఆ రావణున కెదురుగ శంకరుడుండెను.

42 తా॥ మూడు నేత్రములు, 5 తలలు సంతోషముతో శంకరుడుండగా ఆ రావణుని జూచి ఓయీ! నీ స్తోత్రమునకు సంతసించితి, వరమడుగుము ఇత్తుననెను.

43 తా॥ స్వామీ! నిన్ను నేను కోరవలసినదేదీలేదు. ఆ లక్ష్మి నా యింట దాసిగా నున్నది. అష్టనిధులు గలవు. ఆ నిధులు దాసీ గణమువలె చౌకబారుగ నా యింట నున్నవి సదాశివా!

44 తా॥ బ్రహ్మ ప్రతి రోజు పంచాంగమును నా యింట చెప్పును. అతడెప్పుడు నా కనుసన్న నుండును. ఇక 33 కోట్ల దేవతలన్న నా నిజ సేవకులే!

45 తా॥ ఆ అగ్నిదేవుడు బట్టలదగ్గరనుండి ఉదుకును. ఆ యమధర్మరాజు వంటివా డేదేని బూనుకొని చేయబూనిన నేను వద్దంటే ఆగిపోవును.

46 తా॥ నా తమ్ముడు కుంభకర్ణుడు, పుత్రుడు ఇంద్రజిత్తు, నా నివాసము సముద్రము మధ్య దేవతలకు చొరరానిది. ఇక కామధేనువు నా యింటనే గలదు,

47 తా॥ నాకు వేయికోట్ల వత్సరముల ఆయువు. నాబోటి వాడెవడున్నాడు? ఈ నా సంగతంతయు నీ కెఱుకయే! కాని, నేనిప్పుడు కైలాసమును గొనిపోవచ్చితిని.

48 తా॥ అయ్యా! మా తల్లిగారు రోజును మీ పూజ చేయనిది భోజనము చేయనను వ్రతము గలది. ఆ కొరత లేకుండ మా తల్లిగారి కోరిక తీర్చండి! అనెను,

49 శ్లో॥ ఈశ్వరో రావణం ప్రాహ కైలాసేన ప్రయోజనం।
కింకిం గానేన తే దాస్యం ఆత్మలింగం సుదుర్లభమ్॥

50 శ్లో॥ సద్యో లింగార్చనే నైవ యా యా మానస వాసనా।
సాసా సంపూర్ణతాం యాయా త్ప్రాణలింగార్చనా న్మమ॥

51 శ్లో॥ రుద్రాభిషేకపూర్వంహి త్రికాలంతస్యపూజనం।
కృత్వా షడక్షరం మంత్రం జపిత్వాష్టోత్తరంశతమ్॥

52 శ్లో॥ ఏవం త్రివర్షపర్యంతం పూజనాత్సర్వకామభాక్।
భూత్వా త్వం రావణ! తతో మత్స్వరూపోభవిష్యసి॥

53 శ్లో॥ యత్సన్నిధావదో లింగం తస్యమృత్యుభయంకుతః।
సర్వేదోషాః ప్రణశ్యంతి లింగదర్శనమాత్రతః॥

54 శ్లో॥ నస్థాపయక్షితౌలింగం యా వల్లంకాంగమిష్యసి।
త్రివర్ష పూజనాదీశ స్త్వం కైలాసశ్చతేపురం॥

55 శ్లో॥ ఇతి కర్పూరగారేణ వరోద త్తస్తతఃస చ।
సాష్టాంగం తం ప్రణమ్యాశు లంకాంగంతుం సముద్యతః॥

56 శ్లో॥ ఋషీశ్వరోనారదోఽథ జ్ఞాత్వేదం తక్షణం ద్రుతమ్।
మత్వాఽసమంజసం సర్వం సురేంద్రభువనం యయౌ॥

57 శ్లో॥ ఉవాచ నారదః స్వస్థముపావిష్టోఽసికింవద।
ఇంద్రా! మరత్వం త్వల్లక్ష్మీరావణే నా ధునాహృతా॥

58 శ్లో॥ జాతశ్చిరాయుర్లంకేశో లబ్ధ్వాకర్పూరగౌరతః।
ప్రాణలింగం శివేనోక్తం మ త్తుల్యత్వం భవిష్యసి॥

49 తా॥ అపుడు శివుడు రావణునితో ఓరీ! నీకు కైలాసముతో ప్రయోజన మేమి? నీకు వరమేమియు నీయదగినది లేదని నీవే అంటివి. ఆత్మ లింగము నిచ్చుట దుర్లభ మనెను.

50 తా॥ అయ్యా! ఆత్మలింగార్చన కోరిన కోరికల తీర్చునది. ఆ అర్చనచే మనసులోని కోరికలు ఫలించును.

51 తా॥ అయ్యా! నీ లింగమునకు రుద్రాభిషేకమును చేసి, త్రికాలమును లింగ పూజ చేసి - ప్రణవయుక్త శివ పంచాక్షరి (మంత్రము) 108 పర్యాయములు జపించిన అనంత ఫలము గదా? ఇమ్మనెను.

52 తా॥ ఈ విధముగ మూడు సంవత్సరములు - యెవడు నిష్ఠతో చేయునో వాని కోర్కెలు దీరును. తరువాత రావణా! నీవు నా రూపము నొందుదువు.

53 తా॥ ఎవని సన్నిధిలో ఆత్మ లింగమైుండునో వానికి మృత్యు భయము లేదు - ఆత్మ లింగ దర్శనమున సర్వ దోషములు నశించును.

54 తా॥ ఓయీ రావణ! ఆ లింగమును నీవు తీసుకొని వెళ్ళదలచిన దానిని ఎకాయెకి లంకా పట్టణమున నుంచవలెనేగాని త్రోవలో నేలపై నుంచ రాదు.

55 తా॥ ఇట్లని తెల్లనగు తన కరముతో నాచేతికిచ్చెను - సాక్షాత్ లింగమునకు నమస్కరించి లంకా పట్టణమునకుఁ గొనిపో నుంకించెను.

56 తా॥ ఈ సంగతిని నారదుఁడు తక్షణము తెలిసికొని - ఇది తగిన పని గాదని స్వర్గమునకుఁ బోయెను.

57 తా॥ ఆ నారదుడు స్వర్గమునకు బోయి - ఓయీ! ఇంద్రా! ఏమిట్లూరక కూర్చుంటివి? నీ స్వర్గక్ష్మిని రావణుడిప్పుడు హృదయపూర్వకముగ గొనిపోవును.

58 తా॥ లంకాధిపతి యిపుడు చిరాయువుగా నాశీర్వదింపఁబడి-కర్పూర సదృశ ధవళాత్మలింగమును పొందిన నీతో సమానత్వమును పొందును.

59 శ్లో॥ త్రివర్ష పూజనాత్త్వంహి మత్స్వరూపో భవిష్యసి।
పురీచతేపికైలాసో నాపిమృత్యుభయం తవ॥

60 శ్లో॥ ఇతి లబ్ధవరశ్శంభోః తుష్టో౽గాద్రావణఃపురం।
కారణం యే సురాబద్ధా స్తేషాం ముక్తిరితఃకుతః॥

61 శ్లో॥ లంకాయాం సేవ్యతాంనిత్యం భవద్భిర్భీతధరావణః।
రంభోర్వశ్యాదయో దేవ్యః సేవాంకుర్వంత తస్యతు॥

62 శ్లో॥ ఇంద్రోమునివచఃశ్రుత్వాభీతో౽కంపత సామరః।
ప్రణమ్యనారదం ప్రాహ కింకర్తవ్యమితః పరం॥

63 శ్లో॥ నారదఃప్రాహదేవేంద్ర బ్రహ్మాణం శరణంవ్రజ।
కథయిష్యామ్యుపాయం తే సజ్ఞాతా సర్వలోకసృట్॥

64 శ్లో॥ తతః స మునినా సార్థం బ్రహ్మలోకం ద్రుతంగతః।
తస్మైనివేదయామాస యథావృత్తంసురాధిపః॥

65 శ్లో॥ బ్రహ్మోవాచసురేంద్రం తం వైకుంఠ గచ్ఛసత్వరం।
దైత్యారిః స హృషీకేశ ఉపాయంహి విధాస్యతి॥

66 శ్లో॥ తతస్తే బ్రహ్మదేవాశ్చ వైకుంఠ భువనంగతాః।
ప్రాప్యనారాయణందేవం స్వవృత్తాంతం న్యవేదయన్॥

67 శ్లో॥ బ్రహ్మోవాచ మహావిష్ణో! ప్రతీకారంద్రుతంకురు।
మహాసంకట మగ్రే౽పి తవదేవ! భవిష్యతి॥

68 శ్లో॥ త్రయస్త్రింశత్కోటిసురాః నిబద్ధారావణేనహి।
తన్మోచనార్థమగ్రేత్వం క్షితావన్ తరిష్యః

59 తా॥ మూడు సంవత్సరముల పూజవలన - నీవు నా స్వరూపము నొంద గలవు - నీ పట్టణము కైలాసమగును - నీకు మృత్యు భయముండ దని శివు డాతనికి చెప్పెను.

60 తా॥ ఇట్టి వరమును రావణుడు శివునివలన పొంది స్వపురమునకుఁ బోయెను. ఏ దేవతలను రావణుడు బంధించెనో వారికిక ముక్తి గూడ నుండదు.

61 తా॥ మీరు గూడ ఇక్కడ నుండి లంకకు వెళ్ళి ఆ లింగమును సేవిం చండి! ఇఁక రంభ - ఊర్వశి మొదలగువారు - మీరును ఇక రావణు సేవ చేయవలయును.

62 తా॥ ఆ యింద్రుడు నారదునివలన విని దేవతలతో గూడి - స్వర్గ రాజ్య మును గూర్చి భయపడెను. నారదునకు నమస్కరించి, స్వామీ! మేమిప్పుడు చేయవలసినదేమియో చెప్పండి అనెను.

63 తా॥ అయ్యా! నీవు ఈ విషయమున బ్రహ్మను శరణొందుమని ఇంద్రు నకు నారదుడు చెప్పెను. ఆ బ్రహ్మ మీ కుపాయమును చెప్పును.

64 తా॥ ఇట్లు నారదునిచే ప్రేరేపింపబడి వెంటనే బ్రహ్మలోకమును పొందెను. తమకు జరిగిన విషయము నంతయు నింద్రుడు బ్రహ్మకు సర్వమును తెలిపెను.

65 తా॥ అపుడు బ్రహ్మ యింద్రునితో - ఓయీ యింద్ర! నీవిప్పుడు వెంటనే స్వర్గమునకు పొమ్ము - మా తండ్రి విష్ణుమూర్తి మీ కుపాయ మును తప్పక చెప్పుననెను.

66 తా॥ అపుడు వారందరు బ్రహ్మతో గూడ వైకుంఠమునకు బోయిరి. అచట నారాయణమూర్తిని గలిసి తమ వృత్తాంతమునంతయును ఆయనతోఁ జెప్పికొనిరి.

67 తా॥ అప్పుడు బ్రహ్మ విష్ణువుతో అయ్యా, దీనికి ప్రతీకారమును చేతురు గాక! ముందు మహా సంకటము తమకు గూడ కలుగును అనెను.

68 తా॥ అయ్యా, రావణునిచే యిపుడు 33 కోట్ల దేవతలును చిక్కియున్నారు. అందుచే ముందు తాము భూమియందవతరించి వాని గర్వమణచండి!

69 శ్లో। ఈశ్వరస్య ప్రాణలింగం గృహిత్వాఽగాత్ఖలాగ్రణీః।
రావణస్యనభంగోతః స ఏవేశోభవిష్యతి॥

70 శ్లో॥ కురుశీఘ్రముపాయం త్వం భవిష్యత్యన్యథాఽగ్రతః।
సుదుస్తరమిదం దేవ రక్షోనిర్దలనం హరే॥

71 శ్లో॥ ఇది బ్రహ్మవచః శ్రుత్వాకోపాధ్మాతో హరిస్తదా।
జాతావినష్టి రిత్యుక్త్వాకైలాసం త్వరితోగతః॥

72 శ్లో॥ ఈశ్వరం శంకరం ప్రాప్యవిష్ణుః ప్రోవాచరక్షసే।
రావణాయ కుతో దత్తం ప్రాణలింగం వ దాదునా॥

73 శ్లో॥ రావణోరాక్షసః క్రూరో దేవాయద్భృత్యతా మితాః।
కారాస్థితాః కతిపయాస్తేషాం ముక్తిః కథం తతః॥

74 శ్లో॥ పయః సర్పాయేవరాణ్ దురాచారాయ యచ్ఛసి।
పశ్యాధునామరత్వంస ప్రాప్తవాణ్ స్వర్గభాగ్భవేత్॥

75 శ్లో॥ ఉవాచ శివ ఈశస్తం విష్ణో! తద్భక్తి మోహితః।
విస్మృత్య తుష్ట మనసా ప్రాణలింగం మయార్పితమ్॥

76 శ్లో॥ రావణః స్వశిరశ్ఛిత్వా వీణాంకృత్వా స్వయంజగౌ।
సుస్వరంసాంగ రాగాఢ్యం సామగానం సుమంజులం॥

77 శ్లో॥ పార్వతీ సాఽపిధాతవ్యేత్యేవం మోహం మహోభవత్।
విస్మృత్యరావణాయైవ ప్రాణలింగం మయార్పితం॥

78 శ్లో॥ విష్ణురూప ఉమాకాంత! త్వమేవం దుర్లభాన్వరాణ్।
దదాస్యేతే న మే కష్టం దుష్టామత్తాభవంతిహి॥

69 తా॥ దుర్మార్గుడీశుని మెప్పించి ఆత్మలింగమును లంకకు గొనిపోయెను. రావణునకు వ్రతభంగము కాకున్న ఈశుడంతవాడగునట.

70 తా॥ స్వామీ! తామన్యథా భావించక దీని కుపాయము ఆలోచించండి! ముందా రావణుని వ్రత సమాప్తియైన వానిని సంహరించుట దుర్లభము.

71 తా॥ ఇట్టి బ్రహ్మ వాక్యమును విని విష్ణువు కోపోద్రేకుడై - వాడు నష్టమును పొందునులే అని కైలాసమునకు త్వరగా పోయెను.

72 తా॥ విష్ణువు కైలాసమునకు వెళ్ళి శంకరుని జూచి, స్వామీ! దుర్మార్గుడగు రావణున కాత్మలింగ మిచ్చితిరట దాన ముప్పు వాటిల్లును.

73 తా॥ రావణుడు క్రూరుడు. మీ బలమున దేవతలను సేవకులుగ చేసికొనెను. కొందరు దేవతలఁగారాగారవాసుల జేసెను వారలకు ముక్తి యెట్లు?

74 తా॥ స్వామీ, పాముకు పాలనుపోసినట్లు దుర్మార్గునకు వరములిచ్చితిరి. ఇపుడు వాడు దేవతల భయపెట్టి స్వర్గపాలకుడయ్యెను.

75 తా॥ అపుడు శివుడు విష్ణువుతో వాని యానాటి భక్తికి మెచ్చి మోహితుడనైతిని - ఆ మోహముతో మరచి వానికి ప్రాణ లింగమును వరముగ నిచ్చితిని.

76 తా॥ ఆ రావణుడు తన తలల నరికి నివేదన లిచ్చి - తననరములతో వీణ వాయించుచు మంజుల స్వరంతో నన్ను గానము చేసినాడు.

77 తా॥ అపుడు పార్వతియు వాని మాయకు లొబడి వరములీయ నంగీకరించెను నేను నిజముగ మరచియే వానికి ప్రాణలింగమిచ్చితిని.

78 తా॥ ఓయీ శంకరా! నీవు దుర్మార్గులకు దుర్లభములైన వరము లిచ్చుచుంటివి. దానిచే ఆ దుర్మార్గులు మత్తులై రెచ్చిపోవుచుందురు. అందులకు వారినణగద్రొక్కుట నాకు కష్టమగుచున్నదని విష్ణువనెను.

79 శ్లో॥ అవతార ప్రసంగోమే ఘటతే తే యతోఽసురాః।
భవంతి తే సుదుర్ధర్షాః దేవ బ్రాహ్మణ పీడకాః॥

80 శ్లో॥ లింగం తస్మైకదా దత్తం సోఽద్యలంకాం గతోనవా।
ఈశ ఊచేపంచనాడీమితకాల స్తతోగతః॥

81 శ్లో॥ ఇతి శ్రుత్వాశివవచః సూర్యాదర్శన కారణం।
విధాయ విష్ణు రాహూయ నారదం ప్రాబ్రవీదిదం॥

82 శ్లో॥ దేవర్షే! నారదాశుత్వం గచ్ఛమానసవేగవత్।
లంకాం గచ్ఛతి దుష్టోఽసౌ లింగమాదాయ రావణః॥

83 శ్లో॥ గత్వాతదగ్రత స్తస్య గమనాయ విలంబనం
కురు యత్నేన సోఽద్యాపి నగతో నిజమందిరమ్॥

84 శ్లో॥ సూర్యోఽప్య దృశ్యతాంయాయాత్సంధ్యావందనకర్మణి।
తిష్ఠేత్ స రావణోనూనం విఘ్నోప్యస్యభవిష్యతి॥

85 శ్లో॥ ఇత్యాజ్ఞప్తః స హరిణా నారదః సత్వరం యయౌ।
మనోగత్యాఽగత స్తత్ర రావణస్య పురఃపథి॥

86 శ్లో॥ తతో విష్ణు రువాచేదం సంగతం గణనాయకం।
విజ్ఞాయ ప్రేరయిష్యామి సత్వరం విఘ్న హేతవే॥

87 శ్లో॥ ఇత్యుక్త్వాధ సమాహూయ గణేశం విష్ణురబ్రవీత్।
విఘ్నేశాన గణేశాన రావణస్త్వాముపేక్షతే॥

88 శ్లో॥ త్వాంనమంతి సురాస్తేషాం సిద్ధింయాతా మనోరథాః।
యేలోకేత్వాముపేక్షంతే తేషాం విఘ్నాః పదే పదే॥

79 తా॥ ఆ దుర్మార్గుడు మీరిచ్చిన వరమహిమతో దేవతలను మునులను సాధువులను బాధించుట వలన నాకు అవతారశ్రమ గలుగుచున్నది.

80 తా॥ లింగమును వానికి మీ రెప్పుడిచ్చితిరి? ఇప్పు డా లింగముతో వాడు లంకకు చేరి యుండునా? అంతట శివుడు, ఓయీ విష్ణు! 5 నిమిషాల కాలము అయియుండును.

81 తా॥ ఆ మాటను విన్న విష్ణువు సూర్యుడు కానవచ్చుటలేదు. ఇది మంచి తరుణ మనుకొని నారదుని పిలిచి యిట్లనెను:

82 తా॥ ఓయీ నారదా! ఆ రావణుడు లింగమును గొని లంకకు చేరెనో లేదో? నీవు మనోవేగమున నచటకు వెళ్ళుము.

83 తా॥ నీ వచటకు వెళ్ళి అతడింతకు నింటికి చేరియుండడు. నీ వింకను యింటికి చేరనీక మాటలతో కాలయాపనను చేయుము.

84 తా॥ ఇంతలో సూర్యుడస్తమింపఁబోవును. అతడు సంధ్యావందనమున కాలసించునని ఆ సంధ్యా పనికి బూనుకొనును. అందుచే ఆత్మలింగ స్థాపనకు విఘ్నము అగును.

85 తా॥ విష్ణువు మాట ప్రకారము నారదుడు వెళ్ళి ఆ రావణునెదురుగ మార్గమున గలిసెను.

86 తా। ఇంతలో విష్ణువు విఘ్నేశుని బిలిచి, అయ్యా ! రావణునకు శివుడు ఆత్మలింగ మిచ్చి పంపుట మీకు తెలిసినదే ! వాడు దానిని లంకలో స్థాపించక ముందు వానికి విఘ్నమును గలిగించు మనెను.

87 తా॥ ఓయీ నీవు రావణునకు సమీపమున విఘ్న మొదవింపను పేక్షింపకు.

88 తా॥ నీ విట్లు చేసినందున దేవతలు మనోరథములను పూర్తి చేసుకొనగలరు. నీకు నమస్కరింతురు.

89 శ్లో॥ అద్యత్వామనివేద్యాసౌనిధానం రావణోఽహరత్।
ప్రాణలింగం గణేశ! త్వం మోహయిత్వా ప్రయత్నతః॥

90 శ్లో॥ అతోఽద్యభవతాకార్యం రావణస్య వివంచనమ్।
బాల వేషధరోభూత్వాతం వ్యాజేన వివంచయ॥

91 శ్లో॥ సమార్గేఽస్తమితే సూర్యే సంధ్యావందన కర్మణి।
రావణః స్థాస్యతి మునిస్తదర్థం చాగ్రతో గతః॥

92 శ్లో॥ శివాజ్ఞయా రావణస్స లింగం నస్థా పయిష్యతి।
నస్థాప యిష్యతికరే మూత్రోత్సర్గేచకర్మణి॥

93 శ్లో॥ బాలభావేన తంగచ్ఛ సౌమ్య శిష్యాత్మనాఽధవా।
స యధాయేన విశ్వాసం యాయాత్త్వాజ్ఞ స్తథాకురు॥

94 శ్లో॥ సంధ్యాకాలే త్వత్కరే స లింగం దాస్యతి నిశ్చితం।
గృహిత్వాతే నిధేహి త్వంధ్రువం స్థాస్యతి తత్రతత్॥

95 శ్లో॥ వ్యాజేన జయ్యఃఖలఇత్యుపాయం సమ్యగ్విచార్యేతి జగాద విష్ణుః।
తథేతిచోక్త్వా గణనాయకోఽపి పాధేయ భక్ష్యంసహరిం యయాచే॥

96 శ్లో॥ పంచఖాద్యతిలాన్ క్షీరం నారికేలేక్షు దాడిమమ్।
మోదకాన్ లడ్డు కాంశ్చైవ దేహిమే ఘృతసంప్లుతాన్॥

97 శ్లో॥ స మృదూంశ్చణకాన్ లాజాంచ్ఛర్కరాసహితాన్ హితాన్।
స్వామిన్మే భక్షణాయాద్యదేహితి త మయాచత॥

89 తా॥ ఆ రావణుడు నీకును తెలియకుండ దానిని గొనిపోయెను. ఓయీ గణేశ! ఆ ప్రాణలింగమును మోసముతో పుచ్చుకొని రావలయును.

90 తా॥ అందుచే గణేశ ఈ కార్యము నీ వలన గావలయును. నీవు బాల వేషముతోనైన రావణుని వంచించి, యేదేని నెపమున ఆత్మలింగ మును గొని రావలయును.

91 తా॥ సూర్యుడు త్రోవలో నస్తమించినచో రావణుడు సంధ్యావందనమునకుఁ బోవును. అట్లు కాగలందులకు ముందుగా నాతని కడకు నారదుని పంపితిమి.

92 తా॥ శివాజ్ఞ లేనిది రావణుడు లింగమును స్థాపించడు,మరియు నది చేతిలో నుండగా మూత్రోత్సర్జనము చేయడు.

93 తా॥ పిల్లవానివలెనుగాని శిష్యభావముగగాని అతడు నమ్ముచున్నట్లు చేసి తెలివితేటలతో అతని వెంట వెళ్ళుచుండుము.

94 తా॥ సంధ్యాకాలమైనచో నాతడు నీ చేతికి ఆ లింగమును తప్పక యిచ్చును. నీవు దానిని తీసుకొని అచటి నేలపై నుంచుము. వెంటనే ఆ లింగమచట స్థాయియై యుండును.

95 తా॥ విష్ణుమూర్తి - ఆ విధముగ నొక నెపముచే వానిని ఓడించవలసినదే. మూర్ఖుడుగద? ఆ గణేశుడు అట్లేనని- దారి బత్తెపు భక్ష్యములతో బయలుదేరి హరిని జేరెను.

96 తా॥ ఓయీ హరీ! నాకు భోగ్యములైన-భక్ష్యములను-కొబ్బరికాయలు చెఱుకుగడలను, దానిమ్మపండ్లు-ఉండ్రాళ్ళను అన్నిటిని మంచినేతితో బాగుగ వండినవాని నిమ్మనెను.

97 తా॥ మెత్తని శనగ గుగ్గిళ్ళను-పంచదారతో గలసిన మంచి పేలాలు మొదలగు తినుబండారముల నాకిమ్ము వెదలెదనని విష్ణువును చూచెను.

98 శ్లో॥ విఘ్నేశ్వరేణ యద్యత్తు యాచితం భక్ష్య ముత్తమమ్।
తత్తత్తస్మై దదౌ విష్ణుః జక్షన్ వర్ణీవ నిర్యయౌ॥

99 శ్లో॥ బ్రహ్మర్షి ర్నారదస్త్వగ్రే రావణస్య మనోజవః।
గత్వా తం ప్రాహ వినయా దాగతోఽసకుతోవద॥

100 శ్లో॥ రావణోనారదం ప్రాహ గత్వాకైలాస పర్వతమ్।
ప్రసాదితోమయాతత్ర చంద్రమౌళి ర్వరప్రదః॥

101 శ్లో॥ భూత్వామే సుప్రసన్నఃస ఆత్మలింగం ప్రదత్తవాన్।
సర్వకామప్రదం రమ్యం వరానపి బహూన్మునే!॥

102 శ్లో॥ నారదః ప్రాహ లంకేశ ఫలితం దైవమేవ తే।
లింగం మృత్యుహరం లబ్ధం జానే తదహ మాదితః॥

103 శ్లో॥ తన్మహ్యం దర్శయ తతో విలోక్యచ పరీక్ష్యచ।
కథయిష్యామి తే లింగ లక్షణాని సవిస్తరమ్॥

104 శ్లో॥ నారదస్య వచః శ్రుత్వా రావణః శంకితాంతరః।
దూరతో దర్శయామాసక రేవాసోఽపసార్యసః॥

105 శ్లో॥ తద్దృష్ట్వా నారదఃప్రాహ లంకేశముపవేశ్యచ।
లింగస్యమహిమానంతేశ్రుణు వక్ష్యామిసాదరం॥

106 శ్లో॥ రావణస్యతు లింగస్య జానామ్యుత్పత్తి మాదితః।
కథయామి కథామస్యత్వం భవైకాగ్రమానసః॥

107 శ్లో॥ మృగ ఏకః కదాచిత్తుకాలాగ్ని సదృశోవనే।
సైరంభగ్నభృతీన్వన్యార్ భక్షయిత్వాచచారహ॥

98 తా॥ విఘ్నేశుడడిగినవన్నిటిని విష్ణువు అతనికిచ్చెను, వినాయకుడు బాల బ్రహ్మచారి యగుటచే వానిలో గొన్నిటిని తినుచుబయల్వెడలెను.

99 తా॥ బ్రహ్మర్షియైన నారదుడు ముందుగా మనోవేగమున నాతని జేరెను నారదుడు వెళ్లుట తోడనే వినయముతో రావణుడు, మీ రాక యెచట నుండి అని ప్రశ్నించెను.

100 తా॥ అయ్యా! నేను కైలాస పర్వతమునకు బోయి, అచట శివుని మెప్పించి సంతోషపరచి లింగమును అడిగితిని.

101 తా॥ ఓయీ మునీ! శంకరుడు ఆ రావణ స్తుతికి మెచ్చి వానికా లింగము నిచ్చుటయేకాదు, అనేక వరములగూడ నిచ్చెను.

102 తా॥ ఆ మాట విన్న నారదుడు-ఓయీ, నేను మొదటనుండి యెరుగుదును. ఆ లింగము మృత్యుహరమైనది. నీకు దైవము తోడ్పడినది. లాభ కరమే.

103 తా॥ ఓయీ! నీవు నీ కిచ్చిన లింగమును చూపుము. దాని బాగోగులు, శుభాశుభ లక్షణముల దెలుపు దనెను.

104 తా॥ నారదు డడిగిన దానికి రావణుడంతరమున శంకించి - అయ్యా, ఇది చేతిలోనే ఉండవలెను - మీరు చూడఁదలచిన దూరముగ నుండి చూడండనెను.

105 తా॥ దానిని చూచిన వెంటనే నారదు డా లింగము యొక్క మనుగడను రావణుని సమీపమునకు చేరి వినిపింపఁదొడగెను.

106 తా॥ ఓయీ రావణా! ఈ లింగము యొక్క పుట్టుక మొదలుకొని యింత వఱకు తెలియ చెప్పుదును-సావధానముగ నేకాగ్ర చిత్తముతో వినుము.

107 తా॥ ఒకప్పుడొక మృగము కాలాగ్ని సదృశమైనది వనములో స్వేచ్ఛగాఁ దిరుగ నాయడవి నున్న మృగములను చెట్లను ధ్వంసము చేయు చుండెను.

108 శ్లో॥ బ్రహ్మవిష్ణుమహేశానా మృగయార్థం వనంగతాః।
త్రిమూర్తయోమృగం హత్వా తస్యమేదోఽభజం స్తదా॥

109 శ్లో॥ తస్యస్యుః త్రీణిశృంగాణి లింగానితదదోఽపిచ।
త్రీణి త్రిభిర్గృహీతాని ప్రాణలింగానితానితు॥

110 శ్లో॥ మాహాత్మ్యం శ్రుణులింగస్య రావణ స్త్యైకచేతసా।
త్రివర్షం పూజయే ద్యః సః ఈశ్వరోవరదోభవేత్॥

111 శ్లో॥ యత్రతిష్ఠేదిదంలింగం సకైలాసం నసంశయః।
బ్రహ్మవిష్ణుమహేశానాం మహత్వం లింగధారణాత్॥

112 శ్లో॥ శ్రుణ్వాన్యమపివక్ష్యామిమహిమానంహి రావణ!।
సప్రాహనశ్రుణోమీహలంకాం యాస్యామిసత్వరమ్॥

113 శ్లో॥ ఇత్యుక్త్వాగంతుముద్యుక్తం రావణంప్రాహ నారదః।
సంధ్యావందనకాలోఽయం బ్రాహ్మణానాముపాగతః॥

114 శ్లో॥ అనేకవేదవేత్తాత్వం కథంమార్గం క్రమిష్యసి।
సంధ్యాకాలేఽధ్వనిప్రాప్తే సంధ్యాలోపోభవేన్నకిమ్॥

115 శ్లో॥ అహం తిష్ఠామీహ సంధ్యావందనం కర్తుమేవహి।
ఇత్యుక్త్వా రావణం సింధుం సంప్రాప్తోనారదోమునిః॥

116 శ్లో॥ అత్రాంతరే బ్రహ్మచారివేషధారీగణేశ్వరః।
రావణస్యాగ్రతోభూత్వాయజ్ఞియాః సమిధోఽచ్ఛినత్॥

117 శ్లో॥ మనసాచింతయద్రక్షః సందేహోఽయ ముపాగతః।
వ్రతభంగోభవేత్సంధ్యా వందనా భావతోమమ॥

108 తా॥ ఒకనాడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముప్వు రామృగమునకై అడవికి వెళ్ళి దాని మేదస్సును ముప్వురు తినిరి.

109 తా॥ ఆ మృగమునకు మూడు కొమ్ములుండినవి - ఆ లింగముల మూడి టిని ఒక్కొక్కరొక్కొక్కటిగ చేపట్టి వానిని ప్రాణలింగములనిరి.

110 తా॥ ఆ లింగమహిమను విను - రావణా! మూడు సంవత్సరము లాలింగ మును పూజించినవాడు శివుడై, వరప్రదుడగును.

111 తా॥ ఎచట నీ లింగముండునో అచట కైలాసము - ఇది నిశ్చయం. ఈ లింగముల ధరించినందుననే బ్రహ్మ విష్ణు మహేశులు మహిమాన్వితు లైరి.

112 తా॥ ఓ రావణా! ఇంతేకాదు - దాని మహిమ మరియు వేరొండు గలదు, వినుమనెను. అపుడు రావణుడు - ఇక నేను వినుకాలము లేదు - లంకా పట్టణమునకు తొందరగ వెళ్ళవలెననెను.

113 తా॥ ఇట్లని అతడు పరుగెత్తి పోబోవుచుండగా నారదుడు-అయ్యా, ఇపు డెటు కదలరాదు- బ్రాహ్మణులకు సంధ్యావందన కర్తవ్యకాలమనెను.

114 తా॥ ఓయీ రావణా! నీవనేక వేదముల నెరుగుదువు - నీవీ సంధ్యావందన కాలము నెట్లు వదలుదువు? మార్గమున సంధ్యా సమయమైతే - దాని లోపము వల్ల పాపము గద?

115 తా॥ నేనిక్కడ కూర్చుండియే యుందును - నీవు సంధ్యావందన మిచట సముద్రమున చేసి రమ్ము వెళ్ళుమని పంపెను.

116 తా॥ ఇంతలో గణాధిపతి బ్రహ్మచారి వేషధారియై యజ్ఞమునకై సమిధ లను తెంచుకొనవచ్చెను రావణుని దగ్గరకు.

117 తా॥ అంత రావణుడు - నాకు త్రికరణశుద్ధిగ సందేహము గలుగుచున్నది. ఇవాళ సకాలసంధ్యావందన కర్మము వ్రతభంగమగునట్లు న్నదని సందేహపడెను.

118 శ్లో॥ క్రియాకాలే నైవదార్యం లింగంనాపిమహీతలే।
స్థాపితవ్య మతఃసంధ్యాకాలేఽస్మిన్ కింకరోమ్యహం॥

119 శ్లో॥ అయంతు బ్రహ్మచారీహ బాలకోఽతీవసుందరః।
సింధుతీరంపర్యటతి గత్వాపృచ్ఛామితంఖలు॥

120 శ్లో॥ బ్రహ్మచారీవటురయంనైవ విశ్వాసఘాతకృత్।
తత ఏతన్మహాలింగం దత్త్వైతస్యకరేఽత్ర తు॥

121 శ్లో॥ కుర్వే సంధ్యావందనాది నిత్యకర్మేతిరావణః।
విచార్యప్రయయౌ తస్య సమీపం బ్రహ్మచారిణః॥

122 శ్లో॥ లంబోదరో దశగ్రీవం దృష్ట్వాదూరం యయౌ భియా।
రావణోఽప్యభయం దత్వా తత్సమీపం సమాగతః॥

123 శ్లో॥ రావణో మంజులంప్రాహక స్త్వం మాతాపితా తవ।
కో వాకస్మిన్కులే జన్మ తవజాతం వదస్వమే॥

124 శ్లో॥ ఉవాచ బ్రహ్మచారీ తం మాం పృచ్ఛసికుతోవద।
పితృభ్యాం మమ కిందేయమృణంతే కథయాగ్రతః॥

125 శ్లో॥ ప్రహసన్నపి లంకేశః స్నేహభావేన తత్కరం।
ప్రగృహ్యప్రాహపృచ్ఛామి ప్రీత్యామాం వదపుత్రక!॥

126 శ్లో॥ బ్రహ్మచారీ తతఃప్రాహ మహాత్మాఽస్తి పితామమ।
రుద్రాక్షభూషితో భస్మలిప్తగాత్రో జటాధరః॥

127 శ్లో॥ తస్య శంకర ఇత్యాఖ్యా భిక్షార్థమటతిక్షితిమ్।
నక్తం దివముమాసంజ్ఞా మమ మాతాఽపివిశ్రుతా॥

118 తా॥ నా చేతిలింగమును నేనెంతసేపు పట్టుకొనియుందును? దీనిని భూమిపై నుంచరాదు. సంధ్యావందనకాలమిప్పుడు వచ్చినది. నేనేమి చేయుదును?

119 తా॥ ఇతడు - బ్రహ్మచారి - సుందరుడైన బాలకుడు - ఈ సింధుతీరమునం తిరుగుచున్నాడు. అతని వద్దకు వెళ్ళి నేనడుగుదును.

120 తా॥ ఏమంటే, ఈ బ్రహ్మచారి - దేవవిశ్వాసపరుడు - భగవంతునిపై విశ్వాసములేనివాడుకాడు - ఇప్పుడీ సంధ్యావసరసమయమున యీతని చేతికిలింగమును మోయనిత్తుననెను.

121 తా॥ ఈ లింగమునాతడు ధరించితే నా సంధ్యావందనము నిత్యకర్మ పరిపూర్తి యగునని ఆ బ్రహ్మచారి వద్దకు వెళ్లెను.

122 తా॥ ఆ విఘ్నేశ్వరుడు - రావణుని చూచి దుష్టుడను భీతితో దూరముగా తొలిగిపోవుచుండెను.

123 తా॥ ఓయీ బ్రహ్మచారీ! అని మధురస్వరమున పిలిచి అయ్యా! మీ తలిదండ్రులెవరు? ఎందులకిట వంటరిగా తిరుగుదువు? నీ జన్మ ఎట్టిది? అనెను.

124 తా॥ అప్పుడా బ్రహ్మచారి రావణునితో నీకు నా సంగతేల? నేనెక్కడ వాడనైతే నీకెందుకు? మా తలిదండ్రులు నీకేమైన ఋణమా? ఉంటే దానినంతటిని చెప్పమని రావణుని నడిగెను.

125 తా॥ అయ్యా బాబూ! బాలక! అని నవ్వుచు - ఆయన చేయిని పట్టుకొని బ్రహ్మచారీ! నీయందున్న ప్రేమతో నడుగుచుంటిననెను.

126 తా॥ అయితే విను - రావణా! మా నాన్నగారు చాలా మహాత్ముడు రుద్రాక్షలు ధరిస్తాడు. వంటి నిండ విభూతి పూస్తాడు - జడలుధరించి వుంటాడు.

127 తా॥ ఆయన పేరు శంకరుడు. ప్రతి రోజు భిక్షకై భూమిపై తిరుగుతుంటాడు. రాత్రింబవలు ఆయన వెంటనే ఉమా అనే పేరుగల మా అమ్మ ఉంటుంది. ఆమె పేరుగల తల్లి.

128 శ్లో॥ ఏతావ త్పృచ్ఛసికుతో బాలకోఽహమధీరధీః।
ముంచముంచకరంయాస్యే గృహంత్వత్తోబిభేమ్యహం॥

129 శ్లో ఇతి శ్రుత్వాద్విజసుతం మత్వాతం ప్రాహరావణః।
భిక్షుకస్తేపితా రంకః సుఖవార్తా కుతస్తవ॥

130 శ్లో॥ మమలంకాపురీహైమీ యత్ర రత్నమయాని తు।
గృహాణతాం మమాగచ్ఛ తత్ర దేవార్చకోభవ॥

131 శ్లో యద్యద్యాచసి తత్తత్తే దీయతే సకలం మయా।
మయాసహ సమాగచ్ఛ సుఖం యాస్యసి నిర్వృతః॥

132 శ్లో సప్రాహలంకాం నోయాస్యేనరాశాయత్ర రాక్షసాః।
తే మామారణ్యకం బాలం భక్షయిష్యంతిరాక్షసాః॥

133 శ్లో॥ తస్మాల్లంకాంనయాస్యామి కరంముంచవ్రజామ్యహం।
చణకాశనతోఽశాంతా క్షున్మే యాస్యే తతోగృహమ్॥

134 శ్లో॥ ఇత్యుక్తవంతంతంబాలం ప్రసాద్యప్రాహరావణః।
యావత్సంధ్యాముపాశిష్యేతావల్లింగంగృహాణభోః॥

135 శ్లో॥ బాలకః ప్రాహతేలింగం మన్యేగురుతరంతుతత్।
కరేధర్తుంన శక్నోమి మామాంపీడయవర్ణినం॥

136 శ్లో॥ లింగం జడమహమ్మూఢో ధర్తుం శక్నోమినైవహి।
కరం ముంచగృహం యాస్యేధర్మోనేనభవేత్తవ॥

137 శ్లో॥ ఏవం శ్రుత్వాఽపితం ప్రార్థ్యతల్లింగంతత్కరేదదౌ।
గత్వాసముద్రతీరం స సంధ్యావందనమారభత్॥

128 తా॥ ఆ బాలుడు ఇట్లు చెప్పి - ఎందుకడిగితివి? సరే, ఏమైనను నిన్ను చూస్తే నాకు భయంగా వుంది - నా చేయి వదలుము - వదలు మనెను.

129 తా॥ ఈ మాటల విని-పాపమితడు బ్రాహ్మణపుత్రుడు-అయ్యా! మీ నాయన భిక్షుకుడంటివే? అతడు పనికిమాలినవాడా? అట్లైన నట్టివానితో నీకు నీ యింట సుఖములేదుగద అనెను.

130 తా॥ నా నివాసమైన లంకాపురి బంగరుమయమైనది. రత్నముల కూర్పు గలది మా గృహములు మంచివి. మా యింటికి రమ్ము! మా యింట దేవతార్చనము జేసుకొనుము-

131 తా॥ నీవేదేది కోరితే దాని దానినంతయు వెంటనే యిత్తును. నా వెంట మా యింటికివస్తే నీకు సుఖము - బాగుగ నుందుననెను.

132 తా॥ అప్పుడు రావణుడు - ఓయీ! నీవు నావెంటగాక వేఱుగా తిరిగిన - రాక్షసులు మానవ భక్షకులు - అందుచే వీడెవడో అడవి పిల్లవాడని నిన్ను చంపి తినివేతురనెను.

133 తా॥ అయ్యా! అందుకనే నేను లంకకు రాను. నా చేతిని వదలుము - అయ్యా, ప్రస్తుతము నా ఆకలి మంటకు కొన్ని శనగలతిని క్షుద్బాధ పోగొట్టుకొని మా యింటికేగుదుననెను గణపతి.

134 తా॥ ఇట్లనుచున్న బాలకుని మంచి మాటలతో ప్రసన్నునిచేసి రావణు డిట్లనెను: అయ్యా! నా చేతి యీ లింగమును నీవు పట్టుకొని యుండుము. ఇంతలో నేను సంధ్యావందనము చేసికొని వచ్చి తీసి కొందుననెను.

135 తా॥ అంతనా బాలకుడనెను: అయ్యా! ఇది చాల బరువైన లింగము. నేను దీనినెట్లు ధరింపగలను? నేను బ్రహ్మచారిని, నన్ను పీడింపకు మనెను.

136 తా॥ ఇది జడమైన దానినినేనెట్లు మోయుదును? నీ ధర్మ మేమైనగానిమ్ము నా చేతిని విడుము. నా యింటికి పోదుననెను.

137 తా॥ ఇట్లన్నను ఆ బ్రహ్మచారిని బ్రతిమాలి ఆత్మలింగము నాతనిచేత పెట్టి వెంటనే వత్తునుండుమని సముద్రతీరమునకు సంధ్యకు పోయెను.

138 శ్లో॥ బ్రహ్మచారీ తమాభాష్య స్థితః ప్రోవాచ రావణం।
యావత్సామర్థ్యమాదాయ లింగం తిష్ఠామి నిశ్చితమ్॥

139 శ్లో॥ త్వం శీఘ్రమేహినోచేత్త్వాం త్రిరాహూయ ప్రయత్నతః।
అనాగతేత్వయి క్షిత్యాం స్థాపయిష్యామ్య సంశయమ్॥

140 శ్లో॥ ఏవం నిర్ధార్యహస్తాభ్యాం లింగమాదాయ స స్థితః।
దివి దేవా విమానేషు స్థితాః కౌతుక మీక్షితుం॥

141 శ్లో॥ అర్ఘ్య ప్రదాన కాలేతం రావణం సగణాధిపః।
ప్రాహవోఢుం నశక్నోమి లింగం తే శీఘ్రమేహిభోః॥

142 శ్లో॥ స్నాన పూర్వకమర్ఘ్యం సదాస్యం స్తిష్ఠక్షణం త్వహమ్।
ఆగమిష్యామీతి హస్తముద్రాం తస్మైవ్య దర్శయత్॥

143 శ్లో॥ పునఃక్షణం విరమ్యాసౌ త్రి రాహూయ గణేశ్వరః।
ప్రాహ భారంనశక్నోమి వోఢుమాగచ్ఛ సత్వరం॥

144 శ్లో॥ దశాననో గణేశేనత్రి రాహూతోఽపినాగతః।
స్వఃస్థాన్ సురగణాన్కృత్వా సాక్షిణోగణనాయకః॥

145 శ్లో॥ శ్రీవిష్ణుం మనసా స్మృత్వాస్థాపయామాస భూతలే
లింగం సంతోషమాపన్నా దేవాః పుష్పముచోదివి॥

146 శ్లో॥ దత్వార్ఘ్యాణి సలంకేశః శీఘ్రమాగత్యబాలకం।
తల్లింగం స్థాపితందృష్ట్వా క్రుద్ధోబాలం వ్యతర్జయత్॥

147 శ్లో॥ విశ్వాసఘాతక సుదాంభిక కూటతోక
త్వం విప్రలంభక సువంచక మూర్ఖరంక।
రేబుద్ధి పూర్వకమి దంకృతవానసీతి
ప్రోక్త్వా వ్యతాడయ దసావహసద్విదిత్వా॥

138 తా॥ అంతట బ్రహ్మచారి రావణునితో ఉన్న సంగతిని చెప్పెను. ఏమంటే? అయ్యా! దీనిని నెంతసేపు మోయు సామర్థ్యముండునో చెప్పలేను. నాయోపినంతసేపుందును.

139 తా॥ అయ్యా! నీవు శీఘ్రముగ రమ్ము. నేనా లింగమును మోయభరింప లేనపుడు నిన్ను ముమ్మారు పిలుతును. నీవు రానిచో యీ లింగమును నేలపై పెట్టెదను. అందు సందేహము లేదు.

140 తా॥ ఇట్లు ఆ రావణునితో నొప్పందమును చేసికొని అతని చేతినుండి బ్రహ్మచారి లింగమును గొనెను.

141 తా॥ సరిగా రావణు డర్ఘ్యప్రదానమిచ్చు సమయమునకు గణపతి రావణుని రమ్మని పిలిచెను. ఓయీ, నేను భరింపలేకున్నాను. నీవు నీ లింగమును గొనుము రమ్మని పలికెను.

142 తా॥ అయ్యా! నేను అర్ఘ్య దానమిత్తునని న్యాసము చేసితిని. ఒక క్షణ ముండుము. ఇదిగో అర్ఘ్య ప్రదాన హస్తమని యెత్తి చూపెను.

143 తా॥ వెంటనే ఒక క్షణము ఆగి రావణుని మూడుసార్లు పిలిచెను. అయ్యా! నాకు లింగము బరువెక్కినది. మోయలేను, రమ్మని పిలిచెను.

144 తా॥ రావణుడు కర్మ మధ్య నుండుటచే గణపతి పిలిచినను రాలేదు. వెంటనే గణపతి దేవతలను సాక్ష్యముగబెట్టి భూమియందుంచెను.

145 తా॥ దానిని నేలపై పెట్టునపుడు విష్ణువును మనసులో స్మరించుచు నేలపై లింగమును నుంచుటతోడనే దేవతలు, లింగము సంతసించె. దివినుండి పుష్పవృష్టి గురిసెను.

146 తా॥ అర్ఘ్యమిచ్చి రావణుడు వచ్చి చూచి లింగస్థాపనను గని కోపముతో ఆ బాలుని కసరెను.

147 తా॥ ఓరీ చెడ్డవాడ! నీవెంత విశ్వాసఘాతుకుడవు. లింగమును నానుండి విడదీసి నేలపై పెట్టితివి. నేను వ్రతభంగమగునని రానైతిని. నీవు మూర్ఖుడవు. వంచకుడవు. దీనిని నీ విప్పుడు బుద్ధిపూర్వకముగనే చేసితివి. ఓయీ! నీవు కావలయునని యిట్లు చేసితివి.

148 శ్లో॥ పాలకః ప్రాహ యస్మాన్మామసమర్థ మనాగసమ్।
తాడయిష్యామి పిత్రేఽదో వక్ష్యామీతి బ్రువన్గతః॥

149 శ్లో॥ తతస్సరావణోలింగం కరైర్ధృత్వాహతేనతు।
ఉద్ధర్తుం యతమానోఽపి తదుద్ధర్తుం శశాకనో॥

150 శ్లో॥ స్వశిరస్తాడయామాస చకంపే ధరణీతదా।
రావణస్యబలం క్షీణంజాతం లింగం మహాబలం॥

151 శ్లో॥ మహాబలేశ్వర ఇతి లింగనామ తతోఽభవత్।
నిష్పీడనేన చోద్ధారాద్గోకర్ణా కారతాంగతం॥

152 శ్లో॥ లంకానాథోఽధ తత్రైవ తపస్తప్త్వాఽలభ ద్వరాన్।
తతః ప్రభృతి తత్క్షేత్రం జాతంగోకర్ణ సంజ్ఞితమ్॥

153 శ్లో॥ సమస్తా దేవతాస్తత్ర తత ఆరభ్యసంస్థితాః।
అద్భుతా మహిమా తస్యప్రోక్తా స్కందపురాణకే॥

154 శ్లో॥ ఇతి సిద్ధవచోఽభిలాషుకః
స నిశమ్యాప్యథ నామధారకః।
స్మవిపృచ్ఛతితత్ప్రవ
క్ష్యతిక్షితి దేవోమతిమాన్ సరస్వతీ॥

ఆధ్యాయసార సంగ్రహ శ్లో॥కః :
శివోదశాస్యాయ దదౌస్వలింగం ప్రగృహ్యదంభాద్గణ పత్తతస్స.
ఉపేంద్రవన్నాలముఖేరితఃతంమహాబలేశం నిదధౌ నషష్ఠే॥

**148** తా॥ ఓయీ! నీవు నిరపరాధిని నిన్ను రక్షింపఁదగవు. నీ వధికముగ మాట్లాడిన నిన్ను తన్నుదును. మా నాన్నతో చెప్పి నిన్ను అపరాధిని చేతును.

**149** తా॥ వెంటనే రావణుడు ఆ లింగమును చేతులతో నెత్తుటకు ప్రయత్నించెను. కాని, ఆ లింగము రాదయ్యెను.

**150** తా॥ ఎంతకు లింగము కదలకున్న రావణుడు నెత్తిని బాదుకొనెను - భూమి అల్లలాడెను - లింగము మిక్కిలి బలమెక్కి బిగిసిపోయెను.

**151** తా॥ అదిమొదలాలింగము - మహాబలేశ్వరుడని దానిని పీడింపకయే కదలించినందున - గోకర్ణాకారముగ నున్నందున - గోకర్ణేశ్వరుడని - అచటి యీశ్వరలింగమునకుఁ బేరు.

**152** తా॥ ఆ లింగనాథుడు గోకర్ణుడనువాడు - అచట చాలకాలము తపస్సును చేసి వరముల బొందెను. అది మొదలు గోకర్ణేశ్వరుడు వరప్రదుడని - దానిని జూడ శ్రీపాదులవారు తల్లి యానతిని వెళ్ళిరి.

**153** తా॥ అందుచే సమస్త దేవతలెప్పుడాస్వామిని సేవింతురు. ఈ గోకర్ణ క్షేత్ర మహిమ చాల అద్భుతము. ఇట్లని స్కాంద పురాణములో విస్తృతముగాఁ జెప్పఁబడినది.

**154** తా॥ ఇట్లు సిద్ధయోగి వాక్యముల విని నామధారకుడు ఆ స్వామి గొప్పగ ఎక్కువ ప్రీతిగల వాడయ్యెను. ఓయీ! నీకు తోచిన సందేహము లడుగుము. దానికి సమాధానమును - ఆ సరస్వతీ యోగియైన దత్తుడే సందేహనివారకుడగును.

గద్య॥ దీనిని గంగాధర సరస్వతీ తనూజుడును - శ్రీ నృసింహ సరస్వతీ స్వామి వారి శిష్యుడునగు వాసుదేవానంద సరస్వతి - మహారాష్ట్ర భాషలోని గురుచరిత్రను సంస్కృతమున సప్తసాహస్రముగ వచించిన దానికి - జ్ఞానకాండలో ఆరవ అధ్యాయము తాత్పర్యము సమాప్తము.

తా॥ రావణునకు శివుడాత్మలింగమిచ్చుట - దానిని గొనిరాలేక నడుమ గణపతిచే గోకర్ణమున స్థాపింపబడుటచే మహాబలేశ్వరుడని - గోకర్ణుడు తపముచేసి వరములొందెనన్న కారణముగ గోకర్ణ నామమని - శ్రీ శ్రీపాదస్వామి వారు మొదటగా వెళ్ళిన గోకర్ణక్షేత్ర మహిమరూప - ఆరవ అధ్యాయం సమాప్తము.

# శ్రీ గురుదత్త చరితే

## సప్తమోఽధ్యాయః - జ్ఞానకాండః

1. శ్లో॥ నామధారక ఊః చేతం కృపయావిస్తరేణమే।
గోకర్ణ మహిమానం తం వదకే లేభిరే వరం॥

2. శ్లో॥ హిత్వా సమస్తతీర్థాని శ్రీపాదో యత్ర సంస్థితః।
కథాం కథయ మే తస్యక్షేత్రస్య త్వం పురాతనీం॥

3. శ్లో॥ యస్యాస్తి సద్గురౌ ప్రీతిః స తీర్థ మహిమాశ్రుతిమ్।
వాంఛాతీతః కృపామూర్తే! జ్ఞానజ్యోతిర్వదస్వ మే॥

4. శ్లో॥ సిద్ధః ప్రాహైకచిత్త స్సన్ శ్రుణుత్వం నామధారక।
గోకర్ణ మహిమానం తే కథయిష్యామి విస్తరాత్॥

5. శ్లో॥ పూర్వ మిక్ష్వాకువంశోఽభూత్ రాజా మిత్రసహాభిధః।
సర్వధర్మ రతశ్శూరః క్షత్రియాణాం ప్రతాపవాన్॥

6. శ్లో॥ రాజా సకల ధర్మజ్ఞః వివేకీ శ్రుతి తత్పరః।
కులాభిమానే ప్రబలాఢ్యోసౌ నిత్యోద్యోగోదయానిధిః॥

7. శ్లో॥ ఏవం సన్నేకదా రాజా మృగయార్థం వనంగతః।
ప్రవిష్టోఽభూ న్మహారణ్యం సింహాదేర్యత్ర సంస్థితిః॥

8. శ్లో॥ రాజా ని ర్మనుజేఽరణ్యే వినేష్యన్ వ్యాఘ్ర పూర్వకాన్।
దదర్శజ్వల నాకారం దైత్యమేకం భయానకమ్॥

1 తా॥ ఓయీ! సిద్ధయోగి! దయతో నాకు గురు కథను విపులముగా చెప్పితివి- గోకర్ణక్షేత్ర మహిమ అనంతమైనదంటిరి - దానిని నాకు విన్పించండి! ఆ యీశ్వరునిచే వరము నెవ్వరు పొందిరి?

2 తా॥ శ్రీ శ్రీపాదవల్లభుల వారు పుణ్య తీర్థముల నన్నిటిని వదలి గోకర్ణ క్షేత్రమందే చాలా కాల ముండిరంటే అది పురాతన క్షేత్రమని పుణ్య ప్రదమైన దగుటచే దాని మహిమను వినగోరు చుంటిని - తెలుపండి!

3 తా॥ ఏ యీ పుణ్యక్షేత్ర మంటే గురువుగారు ప్రేమించిరో - అది చాల మహిమగలదై యుండును. కావున దయతో నా పుణ్యక్షేత్ర మహిమను వినిపించం డని ప్రార్థిస్తున్నాను - చెప్పండని ప్రార్థన.

4 తా॥ సిద్ధుడు - నామధారక! నీకు గోకర్ణ క్షేత్ర మహిమను విస్తరించి చెప్పుదును - ఏకాగ్ర చిత్తముతో వినుము - అనెను.

5 తా॥ పూర్వ మిక్ష్వాకు వంశమున బుట్టిన వాడు - క్షత్రియ శూరుడు - స్వధర్మము నాచరించుచు రాజ పదవిలో గణన కెక్కిన వాడు - మిత్ర సహు డను పేరు గల రాజొకడుండెను.

6 తా॥ ఆ రాజు సమస్త ధర్మముల నెఱిగిన వాడు - వివేకి - వేద ధర్మము నాచరించు వాడు - కులాభిమాని - బలాఢ్యుడు - ఎప్పుడు కాలమును వ్యర్థ పుచ్చక దయతో ప్రజోపకారముల చేయుచుండును.

7 తా॥ ఇట్లుండ నా రా జొకప్పుడు - వేటకై అరణ్యమునకు బోయెను - సింహ శరభ శార్దూ లాది క్రూర జంతువులతో గూడిన భీకరా రణ్యమునఁ బ్రవేశించెను.

8 తా॥ ఆ రాజు నిర్మానుష్యమగు నా యడవి యందు -పులులకై వెదకు చుండగా నొక చో భయంకరముగా - అగ్నివలె మండి పడుచున్న నొక రాక్షసుని చూచెను.

9 శ్లో॥ సజ్జీకృత ధనూ రాజా వవ ర్షామర్షణ శ్శరాన్।
తై ర్బాణై రసురో విద్ధో మూర్ఛితో నిపపాత సః॥

10 శ్లో॥ భ్రాతా తస్య బలీ దృష్ట్వా మ్రియమాణం స్వసోదరం।
విలీయ విలలా పాతి దుఃఖితో భ్రాతృ శోకతః॥

11 శ్లో॥ త్యజన్ ప్రాణాన్స దైతేయః ప్రా హాసి త్వం స సోదరః।
త్వర్తి మ ద్ధింసకం భూపం ఘాత యైనం ప్రయత్నతః॥

12 శ్లో॥ ఇతి సోదర మాభాష్య సదైత్యః పంచతా మితః।
తద్భ్రాతాసోఽపి మాయావీ నరరూప ధరోఽభవత్॥

13 శ్లో॥ నృ రూ పేణ నృపం ప్రాప్య బలిన స్తస్య భూపతేః।
సౌమ్య వా క్సేవకో భూత్వా తం భేజే ఽతీవ నమ్రవత్॥

14 శ్లో॥ విజ్ఞాయ కపటీ నిత్యం స్వామినో ఽస్య మనోగతమ్।
అనుకూల్యేన తం భేజే రాజానం వన చారిణం॥

15 శ్లో॥ దుష్టజీవాన్ నృపో హత్వా హింస్రాన్ సంతుష్టమాననః
పరావృత్య పునః ప్రాప్తః స్వపురీం సేవ కాన్వితః॥

16 శ్లో॥ ఛిద్రం పశ్యన్ సదైత్యో ఽపి కాపట్యేన స్థిత స్తతః।
రాజ్ఞా ప్రాప్తే పితృశ్రాద్ధే వశిష్ఠాద్యా నిమంత్రితాః॥

17 శ్లో॥ తస్మిన్ నే స్వయం పాక స్థానే కపటి సేవకం।
త త్కాపట్యానభిజ్ఞ స్తం నియోజ్య ప్రాహభూపతిః॥

18 శ్లో॥ సేవ కాత్ర త్వయా స్థిత్వా యద్య దాజ్ఞాపయ త్యసౌ।
వల్లవ స్తదా నీయ పాక సిద్ధ్యై ప్రదీయతాం॥

9 తా॥ ఆ రా జా క్రూర దైత్యుని పై ధనువు నెక్కు పెట్టి ఎడతెరపి లేకుండ బాణముల వర్షమును గురిపించెను - ఆ బాణ పాతములకు తట్టుకొన లేక - బాణ నిహతుడై పడి పోయెను.

10 తా॥ అంతట మూర్ఛ పడిన రాక్షసుని తమ్ముడు - సోదరుడు మరణించె నని - భాతృ శోకముతో లోలోన దుఃఖించెను.

11 తా॥ ఆ మొదటి రాక్షసుడు - కొంత సేపటికి తన ప్రాణముల కదలుచు సోదరునితో నిట్లనెను: సోదరా! నా ప్రాణ ఘాతుకుడైన యీ రాజును ఏ విధముగ నైన ప్రయత్నముతో చంపుము.

12 తా॥ ఇట్లుగా సోదరుని తో చెప్పి యా మొదటి రాక్షసుడు ప్రాణముల విడిచెను. ఆ సోదర రాక్షసుడు మాయావి - అందుచే తన మాయతో నర రూపమును వెంటనే ధరించెను.

13 తా॥ మానవ రూపంతో రాజు వద్ద - బలవంతుడగు నా రాజునకు విధే యుడై సేవకత్వము వహించి. మంచి మాటలతో వినయమును జూపుచు - నా రాజును సేవించు చుండెను.

14 తా॥ కపటియైన ఆ రాక్షస సోదరుడు (నర రూప సేవకుడు) రాజు గారికి అనుకూల మనఃప్రవృత్తితో ఆ యరణ్య సంచారియైన రాజును సేవించు చుండెను.

15 తా॥ దుష్టములైన క్రూర మృగములను హింసించుచు ఆరాజు సంతసించు చుండెను. తర్వాత ఆ వేటను చాలించి సేవకునితో గూడ తన పురమునకు బోయెను.

16 తా॥ ఆ రాక్షసుడు రాజు వెంట నుండి ఆయనను చంపుటకుఁ దగిన అధర్మముల గనిపెట్టు చుండెను. అంత గొన్ని రోజులకు రాజు నింట పితృ శ్రాద్ధము రాగా వశిష్ఠాదుల భోక్తలగ బిల్చెను.

17 తా॥ ఆ రోజున వంటల వానికి సాహాయమునకై యా కపట రాక్షస సేవకు నుంచెను. ఆ రాజు ఆకపట రాక్షసుని చిత్తవృత్తి నెఱుగక వానిని నియమించెను.

18 తా॥ ఓరీ సేవకా! నీ విట నుండి యీ వంటవాడేది యడిగిన దానిని వంటల వాని కందించుచు పాకము చేయు వీనికి సాయపడుచుండు మనెను.

19 శ్లో॥ తథేతి స ప్రతి శ్రుత్య నరమాంసం ప్రయత్నతః।
కాపట్యేన దదౌతస్య పాకోఽ ప్యజ్ఞానతః కృతః॥

20 శ్లో॥ పరివేషణ కాలేతు జ్ఞాన దృష్టి ఋషీశ్వరః।
జ్ఞాత్వా చుకోప భూపాయ వశిష్ఠః ప్రాబ్రవీచ్ఛసన్॥

21 శ్లో॥ రాజన్నో మానుషం మాంసం అస్పృశ్య ముపకల్పితం।
ద్రుత మేతేన పాపేన భవత్వం బ్రహ్మరాక్షసః॥

22 శ్లో॥ ఇతి శాప వచ శ్శ్రుత్వా క్రుద్ధో రాజా మహాబలః
శాపం దాతుం స్వయం తస్మై ప్రాహ శాపః కు తోర్పితంః॥

23 శ్లో॥ న జ్ఞాతో మాంస పాకో మే నాయం పాకోమ దాజ్ఞయా।
జాత శ్శాపో వృధా దత్తః తుభ్యం దా స్యామ్యహంతథా ॥

24 శ్లో॥ ఇ త్యుక్త్వోదక మాదాయ స్వాంజలౌ శపతీ శ్వరే।
మదయంతీ సతీ ప్రాప్య వారయామాస తం పతిం॥

25 శ్లో॥ రాజ్ఞీ ప్రాహ మహా దోషో గురుశాపా ద్భవిష్యతి।
తథోక్తం న వృధాఽత స్త త్పదే భజ తరిష్యసి॥

26 శ్లో॥ ఇతి భూపతి రాశ్రుత్య మదయంతీ సతీవచః।
స్వాంజలి స్థోదకం దుష్టం జహౌ తత్పతితం పదే॥

27 శ్లో॥ కల్మాష సలిల స్పర్శాత్ ద్దైవ యోగేన పాదయోః।
కల్మాషపాద నామా భూ ద్భూపతి ర్బ్రహ్మ రాక్షసః॥

28 శ్లో॥ రాజపత్ని వశిష్ఠస్య గృహిత్వా చరణౌ దృఢమ్।
ప్రాహేయతా ఽలం కోపేన స్వామిన్! బాలం సముద్ధర॥

19 తా॥ అట్లే నని రా జాజ్ఞను తల ధరించినట్లంగీ కరించి తరువాత నర మాంసమును శాకముగఁ దయారు చేయించెను. వంటవా డద్దాని నెఱుగక ఆ మాంసమును పచనముఁ జేసెను.

20 తా॥ భోజన సమయమునకు - భోక్తలు బ్రాహ్మణార్థ బ్రాహ్మలు - విస్తరి చుట్టు పరిషేచనము చేయు చుండ వశిష్ఠ మహర్షి దానిని చూచి కోపముతో శాప మిచ్చుచు రాజుతో ననెను.

21 తా॥ రాజా! అస్పృశ్యమైన మానవ మాంసమును వడ్డింపించితివి - ఈ పాపమున నీవు వెంటనే బ్రహ్మ రాక్షసి వగు మనెను.

22 తా॥ పర్రాక్రమ వంతుడు బలాఢ్యు డగు రాజు - ఆ శాపమును సహింపక తాను ప్రతి శాప మీయ యత్నించుచు-అయ్యా! మీరు శాప మెందుల కిచ్చితి రనెను.

23 తా॥ అని అనుచు - అయ్యా! వంటను నేను చేయలేదు - ఇట్లు చేయు మని నే నాజ్ఞ నీయలేదు - మీరు వృధాగా నాకు శాప మిచ్చితిరి - నేను మరల మీకు శాప మిచ్చుచున్నాను.

24 తా॥ ఇట్లనుచు ఉదకమును చేత గొని దోసి లుంచి శపింపబోగా - ఆ రాజపత్ని మదయంతి రాజును చేరి - శాప మీయ వలదని భర్తను నివారించెను.

25 తా॥ నాథా! గురువు గారిని ప్రతి శాపముతో బాధింప నది మహా దోష మగును - అట్లు చేయుట వ్యర్థ మగును - మీరు వెంటనే వారి పాద ముల బడి ఆ రాక్షస త్వమునుండి తరించండి!

26 తా॥ ఆ రాజు తన భార్య మదయంతి చెప్పిన దానిని బాగుగ విని విచా రించుకొని ప్రతిశాప జలము దోసిలినుండి క్రిందవైచి యావశిష్ఠుని పాదములంటి పడెను.

27 తా॥ శాప జలమును తాను క్రిందికి వదలి పెట్టిన పుడాయుదకము తన పాదములపై బడి నందున ఆ రాజు కల్మాషపాదు డను పేర బ్రహ్మ రాక్షసు డయ్యెను.

28 తా॥ అంత టారాజు భార్య వశిష్ఠుని చరణములఁ బట్టుకొని 'స్వామీ! ఇంతలో కోపము నుడుగండి! ఎట్లైనా అజ్ఞుడైన యీ పిన్నవానిని సంరక్షించండి!' అనెను.

29 శ్లో॥ తతః శాంతో వశిష్ఠో ఽభూ త్కారుణం ప్రాహ స సర్వవిత్,
ఉషిత్వా ద్వాదశ సమా భవిష్య త్యేవ పూర్వవత్॥

30 శ్లో॥ మైత్రావరుణి రి త్యుక్త్వా వశిష్ఠ స్వా శ్రమంగతః।
బ్రహ్మ రాక్షసతాం ప్రాప్య వనం మిత్రసహో యయౌ॥

31 శ్లో॥ నిర్మనుష్యే వనే స్థిత్వా స రాజా బ్రహ్మ రాక్షసః।
అభక్షయ న్నృ పశ్వాదీ న్నిజ కర్మ విపాకతః॥

32 శ్లో॥ ఏవం స న్నేకదా దైవా న్మార్గగౌ విప్రదంపతీ।
దృష్ట్వా భక్షయితుం ప్రాప రాక్షస స్సభయానకః॥

33 శ్లో॥ వ్యాఘ్రః పశు మి వాగత్య ద్విజ మత్తుం సమా దదే।
బ్రాహ్మణీ సహసా దృష్ట్వా భీతభీతాన్వధావత్॥

34 శ్లో॥ శోకేన మహతా వ్యాప్తా బ్రాహ్మణీ త మభాషత।
స్వామి న్మే రక్ష సౌభాగ్యం ముంచ ప్రాణేశ్వరం పితః!॥

35 శ్లో॥ మా హింసీర్మే పతిం ప్రీతిర్మ మాతీవాత్ర వల్లభమ్।
త్యజ వారయ మే శోకం భక్ష మాం వా యథా సుఖం॥

36 శ్లో॥ పతిం వినాతు నారీణాం వృథా జనన మశ్మవత్।
మాం భక్ష ప్రథమం దీనాం పత్యుః ప్రాణాం శ్చ రక్షవా॥

37 శ్లో॥ రూపలావణ్యసంపన్నో యువా ఽయం వేద శాస్త్రవిత్।
ప్రాణరక్షణ తోఽన్య త త్త్వం జగద్రక్షణ పుణ్యభాక్॥

38 శ్లో॥ కృపాం కురు భవిష్యామి దుహితా తవ మానద।
యది పుత్రా భవిష్యంతి వర్ధయిష్యామి తేభిదామ్॥

29 తా॥ సర్వము నెఱిగిన యా వశిష్టుడు రక్షణ స్వభావమున శాంతుడై దయతో 'అమ్మా! నీ వంతగ చింతపడకుము. పన్నెండేండ్ల కు యీ యన యథా పూర్వస్థితు' డగు ననెను.

30 తా॥ ఇట్లా మిత్రావరణ పుత్రు డగు వశిష్ఠ మహర్షి చెప్పి స్వాశ్రమమునకుఁ జనెను, రాజున్ను మిత్రసహుడగు నాతడు కల్మాష పాద నామమున బ్రహ్మరాక్షసిగా నడవిని బడెను.

31 తా॥ ఆ రాజు నిర్మానుష్యమగు నడవిని బ్రహ్మరాక్షసుడై పడి - ప్రారబ్ధ కర్మపాకమున మనుష్యులను - పశువుల హింసించి తన్మాంసమున కడుపు నింపుకొను చుండెను.

32 తా॥ ఇట్లుండ దైవయోగమున నా యడవి యందలి మార్గమున బ్రాహ్మణ దంపతులు పోవుచుండిరి; భయంకరుడగు రాక్షసుడు (రాజు) ఆ బ్రాహ్మణ దంపతిని భక్షింప నచటికి వచ్చెను.

33 తా॥ ఇంతలో నొక పెద్దపులి యు బ్రాహ్మణుని తినుటకు సమముగ వచ్చెను- ఆ సంగతిని చూచి యా దంపతులలోని ఆడుమనిషి భయ పడుచు వాని వెంట నురికెను.

34 తా॥ కొంతతడవున కాభయమునుండి విడి పడి బ్రహ్మ రాక్షసుని వేడు కొనెను. 'స్వామి! నా సౌభాగ్యమును కాపాడండి ఎట్లైనా నా ప్రాణ నాథుని రక్షించండి! తండ్రివి గదా స్వామీ?' అనెను.

35 తా॥ 'స్వామీ! నా కతిప్రీతికరుడైన నా భర్తను హింసింపకుము- ఈయనను భక్షించిన నేను శోకముతో చత్తును- అందుకని నీవు నా పతిని వదలి నన్ను భక్షింపుము- ఆయనను రక్షింపు' మనెను.

36 తా॥ 'లోకమున భర్తలేని యాడుదాని జన్మ వ్యర్థగ బండరాయితో సమానము- అందుచే ముందు నన్ను భక్షింపుము- భర్త ప్రాణముల రక్షింపుము.

37 తా॥ 'ఈ నాభర్త అందగాడు - నాకు ప్రియుడు - చిన్నవయసు వాడు - వేదశాస్త్రముల నెఱిగిన వాడు - అందుచే యీ బ్రాహ్మణ రక్షణచే నీకు జగద్రక్షణ ఫలము వచ్చును.

38 తా॥ 'స్వామీ! నేను నీకు కూతురు వంటిదానను - మాకు పుత్రులుదయించిన నీ పేరు పెట్టుకొని పెంచుదుము - కావున ఓ మహాత్మా! ఈయనను భక్షింపక రక్షిం చం'డనెను.

39 శ్లో॥ ఏవం బహు ప్రకారేణ స శోక వ్యాప్త యా తయా।
బోధితోఽపి నత ద్వాక్యం మత్వా భక్షితవాన్ ద్విజమ్॥

40 శ్లో॥ భక్షితం స్వపతిం దృష్ట్వా శాపం తస్మై ప్రదాస్యతీ।
బ్రాహ్మణీ రాక్షసం ప్రాహ శ్రుణు మే పాప శాప గాం॥

41 శ్లో॥ త్వం రాజా సూర్యవంశీయః శాపా ద్రాక్షసతామితేః।
పుని ర్ద్వాదశవర్షోర్ధ్వం దైవా ద్రాజా భవిష్యసి॥

42 శ్లో॥ కరిష్య సి మహిష్యా త్వం రతిం చేన్మృతిమేష్యసి।
అనాద విప్రహింసోత్థం దురాత్మన్ భోక్ష్యసే ఫలం॥

43 శ్లో॥ ఏవం క్రుద్ధా సతీ తస్మై శాపం దత్వా ప్రయత్నతః।
పత్యు రస్థీ న్యుపాదాయ విధినాఽగ్నిం వివేశ సా॥

44 శ్లో॥ ఏవం నృపో ద్వాదశాబ్దా నుషిత్వా గహనే వనే।
శాపకాలే వ్యతిక్రాంతే రాజా భూత్వా పురం యయౌ॥

45 శ్లో॥ స్మరాతురా స్య మహిషీ పూర్వవ త్తం సమాగతం।
ఆలింగితు ముపాగాత్తాం బ్రాహ్మణీ శాప మబ్రవీత్॥

46 శ్లో॥ శ్రుత్వా పతివచో దీనా మదయంతీ సుదుఃఖితా।
త్యక్తుం ప్రాణా న్నివృత్తాఽభూ న్మనసా ఽతీవ దూయతా॥

47 శ్లో॥ రాజాఽపి దుఃఖితోఽభూ త్తం మదయంతీ వచోఽబ్రవీత్।
ద్వాదశాబ్దై ర్న మే కష్టం నష్టం నాప్తాఽస్మి సంతతిః॥

48 శ్లో॥ ఇతి తస్యాః వచః శ్రుత్వా నేత్రాభ్యాం జల ముత్సృజన్।
శోకావిష్టో ఽవద ద్రాజా కింకరోమి విధిర్బలీ॥

39 తా॥ ఇట్లనేక విధములుగా నేడ్చుచు కాళ్ళకు నమస్కరించుచు వేడికొనినను రాక్షస భావమును వదలక - ఆమె వాక్యమును లెక్కసేయక ఆ బ్రాహ్మణుని తినెను.

40 తా॥ ఆ బ్రాహ్మణి తన కన్నుల యెదుట తినఁబడిన తన భర్తను చంపిన రాక్షసుని చూచి యాతని కామె శాపమీయబోవుచు నీ పాపమునకు శాప మిచ్చు చుంటిని - వినుము.

41 తా॥ 'ఓయీ! నీవు సూర్య వంశపు రాజువు. శాపకారణముగ రాక్షసత్వ మొందితివి మరియు పం(డెం డేండ్లవరకు బ్రహ్మరాక్షసుడవుగ నుండి దైవయోగమున రాజు వగుదువు.

42 తా॥ 'అట్లు రాజత్వ మొంది నీ భార్యతో నీవు రతిక్రీడ యొనరించిన వెంటనే చత్తువు. ఇది యీ బ్రాహ్మణ హింసకు పలము. నా శోకమునకు 12 ఏండ్లు బ్రహ్మ రాక్షసపు విస్తారము.'

43 తా॥ ఇట్లా బ్రాహ్మణి కోపమున నతిప్రయత్నముతో నా రాక్షసునకు (రాజునకు) శాపము నిచ్చెను. వెంటనే తన భర్త యెముకలను పడి గట్టుకొని అగ్నిని తయారు గావించి అందుబడి చచ్చెను.

44 తా॥ తరువాత నా రాజు మరల 12 ఏండ్లావనమున నుండి శాప కాలపు గడువు తీరిన వెనుక రాజత్వము నొంది యథా పూర్వముగ తన నగరమునకుఁ బోయెను.

45 తా॥ ఆ రాజపత్ని మదయంతి భర్త రాకకు సంతసించి మన్మథ పీడితయై దన భర్తను ప్రేమతోఁ గౌగిలించి కొనెను. అప్పుడు రాజు భార్యతో తనకు బ్రాహ్మణి యిచ్చిన శాపమును చెప్పెను.

46 తా॥ భర్త ఆ శాపవచనమును వినిపింప దానిని విన్న మదయంతి దుఃఖమును జెంది తాను చచ్చిపోవుటకు మనసున నిశ్చయించి తత్ప్రయత్నపరు రాలయ్యెను.

47 తా॥ దానికి రాజును దుఃఖపడి యుండ, మదయంతి భర్త యగు రాజుతో 'అయ్యా! మీరు మరో 12 సంవత్సరముల శాప మొందిన నష్టము లేదు గాని, నాకు సంతతి లేని నష్ట మతికష్ట మయ్యెను.'

48 తా॥ ఆమె పలికిన యీ దీనవచనమునకు రాజునకు కన్నుల నీరు జలజలా రాల్చుచు శోకావిష్టుడై 'నే నేమి చేతు నిప్పుడో యింతీ! విధి యెంత వానికైనను బలవత్తర మైనది' అనెను.

49 శ్లో॥ తతః పురోహితా న్వృద్ధాన్ మంత్రిణో ఽతి విశారదాన్।
ఆహూయ బ్రహ్మహత్యాది సర్వం తేభ్యో న్యవేదయత్॥

50 శ్లో॥ పురోహితా మంత్రిణశ్చ ప్రాహుః పాప విమోచనం।
తీర్థాచారం కురుతతః త్వం పునీతో భవిష్యసి॥

51 శ్లో॥ ఇతి శ్రుత్వా వచస్తేషాం రాజా తీర్థపరో ఽభవత్।
సకలాని చ తీర్థాని సిషేవే స యథావిధి॥

52 శ్లో॥ ప్రతితీర్థం నృపో గత్వా స్నానం కృత్వా విధానతః।
వస్త్రాన్నధనదానాద్యైః యజ్ఞై ర్విప్రా న్సురానపి॥

53 శ్లో॥ తర్పయామాస సద్భక్త్యా బ్రహ్మహత్యా తథాఽపి తం।
సుఘోర రూపానుగతా న ముమోచ కథంచన॥

54 శ్లో॥ స రాజా బహుకష్టేన నిర్విణ్ణో మనసా భృశమ్।
చింతాగ్రస్తో యయౌ దైవాత్ సుందరీం మిథిలాపురీం॥

55 శ్లో॥ పుర బాహ్య ప్రదేశే స చింతావిష్టో భృశం నృపః
వృక్షచ్ఛాయాం సమాసాద్య నిషసాద శ్రియాన్వితః॥

56 శ్లో॥ ఋషీశ్వరై ర్యుతో య ద్వద్గణై రుద్రః ప్రకాశితః।
గౌతమాఖ్యో ఋషివరః సహసా సముపాగతః॥

57 శ్లో॥ దృష్ట్వా తం గౌతమం రాజా పతిత స్తస్య పాదయోః।
నమస్కృత్యా తిభక్త్యా తం హర్షేణ మహతా ప్లుతః॥

58 శ్లో॥ దుఃఖితం తం సమాశ్వాస్య గౌతమః కరుణార్ద్ర ధీః।
ఆదిత స్సర్వవృత్తాంతం పప్రచ్ఛ క్షేమ చాపి చ॥

49 తా॥ పిమ్మట విచారించి యా రాజు మంత్రి పురోహితులను ఆలోచన పరుల బిలిచి తనకు గలిగిన శాపములను అద్యంతముగాఁ జెప్పెను.

50 తా॥ అంతయు విన్న యా పురోహితులు మంత్రులు నాలోచించి 'పాప విమోచనోపాయము తీర్థాచరణము. దానితో రాజా! నీవు పవిత్రుడ వగుదువు, తీర్థ క్షేత్రముల సేవింపుము.'

51 తా॥ ఆ యాప్తుల వాక్యముల విని భార్యతో గూడ తీర్థాటన పరుడయ్యెను. శాస్త్ర ప్రకారము సమస్త తీర్థముల సేవించెను.

52 తా॥ ఆ రాజు ప్రతి తీర్థమునకు వెళ్లి శాస్త్ర ప్రకారము పూజించి వస్త్ర అన్న ధన దానాదుల నితరులను, యజ్ఞములతో దేవతలను జలతర్ప ణాదుల పితరులఁ దృప్తి పరచెను.

53 తా॥ ఆ విధముగ నా రాజు భక్తితో నందరఁదృప్తిపరచినను బ్రహ్మ హత్య ఆ రాజును ఘోర రూపముతో వదలకుండ వెనువెంట నంటి తిరుగు చుండెను.

54 తా॥ ఆ రాజును అనేక కష్టములఁ బడి నిర్విణ్ణుడై చింతతోఁ గ్రుంగిపోవుచు దైవయోగమున సుందరమైన మిథిలయను పట్టణమును గూర్చి వెళ్ళెను.

55 తా॥ ఆ మిథిలా నగర ప్రవేశమునకు ముందు బాహ్యోద్యానమున చింతా విష్టుడై - భార్యతో గూడి ఒక చెట్టు నీడను చింతించుచు గూర్చుం డెను.

56 తా॥ ఋషీశ్వరులతో గూడుకొనిన శంకరు డచట గాన వచ్చెను - ఆ ఆ ఋషులలో గౌతమ మహర్షి ముఖ్యుడై త్వరగా నాతని యొద్దకు వచ్చెను.

57 తా॥ ఆ రాజు తన యెదుటఁ గనబడిన గౌతముని పాదములబడి - ఆయ నకు నమస్కరించి ఆనందాశ్రువుల విడుచుచు సంతోషపడెను.

58 తా॥ దుఃఖముతో నున్న యాతని నోదార్చుచు కరుణామయ బుద్ధితో ఆ రాజవృత్తాంతము నాద్యంత మడిగి యోగక్షేమముల నడిగెను.

59 శ్లో॥ రాష్ట్రం తే కేన వాఽక్రాంతం వనవాసః కుతస్త్వయం।
చింతా వ్యాకులితో భాసి కిమర్థం వద సువ్రత॥

60 శ్లో॥ ఇతి తస్య వచః శ్రుత్వా స రాజా ప్రాహ దుఃఖితః।
దైవా ల్లగ్నో బ్రహ్మశాపో బ్రహ్మహత్యాపి చాగతా॥

61 శ్లో॥ ప్రాయశ్చిత్తాదికం చీర్ణం యజ్ఞా ద్యా అప్యనుష్ఠితాః।
సమస్త క్షేత్ర తీర్థా దౌ ధర్మా ద్యాచరితం మయా॥

62 శ్లో॥ అద్యాపి దోషశాంతి ర్మే నజాతా వ్రతచారిణః।
బ్రహ్మహత్యా ఘోరవేషాఽ ధాపి మా మనువర్తతే॥

63 శ్లో॥ అద్య మే సఫలం జన్మ దృష్టం తే పావనం పదమ్।
నశ్యే దతఃపరం కష్ట మిత్యుక్త్వా త త్పదే ఽగ్రహీత్॥

64 శ్లో॥ శ్రుత్వా భూపస్య వచనం గౌతమః కరుణాకరః।
ప్రాహ మాభీః శంకర స్తే త్రాతా మృత్యుంజయో ఽభయః॥

65 శ్లో॥ తవ శాపవినాశార్థం తీర్థం తే కథయా మ్యథ।
మహా పాపహరక్షేత్రం గోకర్ణాఖ్యం సుపావనం॥

66 శ్లో॥ గోకర్ణ స్మరణా త్సద్యో బ్రహ్మత్యాది నశ్యతి।
ఈశ్వరో యత్ర వసతి సదా మృత్యుంజయ శ్శివః॥

67 శ్లో॥ యథా కైలాసశిఖరం యద్వా మందరకందరమ్।
త ద్వద్గోకర్ణ కర్పూర గౌరీశ వసతి స్థలమ్॥

68 శ్లో॥ యథా నిశ్యుద్గతే ధ్వాంతే వహ్నినా శశినా ఽపివా।
సర్వ ధా నైతి న వినా సహస్రకిరణోదయాత్॥

59 తా॥ 'ఆయ్యా! మీ రాజ్యము నెవడైన న్నాక్రమించెనా? మీకీ వనవాస మెందు లకుఁ గలిగెను - నీకింత చింత గల్గుటకు కారణమేమి? ధర్మాత్మ నకు కష్టమేమి చెప్పుము.'

60 తా॥ అట్లడుగుటతో నా రాజు పొంగి పొరలు దుఃఖముతో 'దైవ వశమున బ్రహ్మ రాక్షసత్వము - దానిపై బ్రహ్మ హత్యాపాతకము రెండును తగిలినవి-

61 తా॥ దానిని పోగొట్టుకొన - ప్రాయశ్చిత్తములతో యజ్ఞాదు లొనర్చితిని - సమస్త తీర్థములు దిరిగి దానధర్మాదులతో భగవంతుని సేవించితిని.

62 తా॥ 'ఎన్ని ధర్మములు వ్రతములు ఆచరించినను యిప్పటి కాబ్రహ్మ హత్యాదోషము శాంతింపక ఘోర రూపముతో నన్ను వెంటాడు చున్నది-

63 తా॥ 'పవిత్రులు - పుణ్యాత్ములు మహానుభావులగు మీ దర్శనమున నిప్పుడు నా జన్మ సఫలమైనది. ఇఁక నిటుపై నా కష్టములు తీరినట్లే' అని యాయన పాదముల బడెను.

64 తా॥ ఆ రాజ వృత్తాంతమును విన్న గౌతముడు దయాన్వితుడై - 'ఓయీ నీవు భయము నొందకుము - మృత్యుంజయుడగు శంకరుడు అభయ మిచ్చువాడు.

65 తా॥ 'నీ పాపము పోయెడి తీర్థమును జెప్పెదను, మహాపాపముల పోగొట్టు నది - పవిత్రమైనది - గోకర్ణమను పేరుగల పుణ్యక్షేత్ర మున్నది-

66 తా॥ 'ఆ గోకర్ణమను క్షేత్రము యొక్క పేరు విన్న బ్రహ్మహత్యా పాత కము పోవును - సర్వకాల సర్వావస్థలందు మృత్యుంజయుడగు సదా శివు డచట నుండును-

67 తా॥ 'కైలాస పర్వతము - మందర పర్వత బిలము - ధవళ కాంతితో నీశ్వరుని వాసమయ్యెను. అట్లే - కర్పూరమువలె స్వచ్ఛమైన గోకర్ణ క్షేత్రము ఈశ్వరునికి వదలరాని చోటు.

68 తా॥ 'లోకము చీకటితోఁ గ్రమ్ముకొని నపుడు - అగ్ని జ్వాలచే గాని చంద్రకిరణ ప్రసారమున గాని వెలుతురు నొందును. అంతట బాగా కనుపడవలె నంటే సూర్యకాంతియే కావలయును.

69 శ్లో॥ తథైవేతర తీర్థాద్యైర్నాంహసః సర్వధా క్షయః।
గోకర్ణ దర్శనా దేవ సర్వం నశ్యతి పాతకమ్॥

70 శ్లో॥ బ్రహ్మహత్యాసహస్రాణి సద్యో గోకర్ణ దర్శనాత్।
నశ్యంతి స్మరణాదస్య పూతాత్మా జాయతే నరః॥

71 శ్లో॥ ఇంద్రోపేంద్ర విరించాద్యాః సిద్ధారా యత్ర దేవతాః।
యత్ర తప్త్వా తపో ఽనేకే జాతా లబ్ధ మనోరథాః॥

72 శ్లో॥ తద్గత్వా భక్తిపూర్వం యే జ్ఞానిన స్తప ఆదికమ్।
కుర్వంతి తల్లక్షగుణం భవేత్ క్షేత్ర ప్రభావతః॥

73 శ్లో॥ యత్రసిద్ధిం గతాబ్రహ్మ విష్ణు శక్రాదయోఽమరాః।
నివాస మాత్రతః శీఘ్రం కిం వక్తవ్య మతఃపరం॥

74 శ్లో॥ కైలాసం విద్ధి గోకర్ణం సాక్షాదీశం మహాబలమ్।
విఘ్నేశ్వరేణ శ్రీవిష్ణోరాజ్ఞయైవ ప్రతిష్ఠితమ్॥

75 శ్లో॥ పుణ్యే గోకర్ణ కే క్షేత్రే నివసం త్యఖిలాః సురాః।
బ్రహ్మ విష్ణు శ్చ మఘవా విశ్వే దేవా మరుద్గణాః॥

76 శ్లో॥ సూర్య శ్చంద్రో ష్టవసవః పూర్వ ద్వారం సమాశ్రితాః।
మహాబలేశ్వరం నిత్యం భక్తి యుక్తా ఉపాసతే॥

77 శ్లో॥ యమోగ్ని శ్చిత్ర గుప్తశ్చ రుద్రా పితృగణా స్తథా।
ఉపాసతే సదా భక్త్యా దక్షిణ ద్వార మాశ్రితాః॥

78 శ్లో॥ దేవా వరుణ ముఖ్యాశ్చ పశ్చిమ ద్వార మాశ్రితాః।
ఉపాసతే ప్రీతియుతా గోకర్ణే చంద్రమౌళినం॥

69 తా॥ 'అట్లే యితర తీర్థముల వలన పాపక్షయము కాకపోదు - సర్వవిధ పాపక్షయము గోకర్ణక్షేత్ర దర్శనమున వెంటనే తొలగును.

70 తా॥ 'వేయి బ్రహ్మహత్యా పాతకములైనను గోకర్ణ దర్శన మాత్రమున నశించును - మానవు డెవడైనను గోకర్ణ క్షేత్రేశ్వరుని దర్శించిన - స్మరించిన పుణ్యవంతు డగును.

71 తా॥ 'ఇంద్రుడు, ఉపేంద్రుడు మొదలగు ప్రసిద్ధదేవత లందరు యీ గోకర్ణ క్షేత్రమున తప మొనర్చి, స్వ వాంఛల నెరవేర్చు కొని సిద్ధపురుషులైరి.

72 తా॥ 'ఎవరైన భక్తితో యీ క్షేత్రమున తపోదానయజ్ఞము లొనర్చిన - ఈ క్షేత్ర మహిమచే యితర క్షేత్రముల నాచరించిన దానికన్న లక్ష గుణము ఫలము గల్గును.

73 తా॥ 'ఏ యీక్షేత్రమందు - బ్రహ్మ విష్ణు ఇంద్రుడు మొదలగు దేవతలు నివసించిన మాత్రమున మహిమాన్వితులైరో గదా? ఇంక యిక్కడ ఉండి దానధర్మ ములచేర్చిన వారి నేమనవలె?

74 తా॥ 'గోకర్ణ క్షేత్రమును సాక్షాత్తు కైలాస మనియు ఇచటి మహాబలేశుడు శివుడని తెలియుము శ్రీమహావిష్ణ్వాజ్ఞచే విఘ్నేశ్వరునిచే శివలింగ మిచట ప్రతిష్ఠిత మయ్యెను.

75 తా॥ 'పుణ్యవంతమైన యీ గోకర్ణ క్షేత్రమున బ్రహ్మ, విష్ణు, ఇంద్రుడు విశ్వే దేవాదులు మరుద్గణము దేవసంఘము నందరును నివసించి యున్నారు.

76 తా॥ 'సూర్యుడు చంద్రుడు అష్టవసువులు ఈ గోకర్ణేశ్వర మహాబలేశ్వరు నాశ్రయించి భక్తియుక్తులై తూర్పు ద్వారముకడ నెల్లప్పు డుందురు.

77 తా॥ 'అట్లే దక్షిణద్వారము కడ యముడు చిత్రగుప్తుడు ఏకాదశరుద్రులు పితృ దేవతాగణమును భక్తితో నెల్లపు డాదేవుని నుపాసించు చుందురు.

78 తా॥ 'దేవతలు వరుణుడు మొదలగు వారు ఆ గోకర్ణేశ్వర పశ్చిమ ద్వార మందుండి ఆ చంద్రమౌళిని ప్రీతితో నేసురక సేవించు చుందురు.

79 శ్లో॥ కుబేరో భద్రకాళీ చ సమీరః సప్తమాతృకాః।
మహాబలేశ మర్చంతి ద్వార ముత్తర మాశ్రితాః॥

80 శ్లో॥ విశ్వావసు శ్చిత్రరథః చిత్రసేనాదయ స్సదా।
గంధర్వా స్తత్ర గీతేన శంకరం పర్యుపాసతే॥

81 శ్లో॥ కశ్య పోఽత్రి ర్వశిష్ఠశ్చ కణ్వాద్యా మునయో ఽమలాః।
తపసాఽ రాధయంతీశం క్షేత్రం గోకర్ణ మాశ్రితాః॥

82 శ్లో॥ తిలోత్త మోర్వశీ రంభా ఘృతాచీ మేనకా ముఖాః।
మహాబలేశాభి ముఖం నిత్యం నృత్యంతి భక్తితః॥

83 శ్లో॥ మహర్షయః కృతయుగే విశ్వామిత్ర పురోగమాః।
జాబాల జైమిని భరద్వాజాద్యాః సిద్ధి మాప్నుయుః॥

84 శ్లో॥ సనకాద్యా కుమారాశ్చా నారదాద్యాః సురర్షయః।
మరీచాద్యా మానసాశ్చ భజం త్యుపనిష ద్విదః॥

85 శ్లో॥ సిద్ధా సాద్యా మునీశాశ్చ దండినో బ్రహ్మచారిణః।
నిర్గుణా శ్చాజినధరాః తత్రశంభు ముపాసతే॥

86 శ్లో॥ త్వగస్థి మాత్రా వశిష్ట దేవా అపి మహాధియః।
అనుతిష్ఠంతి చార్చంతి భక్త్యా తం చంద్రమౌళినం॥

87 శ్లో॥ గంధర్వాః పితర స్సిద్ధాః వసవో ష్టా వుపాసతే।
విద్యాధరాః కిన్నరాశ్చ త ఐత్యేత్య పునఃపునః॥

88 శ్లో॥ సగుహ్యకాః కింపురుషాః శేష నాగా హి తక్షకాః॥
భూతా పిశాచా వేతాలాః ఆయాం తీక్షితు మీశ్వరం॥

79 తా॥ 'కుబేరుడు భద్రకాళీ సమీరుడు (వాయువు)సప్త మాతృకలు ఉత్తర ద్వార మున నివసించుచు మహాబలేశ్వరుని నిత్యము పూజించు చుందురు.

80 తా॥ 'విశ్వావసువు చిత్రరథుడు చిత్రసేనాదులు మొదలగు గంధర్వు లందరును భక్తియుక్తులై నృత్యగీత వాద్యములతో ఆ శంకరుని సేవించు చుందురు.

81 తా॥ 'కశ్యపుడు అత్రి, వసిష్ఠుడు కణ్వుడు మొదలగు మునులందరు నిర్మల మనస్సుతో తప మాచరించుచు ఆ గోకర్ణేశ్వరుడగు శంకరుని సేవింతురు.

82 తా॥ 'తిలోత్తమ - ఊర్వశి - రంభ - ఘృతాచి - మేనక మొదలగు దేవ వేశ్యలు మహాబలేశుని కభిముఖులై నిత్యము భక్తితో నాట్యము చేసి యీశు నర్చింతురు.

83 తా॥ 'కృతయుగమున విశ్వామిత్రాది మహర్షులును - జాబాలి, జైమిని భరద్వాజాది పుణ్యపురుషు లీమహాబలేశ్వరు ముందు ధ్యానించి సిద్ధిని పొందిరి.

84 తా॥ 'సనకాది ఋషులు - నారదాది దేవర్షులు - మరీచ్యాది ప్రజాపతులును ఉపనిష ద్విదులై యీ గోకర్ణేశ్వరుని నిత్యము సేవించు చుందురు.

85 తా॥ 'సిద్ధులు - సాధ్యులు - అవధూతా ద్యా జన్మబ్రహ్మచారులును - నిర్గుణులై అజినాంబరధారులగు మహాయోగులును - అచటి శంకరుని నిత్య ముపాసించు నుందురు.

86 తా॥ 'చర్మము - ఎముకలు మాత్రముండి - శుష్క శరీరులగు మహా మహు లందరును - భక్తితో నిత్య మాగోకర్ణ చంద్రమౌళీశ్వరు నర్చించు చుందురు.

87 తా॥ 'గంధర్వులు - పితృదేవతలు - సిద్ధులు - వసువులు - విద్యాధరులు- కిన్నరులు మొదలగు వారు ప్రతి నిత్య మా యీశ్వరుని ముందుకు వచ్చి - పునః పున ర్దర్శన నుతుల సేవించు చుందురు.

88 తా॥ 'గుహ్యకులు - కింపురుషులు - శేషులు - తక్షకాదులు - భూతప్రేత పిశాచాదులు ఈ గోకర్ణేశ్వరు చూచి సేవించి పోవు చుందురు.

89 శ్లో॥ భూషితా భూషణై ర్దివ్యై ర్దేవా దేవీ సమన్వితాః।
సూర్యకాంతి విమానస్థాః స్వ రాయాం తీశ మీక్షితుం॥

90 శ్లో॥ కేచి త్స్తు వంతి గాయంతి కేచి న్నృత్యంతి భక్తితః।
పూజయంతి నమంతీశం కేచి ద్దర్శన లాలసాః॥

91 శ్లో॥ యేషాం కేషాంతు భూపాల యా యా మనసి వాసనాః।
తా స్తా సిద్యంతి తత్రైవ నేదృశా సదృశం క్వచిత్॥

92 శ్లో॥ మహర్షయో ఽగస్త్య ముఖాః కందర్పాగ్న్య
దయోఽమరాః।
ప్రియవ్రతాద్యా రాజానః క్షేత్రే స్మిన్ లేభిరే వరాన్॥

93 శ్లో॥ శింశుమారో భద్రకాలీ త్రికాలం లింగ మర్చతి।
తార్క్ష్యాద్యా అత్ర సర్పాదీ న్న హింసం త్యహితా-అపి॥

94 శ్లో॥ రావణః కుంభకర్ణశ్చ తధా ఽన్యే రాక్షసా ఇహ।
జాతా లబ్ధవరానిత్యం అర్చం తీశం విభీషణః॥

95 శ్లో॥ ఏవం సర్వం దేవకులం సిద్ధ దానవ మండలం।
ఈశ మారాధ్య గోకర్ణే కృతకృత్య మభూ దిహ॥

96 శ్లో॥ స్వనామ్నా కేచ నాత్రైవ లింగాని స్థాపయంతి హి।
ప్రాప్నువంతి వరా నత్ర పురుషార్థాం శ్చతుర్విధాన్॥

97 శ్లో॥ బ్రహ్మా విష్ణుః కార్తికేయో లింగా న్యత్ర స్వనామతః।
గోకర్ణే స్థాపయామాసుః వినాయక ముఖా అపి॥

98 శ్లో॥ ధర్మః క్షేత్రపతిః దుర్గా దేవీ శక్తి స్తథైవచ।
స్వనామాన్విత లింగాని స్థాపయామాసురాదరాత్॥

89 తా॥ 'సమస్త భూషణ భూషితులై - తమ తమ దేవేరులతో దేవత లందరు విమానచారులై స్వర్లోకము నుండి వచ్చి భక్తితో సేవించి పోవు చుండిరి.

90 తా॥ 'కొంద రాస్వామిని స్తోత్రించుచు - గానము చేయుచు - భక్తితో నాట్యము చేయుచు - నమస్కరించు వారు కొందరు - పూజించు వారు కొందరు - దర్శించు వారు కొందరై యుండిరి.

91 తా॥ 'ఓ రాజా! ఎవరెవ రే యే కోరికల మనసున దలచుకొనెడివారో వా రా యా కోరికల సిద్ధి పొందుచుండిరి - ఇట్టి దేవుడు గాని - ఇటువంటి క్షేత్రము గాని లేదు.

92 తా॥ 'అగస్త్యాది మహర్షులును,మన్మథుడు - అగ్ని మొదలగు - అమరులును ప్రియవ్రతాది మహారాజులును - ఈ పవిత్ర గోకర్ణ క్షేత్రముననే తమ తమ అభీష్ట వరములఁ బొందిరి.

93 తా॥ 'శింశుమారుడు (కాలపురుషుడు) భద్రకాళీ- మొదలగు వారు త్రికాలము లందు పూజించు చుండిరి. తార్క్ష్యాది సర్పనాయకు లందరు తమ శత్రువులను గూడ అహింసతో నుందురు.

94 తా॥ 'రావణుడు కుంభకర్ణుడు మొదలగు ప్రముఖ రాక్షసులు, విభీషణాది సుమనస్కులు తాము కోరిన వరములతో సఫలులై నిర్భయముగ ప్రీతితో నీశ్వరుని సేవించు చుండిరి.

95 తా॥ 'ఈవిధముగ దేవతాకులమువారు రాక్షస జాతివారు సిద్ధ సాధ్యాది యోగు లందరు గోకర్ణే శుని కొలిచి కృతకృత్యులై యుండిరి.

96 తా॥ 'కొందరు తమనామ చిహ్నముగ నిచట లింగముల స్థాపించిరి. ఈ గోకర్ణమున తత్సేవ వలన వరములను - పురుషార్థ చతుష్టయమును సాధించు కొనిరి.

97 తా॥ 'బ్రహ్మ - విష్ణువు - కుమారస్వామి తమ పేర నిచట లింగముల ప్రతిష్ఠించిరి. ఇట్లే వినాయకుడు మొదలగు దేవతలు ఈ గోకర్ణమున లింగప్రతిష్ఠలు చేసిరి.

98 తా॥ 'ధర్మరాజు - క్షేత్రపాలుడు, దుర్గాదేవి - శక్తి మొదలైన వారు తమ నామ చిహ్నముగ నిచట భక్త్యాదరములతో లింగములఁ బ్రతిష్ఠించిరి.

99 శ్లో॥ అసంఖ్యాతాని లింగాని సంతి యత్ర పదే పదే।
అసంఖ్యాతాని తీర్థాని క్షేత్రే గోకర్ణ సంజ్ఞితే॥

100 శ్లో॥ గోకర్ణ ముత్తమం క్షేత్రం తీర్థాన్యత్రోదకాని తు।
లింగాని సర్వే పాషాణాః యత్ర సంతి పదే పదే॥

101 శ్లో॥ కృతే శ్వేతం లోహితంచ త్రేతాయాం లింగ మీశితుః।
ద్వాపరే పీతవర్ణంచ కృష్ణవర్ణం కలౌ యుగే॥

102 శ్లో॥ సప్త పాతాల తలతః స్థితం లింగం సుహోన్నతం।
కలౌ భూత్వా మృదుతరం సూక్ష్మ రూపేణ దృశ్యతే॥

103 శ్లో॥ పశ్చిమాబ్ధి తటే రమ్యం క్షేత్రం గోకర్ణ సంజ్ఞితం।
పరమాశ్చర్యదం బ్రహ్మహత్యాది కలుషాపహం॥

104 శ్లో॥ మహాంతి పంచపాపాని బ్రహ్మహత్యా ముఖానితు।
పరదారగమాదీని దురాచార మయానిచ॥

105 శ్లో॥ తత్ర దర్శన మాత్రేణ నశ్యంతి సకలాని హి।
గోకర్ణలింగం దృష్ట్వైవ కామాన్ లబ్ధ్వా ఽమృతం వ్రజేత్॥

106 శ్లో॥ తత్ర స్థిత్వా పుణ్యదినే యేభక్త్యార్చంతి భూభుజః।
యాస్యంతి రుద్రలోకంతే నాత్ర కార్యా విచారణా॥

107 శ్లో॥ యదా కదావా గోకర్ణం దైవాదాగత్య యో నరః।
భక్త్యా ర్చతి మహేశం స బ్రహ్మలోక మవాప్నుయాత్॥

108 శ్లో॥ రవీందు సౌమ్యవారేషు పౌర్ణిమా ఽమావాది పర్వసు।
స్నాత్వా సముద్ర సలిలే యో దానాది కరోతిచ॥

99 తా॥ 'లెక్కకు మిక్కుటమైన లింగములు - అట్లే లెక్కలేనన్ని పవిత్ర తీర్థములు ఈ గోకర్ణ క్షేత్రమున వెలిసి యున్నవి.

100 తా॥ 'క్షేత్రములలో నుత్తమము గోకర్ణ క్షేత్రము - ఇందున్న జలము లన్నియు పుణ్య తీర్థములు - ఈ క్షేత్రమున నెచటఁ జూచినను - పాషాణము లన్ని లింగము.

101 తా॥ 'ఈ గోకర్ణేశ్వరుడు - కృతయుగములో - తెల్లగను - త్రేతాయుగ మున నెఱ్ఱగను - ద్వాపరములో పచ్చగను - కలియుగమున నల్లని వర్ణముతో నుండెను.

102 తా॥ 'ఈ గోకర్ణేశ్వరలింగము అదో లోకము లేదింటి నుండి యిప్పుడు మనకు కానవచ్చెడిది మహోన్నత లింగము - ఇది కలియుగమౌటచే సూక్ష్మముగ నుండెను.

103 తా॥ 'పడమటి సముద్రతీర మందలి ఈ గోకర్ణ క్షేత్రము పరమాశ్చర్య కరమైనది - బ్రహ్మహత్యాది మహాపాతకములు పోగొట్టునది.

104 తా॥ 'బ్రహ్మహత్యాది పంచ మహాపాతకములు - పరదార ధనాదుల నష్ట పరచువారు - దురాచారులు - ఈ గోకర్ణ క్షేత్ర మహించే శుద్ధు లగుదురు.

105 తా॥ 'ఇచట గోకర్ణేశ్వరుని దర్శనము చేతనే పాపము లన్ని నశించును ఈ క్షేత్ర దర్శన మాత్రమున - వాంఛితసిద్ధి భక్తులకు కలుగును.

106 తా॥ 'ఈ గోకర్ణ క్షేత్రమున పుణ్య దిన మందీ దేవుని పూజించెడి భక్తులగు రాజులు తప్పక రుద్రలోక మందుందురు - దీనికి సందేహింపఁ బని లేదు.

107 తా॥ 'ఏ నరుడైనను దైవ యోగముచే యీ గోకర్ణేశ్వరుని భక్తితో పూజిం చుట తటస్థించినచో - నతడు పాప రహితుడై బ్రహ్మలోకమును తప్పక పొందును.

108 తా॥ 'ఆది - సోమ - బుధవారములందు గాని - పూర్ణి మామావాస్యాది. పుణ్య తిథులందు గాని ఇచట గల సముద్రోదకముల స్నానించి తర్పణ దానాదుల చేసినను-

109 శ్లో॥ శివపూజాం వ్రతం హోమం జపం బ్రాహ్మణ తర్పణం।
కించి త్కృత మిహ క్షేత్రే - తదనంత ఫలం భవేత్॥

110 శ్లో॥ వ్యతీపాతాది కాలేషు సూర్య సంక్రాం త్యహస్సుచ।
ప్రదోషే శివరాత్ర్యాం త త్పూజా పుణ్య మనుత్తమం॥

111 శ్లో॥ కింబ్రువే క్షేత్ర మాహాత్మ్యం బహవో లేభిరే వరాన్।
భక్తవత్సల ఈశోఽసౌ పుష్యమాత్రేణ తుష్యతి॥

112 శ్లో॥ మాఘమాసే ఽసితేపక్షే శివరాత్ర్యాం నిశీథకే।
బిల్వపత్రార్పణా దత్ర ఫలం త్రైలోక్యదుర్లభం॥

113 శ్లో॥ ఏవం నిరుపమం క్షేత్రం యేన యాస్యంతి దుర్భగాః।
న శ్రుణ్వంత్యపి యే మూఢాః బధిరాస్తే న సంశయః॥

114 శ్లో॥ ఉపోషణం జాగరణం యే కుర్వం తీశసన్నిధౌ।
తాని తేషాం స్వర్గమార్గ సోపానాని న సంశయః॥

115 శ్లో॥ గోకర్ణస్థాన మహిమా చతుర్విధపుమర్థదః।
లోకా అనేకే గోకర్ణే సంప్రాప్తా దుర్లభా న్వరాన్॥

116 శ్లో॥ స్నాత్వా తీర్థేషు ముఖ్యేషు భక్త్యా సంపూజ్య ముక్తిదమ్।
మహాబలేశ్వరం లింగం పాపముక్తో భవే న్నరః॥

117 శ్లో॥ ఏవం గోకర్ణ మాహాత్మ్యం శ్రుత్వా గౌతమ వక్త్రతంః।
ప్రేమ్ణా మిత్ర సహో రాజా హృష్టః పప్రచ్ఛ తం మునిం॥

118 శ్లో॥ మునే! గోకర్ణ మాహాత్మ్యం వర్ణితం విస్తరేణమే।
నిదర్శనం వద త్వ్యేకం ముక్తః కోఽత్రమహాంహసః॥

109 తా॥ 'దేవపూజను - పుణ్యవ్రతములను - మంత్రజపమును - బ్రాహ్మణుల కన్న ధన దానాదులఁ దృప్తి చేసినను - ఆ ఫలము అంతులేనిదై వర్థిల్లును.

110 తా॥ 'వ్యతీపాత యోగ కాలమున - సూర్యసంక్రమణ సమయ ములందు ప్రదోష సమయములందు - విశేషించి శివరాత్రసమయము లం దీపూజ శ్రేష్ఠము.

111 తా॥ 'ఈ గోకర్ణ మాహాత్మ్యమును గూర్చి యింక నేమని చెప్పుదును? ఇక్కడ ననేకమంది అనేక వరము లొందిరి. ఇచటి శివుడు పుష్య మాస పూజకు సంతుష్టు డగును.

112 తా॥ 'మాఘమాసకృత మహాశివరాత్రి నా డీయీశ్వరుని పూజచేసి బిల్వ పత్రమును ఈశ్వరునకు సమర్పించినచో-తత్ఫల మధికము,దుర్లభము.

113 తా॥ 'ఇట్టి సాటిలేని పుణ్యక్షేత్ర దర్శనము పాపాత్ములకు దుర్లభము - ఈ పుణ్యక్షేత్ర మహిమను విననివారు - మరు జన్మలో బధిరులై పోవుదురు.

114 తా॥ 'ఈ శివుని సన్నిధిలో - శివరాత్రి నా డుపవాసమును - రాత్రి జాగర ణమును యెట్టి మూఢులు చేసినను వారు స్వర్గమునకు మెట్లు కట్టు కొన్న వారగుదురు.

115 తా॥ 'గోకర్ణక్షేత్రమహిమ - చతుర్విధ పురుషార్థ ప్రదము - అనేక ప్రజ లీదుర్లభమైన గోకర్ణక్షేత్రమును ఆశ్రయించి దుర్లభములై న ననేక వరము లొందిరి.

116 తా॥ 'ఈ గోకర్ణ తీర్థమందు స్నానముఁ జేసి భక్తితో నీ స్వామిని పూజించి - మహాబలేశ్వరుని ధ్యానించిన - తప్పక మోక్షమును బొందుదురు.'

117 తా॥ ఈ విధముగా మిత్రసహుడగు నారాజు గౌతమ ముఖమునుండి ప్రేమతో విని సంతసించి యామునిని గూర్చి యిట్లనెను:

118 తా॥ 'ఓయీ!గౌతమర్షీ! తమరు గోకర్ణమాహాత్మ్యమును విస్తరించి చెప్పితిరి. దానికి నిదర్శనముగ - గొప్ప పాప విముక్తిని మోక్ష ప్రాప్తిని గూర్చి చెప్పుము.

119 శ్లో॥ తన్మహ్యం గౌతమ స్వామిన్ కృపయా పరయా వద।
ఇత్యుక్త్వా భూపతి స్తస్య గౌతమస్యపదేఽగ్రహీత్॥

120 శ్లో॥ గౌతమః ప్రాహ గోకర్ణ మహిమానం మహీపతేః।
యత్ర ముక్తా మహాపాపాః మయాదృష్టా స్సహస్రశః॥

121 శ్లో॥ శ్రుణ్వైకదాఽగమం క్షేత్రం గోకర్ణం శివరాత్ర్యహో।
మాఘేమా స్యసితే పక్షే సంప్రాప్తా యాత్రికా జనాః॥

122 శ్లో॥ మధ్యాహ్నే ఉపవిష్టోఽహం వృక్షచ్ఛాయా ముపాశ్రితః।
దూరా దద్రాక్ష మాయాంతీం చాండాలీం రోగపీడితాం॥

123 శ్లో॥ వృద్ధాం మందాం శుష్కముఖీం క్షుదితాం వ్రణపీడితామ్।
పూయశోణిత దుర్గంధాం దదర్శ కృమిపీడితామ్॥

124 శ్లో॥ గండమా లోదర వ్యాప్తాం దంతహీనాం సువిహ్వలాం।
కఫావరుద్ధ కంఠీం తాం మ్రియమాణాం దిగంబరాం॥

125 శ్లో॥ ఆదిత్యకిరణ స్పర్శా దపి భాతి మరిష్యతి।
సర్వాంగశూల దుఃఖార్తాం మయా దృష్టా గలద్దృదా॥

126 శ్లో॥ విధవా కేశరహితా ప్రస్ఖలంతీ పదేపదే।
సద్యః ప్రాణాన్ త్యజంతీవ వృక్ష చ్ఛాయా ముపాగతా॥

127 శ్లో॥ ఆగత్య వృక్షచ్ఛాయాం సా పపాత ధరణీతలే।
ప్రాణాం స్తత్యాజ తత్రైవ పశ్యతో మమ సన్నిధౌ॥

128 శ్లో॥ అకస్మా త్తత్ర కైలాసా ద్విమానం సూర్యసన్నిభం।
అవతీర్ణం తత్ర దూతాః శూల ఖట్వాంగ ధారిణః॥

119 తా॥ 'ఓ మహాత్మా! గౌతమర్షీ! దయతో - ఆ గోకర్ణమహిమను ప్రత్యక్షముగ ననుభవించిన వారి చరిత్రమును గూర్చి వచింపు' మని యాముని పాదములను రాజు బట్టుకొనెను.

120 తా॥ 'ఓ రాజా! గోకర్ణమహిమ చాల గొప్పది-ఈ గోకర్ణక్షేత్రమున మహాపాపములు నశించినట్లు - వేలకొలది నిదర్శనములను నేను అనేకముగ చూచితిని.

121 తా॥ 'ఒకసారి శివరాత్రి నాడు నేను గోకర్ణమును చూడ బోయితి - మాఘమాస శివరాత్రి దినమగుట యాత్రికులు తండోపతండములుగా వచ్చుచుండిరి.

122 తా॥ 'నే నప్పుడొక చెట్టు నీడను విశ్రమించితిని - ఒక చండాల స్త్రీ రోగ పీడితురాలై ఆచటికి వచ్చు దానిని చూచితిని.

123 తా॥ 'ఆ చండాల వృద్ధ - అంధురాలు - నోరెండి ఆకలి దప్పికలతో బాధ పడుచున్నది. పురుగులు - రక్తము - చీము కారు వ్రణములతో దుర్గంధమును గొట్టుచున్నది.

124 తా॥ 'ఆ చండాల వృద్ధకు గండమాల అను రోగము పొట్టవరకు వ్యాప్తి చెందినది. పండ్లు లేవు. దేహమును మురచినది - కంఠవ్యాప్త కఫముతో చచ్చుటకు సిద్ధముగ దిగంబరిగా నుండినది.

125 తా॥ 'సూర్య కిరణముల తాకిడికే చచ్చునట్లు హృదయం జారిపోయినది. సర్వాంగముల శూలతో బాధపడు నట్లు నా కంటికి కాన వచ్చినది.

126 తా॥ 'తల గొరిగిన విధవ - అడుగడుగున పడిపోవునట్లు ఉన్నది. ఇక చావునకై పడి ఉన్నదా అన్నట్లు వచ్చి ఒక చెట్టు నీడ పడియుండ వచ్చెను.

117 తా॥ 'అట్లు వచ్చి చెట్టున పడి యుండ కొంతసేపటికి నేను చూచు చుండగానే ప్రాణములను వదలెను.

128 తా॥ 'ఇంతలో నకస్మాత్తుగా - సూర్యకాంతిని బోలిన దివ్యవిమానము కైలాసము నుండి వచ్చెను - ఆ విమానము నుండి శూలము - ఖట్వాంగము ధరించిన మాతలు దిగిరి.

129 శ్లో॥ చంద్రార్ధమౌళిన స్సర్వే శైవా స్తే చంద్రకాంతయః।
కిరీట కుండల ధరా శ్చ త్వారో దివ్యరూపిణః॥

130 శ్లో॥ ఈదృ గ్విమానం సూర్యాభం విచిత్రం సువిరాజితం।
చండాలీం నేతు మాయాతం దృష్ట్వాఽ హం
విస్మితోఽభవమ్॥

131 శ్లో॥ శివదూతా మయా పృష్టాః కిమర్థం హ్యాగతా ఇతి।
ఆగతాస్మో వయం నేతుం చండాలీ మితి తే ఽబ్రువన్॥

132 శ్లో॥ ఇతి శ్రుత్వా వచ స్తేషాం విస్మయో మే మహా నభూత్।
తా నపృచ్ఛం పున ర్భూప! సావధాన మనాః శృణు॥

133 శ్లో॥ కి మీదృశీ యం చండాలీ విమానం దివ్య మర్హతి।
కః స్థాపయే చ్ఛునీం నీత్వా దివ్య సింహాసనో పరి॥

134 శ్లో॥ ఏతయా జన్మతో దూతాః! పాపౌఘః సంచితో మహాన్।
కథ మర్హతి లోకం సా కైలాసం పాపరూపిణీం॥

135 శ్లో॥ పశుమాంసాహారవృద్ధా జీవహింసా పరాయణా।
కుష్టినీ పాపినీ త్వేషా కథం కైలాస మర్హతి॥

136 శ్లో॥ యస్యా నహి శివజ్ఞానం తపః సాధన మేవ వా।
దయాసత్యవిహీ నేయం కథం కైలాసమర్హతి॥

137 శ్లో॥ నైతయా శివపూజాప్రి కృతాపంచాక్షరీ జపః।
న శివస్మరణంవా సా కథంకైలాస మర్హతి॥

138 శ్లో॥ శివరా త్ర్యుపవాసాది నైతయా పి కదా కృతం।
నదత్తం దాన మ ప్యేషా కథం కైలాస మర్హతి॥

129 తా॥ ఆ దూత లందరూ శంకర సేవకు లన్నట్లు - చంద్రశేఖరులై తెల్లగా శివదూత లుండిరి. ఆ వచ్చిన నల్వురు శివ భటులు - కిరీటమును కుండలములను ధరించి యుండిరి.

130 తా॥ 'ఆ విమానము తేజోవంతమై కాంతితో వెలుగు చుండెను. వా రా చండాల స్త్రీని తీసికొని పోవ నా దూతలు వచ్చుట గమనించి యాశ్చర్య పడితిని.

131 తా॥ 'అప్పుడా శివ దూతలను జూచి "మీ రిచ్చటకు ఎందులకు వచ్చితిరి?" అనగా వారు ఈ చండాలిని - శివలోకమునకు గొనిపో వచ్చితిమి అనిరి.

132 తా॥ 'వా రన్న యా సమాధానమును విని విస్మయమును బొంది నేను వారిని యిట్లు అడిగితిని - ఓ రాజా! సావధానముతో వినుము.

133 తా॥ 'ఈ చండాలి ఎట్టిది? ఇట్టి దివ్యమానమున కెట్లర్హురాలు? కుక్కను దివ్యవిమానమున (సింహాసనమున) ఎట్లు కూర్చుండ బెట్టుదురు?

134 తా॥ 'ఓయీ! దూతలారా! ఈమె జన్మతోడనే మహా పాపమును సంపాదించినది. ఇట్టి పాపాత్మురాలు కైలాసమునకు గొనిపో వనెట్లగును?

135 తా॥ ఈమె పశుమాంసము నాహారముగ గొని పెరిగినది. జీవహింసను చేయునది. కుష్ఠురోగముగల పాపాత్మురాలు. కైలాసమున కెట్లు గొని పోగలరు?

136 తా॥ 'ఈమె కసలు శివజ్ఞానమే లేదు - తపము నొనర్ప లేదు-దయా సత్య శౌచములు లేని యీ యమ కైలాసమున కెట్లు గొనిపో నర్హురాలు?

137 తా॥ 'ఈమె శివపూజ చేయలేదు - శివ పంచాక్షరీ జపము చేయలేదు - శివనామ స్మరణము లేదు - ఇట్టిది కైలాసమున కెట్లర్హురాలు?

138 తా॥ 'శివరాత్ర్యుపవాసాదికము ను గూడ నీమె చేయలేదు. పోనీ, దాన ధర్మములనైనఁజేయలేదు. ఇట్టిది కైలాసమునకు బో నెట్లర్హురాలు?

139 శ్లో॥ నజ్ఞాత మేతయా తీర్థం స్నానం పర్వణి నో కృతం।
నాచీర్ణం వ్రత మప్యేషా కథం కైలాస మర్హతి॥

140 శ్లో॥ సర్వాంగే బహు దుర్గంధః పూయ మస్రం గలత్యపి।
చండాలీయం సుదుర్వృత్తా కథం కైలాస మర్హతి॥

141 శ్లో॥ అస్తు పూర్వార్జితం పాపం పతంతి ముఖతో ఽద్యతు।
కీటాః సేయం గలత్కుష్ఠా కథం కైలాస మర్హతి॥

142 శ్లో॥ పాపి నీయం దురాచారా కథం నేయా శివాలయం।
చరాచరే ఽతినింద్యాం తాం కథంనే తుం సమాగతాః॥

143 శ్లో॥ పాపినీ సుదురాచారా మనర్హాం శివమందిరం।
కిమర్థం నేతు మాయాతాః కౌతుకం ప్రతిభాతి మే॥

144 శ్లో॥ ఇతి పృష్టా మయా తే తు హృష్టా మా మబ్రువం స్తదా।
చండాల్యాః పూర్వజన్మాది తత్తే వక్ష్యామి భూమిప॥

145 శ్లో॥ దూతా ఊచు రియం పూర్వ జన్మని బ్రహ్మవంశజా।
సౌమినీ నామ విఖ్యాతా సోమబింబముఖీ వరా॥

146 శ్లో॥ దృష్ట్వా తాం సుందరీం బాలా మనురూపం వరం పితా।
అన్వేష్య కో ప్యలబ్ధో ఽభూ చింతావేష్టిత మానసః॥

147 శ్లో॥ వివాహ స్యాతికాలం స మత్వా సాధారణం ద్విజమ్।
దృష్ట్వా తస్మై స గృహ్యోక్త విధినా తాం సుతాం దదౌ॥

148 శ్లో॥ ఉద్వాహితా నవోఢా సా పత్యు ర్భవన మన్వగాత్।
కంచిత్కాలం నిజగృహే స్థితా సా రుచిరా కృతిః॥

139 తా॥ ఈమె ఏ పర్వదినము లందును పుణ్య తీర్థములలో స్నానము చేయలేదు. ఏ విధముగపుణ్యవ్రతం చేయలేదు, కైలాసమున కెట్లర్హురాలు?

140 తా॥ 'ఈమె అంగ మంతయు దుర్గంధ యుక్తము రక్తము స్రవించుచు మాంసపు ముక్కల రాల్చు కుష్టు రోగము గలది. దుర్వృత్తితో బ్రతికిన నిది కైలాసము న కెట్లు అర్హురాలు?

141 తా॥ 'పూర్వార్జిత పాపము ముఖము నుండి ప్పటికిని పడుచున్నది. ఈమె కుష్టు రోగి యగుటచే పురుగులు వ్రణముల నుండి రాలు చున్నవే - కైలాసమున కెట్లర్హురాలు?

142 తా॥ 'ఇట్టి దురాచార పాపాత్మురాలు నగు నీమె శివాలయమున కెట్లు పోవచ్చును? చరాచర నింద్యవతి యీమె - చాల దుర్మార్గురాలును గొనిపోవ నెట్లు వచ్చితిరి.

143 తా॥ 'దురాచార పాపాత్మురాలు శివ మందిరమున కెట్లు పోవచ్చును? మీరీ దుర్మార్గురాలును కైలాసమునకు గొనిపో వచ్చితి రన్న నాకు విచిత్రముగ నున్నది.'

144 తా॥ నే నడిగిన యీ ప్రశ్నలకు ఆ శివదూతలు సంతోషించి నాకు సమాధానించిరు. 'ఓ రాజా! ఆ చండాలి పూర్వజన్మాది వృత్తాంతమును నీకు జెప్పెద మని చెప్పిరి.

145 తా॥ ఆ శివదూత "లామె పూర్వజన్మమున బ్రాహ్మణ వంశజా రాలు. ఆ జన్మలో సౌమినీ యనుపేరు చంద్రబింబము వంటి ముఖముతో నుండెది.

146 తా॥ యా సౌమినీ సుందరతనమునకు తగిన వరుని వివాహమునకు వెదకి వెదకి ఎచటను దొరకక తండ్రి చింతాకులిత మానసు డయ్యెను.

147 తా॥ వివాహ కాలము దాటుచున్నదని యనుకొని సాధారణ మగు నొక బ్రాహ్మణుని చూచి వానికి స్వ శాఖోక్త విధానంగా కుమార్తె నిచ్చెను.

148 తా॥ పెండ్లియైన వెంటనే ఆ నూతన పెండ్లికుమార్తె భర్తతో నత్త వారింటికి బోయి అచట కొంతకాలము గృహమందే ఆ సుందరాంగి యుండెను.

149 శ్లో॥ తతః కాలేన నియతా తద్భర్తా పంచతా మితః।
దైవయోగేన విధవా బాల్య ఏవాఽ భవత్తు సా॥

150 శ్లో॥ తతో మాతా పితృభ్యాం సా సమానీతా ధవా లయాత్।
పత్యా విరహితా ఖిన్నా సంజాతా సాఽతి దుఃఖితా॥

151 శ్లో॥ సుందరీప్రాగ్వయస్కా-సా స్మరవ్యాప్తా ప్రతిక్షణం।
తరుణం పురుషం దృష్ట్వా మనో జేతుం శశాక నో॥

152 శ్లో॥ స్మరా తురా రహసి సా జారకర్మ రతా ఽభవత్।
తదపి ప్రకటం జాతం పాతకం నహి గోప్యతే॥

153 శ్లో॥ సా నారీ విధవా పూర్వవయస్కా- ప్యతిసుందరీ।
విషయా క్షిప్త మనసా చంచలా ఽభూ త్సదైవ హి।

154 శ్లో॥ తాదృశీ సు దురాచారా జ్ఞాతిభి ర్వ్యభిచారిణీ।
మాతా పితృ సుహృద్భి శ్చ సమమేవ బహిష్కృతా॥

155 శ్లో॥ తతః పిత్రా దయ స్సర్వే తాం త్యక్త్వా దూషితాం సుతాం।
ప్రాయశ్చిత్తేన తే శుద్ధాః త త్సాంసర్గిక దోషతః॥

156 శ్లో॥ పూర్వం సా శంకితా చాపి తతో నిశ్శంకతాం గతా।
స్పష్టం తత్రైవ నగరే రేమే సా కామదూషితా॥

157 శ్లో॥ తత్రైకం సుందరం వైశ్యం అనురూపం విలోక్య సా।
తరుణం రమణం తేన రేమే తద్రూప మోహితా॥

158 శ్లో॥ గేహినీ తస్య వైశ్యస్య భూత్వా దుష్కృతకారిణీ।
రమణీ రమమాణా ఽఽస స్వకులత్రయవైరిణీ॥

149 తా॥ ఇంతలో దైవయోగమున నా సుందరి భర్త కాలధర్మ మొందెను, అందుచే చిన్న తనముననే విధి వశమున విధవ యై పోయె నామె.

150 తా॥ అంత యాపిల్లను తల్లిదండ్రులు అత్తయింటి నుండి పుట్టినింటికి గొని వచ్చిరి. భర్త చనిపోయి నందున నతిఖిన్నురాలై దీనముగనుండెను.

151 తా॥ ఆ సుందరి పిన్నవయస్కురాలు. అందుచే ప్రతిక్షణము మన్మథార్త యయ్యెను. సుందరమైన పురుషుని జూచిన వెంటనే మనసు నిలువ లేనిదయ్యెను.

152 తా॥ అంత యామె మన్మథా వేశ మాపలేక రహస్యముగ వ్యభిచార కర్మ నొనర్చు చుండెను - అది కొంత కాలమునకు బయల్పడెను. పాపము దాచిన దాగదు గదా?

153 తా॥ ఆ స్త్రీ పూర్వవయస్సుది - అందు విధవ - అతి సుందరి - మనసు విషయాసక్త మైనది - అందుచే చంచలమైన మనసు గల దయ్యెను.

154 తా॥ ఇట్టిది వ్యభిచార వృత్తిని మానలేక పోయెను - అందుచే జ్ఞాతులు బంధువులు చివరకు మాతాపితరులు గూడ నామెను వెలి వేసిరి.

155 తా॥ అట్లు నింద్యురాలగు నా సుందరిని - తల్లిదండ్రులు నింద్య యని - ప్రాయశ్చిత్తము మొదలగు కర్మలచే శుద్ధిని బొందిరి - అయినను ఆమె సహవాసమున దూషితులైరి.

156 తా॥ ఇదివరలో దురాచారమునకు శంకించెడిది - ఇప్పు డాశంకను వదలినది. ఇక ఆ పట్టణములో కామదూషితయై - తగిన వారితోఁ గ్రీడించు చుండెను.

157 తా॥ ఇట్లుండ నా నగరములో నొక సుందరుడగు వయసుగల వైశ్యుని మోహించెను. అతడు పిన్న వయసువాడు, సుందరు డగుటచే వానితో గ్రీడించు చుండెను.

158 తా॥ ఆ కోమటివాని భార్యయై దుర్వృత్తికి బూనుకొని తనకు దగిన రమణునితో గూడి తన కుల ద్వయమునుకు బ్రాహ్మణ కులమునకు శత్రువయ్యెను.

159 శ్లో॥ స్త్రియః కామేన నశ్యంతి బ్రాహ్మణో హీనసేవయా।
రాజానో బ్రహ్మదండేన యతయో భోగసంగ్రహాత్॥

160 శ్లో॥ సా ఽరాత్రం తేన సహితా నష్టబుద్ధి రరీరమత్।
తస్యా స్తు రమమాణాయాః పుత్రా అపి బభూవిరే॥

161 శ్లో॥ మాంసాహార రతా నిత్య మున్మత్తా మద్య పానతః।
భూత్వా వైశ్యస్య మహిషీ సర్వమేవం వయో ఽనయత్॥

162 శ్లో॥ కదాచన మదాంధా సా యోషా మేషభ్రమేణ తు।
ఆహారార్థం ధేనువత్సం నిజఘాన దురాత్మికా॥

163 శ్లో॥ నిధాయ శిక్యే వత్సస్య వరాంగ మపరే ఽహని।
అత్తుం నష్టమతిః సద్యః శేషం పక్త్వా చఖాద సా॥

164 శ్లో॥ భ్రాంతా సా మద్యపానేన గాఢం సుప్త్వా వరేహని।
ప్రబుద్ధా పాత్ర మాదాయ ధేనుం దోగ్ధుం సముద్యతా॥

165 శ్లో॥ వత్సస్థానే తదా దృష్ట్వా మేషం భ్రాంతా గృహంగతా।
శిక్యే వత్సశిరో దృష్ట్వా భీతా ఽఽత్మా న మగర్హయత్॥

166 శ్లో॥ సాఽ నుతప్త్వా శివ శివ! చంద్రమౌళే! దురాత్మనా।
కి మిదం విహితం పాప మజ్ఞానే నే తి చా బ్రవీత్॥

167 శ్లో॥ కుప్యేత పతి రేతేన దోషే ణేతి కుధీ స్తదా।
అస్థి చర్మాది నిక్షిప్య సర్వం గర్తే శిరోఽపి చ॥

168 శ్లో॥ సమీపస్థం గృహం గత్వా మృషా దుఃఖేన సా ఽరుదత్।
వ్యాఘ్రే ణాపహృతో వత్స ఇత్యేవం భర్తు రగ్రతః॥

159 తా॥ సాధారణముగ స్త్రీలు - కామము చేతను, బ్రాహ్మణులు నీచకుల సేవతోను, క్షత్రియులు - బ్రాహ్మణుల శిక్షించుటవలన, యతులు భోగముల కలవడిన చెడుదురు.

160 తా॥ సరే 'ఆ సౌమిని వానితో నెత్తెగక క్రీడించి - అనేక మంది సంతానమును పొందెను - ఇట్లుగా నా బ్రాహ్మణ విధవ నష్టబుద్ధి యయ్యెను - వైశ్యునకు పత్నిగా నుండెను.

161 తా॥ ప్రతిరోజామె మాంసాహారముగొనినదై, మద్యపానము చే మత్తురాలగుచుండెను. వైశ్యుని భార్యయై పరిస్థితి ఇట్లుండ - ఇంతలో వయసు తరిగి పోయెను.

162 తా॥ ఒక రోజు వైశ్యపత్నిగ మద్యపాన మత్తయై మేక అను భ్రమతో ఆహారమునకై - ఆవు దూడను చంపి వేసెను.

163 తా॥ అంతట - ఆ యావు దూడ తలనొక చిక్కములో నుంచి, మరురోజున కుంచి, తినుటకు - బుద్ధిలేనిదై - మిగిలిన - అవయవముల వండి మాంసమును తినెను.

164 తా॥ మద్యపాన మత్తుచే వళ్ళు తెలియక తిని గాఢముగ నిద్రించి - మరునాడుదయమున నే లేచి పాలు నావునుండి గొన పాల బితుక పోయెను.

165 తా॥ వైశ్యునకు భార్యయైన ఆ విధవ బ్రాహ్మణస్త్రీ ఆవు దూడ యున్నచోట మేకను చూచి భ్రాంతు రాలై పాలదొడ్డి నుండి యింటిలోనికి వెళ్ళి చిక్కములోని తలను జూచి తనను నిందించుకొనెను.

166 తా॥ దానిని చూచి మత్తు తీరియున్నందున - శివశివ శంకర దుర్మార్గురాలనెంతటి పాపమును చేసితివి? - నా త్రాగుడు మత్తుచే నజ్ఞాననై తినే? అని పశ్చాత్తాప పడెను.

167 తా॥ దీనిని నా భర్త తెలిసికొన్న దుర్మార్గుడు నన్ను కోపపడునని భయపడి గోవత్స చర్మమును ఎముకలను వేరే యొక్కచోట అవతల నొకచోట గృహమునకు వెలుపల పాతి పెట్టెను.

168 తా॥ పాతి పెట్టిన చోటు నుండి గృహమునకు బోయి దొంగ యేడుపు యేడ్చుచు - భర్త యెదుట - ఓనాథా! ఒక పెద్దపులి గోవత్సమును అపహరించె ననెను.

169 శ్లో॥ ఏవమాదీని పాపాని కృత్వా వైశ్య గృహే కుధీః।
మమార సా తతో యామ్యా దూతా స్తాం నేతు మాగతాః॥

170 శ్లో॥ నీత్వా సాపి తృభిః సాకం ప్రక్షిప్తా రౌరవాదిషు।
దు స్తరాం యాతనాం భుక్త్వా చండాలీ సా ధునా ఽభవత్॥

171 శ్లో॥ చండాలీ గోవధా దంధా జాతా సమ్య గనేక్షణాత్।
ఔపపత్యా దలత్కుష్ఠా పితృభ్యాం పరిపాలితా॥

172 శ్లో॥ ఉచ్ఛిష్టాన్నా దానేన బాల్యే సా పరిరక్షితా।
స్నేహేన తన్ముఖే దత్వా గ్రాసా నా త్రాయదా రుచి॥

173 శ్లో॥ వృద్ధా యథా యథా సాపి తథా వృద్ధావ్రణా అపి।
ప్రమీతౌ పితరౌ బాల్యే దీనా ఽభూ త్సా నిరాశ్రయా॥

174 శ్లో॥ గలత్కుష్ఠేన దుర్గంధాం భ్రాతర స్తాం జహు స్తదా।
రక్షతి స్మో దరం సా తు యాచ్నయా ప్రతి వాసరం।

175 శ్లో॥ తథాఽపి నైవ శాంతా ఽభూ ద్బుభుక్షాస్యా ధభిక్షయా।
క్షుత్తృట్ప్రపీడితా నిత్యం కుష్ఠేనాతీవ దుఃఖితా॥

176 శ్లో॥ పుణ్యకర్మ విపాకేన వృద్ధా సా వ్రణదుఃఖితా।
దరిద్రా వస్త్రరహితా పా నాశన వివర్జితా॥

177 శ్లో॥ మార్గే ప్రసిద్ధే పతితా యయాచే సా మహాజనాన్।
పాపయోగేన సాఽ ధాపి న లేభే న్నం క్షుధా ర్థితా॥

178 శ్లో॥ వ్యాధిగ్రస్తా గలత్కుష్ఠా క్షీణదేహ క్షుధార్థితా।
పూయశోణిత దుర్గంధా కర్మణా స్వేన గర్హితా॥

169 తా॥ ఇట్టి గొప్ప పాతకము లనేకముల జేసి వైశ్య గృహమందు కపట వర్తనముతో నుండి చచ్చెను - అంత టామెను గొనిపో యమ దూతలు వచ్చిరి.

170 తా॥ ఆ యమదూత లామెను - తలిదండ్రుల (ఆమె) తో గూడ తీసికొని వెళ్ళి రౌరవ నరకమున బాధలు పెట్టి వదలిరి - తరువాత యీ జన్మలో చండాలస్త్రీ అయ్యెను.

171 తా॥ ఈమే గోవధ వలన చండాలయు - కానక మేక యను కొన్నది కావున - గ్రుడ్డిదియు నయ్యెను. ఉపపతితో నున్నందున కండలూడి పడు కుష్టు రోగమున బెరిగె

172 తా॥ ఎంగిలి కూడు దినుచు చిన్నతనమున బ్రతికెను - ప్రేమతో - నుపపతులతో గూడి వారి యెంగిలి తిన్నందున యిప్పు డుచ్ఛిష్టాన్న మున బ్రతుకుచున్నది.

173 తా॥ తలిదండ్రుల మరణానంతరము తానును వృద్ధ యయ్యెను - ఆమె వయసుతో కుష్ఠ వ్రణములు పెద్ద పెద్దవగు చుండెను - తలిదండ్రులు పోయి నిరాశ్రయ యయ్యెను.

174 తా॥ గొప్ప కుష్ఠు దగుటచే - దేహము దుర్గంధ పూరితము కాగా ఆమె సోదరులు గూడ నామెను వదలిరి - ప్రతిరోజు భిక్షాన్నముతో పొట్ట నింపుకొనెను.

175 తా॥ అప్పటికి రోగము నిమ్మళించలేదు - ఆకలిబాధ అధికమయ్యె - కుష్ఠ రోగముతోను ఆకలి దప్పికలతోను - అతి దుఃఖమును పడుచుండెను.

176 తా॥ 166 వ తాత్పర్యములో - శివశివ చంద్రమౌళి అన్న పుణ్యముచే - వ్రణబాధలతో వస్త్రహీన దరిద్రురాలయ్యు - ఆకలిదప్పులకు దూరమయ్యు నొక బుద్ధి కలిగెను.

177 తా॥ రాజ బాటను పడిపోయి - దారిబోవు జనము నన్న మడిగెడిది. ఆమె చేసిన పాపమున అన్నము దొరకక పోయె- ఆకలి యెక్కువయ్యెను.

178 తా॥ ఆమె కుష్ఠు రోగము - శరీరక్షీణత - ఆకలిబాధ - చీము రక్తము కారుచు దుర్గంధముతో తాను చేసిన పూర్వ కర్మఫల మనుభవించు చుండెను.

179 శ్లో॥ ఏవం సా వర్తమానాఽథ మాఘమాస ఉపాగతే।
శ్రీ పుత్రసహితా లోకాః గోకర్ణం గంతు ముద్యవాః॥

180 శ్లో॥ శివరాత్ర్యాం శివం ద్రష్టుం నానాదేశ సమాగతాః।
హర్షేణ మహతా విష్టా యాత్రికా గమనోత్సుకాః॥

181 శ్లో॥ హ స్త్యశ్వ రథ పాదాతి సహితాః సమలంకృతాః।
రాజాన స్సమను ప్రాప్తా ద్రష్టుం లింగం మహాబలం॥

182 శ్లో॥ బ్రాహ్మణాః క్షత్రియాః వైశ్యాః శూద్రా అన్యోన్య జాతయః।
మహాబలేశ్వరం ద్రష్టుం జగ్ము స్సర్వే ఽతిహర్షితాః॥

183 శ్లో॥ హసంతః కేపి గాయంతో ధావంతః కేచ నాపరే।
నృత్యంతో జగ్ము రఖిలాః స్మరంతో ఽజం పునః పునః॥

184 శ్లో॥ ఏవం తాన్ గచ్ఛతో జ్ఞాత్వా గోకర్ణం హర్షనిర్భరా।
గచ్ఛద్భి ర్భిక్షుకై స్సాకం చండాలీ సాపి నిర్యయౌ॥

185 శ్లో॥ శివే త్యుచ్చారణోత్పన్నా పుణ్యేనక్షేత్ర మాగతా।
చండాలీ సాపి గోకర్ణం గత్వా ఽన్నం సమయాచత్॥

186 శ్లో మార్గేణ గచ్ఛతో లోకాన్ క్రందంతీ సా బుభుక్షితా।
కరౌ ప్రసార్య తా నన్నం అయాచత మహాజనాన్॥

187 శ్లో॥ పూర్వజన్మని మే పాపం కృతం తేనైవ పీడితా।
క్షుధా నివారణార్థం మే దదా త్వన్నం మహాజన!॥

188 శ్లో॥ సర్వాంగేషు గలత్కుష్ఠాం వివస్త్రాం శీతపీడితాం।
దృష్ట్వా మాం క్షుధితా మంధాం ధర్మం కుర్వంతు సజ్జనాః॥

179 తా॥ ఇట్లుండగా గొంత కాలమునకు మాఘ మాసము వచ్చెను - లోకులు తమ తమ కుటుంబము భార్యాబిడ్డలతో గోకర్ణ యాత్రోత్సవమునకుఁ బోవు చుండిరి.

180 తా॥ శివరాత్రి నాడు శివుని చూచుటకు నానాదేశముల నుండి అనేకులు వచ్చు చుండిరి. సంతోషముతో దేవుని చూచు వేడుకతో యాత్రకై పరుగు లిడు చుండిరి.

181 తా॥ కొంద రేనుగులు - గుఱ్ఱములు - రథములతోను - కాలినడకలవారి బలములతో మహారాజులే కొందరు - మహాబలేశ్వరుని చూడ వచ్చు చుండిరి.

182 తా॥ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రవర్ణములవారు - ఇతర జాతుల వారు అన్యోన్య స్నేహముతో సంతోషమున నా గోకర్ణమహాబలేశ్వర దర్శనమునకు వచ్చు చుండిరి.

183 తా॥ కొందరు నవ్వుచు - కొందరు - నృత్యముఁజేయుచు - కొందరు పరుగులిడుచు - కొందరు పాడుచు - కొందరు భజనలతో భగవంతుని స్మరించు కొనుచుండిరి.

184 తా॥ ఇట్లు ప్రజలు గోకర్ణ యాత్రకై గుంపులు గుంపులుగా వెళ్లట నెరిగి కొందరు బిచ్చగాండ్రును బయలుదేరి వెళ్ళుచుండ వారివెంట నా చండాలియు బయలుదేరెను.

185 తా॥ వెనుక జన్మలో - శివ - శివ చంద్రమౌళి అని గోవధానంతరము పశ్చాత్తాప పడిన దగుటచే - ఆ చండాలి గోకర్ణేశ్వర దర్శన లాలసయై గోకర్ణము చేరి బిచ్చమడుగు చుండెను.

186 తా॥ త్రోవన బోవు జనమును - అరచి పిలుచుచు - ఆకలి బాధకై చేతులఁ జాచి - వారి నా యాత్రికుల నన్న మడిగెను - మహాజనము దానిని చూచుచు వెళ్ళు చుండిరి.

187 తా॥ 'అయ్యా! దాతలారా! పూర్వజన్మమున చేసిన పాప మేదో కాని - దాని వలన నా ఆకలి బాధ నివారణకు - కొంచె మన్నము దొరకలేదు పెట్టం డయ్యా!' అనెను.

188 తా॥ ఆపె సర్వాంగ కుష్ఠయై కట్టుబట్ట లేక చలికి ముడుచుకొని యుండెను - అమె - అయ్యలారా! నా యవస్థ ఇది - గ్రుడ్డిదానను ఆకలిగొన్న నాకు ధర్మం చేయండి.

199 శ్లో॥ ఆదిత్యకర సంస్పర్శాత్ దుర్గేయం క్షుళపీడితా॥
ఇయ మేతాదృశీ జాతా పూర్వకర్మ విపాకతః॥

200 శ్లో॥ సా చండాలీ య మత్రైవ వృక్షచ్ఛాయా ముపాగతా।
ప్రాణాన్ జహౌ తత శ్శంభు ప్రేరితా స్మ ఇహా గతాః॥

201 శ్లో॥ శివరా త్ర్యుపవాసాహే శివే బిల్వార్పణేన చ।
జాగరేణ సుపుణ్యేన పాప మస్యా లయం గతం॥

202 శ్లో॥ శత జన్మార్జితం పాప మేతే నాస్యాః లయం గతం।
ప్రీతి పాత్రం శివస్యేయ మతఈశో న ఐరయత్॥

203 శ్లో॥ ఇత్యుక్త్వా శివదూతా మాం తస్యా ఉపరి తే ఽమృతమ్।
క్షిప్త్వా తతో దివ్య దేహం తా మాదాయ ద్రుతం యయుః॥

204 శ్లో॥ ఏత ద్దృష్టం మయా రాజం శ్చండాల్యజ్ఞానతో ఽపి సా।
ముక్తో గోకర్ణ మాహాత్మ్య మీదృశం లోకపావనం॥

205 శ్లో నిస్సంశయం వ్రజ తతో రాజ స్గమన మాత్రతః।
శుద్ధో భూ త్వేహలబ్ధ్వేష్టం పరత్ర గతి మేష్యసి॥

206 శ్లో॥ ఇతి గౌతమతః శ్రుత్వా తుష్టో రాజా ఽపి సత్వరం।
గత్వా గోకర్ణకం క్షేత్రం పాపా న్ముక్తో బభూవ హ॥

207 శ్లో॥ తస్మా త్సుపావనం పుణ్యం గోకర్ణక్షేత్ర ముత్తమమ్।
అతఏవ స్థిత స్తత్ర శ్రీపాదో నామ ధారక!॥

199 తా॥ సూర్యకిరణ ప్రసారముచే (ఎండ తాకిడిచే) రోగ బాధ వలనను బాధ నొంది - పూర్వ కర్మ విపాకముచే నీమె యిట్లయ్యెను.

200 తా॥ ఆ ముసలి చండాలి యే యీ వృక్ష చాయకు వచ్చినది - వచ్చిన వెంటనే ప్రాణములను వదలెను - అపుడు - శివప్రేరితులమై మే మిక్కడకు వచ్చితిమి.

201 తా॥ శివరాత్రినా డు పవాసము చేయుట చేత - శివరాత్రి నిశీధమున శివ పూజా సమయమున తన బిల్వము నీశ్వరార్పితమగుట, జాగరణము చేత పాపము తొలగెను.

202 తా॥ ఈమె నూరు జన్మల నుండి సంపాదించిన పాపము తొలగెను - అందుచే నీమె శివునకు ప్రేమపాత్ర యయ్యెను - కావున శివుడు మమ్మిట కంపెను.'

203 తా॥ ఇట్లు శివదూతలు నాతో బలికి ఆమెపైన అమృతమును చల్లి ఆమెకు దివ్య దేహము నిచ్చి విమానమున గూర్చుండ బెట్టుకొని తొందరగ వెళ్ళిరి.

204 తా॥ ఓ రాజా! నేను చూచు చుండగనే ఆ చండాలిని గొనిపోయిరి. ఆమె సంసారము నుండి ముక్తురాలయ్యెను - కావున శివరాత్రి నాటి గోకర్ణ మాహాత్మ్య మిట్టిది.

205 తా॥ కాబట్టి - ఓ మిత్రసహ రాజా! ఇది నిస్సంశయ పుణ్యప్రదము - ఆ గోకర్ణ క్షేత్రమును బొందిన తప్పక శుద్ధుడ వగుదువు - ఇహలోక పరలోక తారకము.'

206 తా॥ ఇట్లన్న ఆ గౌతమ వాక్యమును విని వెంటనే గోకర్ణ క్షేత్రమునకు బోయెను. అచట తన పాపమునుండి యాతడు ముక్తు డయ్యెను.

207 తా॥ అందుచే పరమ పావనమైన దా గోకర్ణ క్షేత్రము - అందుచే శ్రీపాద వల్లభుల వా రా గోకర్ణ క్షేత్రమున స్థిరనివాసము చేసిరి.

208 శ్లో॥ గంగాధర ద్విజసుతో ఽత్ర సరస్వ తీతి
ప్రఖ్యాత ఏత దవద చ్ఛ్రవణోత్సుకే భ్యః।
అజ్ఞానతో ఽపి వదతా మసతా మ పీదం
లబ్ధం ఫలం కిము సతాం విదుషాం తు వాచ్యం॥

గద్య॥ ఇతి శ్రీ సిద్ధ నామధారక సంవాద రూపేణ సరస్వత్యాఖ్య గంగాధ రాత్మజ విరచిత నరసింహ సరస్వ త్యుపాఖ్యాన సంజ్ఞిత మహరాష్ట్ర భాషాన్విత గురుచరిత్ర సమానార్థాయాం వాసుదేవానంద సరస్వతీ యతి విరచితాయాం శ్రీ గురు సంహితాయాం జ్ఞానకాండే సప్తమోఽధ్యాయః.

ఆదితశ్లోకాః (1015)

ఇతి సప్తమోఽధ్యాయః.

208 తా॥ గంగాధర నామక బ్రాహ్మణుని పుత్రుడగు వాసుదేవ సరస్వతి ప్రఖ్యాతుడగుటచే - ఈ గాథను - వినిపించుటచే ధన్యుడయ్యెను. కావున నీ కథను తెలిసిన వారైన తెలియని వారైనా విన్నచో సంపూర్ణ ఫలము నొందుదురు.

వచ॥ ఇది సిద్ధునకు నామధారకునకు గలిన సంవాదరూపమైనది. గంగాధర పుత్రునిచే విరచితమైనది - నృసింహ సరస్వతిని గూర్చి చెప్పఁబడినది. మహారాష్ట్ర భాషతో గూడి సమశ్లోకమునకు సమానమైన దీ వాసుదేవ సరస్వతీ విరచిత శ్రీగురు సంహిత యందు జ్ఞానకాండలోని ఏడవ అధ్యాయము సమాప్తము.

మొదటి నుండి శ్లోకములు (1015)

ఇట్లు ఏడవ అధ్యాయం సమాప్తము.

శ్రీ గణేశాయ నమః- శ్రీదత్తాత్రేయాయ నమః

# శ్రీ గురుదత్త చరితే

## అష్టమోఽధ్యాయః- జ్ఞానకాండః

1 శ్లో॥ నామధారక ఊచే తం గోకర్ణ మహిమా శ్రుతః।
కతికాలం స్థిత స్తత్ర శ్రీపాదో వద మే ఽగ్రతః॥

2 శ్లో॥ గురుమూర్తే! కృపాసింధో! విద్ధం తేన మనో మమ।
తస్య సచ్చరితం శ్రోతు మానందో ఽతీవ వర్ధతే॥

3 శ్లో॥ ఇతి తస్య వచః శ్రుత్వా సంతుష్టః సిద్ధ ఆహ తం।
చరితం విస్తరా ద్వక్ష్యే సావధానతయా శ్రుణు॥

4 శ్లో॥ క్షేత్రం గోకర్ణ మాసాద్య త్రీణి వర్షాణి తత్ర చ।
స్థిత్వా లోకానుగ్రహ కృ త్తతః శ్రీపర్వతం గతః

5 శ్లో॥ యత్పాద దర్శనా దేవ సర్వ తీర్థఫలం నృణాం।
శ్రుతి రప్యాహ చరణం పవిత్రం వితతం త్వితి॥

6 శ్లో॥ యత్పదే సర్వ తీర్థాని తస్య పర్యటనం భువి।
అనుగ్రహాయ లోకానాం మహ ద్విచలనం స్మృతం॥

7 శ్లో॥ స్థిత్వా ద్రౌ చతురో మాసాఽ దాస్యఽ స్వేభ్య స్వదర్శనం
నివృత్తి సంగమే స్నాత్వా శ్రీపా తు్కురుపురం యయౌ।

8 శ్లో॥ కృష్ణా యత్ర ప్రవహతి వేణ్యా సహ నిరంతరం।
అపారో మహిమా తస్యాః దుర్లభో న్యత్ర భూతలే॥

1 తా॥ ఓయీ సిద్ధమునీ! అని యనుచు నామధారకుడు గోకర్ణక్షేత్ర మాహాత్మ్యమును విన్నవాడై - శ్రీ పాదుల వారక్కడ ఎంతకాల ముండి రని అడిగెను.

2 తా॥ ఓగురువరా, దయామయా! నా మన సెందులకో వారి చరితమును విని ఆనందింప గోరికతో నున్నది - దానిని తాము నాకు విని పింపండి!

3 తా॥ నామధారకు డడిగిన యీ చరిత్రను చెప్పుటకు సంతోషించి ఆ సిద్ధుడు - ఓయీ! నీకు వారి చరిత్రను విస్తరించి వచింతును, సావ ధానముగ విను మనెను.

4 తా॥ ఓయీ! శ్రీ పాదులవారు - గోకర్ణ క్షేత్రమున మూడు సంవత్సరము లుండి లోకుల నను్రగహించు దృష్టితో - అక్కడ నుండి శ్రీశైల క్షేత్రమునకు బోయెను.

5 తా॥ ఏ మహాత్ముని పాదములో సర్వ తీర్థములుండెనో అట్టివాని కి తీర్థ క్షేత్రములకుఁ బోవుటేమి టన మహాత్ములు లోకుల ననుగ్రహింప నట్లు చేతురు.

6 తా॥ ఏ మహాత్ముని పాద దర్శనము సర్వ తీర్థ ఫలప్రదమో అట్టి మహాత్ముడు - తన దర్శన మిచ్చి సాధువులకు సర్వ క్షేత్ర దర్శన ఫలమిచ్చుటకే నని వేదము గూడ చెప్పెను.

7 తా॥ ఆ శ్రీశైల పర్వతమున నాల్గు నెలలుండి - తన దర్శనమును పుణ్యా త్ముల కిచ్చుచు - వైరాగ్య ప్రదమైన కృష్ణ వేణీ సంగమమున స్నానింప కురుపురమునకు వెళ్ళెను.

8 తా॥ ఈ భూలోక క్షేత్రముల మహిమ లన్నిటికన్న మహిమముతో గూడి - నిరంతరము కృష్ణా ప్రవాహ పూరితమైన దా కురుపుర క్షేత్రము.

9 శ్లో॥ మహిమా వర్ణ్యతే చేత్తు గ్రంథో విస్తరతాం వ్రజేత్।
అత స్స్వల్పతరం తుభ్యం కథయిష్యామి తారక॥

10 శ్లో॥ శ్రీపాదాధిష్ఠిత స్థాన ఖ్యాతి ర్జాతా మహీతలే।
అధునా కురుగడ్డీతి స్థానం ప్రఖ్యాత మస్తి తత్॥

11 శ్లో॥ శ్రీపాద మత్ర యే భక్త్యా భజంతి శ్రద్ధయాం జనా।
తే కన్యాపుత్రలక్ష్మ్యాది భాజో భీష్టం భజంతి హి॥

12 శ్లో॥ శ్రీపాద మిహ మా ఽశేషో విస్తరేణ నవర్ణ్యతే।
అథాఽపి కించి దధునా చరితం తస్య తే బ్రువే॥

13 శ్లో॥ విలీయం తత్ర శ్రీపాదః స్వా వతారాంతరం దధౌ।
శ్రీవల్లభః కురుపురే గుప్త రూపేణ చా స్తిహి।

14 శ్లో॥ కథయిష్యామి లో స్తుభ్య మవతార ప్రయోజనం।
తద్గ్రామే వేదశాస్త్రజ్ఞః కశ్చన బ్రాహ్మణో ఽభవత్॥

15 శ్లో॥ తస్య భా ర్యాంబికా నామ సుశీలా పతిదేవతా।
సతీ స్వాచార సంపన్నా పతిసేవా పరాయణా॥

16 శ్లో॥ భూత్వా మృతా బహుసుతా స్తస్యాః ప్రాక్కర్మ యోగతః
అనేక తీర్థ సేవాది నానోపాయా స్తయా కృతాః॥

17 శ్లో॥ తతో దైవవశా జ్జాతో తస్యాః మందమతి స్సుతః।
తథావిధ మపి స్నేహా త్తం పుపో షాంబికా సుతమ్॥

18 శ్లో॥ తత స్స్వవ్రత బంధార్హః జాతో విప్ర సుత స్సతు।
పి తోపనీయ విధినా తస్మై వేద ముపాదిశత్॥

9 తా॥ ఇఁక దాని మహిమను వర్ణింపఁ బూనితే నీ గ్రంథము విస్తారమగును. అందుచే నామధారక! దాని మహిమను గూర్చి నీకు స్వల్పముగ వినిపింతును.

10 తా॥ ఈ నాటికిని కృష్ణవేణీ తీరమున శ్రీ పాదులవారు నివసించిన స్థానమని కురుపురం, కురుగడ్డ అను పేర్లతో క్షేత్ర మొకటి యున్నది.

11 తా॥ ఈ కురుపుర క్షేత్రములో శ్రీ పాదుల వారి నెవరు శ్రద్ధా భక్తులతో సేవించు చున్నారో వారు పుత్ర పౌత్ర సంపదతో ధనధాన్యలోగైశ్వర్యము లొం దు చుండిరి.

12 తా॥ శ్రీ పాదులవారి గూర్చి యిచట నీకు విస్తారముగ నేమియు చెప్పను కాని, కొంచెము మాత్రము నీ కు వినుపింతు నిప్పుడనెను.

13 తా॥ శ్రీపాదులవారు ఇందుండి వే రవతారమును జెందినను గుప్తముగ ఈ కురుగడ్డ పురమున గల తన యాశ్రమ ములోనే యుండెను.

14 తా॥ కనుక నిప్పు డాశ్రీపాద వల్లభుల వారి అవతార ప్రయోజనమును వచించెద. ఆ గ్రామములో వేదశాస్త్రి జ్ఞుడైన యొక బ్రాహ్మణుడుండెను.

15 తా॥ ఆ బ్రాహ్మణుని భార్య సుశీలాంబికా అను పేరు గలది. ఆమె పతివ్రత, మంచి యాచారవతి. భర్తను దైవసమానముగ సేవించు చుండెడిది.

16 తా॥ ఆమెకు అనేకులు పుత్రులు గలిగి చచ్చిరి. ఆమె ప్రారబ్ధ మట్టిది అందుల కామె నానాక్షేత్ర తీర్థ ముల సేవించుచు ఆ కర్మను తొలగించుకొన ననేకోపాయముల చేసెను.

17 తా॥ ఇంతలో దైవవశమున మందమతియగు పుత్రుడుదయించెను. మందమతియైనను వానిని అతి ప్రేమతో నా తల్లి పోషించు చుండెను.

18 తా॥ ఇంతలో కొన్ని రోజులకు ఉపనయన కాలము వచ్చెను. అందు లకా తండ్రి వానిని సకాలముఁన ఉపనీతు నొనరించి వేదమును జెప్పెఁను.

19 శ్లో॥ అజ్ఞో మందమతి ర్నైకం మంత్ర మ ప్యాదదే సుతః।
చింతాతురః పితా తస్య శ్రోత్రియో ఽభూ త్సు దుఃఖితః॥

20 శ్లో॥ ద్విజః ప్రాహ సమారాధ్య దైవా ల్లబ్ధ స్త్వయం సుతః।
హాకష్టం మే కులం నష్టం ప్రాచీనం కర్మదుర్ఘటం॥

21 శ్లో॥ ఏవ ముక్త్వా బహువిధై రుపాయై స్త మ శిక్షియత్।
నివార్యతాదయం తం తం పతిం స్త్రీ దుఃఖితా వదత్॥

22 శ్లో॥ కష్టేన మహతా లబ్ధ ఏకఏవ సుత స్త్వయం।
చిరం జీవతు బా లోఽసౌ దైవేన పరిపాలితః॥

23 శ్లో॥ విద్యాం నార్హతి దైవేన మా తాడయ దయానిధే!।
మూఢత్వేన ద్విజత్వా ప్తి తస్య ప్రాచీన కర్మతః॥

24 శ్లో॥ అతో ఽన్యతాడనే నాలం యది సంతాడయిష్యసి।
ప్రాణాం స్త్యక్షామి భోః స్వామి౯ భవ ద్రగే న సంశయః॥

25 శ్లో॥ ఇతి పత్నీవచః శ్రుత్వా తూష్ణీమాస వివేకవా౯
తథావిధం నిజం దైవం మత్వా కార్యాంతరే స్థితః॥

26 శ్లో॥ తతః కాలేన నియతా విప్రో రోగేణ పీడితః।
పంచతా మగమ ద్దైవ వశేన శ్రోత్రియో ద్విజః॥

27 శ్లో॥ సామూర్ఖ పుత్రా విధవా దారిద్ర్యేణా తిదుఃఖితా।
స్వాత్మానం తనయం చాపి యాచ్నా వృత్త్యా వ్యజీవయత్।

28 శ్లో॥ తస్మై వివాహ యోగ్యాయ నదదౌ కోఽపి కన్యకాం।
మూఢం నిందితవా న్మాతృ యాచితాన్నా శినం జనః॥

19 తా॥ ఎన్ని విధములుగ తండ్రి శ్రమ చేసి ఏ మంత్రము చెప్పినను ఏ యొక్క మంత్రము మందమతిత్వముచే రాలేదు. దాని కాతండ్రి చాల విచారపడి దుఃఖించు చుండెను.

20 తా॥ ఆ బ్రాహ్మణు డిట్లనెను: ఇది దైవయోగమున పుట్టిన సంతానము నా కులము వంశాచారమును సర్వము నష్టమై పోయినది.

21 తా॥ అని యిట్లనుకొని యు అనే కోపాయముల వానిని శిక్షణలో నుంచెను. ఆ శిక్షణలను చూడలేక ఆ తల్లి తండ్రి నందుండి నివారించి యేడ్చెను.

22 తా॥ పోనీ లెండి, చాలా కాలమున కీ యొక్క పుత్రుడు దక్కినాడు. ఇతడు బ్రతికి యుండిన చాలు, దైవమీతని నేరీతిన కనికరించునో స్వామీ? అని భార్య అనుచుండెను.

23 తా॥ దైవ ప్రాతికూల్యమున చదువు వచ్చుటలేదు, కొట్టకండి అనగా ఆ విప్రుడు దైవము గల్గించిన దానికి మనమేమి చేయుద మని యూర కుండెను.

24 తా॥ తల్లి ఆ భర్తతో అయ్యా, మీ రిట్లు కొట్టుటనేను చూడలేను నా ప్రాణ ముల వదులుదును. మీ రట్లు చేసిన నేను మీ యెదుట చత్తుననెను.

25 తా॥ అంతటా భార్యమాటవిని యా బ్రాహ్మణుడు వివేకముతో యూరకుం డెను. అట్లుండి లోకమున తన నిత్యముల నా బ్రాహ్మణుడు నెర వేర్చుకొనుచుండెను.

26 తా॥ ఇట్లుండగా కొంతకాలమునకు ఆ బ్రాహ్మణుడు రోగగ్రస్తుడై దైవ వశమున ఆయన మరణము నొందెను.

27 తా॥ ఆ మూర్ఖ పుత్రుని తో విధవయై న నామె దరిద్రముతో బాధ పడుచు యాచ్నా వృత్తితో (భిక్షాటనముతో) జీవనమును చేయుచుండెను.

28 తా॥ ఆ పిల్లవానికి వివాహ వయసు వచ్చెను-ఎవ్వరు పిల్ల నీయక పోయిరి- వాడు మూఢుడు - తల్లి తెచ్చిన బిచ్చమున్నమును తిను మూఢుడని జనులు నిందించుచుండిరి.

29 శ్లో॥ జనా స్తమూచిరే మూఢ ధృత్వా శీర్షే ఽన్వహం ఘటం।
నద్యా జలం సమానీయ సమర్పయ గృహే గృహే॥

30 శ్లో॥ అశ్మవ జ్జన్మ తే వ్యర్థం మూర్ఖత్వం కులనాశకః।
త్వత్కులే లాంఛనం లగ్నం జన్మనా తవ మూఢ ధీః॥

31 శ్లో॥ ఖ్యాత శ్చతుర్షు రాష్ట్రేషు సదాచారః పి తా తవ!
వేదశాస్త్ర పురాణజ్ఞః స తే జన్యా క లం కితః॥

32 శ్లో॥ జననీ యాచితా న్నేన త్వం మూఢ ఉదరం భరిః।
న బ్రిహణాసి కథం బ్రూహి పిత్యా న్నే ష్యత్యదో గతిమ్॥

33 శ్లో॥ సంభూయ తిష్ఠసి పశు ప్రాయో ఽలం తవ జన్మనా।
కిం వ్యర్థజన్మనా గంగాప్రవేశం కురు దుర్మతే॥

34 శ్లో॥ ఇతి లోకవచ శ్శ్రుత్వా సోఽపి మూఢో ఽతిదుఃఖితః।
మాతరం ప్రాహ జనని ప్రాణాం స్త్యక్ష్యామి నిశ్చితం॥

35 శ్లో॥ సర్వే నిందంతి మాం మూఢం శరీరేణ కి మీదృశా।
మత్పోషణేఽపి శ్రాంతాసి మాతర్యా స్యామ్యతోవనం॥

36 శ్లో॥ ఇతి పుత్రవచః శ్రుత్వా మాతా చింతా సమన్వితా।
శోకాబ్ధౌ గహనే సాఽపి పతితా విలలాప హ॥

37 శ్లో॥ దుఃఖితౌ తౌ తతః కృష్ణాప్రవాహం సముపాగతౌ।
తత్ర స్నానార్థ మాయాంతం శ్రీపాదం విప దంతకమ్॥

38 శ్లో॥ దృష్ట్వా తచ్చరణే ధృత్వా ప్రోచతు ర్దుఃఖ విహ్వలౌ॥
గంగాయా మధునా ప్రాణాం స్త్యక్ష్యావ ఇతి నౌ మతమ్॥

29 తా॥ వాడు మూర్ఖుడగుటచే - ధనములేని కారణమున - నెత్తి కడవలతో ప్రతి యింట నీరు తెచ్చి పోసి బ్రదుకు చుండెను.

30 తా॥ ఓరి! నీ బ్రతుకు రాతివలె వ్యర్థమైనది. నీవు కులనాశక మూర్ఖుడవు- మీ వంశము పండితవంశము నీవు పుట్టి నందున మీ కులము కళంకితమైనది.

31 తా॥ మీ నాయన నాల్గు రాష్ట్రములలో పేరుపొందిన పండితుడు - సదాచారుడు వేదశాస్త్రములఁ జదివిన వాడు - నీ మూలమున వంశమునకు మచ్చగలిగెను.

32 తా॥ ఓరీ మూర్ఖ! తల్లి బిచ్చమెత్తి తెచ్చిన కూటితో బ్రతుకుచున్నావు — ఓరీ! నీవు సిగ్గులేక బ్రదుకుచున్నావు - మీ పితరు లధోగతి పాలు గావలసినదేనా?

33 తా॥ పశుప్రాయు డవై బ్రతుకుచున్నావు - ఇంక నీ జన్మ చాలురా? దుర్మార్గుడా! ఇంక నీవు గంగలో పడినా మంచిదిరా! ఎందుకు కీవ్యర్థ జన్మ?

34 తా॥ ఇట్లుగా వానికి తెల్వి వచ్చుటకు లోకులనగా - ఆ మూర్ఖు డా మాటలకు దుఃఖపడి తల్లితో - అమ్మా! నేను నిజముగా మూఢుడను — తప్పక చత్తు ననెను.

35 తా॥ అమ్మా! నన్నందరు నిందించు చున్నారు. ఇట్టి మందమతినగు నా శరీరముండి లాభము లేదు-నా పోషణ తప్పి, నీకు విశ్రాంతి గల్గును. నేనడవికి (నీరున్న చోటికి) పోదును.

36 తా॥ ఇట్లుగా బలుకు పుత్రవాక్యమును విని - ఆ తల్లి బహుచింతతో దుఃఖమున మునిగి చివరకు భరింపలేక యేడ్చు చుండెను.

37 తా॥ అట్లు మాతాపుత్రు లేడ్చుచు కృష్ణానదిని సమీపించిరి - అంతలో నా నదిలో స్నానము చేయుటకై వచ్చు ఆపదుద్ధారకుడు శ్రీపాదవల్లభులఁ జూచిరి.

38 తా॥ చూచుట తోడనే ఆమె అస్వామివారి చరణములఁ బట్టుకొని దుఃఖముతో స్వామీ! మా కిప్పుడు వచ్చిన యీ యాపదకు యీ నదిలో పడి చత్త మని వచ్చితిమి.

39 శ్లో॥ భవా న్దదాతు నా వాఞ్ఛా మాత్మహత్యా హి దుస్తరా।
అతస్త్వాం ప్రార్థయావో నౌ వచ నాత్తవ సద్గతిః॥

40 శ్లో॥ ఇతి తద్వచనం శ్రుత్వా శ్రీపాదః స కృపార్ద్ర ధీః।
ప్రాహ కిం సంకటం ప్రాప్తం మహత్ప్రాణా హి దుస్త్యజాః॥

41 శ్లో॥ విప్రపత్నీ తత స్తస్మై స్వకం దుఃఖం న్యవేదయత్।
భక్తవత్సల! భోః స్వామిన్ రక్షనౌ ఘోర సంకటాన్॥

42 శ్లో॥ అనేక తీర్థా చరణా దనేక వ్రత సేవనాత్।
అనేక దేవార్చనతః పుత్రోఽ యం చిరజీవితః॥

43 శ్లో॥ వ్రతోపవాసాః కతిచిత్ నియమేన మయా కృతాః।
తతో జాతో ఽప్యేష సుతో దుర్మతి ర్లోక నిందితః॥

44 శ్లో॥ వేద సచ్ఛాస్త్ర సంపన్నః పతి ర్మే బ్రాహ్మణో త్తమః।
త స్యోదరే దురాత్మా ఽయం జాతో మందమతిః ప్రభో!॥

45 శ్లో॥ దయస్వ శ్రీప! దయితే! పుత్రో నే దృక్సతాం గతేః।
భూయా ద్భవే దప్యేవ సదుపాయ ముపాదిశ॥

46 శ్లో॥ కృపాబ్ధి ర్దైన్య హర్తా త్వ మితి తే చరణౌ ధృతౌ।
భాగ్యా ద్దృష్టం తే చరణం శరణాగతరక్షణం॥

47 శ్లో॥ స్వామి న్నుత్పద్య సంసారే నానా కష్టం మయా కృతం।
సుఖపృష్టం న మే దృష్టం నష్టాః కష్టా హి తాః సుతాః॥

48 శ్లో॥ భ్రష్టం సౌభాగ్య శిష్టోఽయం దృష్టః పుత్రః సుకష్టదః।
అజాగళ స్తనసమో వృధా జాతో ఽయ మిష్టదః॥

39 తా॥ అయ్యా! తమరు - మా యీ యాత్మ హత్య కాజ్ఞ నీయండి. ఇది చాలా పాపిష్ఠిది - మాకు సద్గతిని గలిగించండి.

40 తా॥ వారి యీ మాటల విని శ్రీపాదులవారు దయగలిగి ఇట్లనెను: ఇప్పుడు మీకు మహా సంకటము వచ్చిచేది కాని, ప్రాణములు వదల రానివి.

41 తా॥ బ్రాహ్మణపత్ని ఆ శ్రీపాదులవారికి తన దుఃఖము నంతయుఁ దెలిపెను. భక్తుల రక్షించు ఓ స్వామీ! మ మ్మీ ఘోర సంకటము నుండి తప్పింపుము

42 తా॥ అనేక తీర్థముల సేవించితిని - బహు వ్రతము లాచరించితిని - అనేక దేవతల పూజించితిని - త న్మూలకముగా నిట్టి జీవత్పుత్రుడుదయించె-

43 తా॥ వ్రతోపవాసముల నెన్నిటినో నియమముతోఁ జేసితిని - అట్లయ్యు - ఇత డింత మూర్ఖుడుగ - లోక నిందితుడు గ బుట్టుకొని వచ్చెను.

44 తా॥ నా భర్త వేదశాస్త్రముల జదివిన యుత్తమ బ్రాహ్మణోత్తముడు - ఆయన ఉదరమున నింద్యుడు దు రాత్ము డెట్లు పుట్టెనో?

45 తా॥ దయయుంచి ఓ శ్రీపాదస్వామీ! ఇట్టి పుత్రుడు స ద్గతి క నర్హుడు - దీనికి సదుపాయమును నాకు దేనినైన యుపదేశించండి!

46 తా॥ స్వామీ! నీవు కృపా సింధువవు - అందుచే నీ పాదములంటి వేడు చున్నాను - నా అదృష్టభాగ్యము కొలది నీ చరణము శరణమైనది.

47 తా॥ స్వామీ! ఈ సంసారము లో పడిన ప్పటినుండి అనేక కష్టముల బడితిని - సుఖమును నేనెన్నడును చూడలేదు - కష్టము లయ్యెను. సుతు లహితులైరి.

48 తా॥ నా సౌభాగ్యం నష్టమైనది - చావగా మిగిలిన పీడు - కష్టమును గల్గించు మందమతియయ్యె - ఇతడు సుతుడయ్యు - మేకమెడచన్నుల వలె వ్యర్థుడయ్యెను.

49 శ్లో॥ శ్రీగురో! దేవమే యాచ్నాం సంశ్రుణు ష్వాగ్ర జన్మని।
సుపూజ్య పుత్రో మానుష్యే జాయతాం త్వం యథా భువి॥

50 శ్లో॥ య త్పాద వందనం సర్వే కరిష్యం తీ దృశః సుతః।
భవత్సే వ ముపాయం మే వద త్వేషా పదేఽ గ్రహీత్॥

51 శ్లో॥ పునః సా ప్రాహ పుత్రేణ యేన మే న పునర్భవః।
సర్వేఽ పిపి తరో యేన స్వర్గే స్థాస్యంతి శాశ్వతం॥

52 శ్లో॥ వాన నేయం మమ బ్రహ్మజ్ఞానీ పుత్రో హి జాయతాం!
ద్రష్టవ్యః ప్రాగ్వయస్యేవ సర్వపూజ్యో భవానివ॥

53 శ్లో॥ ఇత్యే త న్బ్రాహ్మణీవాక్యం శ్రుత్వా సకరుణో ఽబ్రవీత్!
కు ర్వీశారాధనం పుత్రో భవిష్యతి యథా హరిః॥

54 శ్లో॥ గోప్యా దృష్టం వ్రతం పూర్వం తేన గోపగృహే సుతః!
కృష్ణః కారుణికో జాత ఈశ్వరార్చన యోగతః॥

55 శ్లో॥ తథై వారాధయ శివం సుపుత్ర స్తే భవిష్యతి!
ప్రాజ్ఞో ఽవ్యవహితా గామి జన్మ నీశ ప్రసాదతః॥

56 శ్లో॥ బ్రాహ్మణీ పున రాహేదం గోప్యా దృష్టం కథం వ్రతమ్।
కదా కథం చంద్రమౌళిః పూజితో విస్తరా ద్వద॥

57 శ్లో॥ అహ మప్యా చరిష్యామి తథై వ విధినా వ్రతమ్।
సా ఽఽభాష్యేవం కృపామూర్తి శ్రీగురుప్రపదేఽగ్రహీత్॥

58 శ్లో॥ శ్రీ పదో బ్రాహ్మణీం ప్రాహ ప్రదోషే పూజయే శ్వరం।
మందవారే విశేషేణ భక్తిభావ సమన్వితా॥

తా॥ శ్రీగురో! నా యాచనను విను స్వామీ! తాము మరల జన్మను ధరించునపుడు, ఆ గజన్మలో నుంచి పూజ్యులాలింట నిన్ను పుట్టు మని ప్రార్థించుచున్నాను.

తా॥ ఏ మీ పాదములబట్టి సర్వులు కృతార్థులగుచున్నారో - అట్టి పుత్రు లుందురు గాక - దీనికి నా కుపాయమును చూపండి స్వామీ! అని ఆయన పాదములపైబడెను.

తా॥ మరియు నామె - వారితో - అయ్యా! నాకిక మరల నీ లోకమున యీ లాంటి పుత్రునితో జన్మవద్దు స్వామీ! - ఎవనిచే పితరులు తృప్తితో శాశ్వతముగ నుందురో గద?

తా॥ నాకు బ్రహ్మజ్ఞాని యగు పుత్రుడుండు నెడల పునర్జన్మ గలిన ధన్య నయ్యెదను - కాని, నా పుత్రుడు పూర్వవయస్సులోనే మీవలె బ్రహ్మ జ్ఞానిగా నుండగోరెదను.

తా॥ ఇట్లుగా ప్రార్థించు నా బ్రాహ్మణిని దయదలచి యిట్లు పల్కెను. ఈశ్వరారాధనచే నావిష్ణువు సంతసించి పుత్రుడుగా బుట్టెను.

తా॥ పూర్వమున ఒక గోపిక యీ వ్రతము ను చూచిన మాత్రమున నాగోపికా గృహమున శ్రీహరి దయతో నామె యింట కృష్ణుడై పుట్టెను - యశోదా దేవి యీశ్వర పూజ చేసినది.

తా॥ కనుక నోయమ్మా! నీవు శివుని పూజింపుము - ఆ యీశ్వ రానుగ్రహము న నీవు కోరిన జ్ఞాని యగు మహాత్ముడు ముందు జన్మలో తప్పక కలుగును.

తా॥ అప్పు డాబ్రాహ్మణి - స్వామి! గోపి యెప్పు డెట్లా వ్రతము చేసినది? దానికి చంద్రమౌళి నెప్పు డెట్లుగా పూజింప వలెనో విస్తరముగా నంతయును చెప్పండనెను.

తా॥ నేను దానిని తప్పక యాచరింతును - ఆ విధిని నా కుపదేశింపుడు - అని దయామూర్తియైన యాస్వామి పాదముల నా బ్రాహ్మణి సాష్టాంగముతో బట్టుకొనెను.

తా॥ అప్పుడు శ్రీపాదులవారు ఆ బ్రాహ్మణికి - ప్రదోషకాల (ప్రొద్దు కుంకు వేళ) శివపూజను నీవు చేయుము - అందునను శనివార ప్రదోష పూజ చాలా శ్రేష్ఠమైనది,

59 శ్లో॥ పూజా గోపికయా దృష్టా స్పష్టా స్కందపురాణకే।
కథా విస్తరతః ప్రోక్తా సగుణేశ యశోన్వితా॥

60 శ్లో॥ శ్రీగురో ర్వచనం శ్రుత్వా సంతుష్టా సా ద్విజాంగనా।
శ్రీగురో శ్చరణౌ నత్వా పునః పప్రచ్ఛ సాదరం॥

61 శ్లో॥ కథాం కథయ సి స్వామిన్ చిత్రా మభినవా మివ।
య త్కృష్ణోఽపి సుతో జాతః ప్రదోషార్చ నే క్షణాత్॥

62 శ్లో॥ ప్రదోషాషే ణార్చనా న్మే ఽపి లభేత ఫల మీదృశమ్॥
పూజ తో ర్చ్యః కథం పూర్వం తన్మే కథయ విస్తరాత్॥

63 శ్లో॥ శ్రీగురుః ప్రాహ వక్ష్యేతే స్కాందోక్తాం సత్కథా మిమాం।
అస్త ఉజ్జయినీ నామ నగరం సుందరం పరమ్॥

64 శ్లో॥ చిత్రం తథా ఽభవ చ్చంద్రసేనరాజో ఽతిధార్మికః।
తస్య ప్రాణసఖో నామ్నా మణిభద్ర ఇతి శ్రుతః॥

65 శ్లో॥ స ఈశ భక్తి సంపన్న ఈశ పూజాపరాయణః।
శివం ప్రసాదయామాస సో ఽస్మై చింతామణిం దదౌ॥

66 శ్లో॥ కోటిసూర్యప్రకాశో ఽభూ త్సమణి ర్ధరణీ తలే।
మణిభద్ర స్తరణిభం స్వకంఠే ఽధారయ త్సదా॥

67 శ్లో॥ చింతామణి రివ మణే స్తేజః సంస్పర్శనా దపి।
లోకం కాంచనతాం యాతి సద్యో విద్యోతి తాత్మనః॥

68 శ్లో॥ యద్యద్విచింత్యతే త త్తన్మణిస్మరణ తోఽపిచ।
లభ్యమేవేతి తత్ ఖ్యాతింశ్రుత్వాన్యాభూపా ఉపాగమన్॥

59 తా॥ ఈ శనివార ప్రదోషపూజను గోపిక చూచి కృష్ణుని తత్ఫలితముగా పుత్రునిగ బడసెనని - స్కందపురాణములో నున్నది - దాని విస్తృతిని చెప్పినది - సగుణేశపూజ.

60 తా॥ ఆ గురువుగారు చెప్పిన శివపూజ విస్తృతిని విని ఆ బ్రాహ్మణి సంతోషముతో శ్రీగురు చరణముల బట్టుకొని మరల నాదరముతో స్వామి నడిగెను.

61 తా॥ స్వామీ! తాము చెప్పినట్టి కథ విచిత్రమును వినసొంపుగ లద్దె యున్నది - శ్రీకృష్ణుడు గూడ - వాండ్ల అమ్మ ప్రదోషార్చనను చూచినందున కల్గినవాడా?

62 తా॥ స్వామీ! ఆ ప్రదోష పూజను నేను చేసిన నా కాభాగ్యము గల్గునా? అట్లయిన - ఆ ప్రదోషార్చన ఎట్లో? మొదలునుండి సమగ్రముగ విన గోరెదను.

63 తా॥ శ్రీ గురువుల వారు వెంటనే-స్కాంధ పురాణమందు చెప్పబడిన యీ కథను విస్తరించి చెప్పదును - పూర్వము ఉజ్జయినీ నగర మతి రమ్యమై యుండెను.

64 తా॥ అందిది చిత్రమైన కథ - ఆ నగర పాలకుడు చంద్రసేన మహారాజు - మిక్కిలి ధర్మాత్ముడు - ఆయన ప్రాణమిత్రుడు మణిభద్రుడను ప్రఖ్యాతు డొకడుండెను.

65 తా॥ ఆ మణిభద్రుడు శివుని పూజచే మెప్పించి ఆయన అనుగ్రహముచే లభ్యమైన చింతామణి అను నొక మణిని రాజునకిచ్చెను.

66 తా॥ ఆ మణి యీ భూలోకము నంతటి ప్రకాశింప జేయుచు కోటి సూర్యుల వెలుగుతో నొప్పినది - మణిభద్రుడు దానిని మెరుగు బెట్టి నిత్యము తన మెడలో ధరించెడివాడు.

67 తా॥ ఆ చింతామణి స్పర్శచే మణిభద్రుడు ప్రకాశించుటే కాదు - ఆ మణి కాంతి సోకినంత దూరము లోక మొక విచిత్రమైన బంగారు కాంతితో నుండెడిది.

68 తా॥ ఏయేది కోరుకొనిన యయ్యది ఆ చింతామణి స్పర్శన దర్శనాదులతో లభించుచుండెనను ఖ్యాతి ఆ చింతామణికున్నందున సర్వరాజు లక్కడకు వచ్చుచుండిరి,

69 శ్లో॥ కేచనస్నిగ్ధభావేన కౌతుకేన చ కేచన।
బలాత్కారేణమూల్యేన తంస్మేచ్ఛంతిక్షితీశ్వరాః॥

70 శ్లో॥ మణిం నో దేహికేనాపి ప్రకారేణేతి భూమిపాః।
దూతానపీరయామాసు ర్యోద్ధుంచాపి సమాగతాః॥

71 శ్లో॥ తత్రసంగమ్య రాజాన ఊజ్జయిన్యాం మహాబలైః।
తద్రాష్ట్రం వేష్టయామాసుర్మణి గ్రహణ లాలసాః॥

72 శ్లో॥ శనివారే త్రయోదశ్యాం ప్రదోషేమంత్రిణాన్నృపః।
నిశ్శంకము పవిష్టోఽభూద్విధినా శంకరార్చనే॥

73 శ్లో॥ మహాకాలేశలింగం సపూజయా మాసహర్షతః।
తదా శివాలయేద్రష్టుంగోప పుత్రాస్సమాగతాః॥

74 శ్లో॥ పూజాం లింగస్యదృష్ట్వాతే గోపపుత్రా అపిస్వయం।
ముదా పూజయితుం తద్వత్పా షాణేస్వాంగణేస్థితాః॥

75 శ్లో॥ శివాలయంకల్ప యిత్వాపాషాణేన నిజాంగణే।
స్వగేహ సన్నిధౌ భక్త్యా వినోదేన సమర్చయన్॥

76 శ్లో॥ తేపాషాణమయం లింగం బాలకా అర్చనోత్సుకాః।
యథాదృష్టం ధియాఽఽనర్చుః కల్పితైరుపచారకైః॥

77 శ్లో॥ పత్రాది భిర్యథాలబ్ధై రుపచారైర పూజయన్।
పమర్ప్యోదక నైవేద్యం గోపబాలాః కుతూహలాత్॥

78 శ్లో॥ గోప్యస్తన్మాతరస్తత్ర ప్రాప్యపుత్రాన్ని వార్యతాః।
భోజనార్థం నిజగృహాన్నిన్యుః సర్వాన్కుమారకాన్॥

69 తా॥ ఆ వచ్చేవారు కొందరు స్నేహముతోను - కొందరు వేడుకకు - బలాత్కారముగగాని లేక ధనమిచ్చి తీసికొని పోవలయునని రాజు లందరటకు వచ్చుచుండిరి.

70 తా॥ ఆ మణిని ఏ విధముగ నిచ్చుటలేదని - కొందరు రాజులు - తమ దూతలచే నడిగించిరి, అదియు కాదనిన యుద్ధమును చేయుటకువచ్చిరి.

71 తా॥ ఇట్లామణి యందాసక్తితో రాజులందరు ఉజ్జయినీ నగరమును తమ తమ బలములతో - ఆ నగరమునే కాక రాష్ట్రమంతటను చుట్టుముట్టి యుండిరి.

72 తా॥ ఒకనాటి శనివార ప్రదోష సమయమునకా ఉజ్జయిన్యాధిపతి తన మంత్రులతో గూడి నిర్భయముగ నిశ్చింతగ యధావిదిగా శంకరు నర్చింపనుండెను.

73 తా॥ ఆ యుజ్జయినీ నగరములోనున్న శివుడు - మహాకాలేశ్వరుడు - ఆయన రాజు మంత్రి బంధు పురోహితులతో సంతోషముగ శివార్చన నొనర్చుచుండ గోప పుత్రులు చూడవచ్చిరి.

74 తా॥ ఆ రాజొనర్చు ఆ ప్రదోష శివార్చనకు సంతోషపడి గొల్లల పిల్ల లందరు తమ తమ ముందున్న ఒక్కొక్క రాతిని శివలింగముగా భావించి తాము నా పూజను స్వయముగ( జేసిరి.

75 తా॥ ఇంటిలోనికివలె యధావిధిగా తమ ముందున్న పాషాణమునే శివునిగా భావించి యధావిధిగా సంతోషమున వారందరు పూజించిరి.

76 తా॥ అట్లా గోప బాలులు పాషాణమయము లింగములుగ భావించి- రాజు చేయుటను చూచి రాజునకు సర్వోపచారములను యధావిధిగ సమ కూర్చి చేసిరి.

77 తా॥ పత్రములు పుష్పములు - మొదలైనవి పూజార్థ ద్రవ్యము లప్పటికి లభించిన వానిని గొని వచ్చి పూజించి, నివేదనమునకు ఉదకములతో తుష్టిగ నివేదించిరి.

78 తా॥ ఆ గోపకుల తల్లులును అచటకు చేరి తమ పుత్రుల నట నుండుమని చెప్పి - తమ పుత్రులను ఒక్కొక్కరిని జట్టుగా నింటికి భోజనము నకు గొనిపోయిరి.

79 శ్లో॥ ఏకస్తు గోపికా తోకః పూజాసక్తోగతో నహి।
మాతాతస్యోప సంగమ్య తాడయామాస తం సుతం॥

80 శ్లో॥ సాప్రాహ గచ్ఛభుక్త్యర్థం భోజనావ సరస్త్వయం।
కింకరోషినిశి ధ్వాంతే ఇత్యుక్తోఽపి బుబోధనో॥

81 శ్లో॥ క్రుద్ధాతస్మైతదా గోపీ భంక్త్వా పూజాం నిజాంగణే।
దూరాత్పాషాణముత్క్షిప్య సాగతానిజ మందిరమ్॥

82 శ్లో॥ పూజాం విసర్జితాం దృష్ట్వా బాలకో విలలాప సః।
క్షణమాత్రం తదా భూమౌ మూర్చితో నిపపాత హ॥

83 శ్లో॥ లింగం చిత్తే సమాలక్ష్య త్యక్తుం ప్రాణా న్సముద్యతం।
జ్ఞాత్వా బాలం శూలపాణిః ప్రసన్నో ఽభవ దీశ్వరః॥

84 శ్లో॥ శివాల యోంగణం జాతం రత్నయు క్త్వన్తరో ఽపి సః।
సూర్యతేజో భవ ల్లింగం బాలో వృద్ధో ఽభవ త్తదా॥

85 శ్లో॥ గౌరీ రమణ ఆస్థాయ నిజరూపేణ బాలకం।
ఉత్థా ప్యోచే కరం ధృత్వా వృణీ ష్వేష్టా న్వరా నితి॥

86 శ్లో॥ బాలకః ప్రాహ శంభో తే పూజా మాత్రా విసర్జితా।
క్షమాం కురుష్వ మే మాత్రే కోపం మా కురు శంకర!॥

87 శ్లో॥ దయాలు శ్చ్రకవ ర్తీశః సుప్రీతః ప్రాహ బాలకమ్।
యా దదర్శ ప్రదోషే మే పూజాం సా దేవసూ ర్భవేత్॥

88 శ్లో॥ సుతో భవాంతరే తస్యా విష్ణుః కృష్ణో భవిష్యతి।
ఇతి మే వచనం సత్యం నాత్ర కార్యా విచారణా॥

79 తా॥ అందొక గొల్ల కుఱ్ఱడు ఆ శివ పూజలో నిమగ్నుడై భోజనమున కింటికి పోలేదు. అంతట తల్లి వచ్చి - బిడ్డ దన్నము తినలేదను వ్యథతో ఆ పిల్లవాని నచట బాగా కొట్టెను.

80 తా॥ వెళ్ళు - ఇంటికి వెళ్ళి భోజనం చేయుము - ఇందుండి భోజనావసర మును గూడ మరచిపోతివి - అర్ధరాత్రము నిశీథమైనది - అని వానిని మేల్కొలిపి తెలిపెను.

81 తా॥ ఇట్లుగా ఆ గోపి కోపముతో పిల్లవాని నింటికి బంపగోరి - వాని పూజను చెదగొట్టి, అతడు తదితరులు పూజించుచున్న రాళ్ళను దూర ముగ పారవైచి యింటి కేగెను.

82 తా॥ ఈ విధముగా - తల్లి - తాను చేసిన శివపూజను చెల్లాచెదరు చేయ డంతో ఆ పిల్లవాడు క్షణమాగి ఏడ్చుచు నేలమీద మూర్ఛ పడెను.

83 తా॥ తరువాత నతడా శివలింగము తన చిత్తములో నున్నట్లు చూచి తన ప్రాణములఁ దీసికొన బూనెన - శంకరు డద్దానిని గని ప్రసన్ను డయ్యెను.

84 తా॥ ఆ బాలు డట్లు చూచు చుండగనే ఆ శివాలయ ప్రాంగణమున రత్నమయ సింహాసనమున శంకరు డుండగా ఆ బాలుడు వృద్ధుడై ఆయన యెదుట నుండెను.

85 తా॥ అంతట ప్రత్యక్షమై శంకరు డా పడి యున్న బాలుని లేవనెత్తి చేయి పట్టుకొని నాయనా! నీవు కోరదలచిన వరముల కోర్కు మిచ్చెదనెను.

86 తా॥ అప్పు డా బాలుడు శంకరునితో - స్వామీ! మా తల్లి నీకు చేసిన పూజను చెదగొట్టి వేసినది - ఈ దుష్కార్యము మా తల్లిగారిది క్షమిం చండనెను.

87 తా॥ దయా సార్వభౌముడైన శంకరుడు సుప్రసన్నుడై బాలకునితో నిట్లనెను - నీవు చేసిన నా పూజను ప్రదోషకాలమున ఎప్పుడు చూచెనో అపుడే ఆమె దేవత యయ్యెను.

88 తా॥ నీవు - ఈ మరుజన్మమునందు ఆమెకు కుమారుడవై కృష్ణుడుగ నుందువు - ఇది నా మాట - సత్యము - ఇందు సంశయము లేదు చింత చేయకుము.

89 శ్లో॥ యద్య ద్వాంఛసి బాలత్వం మ త్ప్రసాదా దవాప్స్యసి।
భుంక్ష్వ త్వం సౌఖ్య మఖిలం త్వా దృగ్వంశో ఽపి తే భవత్

90 శ్లో॥ ఇతి ప్రసన్నో గిరిజాపతి స్తదా శివో ఽదా త్పరమం వరం ముదా।
పదారవిందం ప్రణతస్య పశ్యతః సుతస్య లింగే ఽంత రథా దీశ్వరః॥

91 శ్లో॥ రత్నోపమం బభౌ లింగం కోటి సూర్య ప్రకాశకః।
శివాలయో ఽపి లోకాఽస్తు మేనిరే ఽభ్యుదితో రవిః॥

92 శ్లో॥ యుద్ధార్థ మాగతా భూపాః శంకితా స్తే స్వ మానసే।
ఆహు ర్ద్వేషం పరిత్యజ్య క ర్తవ్యం రాజదర్శనం॥

93 శ్లో॥ పవిత్రే నగరే రాత్రౌ పశ్యతోఽర్కో ఽదునో దితః।
అతోఽయం పుణ్యవా న్రాజా కో ఽనేన ద్వేష మాచరేత్॥

94 శ్లో॥ ఇత్యుక్త్వా ప్రేషయామాసు స్తస్మై దూతా న్విదృక్షవః।
ప్రత్యుద్గ మ్యాపి రాజా తా నానయామాస హర్షితః॥

95 శ్లో॥ స్నేహేన సమతేతా స్తే ద్యోతం దృష్ట్వా పరస్పరం।
ఊచూ రాత్రా వంధకారే జాత స్సూర్యోదయః కథమ్॥

96 శ్లో॥ తత స్తే చంద్రసేనేన సహితాః కౌతు కాన్వితాః।
త త్రై త్యరత్నఖచితం దదృశు స్తే శివాలయమ్॥

97 శ్లో॥ లింగంచ బాలకముఖా త్సర్వం శ్రుత్వా తిహర్షితాః।
తస్మై గోపాధిపత్యం తే దదు రన్యాశ్చ సంపదః॥

98 శ్లో॥ స్వం స్వం స్థానం యయు సర్వే స రాజా ప్యభయోఽభవత్।
శనిప్రదోషపూజాయాః సుఫలం బ్రాహ్మ ణీ దృశమ్॥

89 తా॥ ఈ నీజన్మలో నే దానిని కోరుకొందువో వానిని వెంటనే పొందగలవు-
నీ వీలోక సుఖముల యధేష్టముగ బొందుదువు - నీవు కోరిన వంశము
లభించును.

90 తా॥ ఆ విధముగా శంకరు డప్పుడు ప్రత్యక్షమై గొప్ప వరముల నాతని
కిచ్చెను - ఆ బాలుడు ఆ శివుని పాదారవిందములకు నమస్కరించెను-
శివు డంతర్ధానమయ్యె.

91 తా॥ ఆ గోపునకుగా నిర్మించిన (శివునిచే కట్టించినది) శివలింగం వేయిరత్న
కాంతుల కోట్లతో వెలుగొందుచున్నది-ఆ శివాలయము - సూర్యోదయ
మట్లుగ గనుపించెను.

92 తా॥ ఇక రాజుగారు చేసిన పూజ వలన - ఆయన మీదకు యుద్ధానికి
వచ్చిన భూపతు లందరును - ఆ రాజుపై యుద్ధమును ద్వేషము
మాని రాజ దర్శన పరులైరి.

93 తా॥ పవిత్రమైన ఆ నగరములో - రాత్రి యం దందరు చూచు చుండగ
సూర్యోదయమయ్యెను - అంతటి పవిత్రుడైన ఆ రాజుపై ద్వేష
మెవరికుండును?

94 తా॥ ఆ రాజదర్శన కాంక్షులై యితర రాజులు దూతల ద్వారా ప్రార్థనల
బంపుకొనిరి - ఆ రాజుగారు ను చూడవచ్చిన రాజుల సంతోషముతో
నెదుర్కొనెను.

95 తా॥ ఆ రాజులు - అందరు స్నేహముతో గలసి - అయ్యా! అర్ధరాత్ర
మున గూడ యీ నగరము సూర్యకాంతితో నుండుట మీ మహిమ
గదా అని యనుకొనిరి.

96 తా॥ అటు తర్వాత చంద్రసేనునితోగూడి వేడుకతో వారందరు -శివుడు
గోపునకుగా నిర్మించి చూపిన రత్నమయ శివాలయమును దర్శించిరి.

97 తా॥ ఆ లింగ ప్రాదుర్భావమును గూర్చి యా గోపబాలకుని వలన విని
వారందరు సంతసించి చూచిరి.

98 తా॥ అంత నా యితర రాజులు అందరు తమ తమ స్థానములకు వెళ్ళిరి -
ఆ రాజును అభయముతో నుండెను - ఓ బ్రాహ్మణీ! శనిప్రదోష
శివపూజ ఫల మిట్టిది.

99 శ్లో॥ శైవో గోపకుమా రోఽపి గృహ మేత్యాహ మాతరం।
భవాంతరే త్వదుదరే విష్ణు స్త్వవతరిష్యతి॥

100 శ్లో॥ ఇ తీశ్వరో వరం మహ్యం దత్తవాన్ హృష్ట మానసః।
కర్పూరగౌరః సుప్రసన్నః ప్రదోషే య స్త్వ యేక్షితః॥

101 శ్లో॥ మయా తే యాచితం మాత రపరాధ క్షమాపనమ్।
శూలపాణిః క్షమాం కృత్వా దత్తవా న్మేపి సద్వరాన్॥

102 శ్లో॥ ఏవం మాత్రేస వృత్తాంతం ప్రాహ జాతం తథైవ హి।
ప్రసన్న ఈశ్వరే జాతే కిం కేషాం దుర్లభం వద॥

103 శ్లో॥ ఏవం ప్రదోష కాలే తు పూజా దర్శన మాత్రతః।
ఈశ్వర స్సుప్రసన్నో ఽభూ ద్విప్ర స్త్రి వరద స్తదా॥

104 శ్లో॥ తవ చిత్తేపి సత్పుత్ర వాసనా చే దసంశయమ్।
ప్రదోషే పూజయ శివం మా దృక్పుత్రో భవిష్యతి॥

105 శ్లో॥ ఇత్యుక్త్వాఽపి ప్రాప్త దుఃఖా సహనా భూ త్తతః ప్రభుః।
తద్భావం శ్రీపదో జ్ఞాత్వా ప్రసన్నో భక్తవత్సలః॥

106 శ్లో॥ తస్యాః కుమార మాహూయ కరం తన్మస్తకోపరి।
దధౌ తథైవ సహసా జ్ఞానీ జాత త్రివేదవిత్॥

107 శ్లో॥ స వేద భాష్య తర్కాది నిపుణ స్సుగుణో ఽభవత్।
పఠంతం తం సుతం దృష్ట్వా తన్మాతా విస్మితా ఽభవత్॥

108 శ్లో॥ విస్మితా విప్రవనితా ప్రాహే శోయం వినిశ్చితః।
కార్యార్థ మవతీర్ణో ఽత్ర భూమౌ మానుష వేషధృత్॥

99 తా॥ ఆ శివపూజా పరుడగు గొల్లవా డింటికి వచ్చి తల్లితో నిట్లనెను - అమ్మా! జన్మాంతరమున నీ కడుపున ఆ విష్ణు మూర్తి జన్మించ గలడు.

100 తా॥ ఈ విధముగ ఈశ్వరుడు సంతోషముతో నాకు వరమిచ్చెను-ప్రదోష సమయమున నీచే చూడబడిన ఆపాషాణమే తెల్లనైన ఈశ్వరుడై నా కిచ్చిన వరము.

101 తా॥ నే నా కాన వచ్చిన శంకరుని స్వామీ నా తల్లి యొక్క అపరాధమును క్షమింపండి అని నేను వేడుకొంటిని, ఆ శూలపాణి క్షమించి నా కనేక వరము లిచ్చెను.

102 తా॥ ఈ విధముగ తల్లితో నా జరిగిన వృత్తాంతము నంతయు చెప్పెను- ఈశుడు ప్రసన్నుడైతే ఎవరి కేది దుర్లభము - అంతయు సులభమే గదా?

103 తా॥ ఈ విధముగ ప్రదోష సమయపూజా వృత్తాంతమును - పూజాదర్శన మాత్ర ఫలమును విని, యీశ్వరుడు ప్రసన్నుడయ్యెనని విన్న బ్రాహ్మణస్త్రీ, వరదుడు శివు డనుకొనెను.

104 తా॥ అమ్మా! నీకు గూడ సత్పుత్రు డుదయించవలె నన్న ఈ శనివార ప్రదోష పూజాఫలము గావలెను - అమ్మా! నీవు ప్రదోషపూజను చేయుము - నావంటి పుత్రుడుద్భవించును.

105 తా॥ ఇట్లని వినియు - ప్రస్తుతము గల్గిన దుఃఖమును సహింప కుండెను- భక్తవత్సలుడగు శ్రీపాదుడును ఆమె భావము నెఱిగి కరుణా పరుడయ్యెను.

106 తా॥ అప్పుడు దయతో - నా స్వామి ఆమె కుమారుని పిలిచి అతని మస్తకమున హస్తము నుంచి, ఓయీ! నీవు త్వరలో జ్ఞానవంతుడ వగుము అనెను.

107 తా॥ అంతట అతడు వేదభాష్య - తర్కాది శాస్త్రముల నేర్చి సుగుణవంతు డయ్యెను - ఆ పిల్లవాని బుద్ధి కౌశలము - శాస్త్ర పాఠములను మంచి బుద్ధిని చూచి వెఱగుపడెను-

108 తా॥ ఆ తల్లి విస్మయ మొందుటగాదు - నిజముగా నీశ్వరుడే ఈ డనుకొనెను - ఏదో యొక కారణజన్మగా భూమియ ందవతరించి న మనుష్య డనుకొనెను.

109 శ్లో॥ పూర్వజన్మార్జితాత్ పుణ్యాత్ గురునాథో உత్ర సంగతః।
ఇత్యుక్త్వా స్వగతం శ్రీశం సా ననామ క్షణే క్షణే॥

110 శ్లో॥ సా ప్రాహేశ స్త్వమేవాసి ప్రదోషే త్వాం సమర్చయే।
మిధ్యా వాక్యం నతే; పుత్రో మమ త్వా దృగ్భవిష్యతి॥

111 శ్లో॥ ఇతి నిశ్చిత్య మనసా పూజయామాస సాஉపి తం।
గ్రామం గత్వా ప్రదోషేஉపి తతః ప్రభృతి శంకరం॥

112 శ్లో॥ వేదశాస్త్రార్థ సంపన్నో జ్ఞానీ తస్యా స్సుతోஉభవత్।
సర్వేభ్యో వ్యధికః పూజ్యో వినీత స్స ప్రసాదతః॥

113 శ్లో॥ కృతోద్వాహః స తద్గ్రామే పుత్రపౌత్ర సమన్వితః।
హృష్టో తిష్ఠ ద్గురుకృపా య స్యోపరి స చేదృశః॥

114 శ్లో॥ ఏవం గురుః కృపాసింధూ రాతి భక్తిజనాయ హి।
సానం దాఖిల సంపత్తీ ర్భోః శ్రీమ న్నామధారక॥

115 ఏవం వృద్ధః సిద్ధః ప్రోచే తం నామధారకం భక్తమ్।
త చ్ఛృణ్వంతు సమస్తా హర్షే ణోత్థం సరస్వతీ దదతి॥

గద్య॥ ఇతి శ్రీ సిద్ధ నామధారక సంవాద రూపేణ సరస్వత్యాఖ్య గంగాధ రాత్మజ విరచిత నరసింహ సరస్వ త్యుపాఖ్యాన సంజ్ఞిత మహారాష్ట్ర భాషాన్విత గురుచరిత్ర సమానార్థాయాం వాసుదేవానందసరస్వతీయతి విరచితాయాం శ్రీదత్తగురు సంతాయాం జ్ఞానకాండే అష్టమోధ్యాయః సమాప్తః.

ఆదితః శ్లోకాః (1130)

ఇత్యష్టమోధ్యాయః సమాప్తః.

109 తా॥ ఈ విధముగ తన పుత్రు డట్టిబుద్ధి మంతుటగుట నా పుణ్యము మంచి దగుటచే యీ స్వామితో కలయిక కలిగినది - ఇట్లుగా చింతించుచు పదేపదే ఆయనకు నమస్కరించు చుండెను.

110 తా॥ ఆమె స్వామీ! మీరే ఆ శంకరులు. ప్రదోషమందు మిమ్మే శంకరునిగ భావించి పూజింతును. మీ వాక్యము వ్యర్థముగాదు. ముందు జన్మలో మీ వంటి వాడు పుత్రుడగు గాక!

111 తా॥ ఇట్లు మనసులో నిశ్చయించి ఆమె ఆ స్వామిని పూజించెను. అంతట యింటికి వెళ్ళి ఆమె ప్రతి ప్రదోషమున శివుని భక్తితో బూజించెను.

112 తా॥ ఆమె పుత్రుడు వేద శాస్త్రార్థ సంపన్ను డయ్యెను. అత డందరిలో పూజ్యుడు, సర్వు లకధికుడు, వినయ సంపన్నుడు, సుసంపన్ను డనిపించు కొనెను.

113 తా॥ ఆ గ్రామములో నే కొలదిరోజులకు వివాహమును చేసుకొన్న వాడై పుత్రపౌత్ర సంపదను బొందెను. ఎవనిపై గురు కృపవచ్చునో వాడిట్లు మహాత్ముడగును.

114 తా॥ ఓయీ నామధారక! ఇట్లుగా గురుకృప నెవడు పొందునో వా డానందముతో నఖిల భోగ భాగ్యములు గలిగి వర్ధిల్లును.

115 తా॥ ఈ విధముగ సిద్ధుడు భక్తుడగు నామధారకునకు చెప్పగా నచటి వారందరు సంతోష స్వాంతులై రని శ్రీవాసుదేవ సరస్వతి వచించెను.

గద్య॥ ఇది సిద్ధ నామధారక సంవాద రూపముగ గంగాధర సరస్వతీ పుత్ర వాసుదేవ సరస్వతి విరచితమైన శ్రీ నృసింహ సర్వస్వతీ రూప శ్రీగురు దత్త సంహితయు మహారాష్ట్ర భాషకు సమముగ శ్రీగురు దత్త చరితమందు జ్ఞాన కాండలోని అష్టమా ధ్యాయము సమాప్తము.

మొదట నుండి శ్లోకములు 1130

ఇ ట్లష్ట మో ధ్యాయము సమాప్తము.

శ్రీ గణేశాయ నమః - శ్రీ దత్తాత్రేయాయ నమః

# శ్రీ గురుదత్త చరితే

## అథనవమోధ్యాయః - జ్ఞానకాండః

1 శ్లో॥ ఇతి సిద్ధవచ శ్శ్రుత్వా ప్రణతో నామ ధారకః।
సంధాయ స్వకరౌ భక్త్యా పప్రచ్ఛ పున రాదరాత్॥

2 శ్లో॥ శ్రీపదే కురుపురే వరే స్థితే తత్కథా కథ మ భూ ద్వ
దాగ్రతః।
వి స్తరేణ భగవ న్మదారమే త్వం కృపా తను రనుత్తమో
స్య హో॥

3 శ్లో॥ ఇతి సంప్రార్థిత స్తేన త ద్భావం భక్తవత్సలః।
జ్ఞాత్వా గురు చరిత్రం స ప్రారేభే వక్తు మాదితః॥

4 శ్లో॥ సిద్ధ ఊచే ప్రవక్ష్యామి కౌతుకం నామధారక!।
త దగ్రే రజక స్త్వేకః సేవకః శ్రీగురో రభూత్॥

5 శ్లో॥ ప్రత్యహం శ్రీపదః స్నాతుం కృష్ణాం యాతి యథావిధి।
త్రీశః స్వయం కృతార్థో ఽపి సంపశ్యన్ లోకసంగ్రహం॥

6 శ్లో॥ గంగా స్నానాది పుణ్యం యత్ దృష్ట్వా తస్య తు తేన కిమ్।
అసౌ లోకానుగ్రహార్థ మథా పి స్నాతి నిత్యశః॥

7 శ్లో॥ మధ్యే కృష్ణా ప్రవాహం స శ్రీపాదో భక్తకామదః।
స్నానం కర్తుం సముద్యుక్త ఏక దా నామధారక!॥

8 శ్లో॥ కృష్ణా తటే స రజకో వస్త్రాణి క్షాళయ త్యపి।
భక్త్యా శ్రీపాద మాగత్య ప్రత్యహం నమతి స్మ సః॥

9 శ్లో॥ త్రికాలం నిత్య మాగత్య దండ వ త్ప్రణనామ హ।
కాయేన వాచా మనసా వినయేన చ భక్తితః॥

1 తా॥ సిద్ధయోగి వాక్యమును విన్న నామ ధారకుడు భక్తితో తన కరముల జోడించి నమస్కరించి యిట్లుగా నడిగెను.

2 తా॥ శ్రీపాద వల్లభులవారు కురుపురములో - వారి కథ యెట్లున్న దో ముందు మీరు విస్తారముగఁ జెప్పుదు మంటిరి - దయతో సంగ్రహముగ చెప్పండి!

3 తా॥ ఇట్లుగా ప్రార్థించు నామధారకునిపై దయగలిగి - ఆ గురుచరిత్ర నాకళింతకుఁ దెచ్చుకొని - ఆదినుండి కథను చెప్పఁ బూనెను.

4 తా॥ ఓయీ నామధారక! నాకును శ్రీవారి కథను చెప్పుట కుత్సాహ మధికముగ నున్నది - శ్రీపాదుల వారి దగ్గర నొక రజకుడు సేవకుడుగా నుండెను.

5 తా॥ ప్రతిదినము శ్రీవారు విధిగా కృష్ణా నదికి స్నానమునకు బోవు చుండెడి వారు - వారు స్వయముగఁ బరిశుద్ధు లైనను లోక సంగ్రహమున కట్లు చేయుచుండిరి.

6 తా॥ గంగానదీ మొదలగు నదుల స్నానము వలని పుణ్యమంతయు నాయన యందున్నంచున స్వయంపవిత్రుడై నను లోకాదర్శనమునకట్లునిత్యము వారు స్నానింతురు.

7 తా॥ అందుచే కృష్ణా నదీ ప్రవాహ మధ్యమున నొకనాడు స్నానము చేయుట కుద్యుక్తులైరి.

8 తా॥ ఆ కృష్ణానదిలో వారి వస్త్రములను ఆ రజకుడు ప్రక్షాళన చేయు చుండెడి వాడు - అట్లుదికి ప్రతిరోజు శ్రీవారి పాద వందనము చేయు చుండెను.

9 తా॥ ఆ నమస్కార మా సమయమున నే గాదు - ప్రత్యహము త్రికాలములందు త్రికరణ శుద్ధిగ భక్తితో సాష్టాంగ దండ ప్రణామము లాచరించు చుండెను.

10 శ్లో॥ ఏవం దినాని కతి చి న్నమతి శ్రీ పదం స్మ తం।
శ్రీవల్లభః సుప్రసన్నో నమం తం రజకం జగౌ॥

11 శ్లో॥ రజక! త్వం ప్రణమ్యా త్ర ప్రత్యహం కష్ట మీదృశం।
కిమర్థం కురుషే తుష్టో రాజ్యం దాస్యామి భక్త తే॥

12 శ్లో॥ ఇతి తద్వచనం శ్రుత్వా గ్రంధిం బద్ధ్వా స పల్లవే
ప్రాహ బద్ధకరః సత్య సంకల్పోఽసి త్వ మీశ్వరః॥

13 శ్లో॥ తత స్సంసార చింతాం స త్య క్త్వా తత్సేవకో ఽభవత్॥
దూరా ద్దృష్ట్వా యాంత మపి ప్రణనామ స దండవత్॥

14 శ్లో॥ ఏవం సు బహుకాలం స సేవకో రజకో న్వహం।
కృ త్వాంగణం నీరజస్కం ప్రేక్షయామాస వారిణా॥

15 శ్లో॥ తతో వాసంతికే కాలే వైశాఖే మాసి కశ్చన।
క్రీడ న్యవనజాతీయో రాజా త్రత సమాగతః॥

16 శ్లో॥ స్త్రీభి స్సహా లంకృతాభిః స్వయం చా భరణై ర్వరైః॥
భూషితో నౌ స్థితో హృష్టో జగామ జల మధ్యతః॥

17 శ్లో॥ హ స్తి ఘోటక పాదాతీం స్తట ద్వితయ చారిణః।
దృష్టవా నమితా౯ హృష్టా౯ భూషితా౯ సేవకా నపి॥

18 శ్లో॥ నానా విధాని వాద్యాని నేదుః కృష్ణాతట ద్వయే।
రాజాస్వయంప్రవాహె ఽపి చిక్రీడ౯ స్త్రీభి రున్మదః॥

19 శ్లో॥ రజకో వా ద్యశబ్దంస్శ్రుత్వాశ్రీగురుచింతనం।
త్యక్త్వా దదర్శ కృష్ణాయాం భూపం విస్మయ మాయయౌ॥

10 తా॥ ఇట్లు కొన్ని దినములు ఆ రజకుడు తనను నమస్కరించు చున్నను సమ్మతించు చున్న శ్రీపాదుల వారు - సుప్రసన్నులై రజకునితో నిట్లనిరి.

11 తా॥ ఓయీ రజక! ప్రతి రోజు కష్టపడుచు త్రికాలముల నమస్కరించు చుంటివే! ఎందులకు? నీకు కోరిక యున్న రాజ్యమైన నిత్తును - నేను నీ సేవకు తుష్టి జెందితిని.

12 తా॥ ఆ స్వామివారి వాక్యమును విని యా రజకుడు చేతులు రెండును చంకలో నిరికించి వినయముతో నమస్కరించుచు మీరు సత్య సంకల్పులగు నీశ్వరులు గదా?

13 తా॥ అది మొద లాతడు సంసార చింతను వదలి శ్రీవారి సేవ యందు నిమగ్నుడయి యుండెను - వా రెక్కడ దర్శనమిచ్చిన సాష్టాంగ పడెడి వాడు.

14 తా॥ ఇట్లు చాలాకాలము సేవ చేయు చుండెను - స్వామివారు తిరుగు ప్రదేశము నంతయు దుమ్ము లేకుండ చేసి, నీటితో తుడిచి శుభ్రము చేయు చుండెను

15 తా॥ ఇట్లుండ నొక వసంతర్తువులో వైశాఖమాసమున - నొకప్పుడు ఒక యవన రాజు జలవిహారము గా నచట కృష్ణా నదిలో పడవపై దిరుగు చుండెను.

16 తా॥ ఆ కృష్ణానదిలో - పడవపై - సర్వాభరణ భూషితలైన తమ రాణుల తోడను సర్వాభరణయుక్తుడై దాస దాసీ జన భోగములో విహారము రాజు చేయుచుండెను.

17 తా॥ రాజుగారి గుఱ్ఱములు - ఏనుగులు యితర పదాతి బలమును ఆ నదీతీరముల సర్వ శోభతో ననుసరించి రాజుగారి హోదాతో వెళ్ళుటను చూచెను

18 తా॥ ఆ నది యొక్క వొడ్డున నానావిధ వాద్య ధ్వనులు మ్రోగుచుండెను- అందొక చోటు పడవ నుండి దిగి రాజుగారు తమ స్త్రీలతో జలక్రీడ లాచరించు చుండెను.

19 తా॥ ఆ నది వొడ్డున బట్ట లుతుకు చాకలి - ఆ శబ్దముల విని ఆ రాజు భోగముల గని - గురువు గారిని తలచుచు వారి దర్శన చింతే మరచి విస్మయపడు చుండెను.

20 శ్లో॥ ప్రాహ హోత్వా ద్యాత్ర సంసారే యది సౌఖ్యం న చే దృశమ్॥
సువైభవం నలబ్ధం చే తజ్జన్మ పశునా సమమ్॥

21 శ్లో॥ రాజ్ఞోఽన్య జీవితం ధన్యం భుంకే సౌఖ్యం య దీదృశః॥
స్త్రియో ఽనేకాః సుభూషాశ్చ భక్త ఈశస్య భాతి మే॥

22 శ్లో॥ కథం తేనార్జితం పుణ్యం లబ్ధోవా ఽన్య కథం గురుః।
దేవ ఆరాధితః కోవా తతః ప్రాప్తేదృశేదశా॥

23 శ్లో॥ మనసా చింతయి త్వైవం గురుం నత్వా స దండవత్।
ననామీ జాతవాన్ శ్రీపా త్కృపాలు స్తస్య వాసనాం॥

24 శ్లో॥ ఏవం త ద్దృద్గతం జ్ఞాత్వా శ్రీపదో భక్త వత్సలః।
త మాహచాయ స ప్రపచ్ఛ కిం చింతయసి మానసే॥

25 శ్లో॥ రజకః ప్రాహ భో స్వామిన్ దృష్టం మే రాజవైభవం।
తుష్టో ఽస్మి కేవలం మన్యే దాసం శ్రీగురో రముం॥

26 శ్లో॥ దేవ మారాధ్య తపసా పురా వస్థా మిమాం గతః।
ఇతి మే చిత్త మాయాతం కృపా మూర్తే వదా న్యరాట్॥

27 శ్లో॥ అవి ద్యా వశతో నానా వాసనా ఉదయం తి హి।
కిం ప్రమాదీం ద్రియార్తై ర్మే త్వత్పదం మే ఽతి సౌఖ్యదం॥

28 శ్లో॥ శ్రీపాదో రజకం ప్రాహ జన్మతః కష్ట భాగసి।
తవా స్తి రాజ్యభోగే చ్ఛా సుఖే నాను భవిష్య సి॥

29 శ్లో॥ తృప్తాని నేంద్రియా ణ్యస్య మన స్తస్య న నిర్మలం।
వాసనా వ్యవశిష్టా చే త్సాజన్మాంతర కష్టదా॥

20 తా॥ ఓ భగవంతుడా! మానవునకు సంసార సుఖమును గల్పించితివి - ఈలాంటి భోగములు సంసారమున లేకున్న వాని జన్మ పశువునకు వలె భోగ హీనమైనదే గదా!

21 తా॥ ఈ రాజు జీవితము ధన్య మైనది - ఈ విధమైన సుఖ మనుభవించు భాగ్య మీరాజు నకు గలదు - ఇతని భార్య లలంకారములే భాగ్య మైనవి - ఇతడు యెంతయో శివ పూజా ధురంధరుడై యుండ వలయును.

22 తా॥ ఈ రాజు ఎంతటి పుణ్యవంతుడో?- ఈయన గురు వెవరో? ఏ దేవుని యెంత కాల మారాధించెనో? - లేకున్న నితని భాగ్య మీవిధ మెట్లుండును?

23 తా॥ ఇట్లుగా తలచుచు మనసులో తన గురువుగారికి దండ నమస్కారము లొనరించెను. శ్రీ పాదుల వారు కృపా పరులగుటచే స్వీయ వాసనను వదలక నమస్కరించెను.

24 తా॥ ఇట్లు వాని హృద యాభిప్రాయము నెరిగి దయామయుడగుటచే ఆ రజకుని పిలిచి, యోయీ! ఏదో విచారముతో నుంటివి - నీ మన సులో నేమున్నదో? అనెను.

25 తా॥ ఆ రజకుడు ఓ స్వామీ! నేను ఒక రాజు యొక్క వైభవమును జూచితిని - ఈ మీ దాసు డగు నేవా వైభమును జూచి చాల సంతోష పడితిని

26 తా॥ దేవుని పూజను పూర్వకాలమున చేసిన భాగ్యమున నిట్టి స్థితి ఆయనకు గలిగినది అని నాకు తోచినది. ఓ కృపామూర్తి! అత దన్యదేశపు రాజు అనెను.

27 తా॥ అజ్ఞానముచే నితరములైన యీ లోకవాసనలు గలుగు చుండును. ఈ యింద్రియములు బలాత్కారము లైనవి నేను మాత్రము మీ పద సేవయు నాకు సుఖ పదము.

28 తా॥ అప్పుడు శ్రీపాదులవారు, ఓరీ! నీవు జన్మతో చాల కష్టగాడివిగా జన్మించితివి. నీకును రాజ్యభోగవాంఛ యున్నచో నీవును సుఖము నొందుము.

29 తా॥ వీనికి ఇంద్రియములకు తృప్తిలేదు. మనస్సు నిర్మలముగ లేదు. నీకు వెనుకటి జన్మవాసన మిగిలి యున్నచో అది జన్మాంతరవాసనేచ్ఛ చే కష్టప్రదమైనది.

30 శ్లో॥ ఇతి స్వామి వచ శ్శ్రుత్వా హస్తౌ సంధాయ సో ఽబ్రవీత్।
కృపా సాగర! కర్తవ్యా నోపేక్షా శ్రీగురో! మమ॥

31 శ్లో॥ గురుః ప్రాహ స్థితే ప్రీతి రాజ్యభుక్తే రతో ద్రుతం।
ప్రయాహీంద్రియ తుష్ట్యర్థం భవత్వం మ్లేచ్ఛ జన్మభాక్॥

32 శ్లో॥ రజకః ప్రాహ చరణ వియోగో మాస్తు తే ఽనయోః।
దర్శనం మే ఽస్తు తే జ్ఞానం పునశ్చా నుగ్రహం కురు॥

33 శ్లో॥ శ్రీగురుః ప్రాహ వైడూర్య నగరే త్వం జనిష్యసే।
దర్శనం మే ఽన్తకాలే తే భవిష్యంతి భవాంతరే॥

34 శ్లో॥ మమ దర్శన మాత్రేణ జ్ఞానం తే ఽపి భవిష్యతి।
చింతాం మాకురు వాక్యం మే సత్య మేవ న సంశయః॥

35 శ్లో॥ పునః ప్రయోజన వశాత్ భవిష్యామి ధరాతలే।
అవతీర్ణే యతి ర్నామ్నా నరసింహ సరస్వతీ॥

36 శ్లో॥ పున రాభాష్య తం ప్రాహ మ్లేచ్ఛయోనిం ప్రజేతి సః।
రజక స్తత్పదే ధ్యాత్వా సాష్టాంగం ప్రణనామ హ॥

37 శ్లో॥ త మాహూయ స్వ నికటం కృపామూర్తి రువాచ తం।
ఇహ జన్మని భోక్తుం తే వాంఛా వా పరజన్మని॥

38 శ్లో॥ రజకః శ్రీపదం ప్రాహ వృద్ధో ఽస్మ్య ద్య జర ద్వపుః।
పరజన్మని భోక్ష్యే తో యౌవనే హ్యుత్తమా రుచిః॥

39 శ్లో॥ రజకస్య వచ శ్శ్రుత్వా శ్రీ పాదః ప్రాహ సేవక!।
గచ్ఛ జన్మాంతరం శీఘ్రం భుంక్ష్వ రాజ్య మకంటకః॥

30 తా॥ ఇట్లన్న స్వామి వారి వచనమును విని రెండుచేతులు కట్టుకొని యాయనతో ననెను: కృపాసింధో! చేయదగినది చేయవలసినదే! శ్రీగురూ! మీ రుపేక్షింపరు గద?

31 తా॥ ఓరీ! నీకును రాజ్యము ననుభవింపవలెనన్న నీవు త్వరగ వెళ్లుము - నీ యింద్రియములు తుష్టి నొందవలె నన్న నీ వా తురకరాజు వగుదువు - అని యనెను గురువుగారు.

32 తా॥ ఆ రజకుడు - ఓస్వామీ! మీ పాద ద్వంద్వము తో మాకు వియోగము వద్దు - మరల నాకిపాదదర్శన మిప్పించండి. మీ యెఱుకయు నాకు గలిగింపవలెను.

33 తా॥ అపుడు గురువుగారు - ఓరీ! నీవు వైడూర్యనగరమున జన్మింతువు - నీవు వృద్ధుడవైన యనంతరము - నీ వాజన్మాంతరముల నాదర్శన మగును.

34 తా॥ ఓరీ! - అపుడు నీకు దర్శనమైన పిదప జ్ఞానము గలుగును - నీవు చింత సేయకుము. నా వాక్యము సత్యమగును. సంశయము లేదు.

35 తా॥ నేను కొన్ని కారణములగా భూమి యం దవతరింపగలను - అపుడు సన్న్యాసినై నరసింహ సరస్వతీ అను పేరుతో నుందును."

36 తా॥ మరల నా రజకునకు శ్రీపాదవల్లభుల వారు చెప్పి, నీవు తురక జాతి యందు జన్మింప పొమ్ము - అనిరి. అంత రజకు డాయనను ధ్యానించి సాష్టాంగనుస్కారం చేసెను.

37 తా॥ ఆ గురుమూర్తి వానిని దగ్గరకు పిలిచి నీ కీజన్మలో - నింకను ఐహికవాంఛ యున్నందున నింకొక జన్మ యిచ్చితి - ఆ మరుజన్మలో ఆ కోరికలు తీరిన జ్ఞానం గల్గును.

38 తా॥ రజకుడు శ్రీపాదులవారి తో - అయ్యా! నేను వృద్ధుడనై శిథిల దేహము గలవాడ నైతిని - పరజన్మలో - కర్మఫల మనుభవించి యవ్వనములో నుత్తమగతి నిప్పింపండి!

39 తా॥ ఆ రజకుని వాక్యమును విని శ్రీపాదుల వా రాసేవకునితో - ఓయీ! నీవు శీఘ్రముగ వెళ్లుము - జన్మాంతరములో రాజ్య భోగమును అకంటకముగ ననుభవింపుము.

40 శ్లో॥ ఇతి శ్రీ గురుణా జ్ఞప్తః ప్రాణాం స్త్యక్త్వా సతక్షణం।
వైడూర్య మ్లేచ్ఛ కులే జజ్ఞే స దైవతః॥

41 శ్లో॥ రజకస్య కథా చిత్రా సంజాతా నామధారక।
తాం విస్తరేణ వక్ష్యామి ప్రసంగవశతోఽగ్రతః॥

42 శ్లో॥ తత్ర ప్రత్యక్ష రూపేణ కంచి త్కాల ముపావసత్।
శ్రీ పాదో మహిమానం స్వం లోకే ప్రఖ్యాపయ న్నివ॥

43 శ్లో॥ సర్వమాహాత్మ్య సంఖ్యానే గ్రంథో విస్తరతా మియాత్।
అతః సంక్షిప్య వక్ష్యేఽ న్యావతారం నామధారక॥

44 శ్లో॥ సర్వ మాహాత్మ్య సంఖ్యానే కుత శ్శక్తి ర్మ మేదృశీ।
స్థానమాహాత్మ్య మప్య స్యామృత దృష్టే స్తు కో వదేత్॥

45 శ్లో॥ శ్రీ గురు ర్యత్ర వసతి స్థాన స్యాపిచ తస్య తు।
విచిత్రం మహిమానం నో వక్తుం శక్తోమి కార్త్స్న్యతః॥

46 శ్లో॥ వక్ష్యే సంక్షేపత స్తస్మాత్ స్థాన మాహాత్మ్య మీశితుః।
ప్రఖ్యాతం త తత్కురుపురం సిద్ధ్యై ద్యత్రా శుకామనా॥

47 శ్లో॥ కతికాలం వసం స్తత్ర శ్రీ పాదో భక్తవత్సలః।
అదృశ్యో ఽభూ ల్లోకదృష్ట్యా ఽవతరిష్యం స్తతః పరం॥

48 శ్లో॥ ద్వాదశ్యా మాశ్వినే కృష్ణే హ స్తర్క్షే భగవా న్ప్రభుః॥
కృష్ణాయాం సమదృ శ్యోఽభూ ల్లోకదృష్ట్యా న తత్త్వతః॥

49 శ్లో॥ భూత్వా స్వయ మదృశ్యోఽపి భక్తానాం కామపూరకః।
ఆస్తే త్రిమూర్తి రద్యాపి భక్తానా మీహితార్థ దః॥

40 తా॥ ఇట్లు గురువుగారి ఆజ్ఞను పొందిన వెంటనే ప్రాణముల వదలెను. దైవయోగముచే వైడూర్యనగరములో మ్లేచ్ఛకుల మందు మగపిల్లవాడై జన్మించెను.

41 తా॥ ఆ రజకుని కథ చాలా చిత్రమైన దో నామధారక ప్రసంగము వచ్చినపుడు ముందు ముందు నీ కాకథను విస్తరించి వచింతునని సిద్ధ దనెను.

42 తా॥ అటు తర్వాత శ్రీపాదులవారు ప్రత్యక్షముగ కొంతకాల ముండిరి. ఆ శ్రీపాదులవారు తమ మహిమను లోకమున కుపయోగపఱచు చుండిరి.

43 తా॥ సర్వము శ్రీపాదులవారి మహిమను చెప్పవలయునన్న గ్రంథ విస్తార మగును. అందుచే వారి అవతారమును గూర్చి నీకు సంక్షిప్తముగ చెప్పుదు నో నామధారక!

44 తా॥ సమస్త మహిమను చెప్పవలెనంటే శక్తి యుండవలెను - ఆ స్థానము యొక్క మహిమయు అమృతసమమైనది - దానిని వచింప నెవడు గలడు?

45 తా॥ శ్రీగురు శ్రీపాదులవా రెచట నుండిరో ఆ స్థానము యొక్క మహిమయు విచిత్రం. దానిని గూడ నీకు సమగ్రముగా చెప్పలేను. వినుము.

46 తా॥ అందుచే ఈశ్వరుడైన శ్రీపాదులవారి స్థాన మాహాత్మ్యమును సంక్షేపించి చెప్పుదును- వారుండినది కురుపురము గదా? ఆ స్థానమే సర్వ కోరిక లిచ్చునది.

47 తా॥ స్వామీ! సిద్ధయోగి ఎంతకాలము భక్తవత్సలుడగు శ్రీపాదులవారచట నుండిరి? లోకదృష్టికి కానరాకుండ వేరొక అవతారమెందులకు ధరించిరి.

48 తా॥ ఆశ్వియుజ బహుళ ద్వాదశి హస్తానక్షత్రమున భగవానుడగు శ్రీపాద వల్లభులు కృష్ణానదికి స్నానమునకై వెళ్ళి లోకదృష్టికి కానరాకుండెను - తత్త్వదృష్టికి కాదు.

49 తా॥ అట్లు వారు లోకదృష్టికి కానరాకున్నను భక్తుల కోరికలను మాత్రము దీర్చుచుండిది. త్రిమూర్తు లవతారుడగుట నదృశ్యుడై కోరికల దీర్చుచుండెను.

50 శ్లో॥ శ్రీ పాదో ఽదృశ్యరూపేణ తత్ర తిష్ఠతి సర్వదా।
అవతార ప్రసంగేన ప్రత్యక్షో జ్ఞానినా మిహ॥

51 శ్లో శ్రీ పాద స్తత్ర జాగర్తి త్యేవం ప్రత్యయ హేతవే।
వక్ష్యే నిదర్శనం శ్రోతః సావధానతయా శ్రుణు॥

52 శ్లో॥ స్థానం వ్రజంతి యే భక్త్యా తేషాం ప్రత్యక్ష ఏవ సః।
భూమండలే ప్రసిద్ధం తత్ క్షేత్రం కురు పురం పరం॥

53 శ్లో॥ సిద్ధోఽవద ద్యత్ఖల నామధారకం పూర్వం యదా శ్రీ గురు
స త్కథానికమ్॥
శ్రోత్వా నువాచాపి తు తత్సరస్వతీ సంజ్ఞో ద్విజో యస్త్వ
పరాసరస్వతీ॥

గద్య॥ ఇతి శ్రీ సిద్ధనామధారక సంవాదరూపేణ సరస్వత్యాఖ్య గంగా ధరాత్మజ విరచిత నరసింహ సరస్వత్యుపాఖ్యాన సంజ్ఞిత మహారాష్ట్ర భాషాన్విత గురుచరిత్ర సమానార్థాయాం వాసుదేవానంద సరస్వతీయతి విరచితాయాం శ్రీ గురుసంహితాయాం జ్ఞానకాండే - నవమోఽధ్యాయః సమాప్తః.

ఆదితశ్లోకాః (1183)

50 తా॥ శ్రీపాదులరా రదృశ్యమైనట్లు లౌకికులు మాత్రమే కాని జ్ఞానులగు భక్తులకు అవతారము ననుసరించి ప్రసన్ను డగుచుండెను.

51 తా॥ శ్రీపాదులవారు ఆ కురుపుర స్థానములో నుండిరనుటకు ప్రత్యక్ష మును, ప్రత్యయమును గలిగించుటకు నిదర్శనము జూవుదు-వినుము

52 తా॥ ఆ కురుపురమున కీనాటికి భక్తులు వెళ్ళుచుందురు. స్వామివారు వారికి ప్రత్యక్షమై కోరికల దీర్చుచున్నారు.

53 తా॥ శ్రీ సిద్ధయోగి నామధారకునకు యథాప్రకారం కథను చెప్పెనని శ్రీవాసుదేవ సరస్వతి ఈ నవమాధ్యాయంతో సమాప్తి చేస్తున్నారు.

గద్య (వచనం) వెనుకటి అష్టమాధ్యాయాంతమందువలె.

మొదటినుండి శ్లోకములు (1183), నవమాధ్యాయం సమాప్తము.

శ్రీ గణేశాయ నమః - శ్రీ దత్తాత్రేయాయ నమః

# శ్రీ గురుదత్త చరితే

## దశమోధ్యాయః - జ్ఞానకాండే

1 శ్లో॥ ఇతి సిద్ధవచః శ్రుత్వా నత్వా తం నామధారకః।
శ్రోష్య శ్రీపాద మాహాత్మ్యం పునః ప్రపచ్ఛ సాదరం॥

2 శ్లో॥ అవతా రాంతరం జాతం శ్రీపాద స్తత్ర హి స్థితః।
ఇత్యుక్తం తత్కథం స్వామిన్ విస్తరేణ వదాఖిలం॥

3 శ్లో॥ సిద్ధ ఆ హాస్య మాహాత్మ్యం కిం బ్రువే నామధారక।
విశ్వవ్యాపీ పరమాత్మా యో నానారూప ధరోవ్యజః॥

4 శ్లో॥ కార్యార్థ మవతీర్ణోఽపి గుప్తరూపేణ చాత్రహి।
కురు క్షేత్రం నివసతి స్వభక్తవరదో విభుః॥

5 శ్లో॥ పశ్య భార్గవ రామోఽపి చిరజీ వ్యధునా ఽస్తిహి।
తతః పరేఽ వతారాస్తు తస్య జాతా అనేకశః॥

6 శ్లో॥ నారాయణో త్ర వసతి సర్వత్రాపి త్రిమూర్తిధృత్।
బ్రహ్మ విష్ణ్వీశ రూపైః స సర్గస్థితివినాశకృత్॥

7 శ్లో॥ హృషీకేశో ఽవతరతి స్వభక్త జన రక్షకః।
దుర్వాసః శాప మాశ్రుత్య గోప్తుం ధర్మం సత స్సురాన్॥

8 శ్లో॥ త్రిమూర్తే రవతారోఽ యం కేఽ స్య పారం పరం విదుః।
నిధిః కురుపురం తీర్థం త్రిమూర్తే ర్వసతి స్త్విహ॥

9 శ్లో॥ యం యం చింతయతే తం తం ప్రాప్నోతి క్షేత్ర దర్శనాత్।
శ్రీగురో ర్వసతి ర్యత్ర కామధేను స్తు తత్ర హి॥

1 తా॥ సిద్ధుడు చెప్పిన దానిని విని నామధారకు డాయనకు నమస్కరించెను. వినదగిన శ్రీపాదులవారి మాహాత్మ్యమును మరల నడుగుచుండ దయతో చెప్పెను.

2 తా॥ అవతారముచే మరొక స్థలమున (జేసినను శ్రీపాదులవా రచటనే యుండిరి అని మీరంటిరే దానిని విస్తారముగఁ జెప్పండి! ఆ కథ యెట్టిదో తెలుపండి!

3 తా॥ ఓయీ నామధారక! శ్రీవారి నింకను ఏమని చెప్పగలను? ఆయన జగత్తును వ్యాపించిన నానారూపధారీ జగద్వ్యాపీ భగవంతుడు గద?

4 తా॥ కార్యార్థ మాయన అవతారము ధరించి యు గుప్తముగా నచట నే యుండెను కురుపుర మన్న దొక కురుక్షేత్రమైతే వాసుదేవుడగు తా నందేయున్నాడు.

5 తా॥ అవతారము ధరించియు పరశురాముడు చిరంజీవియై నట్లు ఇప్పటికి వారందున్నట్లు న్నది గదా? కావున భగవ దవతారము లనేకము లయ్యు ననేకరీతుల నుండును.

6 తా॥ త్రిమూర్తిధారియగు నారాయణుడు అంతట నున్నవాడే! బ్రహ్మ విష్ణు శివ రూపముల తానే సృష్టి స్థితి లయ కారకుడైన ఈశ్వరు డొక్కడే యుండెను.

7 తా॥ విష్ణు వొక్కడే సత్వగుణావిష్టుడై భక్తజనమును రక్షించు చున్నాడు. దుర్వాసుని శాపమాత్రమున నంబరీషుని గాపాడ స్వామి ధర్మ రక్షకుడయ్యెను.

8 తా॥ త్రిమూర్తి రూపుడగు పరాత్పరుని అవతార పారమ్యము నెవ రెరుగుదురు? కురుపురం త్రిమూర్తిరూపుడగు భగవంతుని నిధి స్థానము.

9 తా॥ ఏయే దానిని మానవుడు చింతించునో దానిని తాను ఈ క్షేత్ర దర్శన మాత్రమునఁ బొందును - ఆ త్రిమూర్తి రూపు డెక్కడ నుండునో కామధేను వచటనే యుండును.

10 శ్లో॥ శ్రీపాదస్థాన మహిమా వర్ధతే కేన భూతలే।
కార్త్స్న్యే నాపి చైకం తే వక్ష్యా మీహ నిదర్శనం॥

11 శ్లో॥ తుభ్యం కథయితుం మేఽతి ప్రీతి స్త్వం గురుభక్తిమాన్।
సర్వథో పేక్షతే నైవ భక్తం తన్మార్గ మీక్షతే॥

12 శ్లో॥ గాంభీర్యేణ దృఢా భక్తిః యస్య ధీ రస్య సోఽ చిరాత్।
ఇహ సౌఖ్యం పరం భుక్త్వా పరం పారం గమిష్యతి॥

13 శ్లో॥ అవధారయ దృష్టాంతం ప్రాగ్వృత్తం నామధారక।
వల్లభేశ ఇతి ఖ్యాతో విప్రః కాశ్యపగోత్రజః॥

14 శ్లో॥ ఆచారవాన్ సుశీల స్స వణిగ్వృత్తిః కుటుంబవాన్
శ్రీపాదదర్శనార్థం స ప్రతివర్షం స్మ గచ్ఛతి॥

15 శ్లో॥ ఏవం స స్నేకదా విప్రో వాణిజ్యార్థం స ముద్యతః।
సంకల్ప్య మనసా విప్ర భోజనం కార్యసిద్ధయే॥

16 శ్లో॥ వాణిజ్యే మే ఽతిలాభ శ్చే ద్భూయా త్కురుపురే తతః।
దాస్యే సహస్ర విప్రేభ్య ఇచ్ఛా భోజన మిత్యసౌ॥

17 శ్లో॥ సంకల్ప నిశ్చయే నాసౌ వాణిజ్యార్థం తతో గతః।
శ్రీపాద శ్రీవల్లభాంఘ్రిం మనసా చింతయ న్సదా॥

18 శ్లో॥ యద్యత్ స్థానం గత స్తత్ర లాభో స్యా భూ ద్విశేషతః।
స సంకల్పా చ్ఛతగుణం ధనం లబ్ధ్వా ఽతిహర్షితః॥

19 శ్లో॥ శ్రీపాదచరణే చిత్తం నివేశ్య గృహ మాగతః।
సంకల్పిత ద్విజభుజి తతః కర్తుం సముద్యతః॥

10 తా॥ శ్రీపాదమహిమను పెంచునది కురుపురస్థానమే. దానికి నిదర్శనముగా నొక విచిత్రమును నీకు వినిపింతును - వినుము నామధారక!

11 తా॥ నీకు శ్రీవారి కథను వినుట కెంతటి ప్రీతియో చెప్పుటకు నేనంత శ్రద్ధతో నుంటిని - సర్వ విధముల భక్తుల రక్షింప నాయన త్రిమూర్తిరూపుడై వేయి కన్నుల చూచుచున్నాడు.

12 తా॥ ఎవనికి ధీర చిత్తముండి ఆయన యందు దృఢ భక్తి వంతుడగునో అట్టి వా డీలోకమున సుఖము లనుభవించి పరమున ముక్తి నొందును.

13 తా॥ ఆ స్థాన చరిత్రలో వెనుక జరిగిన వృత్తాంతము నొకదానిని చెప్పుదును - వినుము - పూర్వము కాశ్యప గోత్రజుడైన వల్లభేశు డను నొక బ్రాహ్మణు డుండెను.

14 తా॥ అత డాచారవంతుడు - సౌశీల్యవంతుడు - ఆయన వ్యాపారవృత్తితో కుటుంబమును పోషించుచుండెను - ప్రతి వత్సరము శ్రీపాదులవారి దర్శనమును చేయుచుండెను.

15 తా॥ ఇట్లుండ నొకప్పు డా బ్రాహ్మణుడు బేరము (వ్యాపారము) చేయ బూనిన వాడై మనస్సులో కార్యసిద్ధ్యనంతరం బ్రాహ్మణ భోజన మును సంకల్పించెను.

16 తా॥ నేను చేయబోవు వ్యాపారములో లాభము వచ్చినచో కురుపురమునకు వెళ్ళి అచటి స్వామికి ప్రీతిగా సహస్ర బ్రాహ్మణ భోజనము నిచ్చి పూర్తి నిత్తుననెను.

17 తా॥ ఆ సంకల్ప నిశ్చయముతో వాణిజ్యమునకు వెళ్ళెను. ఆ వ్యాపారము పూర్తియగు వఱకు శ్రీపాదవల్లభుల చరణములను మనసులో దలచు చుండెను.

18 తా॥ ఆ వ్యాపారము నేయేచోటున కేగినను విశేషలాభము గలుగుచుండెను. తా నాశించదానికి నూరు రెట్లు లాభము గలిగి మిక్కిలి సంతోష పడెను.

19 తా॥ శ్రీపాద స్మరణ తోనే వ్యాపారము నుండి యింటికి వచ్చెను. వచ్చిన వెంటనే పూర్వము తాను సంకల్పించిన సహస్ర బ్రాహ్మణ భోజన మున కుద్యుక్తుడయ్యెను.

20 తా॥ ఆ సమారాధనకు సరిపోవు ద్రవ్యముతో కురుపురమునకు బోవుదు ననుకొని పోవుచుండ దానిని తెలిసికొని దొంగలు స్నేహ నెపమున నాతని ననుసరించిరి.

21 తా॥ ధన లోలుపు లైన ఆ దొంగలు రెండు రోజుల ప్రయాణ మట్లు చేసిరి. విశ్వాసింపఁ జేసి మేమును కురుపురమునకు బోవువార మనుచు నిర్జనారణ్యమార్గముం బ్రవేశించిరి.

22 తా॥ మేమును ప్రతియేట కురుపురము బోవునియమమున్నది. శ్రీపాద దర్శనమును చేతుము అన బ్రాహ్మణుడు నది యే నాకు కావని యనెను.

23 తా॥ అట్లని విశ్వసింపఁ జేసి యా బ్రాహ్మణుని శిరస్సు ఛేదించిరి. ధనాప హరణార్థులై వాడి యగు ఖడ్గముతో ఖండించెను.

24 తా॥ చావబోవు సమయమున భక్తవత్సలుని స్మరించుచుండెను. శ్రీపాదుల వారు జటాధారియైన భస్మలిప్త దేహముతో కురుపురము నుండి వచ్చెను.

25 తా॥ చేతిలో త్రిశూలమును ఖడ్గమును గల్గి యున్నందున ఆ దొంగల ముందు నిలిచి ఆ దొంగలను త్రిశూలముతో పొడిచి ఖడ్గధారతో చంపెను.

26 తా॥ అట్లా దొంగలు చావగా నం దొకడు మిగిలి యుండెను. వాడు గజగజ వణకుచు ఆ మహానుభావునిలో దయబుట్ట శరణు వేడెను.

27 తా॥ అయ్యా! నేను నిరపరాధిని. నా అజ్ఞానముతో నా దొంగలను గలిసి తిని. దొంగతనము నా భావములో లేదు. విశ్వసాక్షివి నీకుఁ దెలియ నిది లేదు

28. తా॥ ఆ మాటను విన్న యా మహాత్ముడు కొంత భస్మనాతని కిచ్చి ఆ బ్రాహ్మణుని తల నాయన మొండెము నకు తగిలించి అయన దేహ మున చల్లు మనెను.

29 తా॥ ఆ తలను మొండెమున కదికి భస్మమును దేహమునకు పూయుట తోడనే - శ్రీపాదులవారి అమృత దర్శనమున ఆ విప్రుడు మరల బ్రదికెను .

30 శ్లో॥ అత్రాంతరే నిశా తీతా సూర్యోప్య భ్యుదిత స్తతః।
శ్రీపాదో ఽదృశ్యతాం యాతః చోర ఏక ఉపస్థితః॥

31 శ్లో॥ స సుప్తోత్థిత వ ద్బుధ్వా హతశేషం జగౌ ద్విజః।
మాం బిభర్షి కుతః కేన హతా ఏతే వ దాధునా॥

32 శ్లో॥ తస్కరః ప్రాహ విప్రా త్ర చిత్రం జాతం హి కశ్చన।
ఆగత్య తాపసః చోరాన్ శూలే నాహం స్త వా ంతకాన్॥

33 శ్లో॥ రక్షార్థం మాం నియో జ్యాత్ర మంత్రితేన చ భస్మనా।
శీఘ్రం త్వాం జీవయామాస ఛిన్నశీర్ష మపి ద్విజ॥

34 శ్లో॥ సంస్థితో ప్యధునా ఽత్రై వ సహసా ఽదృశ్యతాంగతః।
న జ్ఞాతో మే మునిః కోఽయం యస్తే ప్రాణా న రక్షత॥

35 శ్లో॥ భా తీశ స్త్రిపురారిః స భస్మలిప్తో జటాధరః।
త్వం భక్తో ఽసీతి మే భాతి తత ఏష సమాగతః॥

36 శ్లో॥ ఇతి తద్వచనం శ్రుత్వా ఖిన్నః శ్రీశాంఘ్ర్య దర్శనాత్।
విశ్వ స్త స్తద్ధనం విప్రో గృహిత్వా ఽగా ద్గురోః పురమ్॥

37 శ్లో॥ నానోపచారై స్సంపూజ్య శ్రీపాదస్య చ పాదుకే।
చతుః సహస్ర సద్విప్ర భోజనం శ్రద్ధయా వ్యధాత్॥

38 శ్లో॥ ఏవం భక్తా అనంతాస్తు తత్ర సిద్ధిం గతాః ఖలు।
మాహాత్మ్యం శ్రీపదస్యేత్థం ఖ్యాతిం కురుపురం తతః॥

39 శ్లో॥ తస్మా దదృశ్య రూపేణ శ్రీపాదో నామధారక।
అసంశయం కురుపురే నివస త్యేవ సర్వదా॥

30 తా॥ ఇంతలో రాత్రి గడిచిపోయెను - సూర్యుడుదయించెను - శ్రీపాదుల వారు అంతర్థానమైరి - దొంగ ఒకడు మాత్రము ముందు కనపడెను-

31 తా॥ మేల్కొన్న వాని చందమున లేచిన ఆ బ్రాహ్మణుడు - ఈ చచ్చిన వారెట్లు చచ్చిరి - చెప్పవేమి - నన్ను భయపెట్టు చున్నావా.? ఎందు కెవరిచే నిప్పుడు వీరు చచ్చిరి ?

32 తా॥ అయ్యా ! ఇప్పు డొక విచిత్ర మిచట జరిగినది - ఇదివరకు మనతో కలిసి వచ్చిన వీరు దొంగలు - మిమ్ముల చంపిరి - ఒక తాపసివచ్చి వారిని చంపి మిమ్ము బ్రతికించెను.

33 తా॥ వారిని చంపిన తరువాత మీ తలను మీ శరీరమునుండి విడిన దాని నదుకుమని యదికించి యొకకొంత భస్మమిచ్చి పూయజేసెను- వెంటనే నీవు బ్రతికితివి-

34 తా॥ ఇప్పటి వర కాయన యిచటనే యుండి అంతర్ధానమయ్యె నా తాపసి. మీ ప్రాణములు రక్షించిన యా ముని యెవరో నేనెరుగను.

35 తా॥ భస్మలిప్త దేహుండు - జటాధారి యైన యాయన త్రిమూర్తిరూపుడే! నీవాయనకు పరమభక్తుని వలె నుంటివి - అందుకే యిట్లాయెన చేసెను.

36 తా॥ ఈ మాటల విన్న తదుపరి ఆ స్వామి దర్శనము తనకు గల్గలేదని దుఃఖించెను. ఆ మాటలలో నా బ్రాహ్మణు డా ధనముతో గూడ కురు పురమునకు బోయెను.

37 తా॥ వెళ్ళి - స్నానించి అచటను న్న శ్రీపాదులవారి పాదుకలకు పూజచేసి నాల్గువేల మంది సద్బ్రాహ్మణులకు మృష్టాన్న భోజనమును పెట్టెను-

38 తా॥ ఇట్లాకురుపుర మందు శ్రీపాదుల వారి యా శ్రమ ప్రదేశమున నేకులగు భక్తులు తరించిరి - ఆయనగారి మహిమ చేతనే కురుపురం మహత్వం గలదయ్యె.

39 తా॥ ఓయీ నామధారక! - లోకులకు కాన రాకయే - శ్రీపాదుల వార టనుండి భక్తుల తరింపఁ జేయు చుండిరి. నిశ్చయముగ శ్రీపాదులు కురుపురమం దుండిరి.

40 శ్లో॥ అవతీర్యాప్య నంతో ఽసౌ స్థితో నారాయణో త్రహి।
అగ్రతో భూష్ణు రప్యత్ర పరిపూర్ణో ఽస్తి సర్వగః॥

41 శ్లో॥ స్థిత్వా ఽపి శ్రీపద స్త్వత్ర గుప్తః ప్రాకృత దృష్టితః।
తతో ఽగ్రతో ఽవతీర్ణో ఽభూ త్స నృసింహ సరస్వతీ॥

42 శ్లో॥ గంగాధరః ద్విజసుతః స సరస్వతీతి
ఖ్యాతో గురో శ్చరిత మాహ సువిస్తరేణ
శ్రోతు ర్మనోహర మిదం సకలా నభీష్టా
నర్థా న్ప్రదాస్యతి లఘు శ్రవణా దపీ హ॥

శ్రీ గణపతయే నమః - శ్రీ దత్తాత్రేయాయ నమః

ఆదితశ్లోకాః 1224
దశమాధ్యాయ సమాప్తః

40 తా॥ నారాయణమూర్తి అనంతావతారముల నొందియు-ఆయా యా తావు లందుండి పరిపూర్ణ కృపతో భక్తుల కోరికల దీర్చు చుందురు.

41 తా॥ శ్రీపాదులవారు ప్రాకృత దృష్టులకు గుప్తరూపమున నిందు కాన వత్తురు కాని, వారే ముందు చెప్పబోవు నృసింహ సర్వస్వ త్యవతార ధరులైరి.

42 తా॥ గంగాధర సరస్వతీ పుత్రులగు వాసుదేవ సరస్వతి గారు ముందు ముందు శ్రోతృజన మనోరంజకముగా చెప్పనున్నారు.

పదియవ అధ్యాయం సమాప్తము
మొదలునుండి శ్లోక సంఖ్య — 1224

# శ్రీ గురుదత్త చరితే

## ఏకాదశోఽధ్యాయః - జ్ఞానకాండే

1 శ్లో॥ నామధారక ఆహేదం శ్రీపాదః క్వావతీర్యచ।
కిం చకార కృపామూర్తే! స్వామిన్మేవదవిస్తరాత్॥

2 శ్లో॥ సిద్ధ ఊచే శృణు ష్వేదం భో! వత్స! శ్రీపదస్తతః।
పూర్వోక్త వరసంసిద్ధ్యై జాతో విప్ర స్త్రియః సుతః॥

3 శ్లో॥ శని ప్రదోషే సర్వేశం పూజయామాస యాంబికా।
గురూపదేశతో దైవా త్పంచత్వం ప్రాప సా తతః॥

4 శ్లో॥ ఉదగ్దేశే ద్విజకులే కరంజ నగరేఽధసా।
ఆత్మజా సమభూ ద్వాజస నేయి బ్రాహ్మణస్యతు॥

5 శ్లో॥ జాతకర్మ పితా తస్యా అకరో ద్విధినా తథా।
నామకర్మ పితృభ్యాం తన్నా మాంబే తి ప్రతిష్ఠితమ్॥

6 శ్లో॥ స్నేహం సంవర్ధయంతీ సా పిత్రో ర్వేశ్మ న్యవర్తత।
తస్మిన్ గ్రామే ద్విజా యాద సాప్రదత్తా మహోత్సవైః।

7 శ్లో॥ శివవృత్తిం మాధవాఖ్య మనురూపం ద్విజం పితా।
దృష్ట్వా తత్రైవ తాం తస్మై గృహోక్త విధినా దదౌ॥

8 శ్లో॥ మాధవస్య గృహే పత్యుః శుభా చారా సదా ఽవసత్।
సాధ్వీ సా పూర్వసంస్కారాత్ పూజయామాస చేశ్వరం॥

9 శ్లో॥ తౌ దంపతీ ప్రదోషే ఽపి శ్రద్ధా భక్తిపురస్సరమ్।
ఈశ్వరం పూజయామాసుః నియమేన నిరంతరం॥

1 తా॥ నామధారకుడు సిద్ధయోగితో స్వామీ శ్రీపాదుల వారెక్కడఁబుట్టిరి? ఏ పనులఁ జేసిరి? ఆ కృపామూర్తుల చరిత్ర విస్తారముగ జెప్పుమనెను.

2 తా॥ ఓయీ నామధారక; శ్రీ పాదులవారు పూర్వమందు బ్రాహ్మణ స్త్రీకి మాట నిచ్చిన కారణముగ నామెకు కుమారుడై జన్మించిను-

3 తా॥ ఆ బ్రాహ్మణాంబిక శని ప్రదోష మున శివపూజ నొనరించిన ది. ఆగు రూప దేశ ప్రకారము జీవిత కాలము శివ పూజ చేసి మృతి నొందెను.

4 తా॥ ఉత్తర దేశమున కరంజ నగరమున వాజననేయ శాఖీయ బ్రాహ్మణు డొక డుండెను. పూర్వోక్త శనిప్రదోషపూజ నిర్వర్తించియామె యాయన కుమారితగ పుట్టెను.

5 తా॥ తండ్రి యామె పుట్టిన వెంటనే- జాతకర్మయు- విధి విధానముగ నామకర్మయు నొనరించి యామెకు అంబా అని పేరు బెట్టెను.

6 తా॥ ఆ కన్య తలిదండ్రులకు గారాబు బిడ్డయై పెండ్లి యీడునకు వచ్చెను. అంత టామె తండ్రి ఆ గ్రామములో నుండెడి బ్రాహ్మణుకిచ్చి మహోత్సవముగ పెండ్లి చేసెను.

7 తా॥ ఆ బాలుని తండ్రి యాయావర వృత్తి నుండుటచే-సుతుడు నట్టి భిక్షుకుడైన శివుని దలచుకొని మాధవయ్య అనుపేరుఁ బెట్టెను.

8 తా॥ ఆ మాధవు నింట (అత్తవారింట) తన వధువగు అంబ సదాచారావతియై పతివ్రతయై -పూర్వజన్మ సంస్కారమున శివపూజ నేమరక చేయుచుండెను.

9 తా॥ ఆ దంపతు లిద్దరు-ప్రదోష మయమునకు శ్రద్ధాభక్తులతో నియముగ, అవిచ్ఛిన్నముగ ఈశ్వర పూజను చేయుచుండిరి.

10 శ్లో॥ ఉభావపిత్రయోదశ్యాం మందవారే విశేషతః।
అంతర్వత్నీ తత స్సా ఽభూ దంబా షోడశ వత్సరే॥

11 శ్లో॥ తృతీయే మా స్యుత్సవేన పుంసావ నవలోభనే।
చక్రే ద్విజో ఽవదద్జ్ఞానం సా సుదోహద లక్షణా॥

12 శ్లో॥ తతో ద్విజవర శ్చక్రే సీమంతో న్నయనం దదౌ।
వాయనాని సువాసిన్యః చక్రుర్నీరాంజనా విధిమ్॥

13 శ్లో॥ నవమాసే ష్వతీతేషు శుభే కాలే శుభేదినే।
అంబాఽ సూత సుతం దృష్ట్వా పితాఽ భూ ద్ధర్షనిర్భరః॥

14 శ్లో॥ స్వా వతార జ్ఞాపనాయ జాతమాత్రోఽ పి చోం కృతిం।
బాల ఉచ్చారయామాస తదా లోకా విసిస్మిరే॥

15 శ్లో॥ జాతక ర్మాకరో ద్విత్తం ద్విజేభ్యో దాన్ముదాఽప్లుతః।
లగ్నం జ్యౌతిషికాః సమ్యక్ సద్భావాద్వీక్ష్య తే ఽబ్రువన్॥

16 శ్లో॥ జన్మోదయో ఽస్య బాలస్య విశేషేణో త్తమో ద్విజ।
పుత్రః కారుణి కోఽయం తే గురూణా మపి సద్గురుః॥

17 శ్లో॥ అ స్యానుగ్రహతః కోఽపి విశ్వవంద్యో భవే దిహ।
అస్య వాక్యం శ్రుతిసమం చింతామణి సమం పదమ్॥

18 శ్లో॥ సిద్ధ్యంతి సిద్ధయో ష్యష్టా వస్య ద్వారి నిరంతరం।
ద్విజో త్తమ వసం త్యస్య గేహే ఽపి నిధయో నవ॥

19 శ్లో॥ భవిష్యం త్యస్య న సుతాః గృహిణీం న వరిష్యతి।
పూజ్య శ్శ్రీ భువనే దృష్ట్యా పతితాన్ పావయిష్యతి॥

10 తా॥ ఆ దంపతులు శనిత్రయోదశీ వచ్చిన నాడు ఆనందముతో విశేషముగ శివపూజ చేయుచుండిరి. ఇట్లుండ నా యిల్లాలికి పదునారవ యేట గర్భమయ్యెను.

11 తా॥ ఆమెకు మూడునెలల గర్భసమయమున శాస్త్రీయముగ పుంసవమ సీమంతము అనెడి గర్భదోహద క్రియలను చేయించి జ్ఞానమును వైదికముగా గలుగజేయించెను.

12 తా॥ ఆ మాధవ శర్మ సీమంత పురస్సరముగా సువాసిన్యర్చన ల నీరాజ నాదులతో జరిపి అందరకు - ఫల కంచుకములాది వాయనముల నిప్పించెను.

13 తా॥ ఇట్లు జరుగగా నాసాధ్వికి తొమ్మిదవ మాసము వచ్చుటతో దనే యొక శుభముహూర్తమున సుతుని గనెను -సంతోషమా యాల్మగలఁ జుట్టి వేశెను.

14 తా॥ ఆ పిల్లవాడు- అవతార పురుష డన్న జ్ఞాపనకు అ బాలుడు పురిటి మంచము నుండియే ఓంకార ధ్వనిని చేయ లోకులందరు విస్మితులైరి.

15 తా॥ ఆ బాలునకు జాతకర్మ మొనరించు నపుడు బ్రాహ్మణులకు ధనాది దానము లానందముతో తండ్రి యిచ్చి సంతృప్తు డయ్యెను. జ్యోతి కులు సుముహూర్తమును పరిశీలించిరి.

16 తా॥ సిద్ధాంతు లాజాతకమును జూచి మాధవశర్మ! ఈ నీ పుత్రుడు పరమ దయాస్వాంతుడు గురువులకు గురువగు జగద్గురువగును.

17 తా॥ ఈయన భగవ దనుగ్రహముచే - విశ్వమంతటికిఁ బూజ నీయు డగును - ఈ బాలుని వాక్యము - వేదమువలె శిరోధార్యము. ఈయన పాదము - చింతామణితో సమము.

18 తా॥ ఈయన యొద్ద నణిమాద్యష్టసిద్ధు లుండును; నవ నిధులు యీాయన నివసించు చోట సిద్ధముగ నుండును.

19 తా॥ జగదేక కుటుంబికుడగు నవతార మూర్తియగుటచే - జగత్తులోని వారే బిడ్డలు కాని ఔరసపుత్రులుండరు - భార్యను వివాహమాడని బ్రహ్మనియతి వాడగును.

20 శ్లో॥ ఈశ్వర స్యావతారో ఽయ మితి భాతి సునిశ్చితమ్।
సందేహో నాత్ర కర్తవ్య ఇ త్యుక్త్వా తే ఽభవ న్నతాః॥

21 శ్లో॥ పున రప్యూచిరే విప్ర దైన్య మేష హరిష్యతి।
అ స్యానుగ్రహ మాత్రేణ కలికాల భయం నహి॥

22 శ్లో॥ యుష్మాకం వాసనా యా స్యా స్తా స్తాః సిద్ధ్యం త్యయత్నతః।
సమ్య గ్రక్షా ఽస్య కర్తవ్యా నిధి రేష గృహాగతః॥

23 శ్లో॥ ఇతి జాతక వేత్తారః ప్రాహుః సమ్యక్ నిరీక్ష్య చ।
జననీ జనకౌ హృష్టౌ దదతు ర్వస్త్ర భూషణమ్॥

24 శ్లో॥ హృష్టా ద్విజవరా జగ్ము రాశీర్భి రభినంద్య తం।
పితరౌ చక్రతూ రక్షాం ప్రేమ్ణా దృష్టిభియా శిశోః॥

25 శ్లో॥ శిశు రుచ్చారయామాస ప్రణవం జాతమాత్రతః।
ఇతి వార్తా ప్రవృత్తా భూ న్నగరే తత్ర సర్వతః॥

26 శ్లో॥ ఇష్టా నాగరికా మిత్రజనా శ్చిత్రం నిరీక్షితుం।
ప్రాప్తా దృగ్దోష భీత్యాం బా తేభ్యో నా దర్శయ చ్ఛిశుమ్॥

27 శ్లో॥ దృ గ్భీత్యా చక్రతూ రక్షాం పితరౌ మోహితాం తరౌ।
మంత్రితాసి తత స్సూత్రబంధనేన చ భస్మనా॥

28 శ్లో॥ పరమాత్మావతారో ఽయం కుతో దృగ్దోషభీరిహ।
అథాఽపి లోకదృష్ట్యేమం రక్షయామాసతు ర్గురుం॥

29 శ్లో॥ ద్వాదశాహో ఽథ సంప్రాప్తే నామ కర్మ యథావిధి
చకార మాధవో విప్రః స్వస్తివాచన పూర్వకమ్॥

20 తా॥ బాగుగ జూచిన ఈశ్వరావతారమూర్తిగ తోచుచున్నాడు - ఇది నిశ్చయము - ఈ విషయమున నెవరిజాతకమును జూచిన సత్య మనియు వారు చెప్పిరి - నమస్కరించు చుండిరి.

21 తా॥ ఆ జ్యోతిష్కులు అయ్యా! ఈ బాలుడు జన్మించిన చోట దైన్యము నకు దరిద్రమునకు తావులేదు - ఈయన అనుగ్రహము వచ్చినచోట కలికాల భయము లేదు-

22 తా॥ అయ్యా! ఇంతమాత్రమే కాదు - మీ మీ వాసనల ననుసరించి మీ యత్నకార్యములు వీరి దర్శన శ్రవణాదులచే సిద్ధించును - కావున నింటికి వచ్చిన పెన్నిధి వలె రక్షించు కొండి.

23 తా॥ ఇట్లుగా జాతక వేత్త లాజాతకమును జూచి ఏక కంఠముగా జెప్పిరి. తల్లిదండ్రు లాపుత్రుని జాతకఫలముల విని - వారికి వస్త్రములిచ్చి తృప్తి పడిరి.

24 తా॥ వారును వానిని - వారి ముగ్వుర నాశీర్వచించి సంతోషమున వెళ్ళిరి- ఆ తల్లిదండ్రు లాబాలకునకు దృష్టి దోషము కొట్టు నని రక్షించు చుండిరి.

25 తా॥ శిశువు పుట్టినది మొదలు ప్రణవ మొక్కటియు చ్చరించుట య కాని నోట యితర వాక్యములు లేవట - అని పట్టణ మెల్ల యీ వార్త బయలు దేరెను-

26 తా॥ అది మొదలు - కొందరు మిత్రులు - ఆప్తులు - నగరంలోని వారా బాలుని చూడ వచ్చుచుండిరి - ఆ తల్లి దృష్టిదోషమగు నని కొంద రకు చూపకుండెను-

27 తా॥ పితరు లజ్ఞాన మోహితులై శిశువు నందరకు చూపకుండిరి - అందు కని - మంత్రౌ షధుల మొల బిగించుట భస్మమును నుదుట నుంచిరి

28 తా॥ పరమాత్మావతారమున దృగ్దోషమే ముండును? అట్లయ్యు లౌకిక దృష్టితో భయపడుచు ఈ విధమైన రక్షణ కార్యము లొనర్చు చుండిరి.

29 తా॥ 12 వ రోజున బాలునకు యధావిధిగా నామకరణమును చేసిరి. ఆ మాధవుడను తండ్రి స్వస్తి పుణ్యాహవాచనాది శుభకార్యముల చేయించెను.

30 శ్లో॥ భూయా న్నరో హరి రితి నరతాపాఘ దైన్యకృత్।
అయ మిత్యాఖ్యయా చక్రే బాలం నరహరిం ద్విజం॥

31 శ్లో॥ మమత్వే నైవ మహతా మాతా ప్రీత్యా రరక్ష తం।
స్వల్ప స్తన్యా ప్రసూ ర్మేనే బాలకం తం బుభుక్షితం॥

32 శ్లో॥ అంబోవాచ పతిం నాథ! నాలం బాలాయ మే పయ।
అన్వేష్టవ్యా ధునా శీఘ్రం ఉపమాతా పయస్వినీ॥

33 శ్లో॥ అథవా ఽజాయతో నాస్యత్ క్షుత్శాంతి ర్మమ దుర్గతః।
ఇతి శ్రుత్వైవ పస్పర్శే బాలో హస్తేన తత్కుచం॥

34 శ్లో॥ కరస్పర్శన స్తస్యాః ఆర్ద్రీకృత్య చ కంచుకమ్।
స్తన్యం ద్వాత్రింశ ద్ధారాభిః క్షరతిస్మ సు ధోపమం॥

35 శ్లో॥ గలితం భువ్యపి ప్రేక్ష్య ప్రాదు శ్చక్రే న దృగ్ప్రియా।
ననామ విస్మితా మాతా లాలయామాస తం ముదా॥

36 శ్లో॥ బాలం నిధాయ పర్యంకే జగౌ హర్షేణ సా సతు।
తిష్ఠతిస్మ న పర్యంకే భువి క్రీడతి సర్వదా॥

37 శ్లో॥ ఏవం స న్న ప్యేక వర్ణం బభాషే నోంకృతిం వినా
భిన్నాంతరౌ తేన మాతాపితరౌ తస్య నిశ్చయః॥

38 శ్లో॥ వాచయామాస తం మాతా స శ్రుత్వా ప్రణవం జగౌ।
దైవయోగేన మూకః కిం జాత ఇ త్యన్వచింతయత్॥

39 శ్లో॥ పప్రచ్ఛతు ర్జ్యోతిషికం గురు మూకత్వ కారణమ్।
మౌనత్వ పరిహారాయ సూపాయాం శ్చ విశేషతః॥

30 తా॥ నరుడు ఆ హరి రూపమును ధరించి నందున నరుల పాపముల హరించు వాడై నందున ఆ బాలునికి నరహరి యని పేరుబెట్టిరి.

31 తా॥ మమతతో తల్లియు ప్రేమతో తండ్రియు శిశు సంరక్షకులైరి. ఆ పిల్లవానికి ఆకలికి పాలుచాలని స్వల్ప స్తన్య నైతి ననుకొనినది.

32 తా॥ అప్పుడా అంబ భర్తతో నాధ! పిల్లవానికి నావద్ద పాలు తక్కువ యైనవి పిల్లవానికి సరిపోవు పాలిచ్చు గోవును తెండి అనెను.

33 తా॥ అట్లుకాకున్న యీ నా పాల వలన పిల్లవానికాకలి చల్లారదు అని భర్తతో నంబ యనుచుండగ శిశువు పాలకై రొమ్ము తడివెను.

34 తా॥ ఆ శిశువంటీ అంటడం తోనె ఆమె క్షీరములుబికి రవిక తడిసెను. అమృత సమ్మిత ధారలు 32 గుటకలకు సరిపోకారిపోయెను.

35 తా॥ అట్లు పాలు కారి నేలను తడిపిన సన్నివేశము నల్గురు చూచి దృష్టి దోషము గలిగింతురని కప్పిపుచ్చెను, లోలోన బిడ్డని దేవునిగ నమస్కరించి యోదార్చెను.

36 తా॥ ఆ పిల్లవాని నంతట పొత్తిళ్ల పరుండబెట్టి సంతోషపడుచుండెను. శిశువుమాత్రము పక్కమీదగాక నేలపైననే ఎప్పుడాడు చుండెడివాడు.

37 తా॥ అవి యేవి జరిగినా ఎంత వయసు వచ్చినా ఓంకారమను నొక వర్ణమును మాత్రమే యుచ్చరించు చుండెను. తలిదండ్రులకది వ్యధ యయ్యెను.

38 తా॥ ఎన్నివిధముల తల్లి అయనను మాట్లాడ నేర్పినను ఓంకారమును తప్ప వేఱుమాటలాడడు! ఏమిరా దైవమా, ఇతడు మూగ యగునని దుఃఖపడెను.

39. తా॥ జ్యోతిష్కులా పిల్లవాని మూగ తనమును అడిగిరి. ఆ మూగ తనము పోవుటకు మంచి యుపాయమును విశ్లేషించి చూచిరి.

40 శ్లో॥ ఆహు ర్జ్యౌతిషికాః కార్యం కుల దేవర్చనం పరమ్।
సౌర్యే హ్యశ్వన్నశ్వత్థ పత్రాన్న భోజనార్పణ మప్యుత॥

41 శ్లో॥ కేచి దాహు ర్మూక మేనం వాచయాథ స వక్ష్యతి।
కేచి త్సంబోధ్య రేబాల! వదస్వే తి త మబ్రువన్॥

42 శ్లో॥ సర్వం శ్రుత్వా ప్రహస్యా థ ప్రాహ ప్రణవ మేవ సః
ఉక్త మోంకార మాకర్ణ్య విస్మితాః సకలా జనాః॥

43 శ్లో॥ కేచి దూచు రిదం చిత్రం బధిరోఽయం ను బాలకః।
శ్రుత్వా జ్ఞాత్వా ఽపి నో వక్తి హేతుం జానీమహే ప్రభో!।

44 శ్లో॥ నోవాచ యేన కేనాపి ప్రకారేణ స బాలకః।
సప్తాబ్ద ఇతి చింతార్తౌ పితరౌ దైవ మూచతుః॥

45 శ్లో॥ వ్రతయోగ్యోఽపి మూకో ఽయం కుమారః సప్త వార్షికః।
కథం వ్రతవిధిః కార్యో బ్రహ్మ న్మూకస్య సంప్రతి॥

46 శ్లో॥ బ్రాహ్మణః ప్రాహ సంస్కార్య ఎష బ్రహ్మ కులో ద్భవః।
సంప్రాప్తే హ్యష్టమే వర్షే విప్రం తూపనయే దితి॥

47 శ్లో॥ ఏవముక్త్వా తు పితరౌ చింతయామాసతుః కథమ్।
మూకో ఽయ ముపదేశ్యోఽద్య దైవయోగః కథం ను వామ్

48 శ్లో॥ ఆరాధితో మహాదేవ స్త్రయో దశ్యాం విశేషతః।
గౌరీశ్వరః ప్రదో షేఽపి వ్యర్థం కిం ను శివవ్రతమ్॥

49 శ్లో॥ ఈశ్వరేణ వరో దత్తః జాతః స ల్లక్షణః సుతః।
న వక్తి మతః కార్యం ఇతి చింతా న్వితే తు తే॥

40. తా॥ అంబా! ఆయనకు మౌనము వదలవలెనంటే కులదేవీపూజ ముఖ్యము. పగలు మాత్రము రావి పత్రములో భోజనం చేయుట విశేష ఫలప్రదము.

41 తా॥ కొంద రాతనిని మూగవాడనిరి. కొందరు మాటలు నేర్పండి మాట్లాడుతాడనుచుండిరి. ఓరీ! అబ్బాయీ! మాట్లాడుమని వానిని పలుకరించుచుండిరి.

42 తా॥ వా రందరిమాటలు వినుచు నవ్వుచు ఓంకారమును మాత్రమే పల్కెడివాడు. ఆ ఒక్క వర్ణమును విని అందరాశ్చర్యపడెడివారు.

43 తా॥ కొందరా పిల్లవానిని చెవిటి యని యనిరి ఎవరేవిధముగ మాటలాడినను అంతయు వినియు తెలిసియు మాట్లాడడు. కారణమేమీ తెలియదు.

44 తా॥ ఎవరెన్ని విధముల మాట్లాడ జేసినను మాట్లాడడు. 7 సంవత్సరములు వచ్చినవే ఇదియేమి కర్మమో యని దైవమునకు మొర పెట్టుకొనిరి.

45 తా॥ వడు గీడు వచ్చినా మూగయయ్యెనని తలిదండ్రులు వగచుచు ఇట్టి మూగవానికి వడుగెట్లు చేయుట ఓ దేవుడా? అని చింతించిరి.

46 తా॥ అప్పు డాపురోహితుడు మాధవునితో అయ్యా! బ్రాహ్మణునకు గర్భాష్టమవత్సరములో నుపనయనము చేయకుండుట తప్పు, చేయండనెను.

47 తా॥ ఆ తలిదండ్రు లదెట్లనుకొంచు చింతించుచుండిరి. మూగవాని కుపదేశ మెట్లు చేయవలెను? భగవదిచ్ఛ యెట్లున్నదో యనుకొనుచుండిరి.

48 తా॥ త్రయోదశీ శనివారమున విశేషముగ శివు నారాధించిరి. ఈ వ్రతము నెంతగ నారాధించిన ఆ ఫలము వ్యర్థము గాదను కొనిరి.

49 తా॥ ఈశ్వర వరప్రసాదుడు జాతక, లక్షణములు, బాగున్నవి మాటలాడ దేమి? అని వారిద్దరు లో లోన చింతపడు చుండిరి.

50 శ్లో॥ పితరా వూచతు ర్బాల ఏక ఏవా వయో రయం।
స్వ ప్నేప్యన్యో నదృష్టో ఽయం పాలయిష్యతి వా కథమ్॥

51 శ్లో॥ న మనోవాసనా పూర్ణా యతః పుత్రోఽయ మీ దృశః।
శనిప్రదో ఽర్చితేశో వర ఈదృ క్కృతో ఽర్పితః॥

52 శ్లో॥ ఏవం నానాప్రకారేణ విలపంతీం సుదుఃఖితాం
సంజ్ఞయా సాంత్వయామాస సముపాగత్య బాలకః॥

53 శ్లో॥ తథాఽపి దుఃఖితాం దృష్ట్వా లోహంధృత్వా గృహం గతః
స్పర్శమాత్రేణ కనకం కృత్వా మాత్రే న్యవేదయత్॥

54 శ్లో॥ పుత్రేణ దత్తం కనక మాదా యాంబా శుచిస్మితా।
విస్మితా పతి మాహూయ దర్శయామాస ధీమతే॥

55 శ్లో॥ అప్రకా శ్యైవ త న్నీత్వా గృహ మన్యచ్చ తత్కరే।
తే లోహం దదతు స్తచ్చ హేమో ఽభూ త్స్పర్శ మాత్రతః॥

56 శ్లో॥ బాలో ఽపశ్య ద్గృ హగతం లోహం తత్సర్వ మేవ హి।
స్వర్ణం జాతం సమృద్ధిం తాం వీక్ష్యవిశ్వాస మాపతుః॥

57 శ్లో॥ తతః పుత్రం సమాలింగ్య పితరౌ ప్రాహతు స్సుతం।
అసి నే త్వం కారుణిక స్తారకః కులదీపకః॥

58 శ్లో॥ త్వత్తో లబ్ధం సర్వసుఖం కింతు తే మౌన కారణమ్।
అజ్ఞాత్వా మాయయాఽ విష్టౌ వదామ స్త్వా మభాషణం॥

59 శ్లో॥ నంద! నా పూర యా! స్మాకం వాసనా అమృతోపమమ్।
వచనం శ్రావయే చ్ఛాఽస్తి భాషణ శ్రవణస్య తే।

50 తా॥ పిల్లవానిని తలిదండ్రులు పిలిచి నాయనా! మాకు నీవొక్కడవే పుత్రుడవు. స్వప్నములో గూడ మే మితరుల నేడమే ఇట్టైన మమ్మెవరు పాలింతురు?

51 తా॥ మా మనసులోని వాసన సంపూర్ణము కాకపోయెనే. పుత్రుడవు, నీ విలాంటి వాడ వైతివే? శనివార ప్రదోష పూజాఫల మిది యేమి?

52 తా॥ ఇట్లనేక విధములుగా నేడ్చుచున్న మాతృ సమీపమునకు బాలుడు వచ్చి సంజ్ఞతో నామె నోదార్చెను.

53 తా॥ అట్లయ్యును ఆమె యేడ్చుచుండగా చూచి యింటిలో నున్న లోహ పాత్రను తాకి బంగారు పాత్రనుగా జూపెను.

54 తా॥ పిల్లవాడట్లు చేసి చూపినదానికి చిరునవ్వు నవ్వి ఆశ్చర్యముతో భర్తను బిలిచి ఆయన కీసంగతి నంతటిని తెలిపెను.

55 తా॥ దాని సంగతిని తెలియకుండ ఇతర గృహము నుండి తెచ్చి యింకొక లోహపాత్ర ను దెచ్చి ఆ బాలుని చేతిలో పెట్టుటతోడనే దానిని తాకిన మాత్రమున బంగరు పాత్ర యయ్యెను.

56 తా॥ మరియు నా బాలుడింటిలో నున్న లోహ వస్తువులన్నిటిని చూచుట తోడనే అంతయు బంగారు మయమగుట చే - ఆ స్వర్ణమయ సమృద్ధిని జూచి అందరు విశ్వాసము నొందిరి.

57 తా॥ అపు డాతలిదండ్రులు కౌగలించుకొనగా వారలు ఇట్లనిరి! నాయనా! నీవు మాకు వారసుడవు - కులోద్ధారకు డ వైతివి-

58 తా॥ తండ్రీ! నీ వలన మాకు సర్వ సుఖములు లభించుచున్నవి. ఈ మౌనమునకు కారణమేమి? మాయతో గూడిన మేము దానిని తెలియక నీవు మాటలురాని వాని వను కుంటిమి.

59 తా॥ కుమారా! మే మాశించిన మా పూర్వ సమస్యను దీర్చుము - నీవు మాట్లాడిన వినవలయు ననుకోరిక గలదు. దానిని తీర్చి మాట్లాడుము.

90 తా॥ ఇట్లు గా నచటి ఋషి తుల్య తాపస యతు లందరును-వారి దగ్గరకు చేరి, అయ్యా! నమస్కారము - మా దొక ప్రార్థన యున్నది వినండని వేడుకొనిరి.

91 తా॥ స్వామీ! తాము లోకానుగ్రహా ర్థము సన్న్యాసమును స్వీకరించండి మమ్ములను ఉద్ధరించండి మా పూజల స్వీకరించండి.

92 తా॥ ఓయీ లోకులు సంన్యాసమును కలియుగ మున నిందింతురు - భూలోకమున తత్స్థాపకు డెవడులే కుండెను దానిని నిరూపించున దిది.

93 తా॥ అగ్నిహోత్రము (అశ్వమేధాదికము) గోమేధము - సంన్యాసము మాంస భోజనము - బావగారివల్ల సంతతిని గనుట - అను నివి కలియుగ నిషేధము.

94 తా॥ ఇట్టి దొకచోట నున్న మాటను బట్టి కలియుగంలో సన్న్యాసము నిషిద్ధ మైనది కావున లోక ప్రచారమున సన్న్యాసమిప్పుడు లేదు.

95 తా॥ పూర్వ మొకప్పుడు నిషిద్ధమైనది అదియు దుర్బల ప్రమాణమే ఈ లోకము న వర్ణ విభాగము ండుట వేదశాస్త్రము లుండుటచే అట్లు దానిని నిషేధించిరి.

96 తా॥ తరువాత A.D.8 వ శతాబ్దమున శంకరాచార్యుల వారు తన తప శ్శక్తితో అగ్నిహోత్రం సన్న్యాసం వఱకు కలియుగం లో నాచరించ వచ్చు ననెను.

97 తా॥ అది మొదలు ఈ విశ్వమున సన్న్యాసాశ్రమము ప్రవర్తిత మైనది. ఈ లోకమున శాస్త్రాదరము లేని దగుట కొంద రే నిందించు చున్నారు

98 తా॥ కావున ఓ గురుస్వామీ! ఈ సన్న్యాసాశ్రమము నకు ద్వారము నేర్ప రచి లోకోపకారమున విశ్వతారకుడవు కమ్ము.

99 తా॥ ఇట్లుగా యతులచే కాశీ విశ్వేశ్వర సన్నిధిని అంగీకరింపఁబడి ఆ గురునాథులు శ్రీ కృష్ణ సరస్వతీ రూప వృద్ధుని వలన సన్న్యాసము దీనికొనెను.

100 శ్లో॥ ఇతి సిద్ధవచః శ్రుత్వా ప్రాహ తం నామధారకః।
సందేహో మమ చిత్తేఽ భూ మ్మునిరాజ! కృపానిధే!॥

101 శ్లో॥ జగద్గురుః శ్రీగురు ర్యః త స్యాప్య న్యో ఽభవ ద్గురుః।
త్రయీమూ ర్త్యవతారస్య గురుణా కిం ప్రయోజనం॥

102 శ్లో॥ ఉవాచ సిద్ధః పూర్వం శ్రీ రఘునాథేన స ద్గురుః।
యథా కృతో వశిష్ఠాఖ్య స్స్వయం భగవతా ఽపి హి॥

103 శ్లో॥ తథా ష్టమా వతారేణ శ్రీకృష్ణేనా పి సద్గురుః।
సాందీపని ర్ముని ర్యద్వత్ కృతో మర్త్యాను సారిణా॥

104 శ్లో॥ తథా సద్గురుణా ప్యేష కృతః కృష్ణ సరస్వతీ।
జ్ఞానవద్ధో వయోవృద్ధో యతీశో ఽతో ఽన్య సమ్మత.॥

105 శ్లో॥ శిష్యః ప్రాహ పున స్సిద్ధం స్వామి న్నే య ద్భవతో దితమ్।
గురుత్వేన వృతః ప్రీత్యా వృద్ధ కృష్ణ సరస్వతీ॥

106 శ్లో॥ యతీశ్వరే భ్య స్సర్వేభ్యో బహుమానో ర్చితః కథమ్।
ప్రేమ్ణా కృష్ణ సరస్వత్యై మూల పీఠం గురోః కథమ్॥

107 శ్లో॥ త త్సర్వం శ్రోతు మిచ్ఛామి సంతోషః శ్రవణా న్మమ।
మమో పరి కృపాం కృత్వా స్వామి న్నే కథయ విస్తరాత్॥

108 శ్లో॥ ఇతి శిష్య వచః శ్రుత్వా హృష్టః శిష్యః స విస్తరమ్।
మూలపీఠం సమారభ్య గురు సంతతి మబ్రవీత్॥

109 శ్లో॥ శ్రీశంకరో మూలపీఠం గురూణాం విష్ణు రస్యచ।
విష్ణోః శిష్యో ఽభవ ద్బ్రహ్మ నామధారక సంశ్రుణు॥

100 తా॥ ఇట్లుగా గురుచరిత్రను సిద్ధుడు నామ ధారకునకు చెప్పగా ఆ నామ ధారకుడు-స్వామీ! నాకు సందేహ మొకటియున్న దనెను.

101 తా॥ జగద్గురువగు శ్రీ గురువు గాశికి ప్పు డింకొక గురు వేర్పడెను. త్రిమూర్త్యవతారుడైన వానికి తరగురువ వసరం లేదు - లోకరీత్యా అట్లయ్యె.

102 తా॥ దానికి సిద్ధుడిట్లుగా నామధారకునకు చెప్పెను- నామధారక! త్రేతా యుగమం దవతారుడైన శ్రీరామునకు వశిష్ఠుడు గురువు కాలేదా?

103 తా॥ అట్లే శ్రీకృష్ణావతారమున మర్త్యావతార మగుటచే సాందీపనిని గురువుగా జేసికొనెను.

104 తా॥ అందుచే యోగ్యులగు శ్రీకృష్ణ సరస్వతి శ్రీ గురుమూర్తికి గురువు లయిరి- ఎందుకనగా, వారు జ్ఞానంలో వయసులో యతులలో గొప్పవారు.

105 తా॥ ఇట్లనుచున్న సిద్ధుని నామధారకు డిట్లడిగెను: మీరు చెప్పుటలో వృద్ధులైన కృష్ణ సరస్వతిగారు శ్రీ వారికి గురువయ్యె నంటిరే.

106 తా॥ ఆ కృష్ణ సరస్వతి గారిని గురువుగారు పూజ చేసి ఆశ్రమస్వీకారము చేసిరంటిరే! అది మన గురువులవారి మూల పీఠ మెట్లయ్యెను?

107 తా॥ దాని నంతయు తెలిసికొన కోరిక యున్నది- తాము వినిపించిన వినుటకు సిద్ధడను. నాయందు దయయుంచి ఆ సంగతిని విపులముగా చెప్పండి.

108 తా॥ సిద్ధుడిట్లా నామధారక వాక్యమును విని సంతోషముతో వానికిట్లనెను: మూలపీఠము మొదలుకొని గురుపరంపరను చెప్పెను.

109 తా॥ ఆది శంకరులు దీనికి మూలపీఠం. దానికి మూలము మొదట విష్ణువు. విష్ణువునకు బ్రహ్మ శిష్యుడయ్యెను. ఇక చెప్పెద వినుమో నామధారక,

110 శ్లో॥ వశిష్ఠో బ్రహ్మణః శిష్యః తస్య శక్తి స్తతో ఽన్యచ
పరాశర స్తస్య శిష్యః వ్యాసో నారాయణ స్స్వయమ్॥

111 శ్లో॥ వ్యాసనో ఽభూచ్ఛుకః శిష్యః గౌడపాదో ఽస్య తస్యచ।
గోవిందా చార్య క స్తస్య శంకరాచార్య ఈట్ స్వయం॥

112 శ్లో॥ విశ్వరూప శ్శంకరస్య బోధ జ్ఞాన గిరి స్తతః।
తస్య సింహగిరి శ్శిష్యః తస్య చేశ్వర తీర్థకమ్॥

113 శ్లో॥ తస్య చేశ్వరతీర్థస్య శిష్యో భూన్నామధారక।
నృసింహతీర్థ సంజ్ఞో ధ శృణ్వతాం గురు సంతతిమ్॥

114 శ్లో॥ విద్యారణ్య మితి ఖ్యాతః సర్వ విద్యా విశారదః।
నృసింహ తీర్థస్య శిష్యో విద్యాతీర్థం తతః పరమ్॥

115 శ్లో॥ త స్యాభూ న్మలయానందో దేవతీర్థ మథా స్యచ।
సరస్వతీ యాదవేంద్ర మునిః శిష్యః తతః పరమ్॥

116 శ్లో॥ యాదవేంద్ర మునే శ్శిష్యః ఏష కృష్ణసరస్వతీ।
పురాతనో ఽభూ త్సన్న్యాసే విశేషేణా స్యసమ్మతః॥

117 శ్లో॥ ఏవంగురుః ససన్న్యాసమార్గ సంస్థాపనాయహి।
తుర్యాశ్రమం గతో నామ్నా యోనృసింహ సరస్వతీ॥

118 శ్లో॥ అథ తత్రైవ వేదార్థం గురునాధ ఉపా దిశత్
అతోఽల్పం వయసాప్యేనం కాశ్యాం సర్వేఽప్యపూజయన్॥

119 శ్లో॥ సమ స్తేభ్యో హి తేభ్యో సౌ విద్వ ద్భ్యోఽపి విశేషతః
వారాణస్యా మభూ త్ఖ్యాతః శ్రీగురు ర్యతి సేవితః॥

110 తా॥ ఆ బ్రహ్మకు వశిష్ఠుడు శిష్యుడు ఆయనకు శక్తి పరాశరుడు. ఆ పరా శరునకు వ్యాసుడు. ఆ వ్యాసుడు నారాయణ రూపుడే.

111 తా॥ ఆ వ్యాసునకు శిష్యుడు శుకుడు. ఆయనకు గౌడపాదులు, వారికి గోవింద భగవత్పాదులు, ఆయనకు శంకరులు, ఆయనకు—

112 తా॥ విశ్వరూపుడు మండనమిశ్రుడు, ఆయనకు జ్ఞానగిరి, ఆయనకు సింహ గిరి, ఆయన శిష్యుడు ఈశ్వరతీర్థులు.

113 తా॥ ఆ ఈశ్వరతీర్థ శిష్యులు నృసింహతీర్థులు - ఇది వంశపరంపర గురుమూర్తుల దో నామధారక!

114 తా॥ అటుపై లోక విశ్రుతులైన విద్యారణ్యులవారు - ఆ నృసింహతీర్థుల శిష్యులు విద్యాతీర్థులు - తరువాతి వారు -

115 తా॥ వారి శిష్యులు మలయానందులు - (దేవతీర్థులు) వారి శిష్యులు . యాదవేంద్ర సరస్వతి గారు. ఆయన గొప్పముని - వారి తరువాత.

116 తా॥ ఇప్పుడు ప్రకృతము చెప్పుకొనుచున్న శ్రీకృష్ణ సరస్వతివారు ఈయన చాలా పురాతన సన్నాసీ యతులలో విశేష గణసీయుడు.

117 తా॥ ఈ విధముగ శ్రీ గురు పరంపర యుండి - ఆ సన్న్యాస మార్గమును సుస్థిర మొనర్చుటకు - వీరు (మన గురువులు) శ్రీ నృసింహ సరస్వతి.

118 తా॥ అప్పుడు శ్రీ గురువు వారు వేదార్థము నుపదేశించెను - ఈ నృసింహ సరస్వతి అల్పవయస్కుడయ్యు కాశి వారందరకు పూజ్యుడయ్యెను.

119 తా॥ ఆ కాశిలోని విద్యావేత్తలకు యోగులకు సర్వసమ్మతులై విశేష పూజ్యులుగ సేవింపబడిరి.

120 శ్లో॥ బహుశిష్యా నుపాదాయ తతో బదరికా వనమ్।
జగామా నంద తీర్థాని పశ్యం త్స ఉపకారకృత్॥

121 శ్లో॥ సవ్యం కృత్వా మేరుగిరిం సర్వతీర్థాని పర్యటన్।
నవఖండ క్షితి స్థాని స యయౌ నామధారక॥

122 శ్లో॥ పశ్యన్ సమస్తతీర్థాని యతిః శిష్య సమన్వితః।
భూమిం ప్రదక్షిణీ కృత్య గంగా సాగర మభ్యగాత్॥

123 శ్లో॥ కృతాని యాని కర్మాణి లోకోద్ధారక్షమాని హి।
గురుణా లోక గురుణా తాని సర్వాణి వేద కః॥

124 శ్లో॥ అశేష లీలా సంఖ్యానే యా యా ద్విస్తరతాం కథా।
వక్ష్యా మ్యహం తు నిజధీ పరిణామావధి ద్విజ॥

125 శ్లో॥ పర్యటం స్తటయాత్రాం స గంగా సాగర తీర్థతః
బ్రహ్మ క్షేత్రం ప్రయాగాఖ్యం తీర్థరాజం యయౌ గురుః॥

126 శ్లో॥ శ్రుత్వా ఽఽగతం గురు స్తత్ర ద్విజ ఏక స్సమాగతః।
మాధవాఖ్యో ద్విజశ్రేష్ఠో గురు దర్శన లాలసః॥

127 శ్లో॥ తుర్యా శ్రమం గ్రాహయిత్వా స తస్మై అధికారిణే।
బ్రహ్మజ్ఞానం ద్వైతహరం శ్రీమ ద్గురు రుపాదిశత్॥

128 శ్లో॥ నామధారక సంజాతాః శిష్యా హి బహవో గురోః।
తేషు సర్వేషు శిష్యేషు యో మాధవ సరస్వతీ॥

129 శ్లో॥ తస్యోపరి బహు ప్రీతిః సమభూ దన్య సద్గురోః।
సర్వా న్ఛిష్యాను పాదాయ నిర్గత స్స తతో ఽగ్రతః॥

130 శ్లో॥ ఇతి నామధారక నుతో విరత
స్సద్గురౌ కామదు గ్గురు చరిత్ర మతః।
ఉదితం శ్రుణోతి ఇహా ఖిలదం
స లభేద భీష్ట మపి చాత్మ విదమ్॥

గద్య॥ ఇతిశ్రీసిద్ధ.... .... .... ....
.... .... .... జ్ఞానకాండే ద్వాగశోఽధ్యాయః-
ఆదితశ్లోకాః (1460)
ద్వాదశోఽధ్యాయః సమాప్తః

120 తా॥ అక్కడ కొంత కాలముండి బహు శిష్యుల గూడికొని బదరికా వనమునకు బోవుచు నానంద తీర్థాదికమును సేవించెను.

121 తా॥ మేరు పర్వతమునకు సవ్యముగ సర్వ తీర్థముల (బర్యటించుచు - నవఖండ భూమండల తీర్థముల నన్నిటిని సేవించెను.

122 తా॥ ఆ గురు నృసింహ సరస్వతిగారు యతుల గు శిష్యుల గూడుకొని సమస్త తీర్థముల దిరుగుచు భూ ప్రదక్షిణ తో గంగాసాగర సంగమం చేరెను.

123 తా॥ సమస్తమైన లోకోపకార కర్మలను - త దుద్ధార పరత నెరవేర్చి-శ్రీ గురువుగారు సూర్యాలోకము లేని చోటు లదిరిగి పవిత్ర మొనర్చెను.

124 తా॥ అనేక తీర్థ సేవనలను - ఉపకారములను లెక్క లేనన్ని చేసెను - దానిని విస్తరింప వలె నన్న గ్రంథము పెరుగును - నేను నా బుద్ధి కందినంత చెప్పుదు.

125 తా॥ ఇట్లాయన తీర్థయాత్రల పర్యటించి గంగా సాగరమునుండి - బ్రహ్మ తీర్థమును అటుపై ప్రయాగాది తీర్థరాజము నకుఁ బోయెను.

126 తా॥ ఆ క్షేత్రమున కు గురువులు వచ్చినా రని విని యొక బ్రాహ్మణుడు మాధవుడను వాడు గురు దర్శన లాలసుడై అచటికి వచ్చెను.

127 తా॥ ఆ బ్రాహ్మణునకు యత్యా శ్రమమును ఇచ్చి అచ్చటి అధికారికిని బ్రహ్మజ్ఞానము పదేశించి ద్వైత భ్రమను పోగొట్టెను.

128 తా॥ ఓయీ నామధారక! గురువు గారి కచ్చట ను శిష్యు లనేకులు కల్గిరి. ఆ శిష్యులలో - మాధ వుడనెడి శిష్యుడు మిక్కిలి బుద్ధి మంతుడు.

129 తా॥ మన గురువర్యులకు ఆయనపై నధిక ప్రీతి. అచటి శిష్యుల నందర వెంటబెట్టుకొని అచట నుండి ముందు నకు వెళ్ళెను.

130 తా॥ ఈవిధముగ నామధారకునకు భూలోక కామధేనువైన గురుచరిత్రను వినిపించి - విన్నవా రందరకు - అద్వైత జ్ఞానము చే భేదభావము పోయి సమస్త కోరికలు నెరవేరును.

మొదటినుండి శ్లోకములు (1460)
12 వ అధ్యాయం సమాప్తం.

శ్రీ గణేశాయ నమః - శ్రీ దత్తాత్రేయాయ నమః

# శ్రీ గురుదత్త చరితే

## త్రయోదశోఽధ్యాయః - జ్ఞానకాండః

1 శ్లో॥ నామధారక సచ్ఛిష్యో నత్వా సిద్ధ పద ద్వయం
కరద్వయం సమానీయ వినయా వనతో ఽబ్రవేత్॥

2 శ్లో॥ జయసిద్ధ మహాయోగిన్ త్వం భవార్ణవ తారకః
ప్రకాశితా గురు కథా త్వయా తే నాఽభ వత్సుఖమ్॥

3 శ్లో॥ నిషేవ్యా ద్యాపి హి గురోః సచ్చరిత్ర కథా మృతమ్।
తృష్ణా వృద్ధా నైవ శాంతా సమర్ధ శమయా ద్య తామ్॥

4 శ్లో॥ సచ్చరిత్రం కామదేనుః కధితం విస్తరేణ తే।
తేన నో మన్మనః ప్రీతి ర్భవ తీచ్ఛాధి కా యతః॥

5 శ్లో॥ క్షుధయా పీడితాయ ద్వ ద్గాః ప్రాప్య బహులం తృణం।
న హీచ్ఛతి తతో గంతుం తద్వ దద్య మమా ప్యభూత్॥

6 శ్లో॥ స్వప్నేపి దుర్లభం తక్రం యస్య తస్య పయోనిధిః।
ప్రాప్త శ్చే ద్రగతో గంతుం ఉత్సహో త కుత స్తతః॥

7 శ్లో॥ తథా ఽహమపి చాల్పజ్ఞో న జానే గురుకీర్తనం।
అవిద్యా వేష్టితో భ్రష్టః స్వామిన్ కష్టార్థి తో ఽభవమ్॥

8 శ్లో॥ ప్రా ప్యాజ్ఞాన ధ్వాంత రజనీ స్థం హి మాం త్వయా।
స్వామి న్న శ్రీ గురో రూపం దర్శితం జ్యోతి రాత్మనా॥

9 శ్లో॥ త్వయా తూపకృతం సాధు త త్ప్రీతి కార కారకమ్।
నేక్షే కల్పద్రు ద్రసోప్యకారో త్తారో యథా నహి॥

శ్రీ గణపతికి నమస్కారం - శ్రీ దత్తాత్రేయుల వారికి నమస్సులు
13 వ అధ్యాయం

1 తా॥ ఆ శ్రోతయగు నామధారకుడు శిష్యుడై సిద్ధుని పాదముల బట్టుకొని రెండు చేతులు జోడించి - వినయముతో - శ్రీ గురు చరిత్రను చెప్పుమని ప్రార్థించెను.

2 తా॥ ఓ సిద్ధయోగీ! నీకు జయమగును. నీవు సంసారమును తరింపఁజేతువు మీరు గురువుగారి కథను చెప్పుచుంటే చాల సుఖముగనున్నది.

3 తా॥ ఇప్పటికిని మీరు చెప్పెడి గురుకథామృతం తాగుతుంటే నాకు వార్ధక్యము వచ్చినా ఆ తృష్ణ యెక్కువైనది అందుచే, ఆ కథచే నా తృష్ణ దీర్పుము.

4 తా॥ శ్రీగురు చరిత్ర కామధేనువు వంటిది. మీ రాకథను విస్తరించి చెపుతుంటే నా మనస్సునకు ఆనందము అధికమగుచున్నది.

5 తా॥ ఆకలిగొన్న గోవునకు అధికమగు గడ్డి దొరికినట్లు, నాకును ఆ విధముగ శ్రవణ్యపేయముగ నున్నందున ఈ కథను వదల బుద్ధి లేకున్నది.

6 తా॥ త్రాగుటకు స్వప్నమందు నైన చల్ల దొరకని వానికి క్షీరసాగరం లభించిన నెట్లు వదలబుద్ధి పుట్టదో, అట్లే ఈ కథామృతం వదల రాకున్నది

7 తా॥ నేను అల్పుడను. గురు కీర్తనమే తెలియని వాడను. అజ్ఞానముతో గూడి - భ్రష్టుడనై యుంటిని. అందుచే గురుచరిత్ర తెలియని కష్టములో నుంటిని.

8 తా॥ అజ్ఞానమను చీకటిలో నే నుంటిని. స్వామీ! మీ దయతో శ్రీ గురు రూపమను జ్యోతిని వెలిగించి చీకటిని తొలగించితిరి.

9 తా॥ నీవు చాల యుపకారమును చేసితివి. నీవు చూపిన దయ ఎట్టిదనగ, కల్పవృక్షము వంటి దానిని చూపితివి.

10 శ్లో॥ నాలం ప్రత్యుపకారాయ చింతామ ణ్యర్పకస్య భూః
శ్రుతః క్వా ప్యుపకారో నకృపా మూర్తే స్తథా తవ॥

11 శ్లో॥ వంశపరం పరయాపి ప్రత్యుపకారః క్రియేత కిం భవతః।
భవ తప్త తాప శామక సే వేంఘ్రి తే ఽంగ తశ్చ వై భవతః।

12 శ్లో॥ స్వామి న్మే కథితో ధర్మః తేన శర్మా భవ న్మమ।
జాతా మనసి సర్వార్థా గురుభక్తి ర్నిరంతరా॥

13 శ్లో॥ ప్రయాగం గురు రాగత్య మాధవా య దదౌ ముదా।
దీక్షాం తతః కుతః ప్రాప్తా వ దైత ద్విస్తరేణ మే॥

14 శ్లో॥ ఇతి శిష్యవచః శ్రుత్వా సంతుష్టం సిద్ధ ఉత్తమః
నిధాయ మస్తకే హస్తం త మాశ్వా స్యాబ్రవీ న్ముదా॥

15 శ్లో॥ శిష్య సద్గుణ! ధన్యోసి లబ్ధం గురుపదం హి తే।
సంసార సాగర ప్రాప్త తారక స్త్వం భవిష్యసి॥

16 శ్లో॥ గురుభావ స్త్వయా జ్ఞాతః తతో భూయోఽపి పృచ్ఛసి।
సంతుష్టోఽస్మి తవ ప్రశ్నా దానందో ఽతీవ వర్ధతే॥

17 శ్లో॥ శ్రుణుతే కథయిష్యామి విఖ్యాతం చరితం గురోః।
కంచి త్కాలం స్థిత స్తత్ర భగవా న్లోక తారకః॥

18 శ్లో॥ దీక్షాం దత్వా మాధవాయ ప్రఖ్యాత మహిమో గుణీ।
తస్యానేక ఽభవం చ్ఛిష్యా స్తేషాం ముఖ్యస్తు మాధవః॥

19 శ్లో॥ తచ్ఛిష్యనామకథనే గ్రందో ఽయం విస్తృతిం వ్రజేత్।
ప్రఖ్యాత సప్త శిష్యాణా మతో నామా ని వచ్మి తే॥

10 తా॥ కృపాకరుడవగు నీవు - అల్పుడ నగు నాకు చింతామణి నిచ్చితివి ఇట్టి దయ నీకు కలిగిన నీకు నేనేమి ప్రత్యుపకారము చేయగలను?

11 తా॥ ఆ గురువంశ పరంపరను వినిపించిన మీకు నేను మీ ప్రత్యంగసేవ సేతును. దయయుంచి దానిని వినిపింపుము.

12 తా॥ స్వామీ! మీరు చెప్పిన ధర్మములను విన్న నాకు సుఖము గల్గినది. నా మనస్సునందు నిశ్చలమైన నిరంతర గురుభక్తి గలిగినది.

13 తా॥ వెనుక చెప్పినట్లు శ్రీ గురువులు ప్రయాగవఱకు వచ్చి, అచట మాధవుడనెడి శిష్యుని దీక్షాపూతుని చేసి రంటిరి. దానిని విపులముగ చెప్పండి.

14 తా॥ ఇట్లడుగుచున్న శిష్యునకు సంతోష చిత్తముతో సిద్ధుడు నామధారక శిరస్సుపై హస్త ముంచి అతని యార్తి కాశ్వాసము చేసి ఇట్లు చెప్పెను.

15 తా॥ సద్గుణుడ వైన శిష్యా! నీకు గురువు గారి పాదము లభించినది ధన్యుడవైతివి - సంసార సాగరము నుండి నీవిక తరింతువు.

16 తా॥ నీకు ఇప్పుడు గురుభావజ్ఞుడవై తరువాత కథను చెప్పుమన్న భావము గలిగినది - నీ ఆసక్తికి సంతసించితిని - ప్రశ్నకు నా కానంద మైనది -

17 తా॥ విను శ్రద్ధగా ప్రసిద్ధికెక్కిన గురు చరితను చెప్పుదును. భగవత్స్వరూపులగు ఆ గురువులవారు కొంతకాల మా ప్రయాగ యందుండిరి-

18 తా॥ మహాత్ములగు శ్రీగురువు గారు మాధవునకు దీక్ష నిచ్చిన తరువాత ననేకులు వారికి శిష్యులైరి - అందీ దీక్షను పొందిన మాధవుడు ముఖ్యుడు.

19 తా॥ ఆ శిష్యుల చరిత్ర నంతయు ప్రత్యేకముగ (జెప్పవలె నన్న విస్తార మగు, అందు ప్రసిద్ధి (జెందిన యేడుగురు శిష్యుల పేరును( జెప్పుదు-

20 శ్లో॥ ఆద్యో బాలసరస్వత్వ థ కృష్ణసరస్వతీ ఉపేంద్రశ్చ।
మాదవ సరస్వతీ యతి రథో సదానంద నామకో ఽన్యశ్చ॥

21 శ్లో॥ షష్ఠః శిష్యో జాతో జ్ఞానజ్యోతిః సరస్వతీ ఖ్యాతః।
సిద్ధోఽహం సప్తమ ఏకైక స్తూత్త రోత్తరం హ్యధికః॥

22 శ్లో॥ శ్రీగురు స్సమవేత స్తై ర్దక్షిణం దేశ మాగతః।
గత్వా పునానః క్షేత్రాణి కరంజు నగరం యయౌ॥

23 శ్లో॥ జననీ జనకాభ్యాం చ సంగతో వందితో గురుః।
ప్రేమ్ణా స్వ స్రానుజాభ్యాం చ సమస్తై రితరై రపి॥

24 శ్లో॥ దృష్ట్వా నాగరికా హృష్టాః గురుమూర్తిం యతిం తదా।
సమస్తా ఆగతాద్రష్టుంపూజాంచక్రుర్జగద్గురోః॥

25 శ్లో॥ గృహేగృహేపి భిక్షార్థం దదు ర్విప్రానిమంత్రణం।
బహురూపధరో భూత్వా ఽఽదదే భిక్షాం గృహేగృహే॥

26 శ్లో॥ సమస్తా విస్మితా జాతా మేనిరే విష్ణు మేవ తం।
యతివేష ధరో ప్యేష జ్ఞేయః పరమ పూరుషః॥

27 శ్లో॥ వంద తీమం నరం యే తే యాస్యంతినరకం ప్రతి।
కార్యార్ధ మవతీర్ణో ఽయం బ్రహ్మ విష్ణు శివాత్మకః।

28 శ్లో॥ ఇత్యాహు రన్యే పితరౌ పూజయామాస తు ర్గురుమ్।
మాత్రే ప్రా క్స్మరణం దాతుం జాతః శ్రీపాద రూపధృత్॥

29 శ్లో॥ తదా తాం జననీం వీక్ష్య శిరో విన్యస్య తత్పదే।
ప్రాహ ప్రదోష ఫలితః సత్య సంకల్ప చంద్రధృత్॥

20 తా॥ అందు మొదటి వాడు బాల సరస్వతి - తరువాత కృష్ణ సరస్వతి - మూడవవాడు ఉపేంద్రుడు అమాధవ సరస్వతి, అటుపై సదానంద సరస్వతియు -

21 తా॥ అరవయాయన జ్ఞానజ్యోతి సరస్వతీ - 7 వ వాడిని నేను, సిద్ధుడను - ఇందలి వరుసలో ఒకరికన్న తరువాత వారందరు చాల అధికులు

22 తా॥ తదు పరి శ్రీ గురువు లాశిష్యులతో గూడి దక్షిణ దేశమునకు వచ్చిరి. త్రోవ నున్న క్షేత్రములను పవిత్రము చేయుచు కరంజా నగరమును జేరిరి -

23 తా॥ ఆ కరంజాలో నున్న తలిదండ్రుల గలిసి కొని - తమ్ములు - ఇత రులు తన్ను దేవునిగా నమస్కరింప వారందరి ననుగ్రహించెను.

24 తా॥ ఆ నగరవాసు లందరు ఆ స్వామి దర్శన మున నానందమొందుచు మన దేవుడు శ్రీ గురుమూర్తి వచ్చె నని చూచుటకు వచ్చి పాదపూజ లొనరించిరి -

25 తా॥ ఇం టింటను బ్రాహ్మణు లందరును భిక్ష కాహ్వానించిరి - కరుణా మయుడగు నాగురు దేవుడు - బహురూప ధారియై వారి నియంత్ర ణచే భిక్ష నందుకొనెను.

26 తా॥ ఆ గ్రామములోని వారందరు బహురూపములతో వచ్చిన విష్ణువే! మన అదృష్టము చే యతివేషమున శరీరరూపధారియై న సాక్షా ద్దేవు డని తెలిసికొనిరి.

27 తా॥ ఈ గురువుగారిని మానవ మాత్రుడన్న చో నట్టివాడు నరకము నొందును - లోకము నుద్ధరించు మహాకార్యమునకై త్రిమూర్తులు కలిసిన దత్తావ తారమే!

28 తా॥ ఈ విధముగ ననుకొనుచున్న మాటలను విని తలి దండ్రు లాయ నను పూజించుచుండిరి. తల్లికి తాను శ్రీపాదులని ప్రదోష పూజా ఫలముగ జన్మించితి నని తెలుపుటకు వచ్చెను.

29 తా॥ ఆ గురువులవారు తల్లిని చూచుటతో ఆమె పాదములకడ తలవంచి నమస్కరించెను. అమ్మా! ప్రదోష పూజాఫలితమిది, ఈశ్వరుడు సత్య సంకల్పుడు గదా?

30 శ్లో॥ పూర్వజన్మ చరిత్రం సా స్మృత్వా స్వపతి మబ్రవీత్।
ఆరాధితో మయా దేవో విశ్వవంద్య! సుతాప్తయే॥

31 శ్లో॥ శ్రీపాద స్యాస్య మే పూజా విహితా పూర్వ జన్మని।
భవే ఽస్మిన్ సుప్రసన్నో ఽభూ త్సఫలం జన్మ మే కృతం॥

32 శ్లో॥ తతో నత్వా చతు రుభౌ కరుణం శరణం గతౌ।
యతిరాజ జగన్నాథ! సముద్ధర భవార్ణవమ్॥

33 శ్లో॥ శ్రీ గురుః ప్రాహ పితరౌ సంన్యాసీ య త్కులే భవేత్।
ద్విచత్వారింశ త్సంఖ్యాక కులోద్ధర్తా భవిష్యతి॥

34 శ్లో॥ కులే యబ్రహ్మ లోకం స శాశ్వతం ప్ర దదాతి చ।
అచలం శాశ్వతం బ్రహ్మ పదం తత్కుల జన్మనామ్॥

35 శ్లో॥ త త్సంతతే ర్భయం దుఃఖం యమా దపి న జాయతే।
తే యాస్యంతి బ్రహ్మలోకం పూర్వం యే నరకం గతాః॥

36 శ్లో॥ భవతా మథ కిం వాచ్యం సన్యాసీ యత్కులే ఽభవమ్।
యమ శంకాపి వాం నాస్తి సత్యం బ్రహ్మవిదాం హి వాం॥

37 శ్లో॥ ఇత్యుక్త్వా పితరౌ స్వామీ సమాశ్వా స్యాబ్రవీ త్పునః।
అష్టైశ్వర్యై ర్హి నందంతే పుత్రా ఏతే శతాయుషః॥

38 శ్లో॥ ఏషా పుత్రాంశ్చ పౌత్రాంశ్చ దృష్ట్వా శర్మా నుభూయ చ।
కాశీక్షేత్రే నివాసో వా మంతకాలే భవిష్యతి॥

39 శ్లో॥ ఖ్యాతం కాశీపురం మోక్షస్థానం వేదాదిషూ త్తమం।
ఇత ఊర్ధ్వం న కర్తవ్యా కాపి చింతా వినిశ్చితమ్॥

30 తా॥ ఆమెయు పూర్వజన్మస్మరణగల్గి తన భర్తతో నిట్లనెను - నాథా! నేను పూర్వమున భగవంతుని సంతానమునకై రాధించితిని.

31 తా॥ పూర్వజన్మమున శ్రీపాదులవారు నాకు ప్రదోష శివపూజ చేయుమని యాజ్ఞాపించిరి. అది యీ జన్మలో ఫలించినది - ఆయన సుప్రసన్నులైరి.

32 తా॥ తరువాత - ఆ గురువునకు (పుత్రునకు) మాతాపిత లిరువురు నమస్కరించి ఆయన చరణములను శరణమనిరి - ఓ జగన్నాథా! మమ్మి సంసారాబ్ధినుండి ఉద్ధరించుడనిరి.

33 తా॥ ఓయీ! మీ కులములో - 80 సంవత్సరములకు - ఒక సన్యాసి బయలుదేరి మీ వంశమునంతటి నుద్ధరింప గలడనెను.

34 తా॥ ఎవరు బ్రహ్మలోకమును పొందు సంతతి వారు (సన్న్యాసులు) ఉందురో - ఆయనవలన నాకు. వారందరకు శాశ్వత బ్రహ్మపదవి వచ్చును.

35 తా॥ ఆ బ్రహ్మభూతుని వంశము లోని సంతతికి భయ దుఃఖము లిహపరత్ర గల్గవు - నరకములో నున్నవారు గూడ ఆ సంన్యాసివలన బ్రహ్మలోకము నొందుదురు.

36 తా॥ కనుక! ఓ దంపతులారా! మీకింకేమి చెప్పెదను? బ్రహ్మభూతుని వంశమునకు యమభయమే లేదు. ఇది సత్యము - మీ కాభయ ముండదు.

37 తా॥ ఇట్లుగా నా గురువులవారు తలిదండ్రుల నాశ్వాసపరచి - అమ్మా నీ యీ పుత్రులైశ్వర్య వంతులై శతాయుష్యు లగుదురు.

38 తా॥ ఇంక యీ ఆడుపడుచు కూడా పుత్రపౌత్రుల జూచి సుఖమనుభవించి చివర కంతకాలమున కాశీలో వసించును.

39 తా॥ కాశీపట్టణము మోక్షమిచ్చునదని వేదములం గొనియాడ బడినది. కనుక మీరిటుపై నేమాత్రమును చింత వహింపకండి. ఇది నిశ్చయము.

40 శ్లో॥ ఇత్యుక్త వంతం సంప్రాప్తా శ్రీగురుం భక్త వత్సలం।
పూర్వాశ్రమ స్వసా రత్నా నా మికా వినతా ఽభవత్॥

41 శ్లో॥ వినయా వనతా ప్రాహ స్వామిం స్తారయ మా మితః।
భవసింధౌ నిమగ్నా హం అవిద్యా జాలవేష్టితా॥

42 శ్లో॥ త్రితాప బడబా దగ్ధా భీతా కామాది నక్రతః।
అలిప్తాం కురు మాం దేవ తప్తుం యాస్యా మ్యహం తపః॥

43 శ్లో॥ ఇతి తస్యా వచః శ్రుత్వా గురుః ప్రాహ హ స న్నివ।
స్త్రియాః కిం తపసా పత్యుః సేవయా పరమా గతిః॥

44 శ్లో॥ వ్యోమకేశ ఇతో ప్యాసాం భవ సింధోః పరం పదం
దదా త్యభీష్ట కామాంశ్చ పాతివ్రత్యా న్న సంశయః॥

45 శ్లో॥ భవపారో త్తారణాయ స్త్రియా ఏకః పతి స్స్మృతః।
తస్మా న్మనః స్థిరీకృత్య పతిం శివమయం భజ॥

46 శ్లో॥ తతస్తే గతి రుద్ధారో నాన్యదా వేద భాషణాత్।
త్వం నాంతః కరణే దుఃఖం కుర్వనేన గతి ర్భవేత్॥

47 శ్లో॥ ఇతి శ్రుత్వా గురూ క్తిం సా వినయా వనతా ఽబ్రవీత్।
బ్రహ్మజ్ఞానీ త్వ మేవాసి గురుమూర్తే! నమోఽస్తు తే॥

48 శ్లో॥ భూతం భవిష్యం జానాసి ప్రారబ్ధం వద మే కథమ్।
అగ్రతో మే గతిః కావా విస్తరా ద్బ్రూహి మే ఽగ్రతః॥

49 శ్లో॥ శ్రీ గురుః ప్రాహ తాం రత్నే వాసనా తవ తాపసి।
సంచితం చాపి తేపాపం తన్న భోగా ల్లయో భవేత్॥

40 తా॥ ఇట్లనుచుండగనే - పూర్వాశ్రమమున చెల్లెలైన యామె యు భక్త వత్సలు ని శరణని నమస్కరించెను. స్వామియు - నామె కిట్లనిరి:

41 తా॥ స్వామీ, తాము మమ్ము రక్షింప వలెననెను - అజ్ఞానులమై మిమ్ము తెలియని వారమగు చు న్నాము - ఈ సంసారము నుండి మ మ్ముద్ధరించండనెను.

42 తా॥ స్వామీ, తాపత్రయము తగ్గినది. కామాద్యరిషడ్వర్గములకు భయపడు చున్నాను - దేవ నాకు వైరాగ్యము ననుగ్రహింపుము - తపస్సు చేసి కొన పోవుదును అనెను.

43 తా॥ గురువు గారామె మాట విని నవ్వుచు - అమ్మా! ఆడు వారికి తపస్సు ఏమిటి? నీ భర్తృ సేవను చేయుము - అదియే యాడువారి కుత్తమ గతి ని చ్చును.

44 తా॥ అటుపైన ఆ ఈశ్వరుడే - సంసార తారకుడు. పాతివ్రత్య ధర్మ మాడు వారికి ముఖ్య మగుటచే - కోరిన కోరిక లన్నియు దానివలన సిద్ధించును.

45 తా॥ సంసార సాగరము నుండి తరింపఁ జేయునది పాతివ్రత్య మొక్కటియే-కనుక చిత్తము నేకాగ్రము గజేసి పతి సేవఁజేయుము.

46 తా॥ అ దొక్కటియే నిన్ను ద్ధరించునది - వేరేమియు లేదని యెఱుగుము. అమ్మా! నీ చిత్తమున దుఃఖమును మానుము - పతిసేవ యే ముఖ్య మైన గతి.

47 తా॥ ఇట్లన్న గురువాక్యమును విని ఆమె వినయ వినమితయై యిట్లనెను- బ్రహ్మజ్ఞానివి నీవే! నీకివె నా నమస్కారము లనెను.

48 తా॥ స్వామీ! నా భూతభవిష్యత్తుల మీరెరుగుదురు - అదెట్లో చెప్పండి స్వామీ! ముందు నాస్థితి యెట్లుండు విస్తరించిచెప్పండని ప్రార్థిస్తు న్నాను - అనెను.

49 తా॥ అప్పుడు గురు విట్లనెను - అమ్మ రత్న! నీ కీతాపస త్వ కాంక్ష యేమీ! పూర్వజన్మమున పావమును ఎక్కువ గ సంపాదించితివి - దాని ననుభవింపక నశింపదు.

50 శ్లో॥ పూర్వజన్మని భోః శుభ్ర ధేను స్తే లత్తయా హతా।
ఉత్పాదితః సమీపస్థ దంపత్యోః కలహ స్త్వయా॥

51 శ్లో॥ దోషద్వయం తవా స్త్యస్య విపాకో ఽత్రై వ జన్మని।
లత్తాప్రహార దోషా త్తే దేహె కుష్టం భవిష్యతి॥

52 శ్లో॥ దంపత్యో ర్వైరజా త్పాపాత్ పతి స్తే భవితా యతిః
త్వాం త్యక్ష్యతీతి తే పూర్వ దోషజం ఫల మీదృశమ్॥

53 శ్లో॥ ఇత్యుక్త్వా దుఃఖితా జాతా పతితా గురు పాదయోః।
గురునా రోద్ధ రాశు త్వ మితి తచ్చరణే ఽగ్రహీత్॥

54 శ్లో॥ శ్రీ గురుః ప్రాహ తాం బాలే! కంచిత్కాలం సుఖం వస।
యతి ర్భవిష్యతి పతిః వయ స్యపర ఏవ తే॥

55 శ్లో॥ తత స్తవ శరీరే పి కుష్ఠరోగో భవిష్యతి।
భుక్త్వా పాపఫలం పశ్చాత్ సద్గతి స్తే భవిష్యతి॥

56 శ్లో॥ కుష్ఠరోగే సముత్పన్నే దర్శనం మమ తే భవేత్।
త్వత్పాప పరిహారాయ క్షేత్రం తే కథయా మ్యహం॥

57 శ్లో॥ భీమాతటే దక్షిణస్యాం తీర్థం పాప వినాశనం।
కుష్ఠరోగే సముత్పన్నే గచ్ఛత క్షేత్ర ముత్తమమ్॥

58 శ్లో॥ గంధర్వనగరే భీమాఽమరజా సంగమే శుభే!
భూమండలేఽతి విఖ్యాతే తీర్థం పాపవినాశనం॥

59 శ్లో॥ ఇ త్యాభాష్య తతః శిష్యైః స హ శ్రీగురు రాగమత్॥
దక్షిణే త్ర్యంబక క్షేత్రే గౌతమీ యత్ర తూదితా॥

50 తా॥ అమ్మా! నీవు పూర్వ జన్మమున - ఒక తెల్ల యావును కఱ్ఱతో కొట్టి చంపితివి - అది గాక నీ దగ్గరగా నుండు భార్యా భర్తలను దంపతులకు కలహము ను గల్పించితివి.

51 తా॥ కావున నీకు రెండు దోషము లున్నవి. వాని నను భవించ వలసినది ఈ జన్మముననే. కఱ్ఱతో గోహత్యవలన నీదేహమునకు కుష్ఠరోగము గలుగును.

52 తా॥ దంపతులకు వైరమును గల్గించిన దాని వలన నీ భర్త యతి యగును. అందుచే నీ భర్త నిన్ను వదలి వేయును - ఇట ఆ పాపద్వయ ఫలితము.

53 తా॥ ఇట్లుగా చెప్పిన గురు వాక్యమును విని ఆమె దుఃఖ పడుచు గురువు పాదములపై బడెను. స్వామీ, నన్ను దరించండని - కాళ్ళు పట్టుకొనెను.

54 తా॥ అమ్మాయీ! నీవిప్పుడు కొంతకాలము సుఖముందువు - నీకు అపర వయస్సున నే నీ భర్త యతి యగును చూడుము.

55 తా॥ అటు తర్వాత నీకు కుష్టరోగము వచ్చును - ఆ పాపఫలమును కొంతకాల మనుభవించి తరువాత నీకు సద్గతి లభించును.

56 తా॥ నీవు కుష్టరోగమున నున్నపుడు నా దర్శనము నీకగును - నీకు ఆ రోగము నశించుటకు ఒక పుణ్యక్షేత్రమును జెప్పెదను.

57 తా॥ భీమానది యొకటి యున్నది 'దానికి దక్షిణముగ పాపవినాశ మొకటి యున్నది - నీకు కుష్ఠరోగము వచ్చిన వెంటనే అచ్చటకు పొమ్ము.

58 తా॥ అచట భీమా అమరజానదుల రెంటి సంగమము - అది ప్రఖ్యాత మైనది. అచట గానుగా పుర మున్నది - దాని దగ్గర పాపవినాశనము.

59 తా॥ ఇట్లుగా బలికి తరువాత శిష్యులతో గూడి శ్రీ గురువులవారు గోదావరీ నదీ జన్మస్థానమైన నాసికా త్ర్యంబక క్షేత్రమునకు వచ్చిరి.

60 శ్లో॥ గురుమూర్తి తత శ్శిష్యైః నాసికం క్షేత్రం మాయయౌ।
యత్రామితాని తీర్థాని పురాణే మహి మాప్య నన్॥

61 శ్లో॥ మహిమ్నో వర్ణనే త్వత్ర కథా విస్తర తా మియాత్।
తస్మాత్ సంక్షేపతో వక్ష్యే శ్రుణు త్వం నామధారక॥

62 శ్లో గోదావర్యా స్తు మాహాత్మ్యం మపారం లోక దుర్లభమ్।
తీర్థాని వృద్ధ గంగాయా అమితాని తటద్వయే।

63 శ్లో॥ సర్వేశ్వర జటాయాం యా స్థితా సో త్తారితా భువి।
బ్రహ్మాండ వ్యతిరిక్తే యం పాప్తౌ పాయై ర్మహర్షిభిః।

64 శ్లో॥ బ్రహర్షి ర్గౌతమః ఖ్యాతః తపస్వీ సో న్వహం పురా।
ఊప్త్వా వ్రీహి ననుష్టాతుం తత స్మోపనిషిదతి।

65 శ్లో॥ ఋషయో మునయః పూర్వం శాలీ నుప్త్వైవ చాన్వహం
ఫలం గృహ్ణంతి తే మంత్ర మాహాత్మ్యా త్ప్రిత్యహం ముదా।

66 శ్లో॥ కదాచి ద్ద్విషయ స్తత్ర మిలిత్వా మంత్రయ న్నితి।
తతో భూమండలేఽస్మాకం గంగా స్నానం భవిష్యతి॥

67 శ్లో॥ యో దుఃఖసంకటే యోజ్యః స గంగా మానయిష్యతి।
తతో భూమండలేఽ స్మాకం గంగాస్నానం భవిష్యతి॥

68 శ్లో॥ యా గతి ర్యోగ యుక్తానాం మునీనా మూర్ధ్వరేతసాం।
సా గతి స్సర్వ జంతూనాం గౌతమీ తీరవాసినాం॥

69 శ్లో॥ ఊర్ధ్వ రేతో మునీనాం యత్ కోటివర్షం తపస్యతాం।
యా గతి ర్నిశ్చితా సైవ గౌతమీ స్నాన మాత్రతః॥

60 తా॥ మొదట త్ర్యంబకం తరువాత నాసికను చేరిరి. ఆ చోటున ననేకములైన పాపనాశక పుణ్యక్షేత్రము లున్నవి.

61 తా॥ ఆ పుణ్యతీర్థముల మహిమను ప్రత్యేకించి చెప్పిన గ్రంథము విస్తారమగును-అందుచే నామధారక! సంక్షేపించి చెప్పుదును శ్రద్ధగా విను.

62 తా॥ ఆ గౌతమీ మాహాత్మ్య మనంతము దుర్లభము - వృద్ధ గంగా తీరము యొక్క స్థలము లిరు వైపుల నున్నవి - అతి పుణ్య ప్రదములు.

63 తా॥ శివుని జటాజూటము నుండి తీసికొని రాబడినది. ఋషులు ఉపాయములు చేసి బ్రహ్మాండ యత్నముచే తీసికొని వచ్చిరి.

64 తా॥ బ్రహ్మర్షి యైన గౌతము డను మహర్షి యుండెగదా? ఆయన మహా తపస్వి - ఆయనగారు వడ్లను చల్లి ఆ ప్రదేశముపై అనుష్ఠానము చేయును.

65 తా॥ పూర్వము ఋషు లందరు వరిపంటకు తయారుగ వడ్లను చల్లి-అవి పంటకు వచ్చు దాకా అనుష్ఠానము చేతురు. అట్లు ప్రతిరోజూ పంట పండించి తిందురు.

66 తా॥ ఒకనాడు ఋషు లందరు కలిసి- ఆలోచించి మనకు గంగా స్నానము లభించుట లేదు- మనకు భూమండలంలో గంగాస్నాన మెట్లు లభించును.

67 తా॥ దుఃఖము నందు సంకటములు వచ్చినను ఓర్పుతో నుండు వాడు దానికి సమర్థుడు- అందుకని తగిన వానిని జూచిన గంగాస్నానము మనకు లభించును.

68 తా॥ ఇది మనకే (యీ గంగ) అవసరముగాదు-పశుపక్ష్యాది జంతు జాలమునకంతటికి మహర్షులకు అందర కవసరమే -గౌతమీ తీర వాస కాంక్ష.

69 తా॥ కోటి సంవత్సరములు తపస్సు చేసిన వచ్చే ఫలము గౌతమీ తీరవాసి జనమునకు లభించును -కావున మనకు గంగ యెట్లు లభించు నను కొనిరి.

70 శ్లో॥ అయం యత్నేన తాం భూమిం ఆనయిష్య త్యతో ఽన్యచ।
సంకటం యోజ్య మస్మాభిః గంగా లాభో భవే త్తతః

71 శ్లో॥ ఏవం విచార్య దూర్వాభిః కృత్వా మాయామయీం తు గాం।
సవత్సాం గౌతమవ్రీహి భక్షణాయ స మైరయన్॥

72 శ్లో॥ అనుష్ఠానరతో దృష్ట్వా వారయామాస తాం మునిః।
త త్సస్యం భక్షయంతీం గాం తదా ధర్మపవిత్రతః॥

73 శ్లో॥ దుర్వారం త దభూ చ్ఛస్త్రం లగ్నం వజ్రాస్త్రవ ద్భువి।
ద్రుతం గౌః పంచతాం యాతా గోహత్యా మౌత్తమం గతా॥

74 శ్లో॥ మిళిత్వా ఋషయ స్సర్వే ప్రాయశ్చిత్తం త మబ్రువన్।
గంగా మానయ గాం తేన తవ శుద్ధి ర్భవిష్యతి॥

75 శ్లో॥ గౌతమః సతథేత్యుక్త్వా సహస్రాబ్దం తపో ఽతపత్।
వ్యోమకేశః ప్రసన్నో భూ ద్వరం బ్రూ హీ త్యభాషత్॥

76 శ్లో॥ గౌతమ స్తేశ్వరం ప్రాహ ప్రస న్నోసి య దీశ్వ ర।
మహ్యం చరాచరో ద్ధృత్యై గంగాం సమార్పయత్॥

77 శ్లో॥ ఇతి గౌతమ వాక్యం స శ్రుత్వా గంగాం సచార్పయత్।
క్షాళయంతీ మనుష్యాణాం పాపం భూమండలం గతా॥

78 శ్లో॥ యథా భాగీరథీ గంగా తథేయం క్షేన వర్ణ్యతే।
అతః శ్రీగురునాథో ఽత్ర సంప్రాప్తో నామధారక!॥

79 శ్లో॥ గౌతమీ తట యాత్రాంస గురునాథ స్సమాచరత్।
పర్యటన్ సర్వతీర్థాని లోకానుగ్రహ కాంక్షయా॥

70 తా॥ దీనిని మనము ప్రయత్నము చేసి భూమికి తీసికొని రావలెను. కనుక నే దే నొక సంకటము కలుగజేసిన గంగ దొరుకును

71 తా॥ ఇట్లు ఋషులు విచారించి తమ తపశ్శక్తిచే గడ్డి పరకలను మంత్రించి మాయామయ మైన గోవును తయారు చేసి దాని వెంటను దూడను గల్పించి గౌతముని యనుష్ఠాన ప్రదేశపు ప్రీహులం దిన దోలిరి.

72 తా॥ గౌతము డను ష్ఠాన మందుండి దాని నదలించెను. అప్పటికి అది కదలక భక్షించు చుండెను. అప్పుడత డనుష్ఠాన మందుండెను.

73 తా॥ ఆ గౌతము డది తినుటను చూచి గడ్డి పోచను విసరెను. అది పెద్ద శస్త్రమై వజ్రాయుధ సమమై ఆ గోవు దూడతో గూడ చంపబడెను.

74 తా॥ గోహత్యా పాతక మాయన కెట్లు బోవు నని విచారించిన, గంగను భూమిపైకి రప్పించి అందు స్నానము చేసిన బ్రహ్మహత్య పోవుననిరి.

75 తా॥ దానిని విని గౌతముడు దానికి గా వేయి సంవత్సరములు తప మొనర్చి శివుని మెప్పింప తాను ప్రసన్నుడై వరమేమి కావలె ననిపించు కొనెను.

76 తా॥ స్వామీ! తమ దయ నాపై గలిగిన చరాచర జీవకోటి సంరక్షణకై - నీ జటాజూట గంగ నిచ్చి అనుగ్రహింపు మని గౌతముడు శివుని వేడెను.

77 తా॥ ఈ గౌతమ ప్రార్థనను విని శివుడు గంగను సమర్పించెను. ఆ గంగ భూమి మీదకు వచ్చి సర్వజీవుల పాపముల కడిగి వేయు చుండెను.

78 తా॥ కనుక భాగీరథి. గంగ అను పాపహారక శబ్దోచ్చారణము న నే కలుగుచుండ దాని మహిమ నెవరు చెప్పగలరు? అందు కని గురువుల వా రా గౌతమిని చేరిరి.

79 తా॥ అందుకని శ్రీ గురువులు గౌతమీ తీర యాత్ర సలుపు చుండిరి. లోకానుగ్రహ కాంక్షులై సమస్త క్షేత్రముల దిరుగు చుండిరి.

80 శ్లో॥ తటం తటం త్వట నవిన్నటవ ద్ధృతవిగ్రహః
మంజరీకే గురుః ప్రాప మాధవారణ్య కం మునిం॥

81 శ్లో॥ నరసిం హార్చన రతో మానసై రుప చారకైః।
దదర్శ శ్రీగురుం చిత్తే యథా ధ్యాత స్తథైవ తం॥

82 శ్లో॥ ప్రణమ్య శ్రీగురుం స్తోత్రైః తుష్టావ బహుభిర్భృశమ్।
మానసే విస్మితో భక్త్యా గురుం ప్రాహసగద్గదమ్।

83 శ్లో॥ య ద్దివ్య పాద ద్వయ మేవ సాక్షాత్ అధిష్ఠితం
దేవనదీ సమీపే।
య దుత్తరం తీర నివాసి రామం లక్ష్మీ సమీపం వసతీహ
నిత్యం॥

84 శ్లో॥ ఇత్యుక్త్వా మాధవారణ్య ముని ర్హృష్టో ననామ తం।
సంతుష్టః శ్రీగురుః ప్రాహ మాధవారణ్యకం మునిం।

85 శ్లో॥ అత్యంత సన్మార్గ ఇహ త్వయాప్తః సేవాధికారేణ తత
స్సమాప్తః।
సంసార మార్గో మమ దర్శనేన ప శ్యాత్మనామా
మవిమర్శనేన॥

86 శ్లో॥ ఇత్యుక్త్వా తం సమాశ్వాస్య శ్రీగురు ర్హర్ష నిర్భరః।
స్వరూపం దర్శయామాస తస్మై దివ్య మనుత్తమమ్॥

87 శ్లో॥ స్వరూపం శ్రీగురో ర్దృష్ట్వా సంతుష్టం స ముని స్తదా।
వినయావనతో భూత్వా నానా స్తోత్రై స్స్తుతిం జగౌ।

88 శ్లో॥ శ్రీ జగద్గురు రాజోఽయం లోక దృష్ట్యా నరో ఽపి హి।
త్వం త్రిమూర్త్యవతార రోఽసి జగజ్జ్యోతిః పరః పుమాన్॥

89 శ్లో॥ త్వం తార కోఽసి విశ్వేషాం అవతీ ర్ణోఽస్య తో భువి।
అస్మాన్ కృత్వా కృతార్థాం స్తే దత్తం చరణ దర్శనం॥

80 తా॥ శ్రీ గురువులు ఆ తీర ప్రదేశముల (దిరుగుచు మంజరీక ప్రదేశమున మాధవారణ్యుల వారి వద్దకు బోయిరి.

81 తా॥ ఆయన మానసమున నరసిం హార్చనను చేయు చుండ నింతలో నా నరసింహుడు ప్రత్యక్షమై నట్లు - నృసింహ సరస్వతి ప్రత్యక్ష మయ్యెను.

82 తా॥ ఆ మాధవారణ్య ముని గురువు గారికి నమస్కారముల (జేయుచు అనేకములగు స్తుతులచే నుతించుచు - ఆశ్చర్యపడి - భక్తితో - గద్గద కంఠమున గురువుగారితో ననెను.

83 తా॥ ఓ స్వామీ! దేవుడవైన నీ పాదము లిచట నదీ తీరమున చిహ్నిత మైనవి. దీని కుత్తరముగ రాముడును లక్ష్మి దేవి యు నుండిరి.

84 తా॥ ఈ విధముగ ఆ మాధవారణ్య ముని స్వామి వారిని చూచి నమ స్కరించు చుండెను. స్వామియు వాని శ్రద్ధాభక్తులకు మెచ్చి ఆ మాధవారణ్య ముని కిట్లనెను:

85 తా॥ ఓయీ! నీవు సన్మార్గమున నుంటివి. నీవు సేవాసక్తి లో దానిని సమాప్తి చేసితివి. నా దర్శనమై నందున ఇక నీవు సంసార మార్గ మును విమర్శించిచూడుము.

86 తా॥ ఇట్లు గా శ్రీగురు వామునిని యోదార్చి - సంతోషముతో నాయనకు తన దివ్యరూపమును చూపెను. అది మిక్కిలి తేజోవంతముగ నుండెను.

87 తా॥ ఆ మాధవారణ్యు లాస్వామి దర్శనమున మిక్కిలి సంతస పడెను. ఆ గురువును వినయ వినమితుడై అనేక విధ స్తోత్రముల( జేసెను.

88 తా॥ ఓ స్వామీ! నీ వీలోక దృష్టికి నర రూపధారి వి జగత్తునకు గురువుగ గాన వచ్చుంటివి. జగజ్జ్యోతి - పరాత్పరుడు- త్రిమూర్త్యవతారడవు.

89 తా॥ అయ్యా! మీరు విశ్వోద్ధారకులు - లోకము నుద్ధరించు కృపా బుద్ధిలో మమ్ముల నను గ్రహింప అవతారమును దాల్చి మీ చరణ దర్శనము నిచ్చితిరి.

90 శ్లో॥ ఇతి స్తుత్వా శ్రీగురుం స తాపస స్తాపసాధిపమ్।
సంతుష్టో హృష్ట చిత్తో భూ త్త మాశ్వా స్యాబ్రవీ ద్గురుః।

91 శ్లో॥ మాధవారణ్య తే మంత్ర సిద్ధి ర్జాతా న సంశయః।
లబ్ధా తే సద్గతి ర్బ్రహ్మ లోకం యా స్యసి శాశ్వతం॥

92 శ్లో॥ నిత్యం నృసింహ మూ ర్తే ర్మే మనసా పూజనం కృతమ్।
ప్రత్యక్షం దర్శనం త్వేత ల్లబ్ధం తేన న సంశయః॥

93 శ్లో॥ ఇత్యుక్త్వా త మను జ్ఞాప్య గంగాతీరేణ స ద్గురుః।
నిర్గచ్ఛ న్వా పరబ్రహ్మేశ్వర శిష్యైః సమాగతః॥

94 శ్లో॥ స్థితో గంగాతటే శిష్యైః సహ స్నాతుం స సద్గురుః।
మర్తుం సమాగతం తత్ర విప్ర మేకం దదర్శ సః॥

95 శ్లో॥ తీరే ఉదరం చ్ఛూల రోగ వ్యధా వ్యాప్తో భృశం ద్విజః।
ప్రాణాం స్త్యక్తుం ప్రవృత్తోఽభూ త్సపీడాం సోఢు మక్షమః॥

96 శ్లో॥ కృతేతు భోజనే దుఃఖం మరణ ప్రాయ మేవ సః
జఠరేఽ నుభవ త్యేవ పరిణామాఖ్య శూలతః॥

97 శ్లో॥ అతఏవ ద్విజో నిత్యం నిరాహారో ఽభవ త్సదా।
అన్నేన వైర మాపన్నో భుక్తోఽ సూం స్త్యక్ష్య తీవ కిమ్॥

98 శ్లో॥ మాసా పక్షేణ వాప్యన్న భోజనా ద్భవతి వ్యధా
ఏవం కతి దినాన్యేష కష్టం ప్రాప్తో ఽతి దుఃసహమ్॥

99 శ్లో॥ మహా నవ మ్యుత్సవే స పూర్వస్మి న్దివసే ద్విజః।
మా సైకేన తు మిష్టాన్నం భుక్త్వా కష్ట మవాప హ॥

90 తా॥ తపస్వి యగు నా మాధవారణ్యముని ఇట్లుగా గురువును స్తోత్రించి సంతుష్టుడై యుండగా శ్రీగురువుగారు వాని కియిట్లనెను:

91 తా॥ ఓయీ మాధవారణ్యా! నీ మంత్రసిద్ధి అయినది. సంశయం లేదు. నీకు సద్గతి లభించినది. నీవు తప్పక బ్రహ్మలోకమునకు పోదువు అనెను.

92 తా॥ అపుడు మాధవారణ్యముని యు - అయ్యా నేను నిత్యము మనస్సులో నృసింహ పూజను చేయు చుంటిని - ఆ స్వామి దయయుంచి మీ రూపమున దర్శన మిచ్చిరి.

93 తా॥ ఇట్లా యన స్తోత్ర తుష్టుడైన ఆ గురువుగారు ఆ మునికి ఆజ్ఞ నిచ్చి ఆ గంగాతీరమున ను పయనించుచు వర బ్రహ్మాత్యాది శిష్యుల గలిసి పోయెను.

94 తా॥ అట్లు శిష్యుల గలిసి జగద్గురు వులు - ఆ తీరమున స్నానము చేయ సిద్ధులై యుండ నచటకు చచ్చుటకు వచ్చిన ఒక బ్రాహ్మణుని జూచిరి.

95 తా॥ ఆ నది యొడ్డున శూల రోగి యొక బ్రాహ్మణుడు ఉదర శూల బాధతో పొరలాడుచు బాధకు భరింప లేక ప్రాణముల దీసికొను చుండెను.

96 తా॥ భోజనము నా బ్రాహ్మణుడు చేసిన ప్రాయముగ నుండెను. కడుపు నొప్పి (శూల)తో (పరిణామ శూలతో) బాధపడుచుండెను.

97 తా॥ అందుకని బ్రాహ్మణుడు రోజు నుపవాస ముండి అన్నమునకు శత్రు వయ్యెను, తింటే ప్రాణము లే పోయెడివి.

98 తా॥ క్షుద్బాధకు తాళలేక నెలకు పక్షమునకు భోజనం చేసి వెంటనే శూలరోగ బాధ ఇట్లుగ బాధతోఁ గొన్నిదినములు కష్టపడుచుండెను.

99 తా॥ ఒక సంవత్సరము మహానవమికి ముందు దుర్గాష్టమి రోజున నెలకొక పరి వంతున ఇష్ట మృష్టాన్నమును కడుపార తిని బాధపడెను.

100 శ్లో॥ బ్రహ్మాన్న భోజనా ద్విప్రో జఠరే ఉత్యంత పీడితః।
గంగాతీరే ఋతః ప్రాణాః పరిత్యక్తుం సముద్యతః॥

101 శ్లో॥ కృత్వా ప్రారం ద్విజో దుఃఖం త్యజః దేహం జగా విదం।
సంసారేణ త్వసారేణ మమా లం పాప రూపిణః॥

102 శ్లో॥ ప్రాణోన్నం జీవనం చాన్నం వి నాన్నం కో ఉత్ర తిష్ఠతి।
అన్నేన వైర మాపన్నే మరణం శరణం మమ॥

103 శ్లో॥ ఇతి నిశ్చిత్య గంగాం బు ప్రవేష్టుం స ద్విజ స్తదా।
ప్రవృత్తో ఉభూ ద్గళే బద్ధ్వా పాషాణం సుదృఢం శ్వసః॥

103 శ్లో॥ కర్పూర గౌరం స్మృ త్వాంతః ప్రాహ భూ త్వేహ భూాభరః
జాతో ఉస్మి నాన్న దానా ద్యై రుపకారో౽పి నో కృతః॥

105 శ్లో॥ ఇహ జన్మని నో పుణ్యం కృతం జన్మాంతరే పి వా।
యతః పుణ్యఫలం నేక్షే తతః కష్టం పురార్జితం॥

106 శ్లో॥ బ్రాహ్మణస్య హృతో గ్రాసో యద్వా కపిలగో రుతః।
కృతో విశ్వాస ఘాతో వా తతః కష్టం పురార్జితం॥

107 శ్లో॥ నేశ్వరః పూజితో వాపి సద్గురు ర్నిందితో థవా।
పితరా వ ప్యవజ్ఞాతౌ తతః కష్టం పురార్జితం॥

108 శ్లో॥ అథవా ప్రాగ్భవే ధిక్కృతా గృహ మాగతాః।
నా ఉన్నేనా తిథయో ఉపీష్టాః తతః కష్టం సమార్జితం॥

109 శ్లో॥ వధూవరౌ హతౌవా మే దత్తో౽ గ్ని రథవా వనే।
పితరౌ వా పరిత్యక్తౌ తతః కష్టం పురార్జితం॥

100 తా॥ ఓయీ బ్రాహ్మణుడా! భోజనం లేక బాధ నొందు చుంటివా? గంగా తీరమున ప్రాణములు వదల దలచు కొంటివా అని చూపరులకు తోచెను.

101 తా॥ ఆ బ్రాహ్మణు డపార దుఃఖవంతుడై ప్రాణముల విడువ దలచి యిట్లను కొనెను: పాపాత్మునకు నాకు సంసారంతో పనియేమి?

102 తా॥ ప్రాణధారణకు అన్నము ముఖ్యము. అన్నము లేకుండ నెవడు బ్రతుకును? తిని బాధపడుట కంటే అసలు చచ్చుట మంచిదనుకొనెను.

103 తా॥ ఇట్లనుకొని నీటిలో బడి చచ్చుటకు సిద్ధమయ్యెను. అందుకని నీళ్ళ పడి చచ్చిన పైకిలేతునేమో యని ఒక పెద్దబండను మెడకు కట్టుకొనెను.

104 తా॥ ఓ శంకరా! భూభార భూతుడనై నే నన్నము తినక ఇతరులకు పెట్టని వ్యర్థుడను, నే నెందుకు? అందుకై చచ్చి పోవుచున్నా నను చుండెను.

105 తా॥ ఈ జన్మలో గాని పూర్వజన్మలో గాని పుణ్యమింతయైన చేయలేదు. ఇట్లనుకొనుటకు నేను పడుచున్న కష్టములే చెప్పుచున్నవి.

106 తా॥ ఏనాడో నే బ్రాహ్మణుని గాని గోవుయొక్క గాని నోటిముందరి అన్నమును తీసి తిని లేక విశ్వాస ఘాతకుడనై యుండవచ్చును. అందుకే ఈ కష్టము.

107 తా॥ లేక శివపూజను చేసి యుండను లేక గురునిందను చేసితిని లేక తల్లిదండ్రుల సరిగా చూచి యుండను.

108 తా॥ లేక పూర్వజన్మమున నింటికి వచ్చిన అతిథులను పెద్దలను ధిక్కరించి యుందును. అందుచే నిట్టి దుఃఖము గలిగినది.

109 తా॥ నూతన వధూవరుల చంపి యుందును లేక అడవికి నిప్పుబెట్టి యుందును తల్లి దండ్రులను పరిత్యజించి యుందును - లేకున్న నాకీ కష్టమేమి?

110 శ్లో॥ విహాయ పితరౌ భుక్త మిష్ట మన్నం స్త్రియా సహ।
భాతి పూర్వార్జితం త్వీదృక్ తతః కష్టం పురార్జితం॥

111 శ్లో॥ స్మృత్వా స్మృత్వైవ పాపాని ప్రవిష్టో గౌతమీ జలం।
తం దృష్ట్వా శ్రీగురుః ప్రాహ శిష్యా నాహ్వాయ త ద్విజం॥

112 శ్లో॥ ఆన యానయ శిష్యా ముం ఆత్మహత్యా తి దోషదా।
పృచ్ఛేయం కస్య కోఽయం హి ప్రాణాం స్త్యజతి వా కుతః॥

113 శ్లో॥ ఇతి శ్రీగురు ణోక్తా స్తే ధావంతః ప్రాప్య తం ద్విజం।
సలి లాదాన యామాసు ర్నిష్కా_స్య గురు సమ్ముఖం॥

114 శ్లో॥ అనాథానాం కల్పతరుః దుఃఖితానా ంకృపాకరః।
పప్రచ్ఛ తం గురు వరః ప్రణతానాం సు శంకరః॥

115 శ్లో॥ బ్రహ్మ న్నిహ కుతః ప్రాణాన్ బుద్ధ్వా త్యక్తు మిహేచ్ఛసి।
ఆత్మహత్యా మహాదోషా శ్రుతా య త్త్వద్వా ఖిలమ్॥

116 శ్లో॥ విప్రః ప్రాహ యతీశా ద్య మాం పృష్ట్వా కిం కరిష్యసి।
జాతం జన్మ మమ వ్యర్థం భూ భారో ఽయం న సంశయః॥

117 శ్లో॥ మాసా పక్షేణ భుక్తం చే దుదరే ఽతీవ దుః సహమ్।
కష్టం భవతి త త్సోఢుం న క్షమో ఽత స్త్య జామ్య సూన్॥

118 శ్లో॥ శరీరం స్యా దన్న మయం తదన్నం వైరతాం గతం।
గురునాథ! వినా న్నేన జీవనం మే కథం వద॥

119 శ్లో॥ శ్రీ గురు ర్బ్రాహ్మణం ప్రాహ వృథా తే సర్వథా గతా॥
క్షణే నై కేన భో బ్రహ్మన్ ఔషధం కథయామి తే॥

110 తా॥ లేక తలిదండ్రుల వదలి నేను నా భార్యతో సుఖముగ ఇష్టాన్నమును తిని యుందును. ఇట్లాంటి పాతకముల చేయకున్న నా కీ కష్టమెట్లు వచ్చును?

111 తా॥ ఇట్లా బ్రాహ్మణుడు తన పాపముల దలచుకొని గౌతమీ జలముల మున మునుగ చూచు చుండెను. అది స్నానార్థమున్న గురువు కంట బడి శిష్యుని బిలిచి ఆ బ్రాహ్మణుని పిలువ మనెను.

112 తా॥ ఇత డెవరో బ్రాహ్మణు డాత్మ హత్యకు తయారై నాడు. వాని ని పిలువుము, పిలువుము-ఎందు కొరకు ఏకారణమున నెవనికై చచ్చు చున్నాడో?

113 తా॥ గురువుగారు చెప్పిన మాటల విని ఆ శిష్యులు పరువెత్తుచు వెళ్ళి - ఆ చావబోవు బ్రాహ్మణుని నీళ్ళనుండి వెలికి దెచ్చి గురు సమ్ముఖ మును జేర్చిరి.

114 తా॥ అనాథలకు కల్ప వృక్షము వంటివాడు - ఆర్తుల రక్షించు దయా మయుడు ఆ గురువు గా రాయనతో నిట్లనిరి:

115 తా॥ బ్రాహ్మడా! ఇక్కడ ప్రాణముల నెందుకు తెలిసియు వదలి పెట్టు చెందులకు? ఆత్మహత్య పెద్ద దోషమైనది - నీకు తెలిసినదె! ఎందు కిట్లు చేయ బూనితివి?

116 తా॥ ఆ బ్రాహ్మణుడు ప్రాణము మీద విసిగి యున్నందున - ఓ యతి! నీ వడిగి నందుకు ఏమి చేయుదువు? భూభారమునకై పుట్టి వ్యర్థ జన్మ వానిని - లాభం లేదనెను.

117 తా॥ నెలకో - పక్షమునకో ఒక సారి భోజనం చేయుదును - ఆ తి నిన ది మొదలు ఉదరములో న చేరినది మొదలు ఆ నొప్పి ని సహింపలేక చావునకు తెగించి నాను.

118 తా॥ అయ్యా! ఈ శరీరము అన్నమయమైనది - అట్టి అన్నముతో శత్రు త్వము వచ్చినది ఆ అన్నమును తినక నేనెట్లు బ్రతుకుదును - మీరు చెప్పండి స్వామీ?

119 తా॥ అప్పుడు గురువుగారు ఆ బ్రాహ్మణుని తో - అయ్యా! నీ కిక నొప్పి యంతయు బోయినది-ఒక క్షణములో అది పోయే మందును నీకు చెప్పెదను.

120 శ్లో॥ మా భీః జహిహి స్వాంతస్థం సంశయం నిశ్చయం వహ।
వ్యాధి స్తే నిర్గతో భూమౌ కురు స్వాదన్న భోజనం॥

121 శ్లో॥ శ్రీ గురో ర్వచనం శ్రుత్వా స్థిరీకృత్య మనః శనైః।
నిధాయ శ్రీ గురుపదే శీర్షం భక్త్యా న నామ తం॥

122 శ్లో॥ తస్మి న్నవసరే కశ్చిత్ ద్విజ ఏక స్సమాగతః।
స తద్గ్రామాధికారీ హ గంగాం స్నాతుం సమాగతః॥

123 శ్లో॥ సహసా శ్రీ గురుం దృష్ట్వా స ఆగత్య గురోః పదే।
వవందే భక్తి సంయుక్తః కాయేన మనసా గిరా॥

124 శ్లో॥ శ్రీ గురు స్తం సమాశ్వాస్య విప్రం పప్రచ్ఛ కుత్ర తే।
నివాస స్తవ కిం నామ మహ్యం కథయ విస్తరాత్॥

125 శ్లో॥ ఇతి శ్రీగురు వాక్యం స శ్రుత్వా ఽథ బ్రాహ్మణో ఽబ్రవీత్।
ఆ స్మ్యాపస్తంబ శాఖీయో ద్విజః కౌండిన్య గోత్రజః॥

126 శ్లో॥ సాయందేవ ఇతి ఖ్యాతః కాంచీపురి వసా మ్యహం।
ప్రాప్తో స్మ్యధర పూర్త్యర్థం సేవకో యవనే శితుః॥

127 శ్లో॥ వసా మ్యధికృతత్వేన గ్రామే ఽస్మి న్నేక హాయనం
ధన్యోహ మద్య ధన్యోహం కృతా ర్థోఽస్మి న సంశయః॥

128 శ్లో॥ త్వద్దర్శనా త్కృతార్థోఽస్మి త్వం నూనం విశ్వతారకః।
దత్తం మే దర్శనం దోషా గతా జన్మాంతరా ర్జితాః॥

129 శ్లో॥ యస్మిం స్తే ఽనుగ్రహ స్సోఽపి తరిష్యతి భవార్ణవాత్।
స్వామిం స్తేదర్శనం లబ్ధ మప్రయత్నేన మేఽ ధునా॥

120 తా॥ నీవు భయపడకుము - మనసులో సంశయ పడకుము. నీ రోగ మంతయు భూమి మీద పడిపోయినది - ఇప్పుడు కోరిన రీతి భోజ నము చేయుము.

121 తా॥ ఆ గురు వాక్యమును విని మనస్సు కుదుట బడిన వాడయ్యెను. వెంటనే తలను వంచి ఆయన పాదముల (బడియెను.

122 తా॥ ఆ సమయమున కచట కొక బ్రాహ్మణుడు వచ్చెను. అత డాగ్రామ మునకధికారి - గంగలో స్నానము చేయవచ్చెను.

123 తా॥ త్వరగా బోవుచు - గంగలో స్నానార్థమున్న గురువుగారి దర్శన మయ్యెను - అప్పు డాయన గురువు నందలి భక్తి చే త్రికరణశుద్ధిగా నమస్కరించెను.

124 తా॥ ఆ నమస్కరించు బ్రాహ్మణు నాదరించి యిట్లు ప్రశ్నించెను - అయ్యా! మీ నివాసమెక్కడ? మీ పేరేమి? అంతటిని విశదముగా చెప్పు మనెను.

125 తా॥ అది విని అయ్యా! నేను అపస్తంబ శాఖ వాడను - కాండిన్య గోత్రి కుడను - బ్రాహ్మణ జన్మవాడను.

126 తా॥ నా పేరు సాయం దేవుడను. నా నివాసము కాంచీపురము - ఈ గ్రామమునకు సంసారమును పోషించుకొన వచ్చితిని - ఇచట యవ రాజు నకు సేవకుడనైతి.

127 తా॥ అరా జిచ్చిన అధికారముతో నీ గ్రామమున ఒక సంవత్సరము నుండి ఉంటున్నాను. ఈ రోజు మీ దర్శన సంభాషణచే ధన్యుడనైతిని.

128 తా॥ తాము ఈ ప్రపంచమంతటికి కారకులైన భగవ త్స్వరూపులు - మీ దర్శనముచే నా జన్మ కృతార్థత జెందినది. నా పాపములన్ని మీ దర్శనమున పోయినవి.

129 తా॥ ఇంకను మీ అజ్ఞారూపానుగ్రహం వస్తే ఈ సంసారమును తప్పక తరింతును. ఏమి నా భాగ్యము! ఈ రో జ ప్రయత్నముగ మహా ద్దర్శన మైనది.

130 శ్లో॥ గంగా పాపం శశీతాపం దైన్యం కల్పతరు ర్హరేత్।
పాపం తాపం చ దైన్యంచ సద్యః శ్రీ గురుదర్శనమ్॥

131 శ్లో॥ పాపం గంగా హరే త్స్నానాత్ తాపం చంద్రో హరే న్నిశి।
దైన్యా ద్వియోజ యత్యేవ కల్పవృక్ష ఉపస్థితః॥

132 శ్లో॥ నైవం భవద్దర్శనం య త్తాప పాతక దైన్యహృత్।
దృష్ట మీదృ క్తవ పదం చతుర్వర్గ ఫలప్రదమ్॥

133 శ్లో॥ ఏవం స్తుత్వా పున రపి శ్రీగురో శ్చరణే ఽగ్రహీత్।
జగద్గురు స్త మాశ్వాస్య స్వాగ్రే స ముపవేశయత్॥

134 శ్లో॥ శ్రీ గురుః ప్రాహ తం విప్రం మ ద్వాక్య మవ ధారయ।
జఠరే వ్యథితో విప్రః క్షుధా ప్రాణా న్కజహాతి హి॥

135 శ్లో॥ వ్యాధే రుపశమార్థాయ కథయా మ్యహ మౌషధం।
నీత్వా స్వమందిరే తస్మై దేహి మిష్టాన్న భోజనం।

136 శ్లో॥ అస్యాన్న భోజనా త్పీడా వ్యాధి శ్చ లయిమేష్యతి।
న యాముం త్వరితం విప్రం క్షుధా ఽక్రాంతోఽ య మస్తితి॥

137 శ్లో॥ ఇతి శ్రుత్వా గురూ క్తిం స వినయావనతో ఽబ్రవీత్।
ప్రాణాం స్త్యక్ష్యతి భుక్త్యైవ బ్రాహ్మణోఽ యం న సంశయః॥

138 శ్లో॥ గతేఽ హ్ని భుక్తో మాసేన తేనా సూం స్త్యక్తు మిచ్ఛతి।
అస్మై అన్న ప్రదానేన బ్రహ్మ హత్యా మవాప్నుయామ్॥

139 శ్లో॥ ఉవాచ శ్రీ గురు ర్విప్రం కథయామ్య ద చౌషదమ్।
మాషాన్నం పరమాన్నం చ సా పూపం పరమౌషధమ్॥

130 తా॥ ఈ గంగ పాపమును- చంద్రుడు తాపమును- కల్పవృక్షము దైన్యమును పోగొట్టును. గురువులైన తమ దర్శనముచే పాప తాప దైన్యములు మూడును హరించినవి.

131 తా॥ గంగ ఇక్కడుండి పాపము నొక్క దాని పోగొట్టును. చంద్రుడు- కల్పవృక్షము ఉపరితలమున నుండి తాప దైన్యములను పోగొట్టును- మీ దర్శనమున నన్నియు నిక్కడనే గల్గును.

132 తా॥ మీ దర్శనం అ మూటిని హరింప చేయుటే గాదు- మీ చరణమును పట్టగలిగిన వానికి చతుః పురుషార్థములు లభించుట నిశ్చయము.

133 తా॥ ఇట్లని గురువుగారిని పొగడుచు వెంటనే ఆయన పాదముల బట్టు కొనెను. వెంటనే గురువులవారు ఆ బ్రాహ్మణు నాదరించి తనముందు గూర్చుండ జేసెను

134 తా॥ బ్రాహ్మణుడా! నే నొకమాటను చెప్పెదను, శ్రద్ధగా వినుము. ఈ బ్రాహ్మణుడు శూలవ్యాధితో ప్రాణముల వదల నున్నాడు.

135 తా॥ నే నావ్యాధిహరణమును గూర్చి ఔషధమును చెప్పుదును - ఆయనను మీ మందిరమునకు తీసికొని వెళ్ళి మృష్టాన్న భోజనము నిమ్ము.

136 తా॥ ఓయీ! అటువంటి భోజనము నితడు కడుపునిండ తినినచో యీతని జాడ్యము పోవును కనుక త్వరగా నీయన కదియిమ్ము- క్షుధాతురుడై యున్నాడనెను.

137 తా॥ ఆ గురు వాక్యమును వినయముతో ఆ గ్రామాధికారి బ్రాహ్మణుడు అయ్యా! అట్లా చేస్తే వెంటనే బ్రాహ్మణుడు తప్పక ప్రాణములు వదలు ననెను

138 తా॥ ఇతడు నిన్న తిన్నదాని కే ఈ రోజు ప్రాణములు వదల వలయునని యనుచున్నాడే నే నీరోజీయనకు భోజనమును పెట్టిన నాకు బ్రహ్మహత్య వచ్చునేమో?

139 తా॥ ఓయీ! నేను నీకు చెప్పుచున్నాను ఇది ఔషధమని చెప్పుచున్నానని గురువుగారు అనుచు - పప్పు - పాయసం మినపగారెలు - బూరెల తినిపించుట దీని అర్థము - ఔషధం,

140 శ్లో॥ ఏత దన్నాశనా దస్య వ్యాధి ర్నాశం గమిష్యతి।
నిస్సంశయం నయా స్వే నం భోజనం దేహి సత్వరం॥

141 శ్లో॥ ఓ మిత్యాశ్రుత్య స తదా భిక్షార్థ మపి సద్గురుమ్।
సశిష్యం ప్రార్థయామాస స్వామి న్నే హితి భక్తితః॥

142 శ్లో॥ అథ శ్రీ గురునాథః స తథేత్యం గీచ కార సః।
సాయం దేవో ఽతిహృష్టో ఽభూ దృక్తిమా న్నామధారకః॥

143 శ్లో॥ అహ మన్యేచ యే శిష్యాః రోగీ విప్రశ్చ తై స్సహ।
శ్రీగురు స్తద్గృహం యాతో భిక్షాం కర్తుం ముదా యుతః॥

144 శ్లో॥ పతివ్రతా స్య వనితా సా తదా ఽతీవ హర్షితా।
పూజయామాస తు రుభౌ విచిత్రం తత్ర చేష్టితమ్॥

145 శ్లో॥ ఉపచారైః షోడశభిః తా వానర్చతు రాదరాత్।
శ్రీమద్గురుం తదాన్యాం శ్చ తచ్ఛిష్యా౯ సకలా నపి॥

146 శ్లో॥ గురుపూజా విధానం తు చిత్రం తత్ర మ యేక్షితం।
ఏకైకం రంగ వల్లీ భీ రచయామాస మండలమ్॥

147 శ్లో॥ నానా రంగై రంచితాని పద్మా నష్టదలా న్యపి।
పంచవర్ణైః సుచిత్రైః స భూషయామాస తుస్థలమ్॥

148 శ్లో॥ తతః సంకల్ప్య సాష్టాంగం ప్రణమ్య విధినా ద్విజః।
వినయావనతో భూత్వా ప్రణనామ పునః పునః॥

149 శ్లో॥ చిత్రాసనే తూ పవేశ్య గురూం శ్చాన్యా౯ పృధక్ పృధక్।
కృత్వా గంధాది యుక్తాని పాద్యార్ఘ్యాదీని చ క్రమాత్॥

140 తా॥ ఇతని కట్టి అన్న మిచ్చినచే యీ వ్యాధి యుపశమించును కనుక సందేహింపక వీనికి నే జెప్పిన రీతిగ తొందరగ భోజనమును పెట్టింపు మనెను.

141 తా॥ శ్రీ గురువుగారన్న దాని కంగీ కరించుచు - ఆ గురువుగారిని - శిష్యులతో గూడ తాముసు భిక్షను మా యింట తీసికొను మని ప్రీతి పూర్వకముగఁ బ్రార్థించెను.

142 తా॥ సరే అట్లే అగుగాక! అని అంగీకరించెను. ఆ సాయందేవుడు ను సంతోషించెను. అందరి స్నానానంతరము వత్తు రని అనుకొను చుండగా-

143 తా॥ తరువాత కొంత సేపటికి గురువుల వారు, వారి శిష్యులు - రోగియు వెంటరా నాతని యింటికి భిక్షార్థ మరిగిరి.

144 తా॥ ఆ సాయం దేవుని భార్య ఉత్తమ యిల్లాలు - స్వామివారికి అర్ఘ్య పాద్యాదు లిచ్చి దంపద్యు క్తముగా స్వామి పూజ చేసిరి. విచిత్రం కన్నులార కానవచ్చెను

145 తా॥ ఆ నాడు వారి యింట గురుపూజ శిష్యులతో సహః మహః ఘనముగా జరిగెను.

146 తా॥ ఆ పూజా విధానము గూడ విచిత్ర రంగవల్లీ భూషిత వేదిక నుంచి ప్రత్యేక ప్రత్యేకముగా నందరిని పూజించిరి.

147 తా॥ ఆ పూజా వేదిక మండపము - అష్టదళపద్మా లంకృతమై - పంచ రంగుల ముగ్గులతో చిత్ర విచిత్రముగా నలంకరించిరి.

148 తా॥ అటుపై సంకల్ప పూర్వాది ఆత్మ ప్రదక్షిణ పర్యంత షోడశో పచార పూజచేసి నమస్కార స్తుతులతో - పూజ లొనర్చిరి.

149 తా॥ తరువాత చిత్రాసనమున గురువుగారిని ఇతర శిష్యాదులకు ప్రత్యేకా సనములగూ ర్చుండఁజేసి గంధాదుల నర్ఘ్యాదులిచ్చిరి.

150 శ్లో॥ ఉపచారైః క్రమే ణైవ పాదౌ పంచా మృతాదిభిః।
రుద్ర సూక్తాభిషేకై శ్చ పూజయామాస భక్తితః॥

151 శ్లో॥ భక్త్యా శ్రీ గురు మా పూజ్య స న్మాల్యాది భి రాదరాత్।
జ్ఞానీ విప్రః పాద తీర్థం దధౌ పాత్రాం తరే తదా॥

152 శ్లో॥ భక్త్యా చరణ తీర్థం తత్ పూజయామాస స ద్విజః।
నీ రాజ్య గీతవాద్యై శ్చ తోషయామాస సద్గురుమ్॥

153 శ్లో॥ శ్రద్ధా భక్త్యా క్రమేణై వ శ్రీగురోః పూజనం ముదా।
అన్యాన్ సంన్యాసినః షోడశోపచారై ర పూజయత్॥

154 శ్లో॥ పుష్పాంజలిం వేదమంత్ర ఘోష పూర్వక మాదరాత్।
తస్మై సమర్పయామాస గురవే ప్రీతి సంయుతః॥

155 శ్లో॥ సుగీతై ర్నమనై శ్చాపి తోషయామాస సద్గురుమ్
స పతివ్రత యా పత్న్యా సాక మేవం స మార్చయత్॥

156 శ్లో॥ ఏవం శ్రీ గురు మాపూజ్య సాయం దేవోఽ తి భావికః।
శిష్యా నన్యా నపి తథా వవందే పరమాదరాత్॥

157 శ్లో॥ గురుమూర్తి రతి ప్రీతో వరం తస్మై దదౌ ముదా।
వృద్ధిం యాయా త్సంతతి స్తే మద్భక్తి రపి తే కులే॥

158 శ్లో॥ జ్ఞాతం గురుచరిత్రం తే సుపుత్రాదిభి రస్తుతే।
గోత్రాభివృద్ధిః సతతం గురుభక్తి రతీవ చ॥

159 శ్లో॥ ఇత్థ మాశ్వాసయామాస స్తథాఽ స్త్వి చాదదే।
కృత్వాఽథ మండలా న్యాశు పాత్రా ణ్యాసాద్య చ క్రమాత్॥

150 తా॥ క్రమముగ నుపచారములు - పంచామృతములతో రుద్రముల చే గురువు నభిషేకించి వినయముతో భక్తిగ వారు శ్రీ గురు పూజ చేసిరి.

151 తా॥ భక్తితో పుష్పమాలలతో గురువు లాది వారందర పూజించి శ్రీ గురు పాద తీర్థ మును గ్రహించి, మిగిలిన వాని నొక పాత్రలో నుంచు కొనిరి.

152 తా॥ ఆయన పాద తోయజమునకు భక్తితో పూజించి నీరాజనముతో మంగ ళారతులతో నృత్య గీత ములతో ను పచరించిరి.

153 తా॥ భక్తితో నిట్లు శ్రీ గురువులకే కాక యితర శిష్యులకు సంతోషముతో ఆ సాయందేవ దంపతులు పూజించిరి.

154 తా॥ పుష్పాంజలులు - వేదఘోషలు కలిసి స్తుతుల జేయుచు - వారి కా నందమగు నట్లు ప్రీతితో నర్చించిరి.

155 తా॥ ఆ సాయందేవుడు పత్నితో గూడి గీత నృత్య వాద్యములచే త స్తుతి ప్రణామములతో - సర్వమును భగవదర్పణ బుద్ధి పూజించెను.

156 తా॥ ఆ సాయందేవు డొక్క గురువుగారినే కాక శిష్యులకు అత్యం తాదరముతో వందనాదు లర్పించెను.

157 తా॥ శ్రీ గురువులు ను పరమానందము నొంది సాయందేవుని తో- నీకు పై వృద్ధి గలిగి సత్సంతానము గలుగును - అని ఆశీస్సులిచ్చెను.

158 తా॥ శ్రీ గురుచరిత్ర నీకుఁ దెలిసది గదా? పుత్రపౌత్రాభివృద్ధి నీకు గలు గును. నీకు గురుభక్తి అధికముగ నున్నందున గోత్రాభివృద్ధి యు గలుగును.

159 తా॥ ఇట్లా సాయందేవు డాదరించెను ఆయనను ఆశీర్వదించెను. ఆటు తర్వాత భోజన పాత్రల మండలములు పాత్రా సాదనయు జరిగెను.

160 శ్లో॥ పాయసా న్నేన పక్వాన్నైః మాషాన్నైః వివిధై రపి।
సశర్కరై ర పూపాద్యైః భక్ష్య భోజ్యాది సంయుతైః॥

161 శ్లో॥ శాకై ర్నానావిధై శ్చాపి సంస్కృతై ర్వ్యంజనై రపి।
పరివిష్టం సూప విష్టం భోజయామాస సాదరం॥

162 శ్లో॥ ఉదరే వ్యథితః శూలే యథేష్టం బుభుజే ద్విజః।
నిర్గతః తత్క్షణం వ్యాధిః కృపా దృష్ట్యైవ స ద్గురోః॥

163 శ్లో॥ స్పర్శ స్పర్శాదయో యద్వత్ స్వర్ణం షోడశ వర్ణకం।
భవతీ శ దృశా తద్వ న్నీ రోగోఽ భూద్ద్విజ స్సుఖీ॥

164 శ్లో॥ యథాం ధకార సంహారః భవే ద్ది నక రో దయాత్।
శ్రీ గురోః కృపయా తద్వత్ కుతో దై న్యా ది శిష్యతే॥

165 శ్లో॥ ఏవం శ్రీ గురునాథేన స్వ శిష్యై స్సహ భోజనం।
కృత మానంద యుక్తో భూ ద్ద్విజాఽన్యే విస్మయాం గతాః॥

166 శ్లో॥ అహో ఆసాం హి తం హ్యన్నం త దేవాభవ దౌషధం।
అత్ర చిత్ర మిదం దృష్టం నష్టో దుష్టో ఽపి త ద్గదః॥

167 శ్లో॥ నామధారకః కిం వచ్మి య స్యోపరి గురోః కృపా।
నశ్యంతి జన్మాంతరజా దోషా వ్యాధేస్తు కా కథా॥

168 శ్లో॥ ఏవం గంగా ధరః శోత్యా నాహ సరస్వతీ।
కామ ధేనూ పమం రమ్యం శ్రీగురో శ్చరితం హి తం॥

169 శ్లో॥ పఠంతి యే భ క్తియుతా వినీతాః
శ్రుణ్వంతి వాఽఽఖ్యాన మిదం గదఘ్నం।
తేషాం గృహో వ్యాధి భయం న నిత్యం
తేషాం సుఖం భూరి వదే త్త్రి సత్యం॥

గద్య : వెనుక ప్రకారం .... .... .... .... .... ....

జ్ఞానకాండే త్రయోదశోఽధ్యాయః
ఆదితః శ్లో॥ 1629
త్రయోదశోఽధ్యాయః సమాప్తః

160 తా॥ ఇక పాత్రలలో - శ్రీ గురు వాజ్ఞా ప్రకారము - పాయసము - భక్ష్యములు - మాషములు - శర్కరయు తాపూపములతో నింపిరి.

161 తా॥ వివిధ శాకపాకములు - వ్యంజనములు - చక్కగా తయారు చేయించి భుజింప (జేయించె నా సాయందేవ గేస్తు.

162 తా॥ కడుపులో నొప్పి పోయి నందున ఆ రోగి యథేష్టముగా భుజించెను- ఆ సద్గురు కరుణా దృష్టితో రోగి రోగమంతయు తొలగి సుఖముండెను.

163 తా॥ పరశు స్పర్శచే ఇనుము పదారు వన్నె బంగారమైనట్లు - శ్రీ గురు దర్శన స్పర్శనచే శూల రోగము పోయి, యా రోగి యను బ్రాహ్మణుడు నీ రోగియై సుఖముగ నుండెను.

164 తా॥ సూర్యోదయమున అంధకారము నశించి యెట్లు లోకము ప్రకాశవంతముగ నుండునో శ్రీ గురువు కృపచే రోగము దైన్యము నంతయు పోయెను.

165 తా॥ ఈ విధముగ శిష్యులతో సహ భిక్ష చేసిన గురువు నానంద భరితుడయ్యెను. అచ్చటి బ్రాహ్మణు లందరును ఆశ్చర్య సంయుతులైరి.

166 తా॥ ఏమీ వింత! ఏ అన్న మాయనకు ద్వేషమయ్యెనో శ్రీ గురుకృపచే ఆయన్నమే ఆయనకు దివ్యౌషధ మయ్యెను.

167 తా॥ నామధారక! నీకు నేనేమి వచింతును? శ్రీ గురువు దయగల్గిన వారు జన్మాంతర పాపములు నశించి సంపద్యుక్తు లగుదురు. ఇక వ్యాధుల సంగతి లెక్కయా?

168 తా॥ ఇట్లుగా గంగాధర సూనులగు వాసుదేవ సరస్వతి గారు కామధేను కల్పవృక్ష సమ్మితముగా గురువు నుపమించి రన్న ఎంతటి వారో తెలియును కదా?

169 తా॥ ఎవ రీ గురుచరిత్రను విందురో పఠింతురో వారికి రోగములున్న నవి పోయి సుఖముండుట యే గాక వా రింట నేనాడును వ్యాధులుండవు; అధిక సుఖములతో నుందురు.

మొదటి నుండి శ్లోకములు 1629

13 వ అధ్యాయం సమాప్తము.

